# సూనృతోదంతము.

మహాశయులారా!

శ్రీకృష్ణావతారతత్త్వమునందుఁ బదియవ ప్రకరణము మీయెదుటఁ బెట్టనోచితిని. ధనవ్యయ మెక్కుడగుట; సహాయము తక్కువయగుట యను నీ రెండు కారణములచేతఁ బదునొకండవ ప్రకరణముతో నీగ్రంథమును బూర్తిచేయఁదలంచి నాఁడను. కాని కథలను జాలభాగము తగ్గించి గ్రంథము పెద్దది గానైనను ముగింపఁ దలంచుకొంటిని. ఉపోద్ఘాతములు వ్రాయువారివలన నించుక యాలస్యమగునేమో దానిని మన్నింతురని వేఁడుచున్నాఁడను. ముఖ్యముగా శ్రీకృష్ణోపదేశములను వ్రాయవలయును. మరల రాధామాధవులకు సమావేశము కావలయును. ఇట్టివి పెక్కుకథలుగలవు. వానినెల్ల సంగ్రహించి వ్రాయ వలనుపడదేమో యనియు సంశయించుచున్నాఁడను. కొందఱు పండ్రెండు ప్రకరణములుగాఁ బూర్తిచేయుమని నాకు వ్రాసిరి. అట్లే చేయుదమా యనియు నొకయూహ జనించెడు. ద్రవ్యముమాట తలంపునకు రాఁగా నీరెండవయూహ యదృశ్యమగును. నాకొఱంతలఁ దీర్చుటకు మ. రా. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగా రున్నారుగదా యనుధైర్యము కలదు. కావునఁ బండ్రెండవ ప్రకరణమున నుపోద్ఘాతము నాంధ్రభాషయందు, నాంగ్లభాషయందును వ్రాయించి శ్రీరాధాశ్రీకృష్ణులకు గోలోకమునఁ బట్టాభిషేకమహోత్సవముతో సంతట

గ్రంథమును బూర్తినొందించిన మేలనియు నూహించుచున్నాఁడను. కావునఁబదునొకండవప్రకరణమాలస్యముగా వచ్చిన నది యే కడపటిప్రకరణమనియు, నది సకాలమునఁ జేరిన నింకొకటి కలదనియుఁ బాఠకమహాశయు లూహింతురుగాక యని చేతు లొగ్గి వేఁడుచున్నాఁడను. గ్రంథము నందించుటలో నావలనఁ గలిగినలోపముల మన్నింతురని మఱొకసారి ప్రార్థించుచున్నాఁడను.

మ. రా. శ్రీ విరూరు పిచ్చయ్యగారు తమపోషకద్రవ్యము నిప్పించుటయేగాక మఱియిరువదియైదురజతముద్రికలఁ బారితోషకముగా నిప్పించి తమయవ్యాజశ్రీకృష్ణభక్తిని నాంయందుఁ గలప్రీతిని స్పష్టపఱచి రనుసంతోషవార్తను దెల్పుకొనుచున్నాఁడను. మ. రా. శ్రీ బీ.పి. దేవరాజులునాయఁడుగారు మున్నె పారితోషకమిచ్చుటయగాక మఱియుఁ బదిరజతముద్రికల నిప్పించి తమకుంగలశ్రీహరిభక్తిని దేటపఱచిరి. ఈ రెండు శుభవార్తలను దెలుపుచు నాతలంపును విన్నవించుచు నిక వ్రాయఁదగిన విశేషములు లేవనియు నీప్రకరణమున నావ్రాసిన విషయములయందుఁ గలలోపముల మన్నింతురనియుఁ బ్రార్థించుచున్నాఁడను.

ఇట్లు విన్నవించు సుజనసేవకుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ.

శ్రీ శ్రీ శ్రీ

# పోషకులు.



## శ్రీకృష్ణావతారతత్త్వమును బోధించుపుణ్యపురుషులు.

### కడప.

మ. రా. శ్రీ. కే. గుండూరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, వి. పిచ్చయ్యగారు, బి. ఏ., ప్లీడర్.
,, సి. లక్ష్మీనారాయణశాస్త్రిగారు, బి. ఏ., బి. ఎల్.
,, కౌతూరు శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, పి. సుబ్బరావుగారు, బి. ఏ., బి. ఎల్,
,, వి. రాధాకృష్ణయ్యగారు, బి. ఏ., బి. ఎల్.
,, బి. పి. దేవరాజులునాయుడుగారు, బి. ఏ., బి. ఎల్.
,, సి. నారాయణరెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్.
,, సి. పి. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, కస్తూరి సూర్యనారాయణరావుగారు, ప్లీడర్.
,, భోగనాథము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, పత్తి రాఘవులుశ్రేష్ఠిగారు.
,, కంచిరాజు లక్ష్మీనరసింహయ్యగారు.
,, సుంకేసుల సుబ్బయ్యగారు.
,, కామిసెట్టి లక్ష్మీనరసయ్యశ్రేష్ఠిగారు.
,, కామిసెట్టి వేంకటేశముశ్రేష్ఠిగారు.
,, మల్లెముకొండు రామలింగయ్యశ్రేష్ఠిగారు.
,, జూలేపాటి చిన్నవెంగన్నశ్రేష్ఠిగారు.

మ. రా. శ్రీ. అన్నలూరు శేషగిరిరావుగారు.
,, బి. శేషగిరిరావుగారు.
,, శ్రీకంఠము నరసింహారావుగారు.
,, వేమగంటి శ్రీనివాసరావుగారు, బి. ఏ., ఎల్, టి.
,, సి. వీరభద్రరావుగారు.
,, పుష్పాల వేంకటస్వామినాయుడుగారు.
,, కాట్రపాటి చలపతిరావుగారు
,, బొంతలకుంట వేంకటనారాయణరావుగారు
శ్రీమతి తలుపుల వేంకటసుబ్బమ్మగారు
మ. రా. శ్రీ. సకలా వేంకటసుబ్బయ్యగారు
,, చిల్లా వేంకటకొండయ్యగారు
,, వీరబోయిన కొండయ్యగారు
,, బచ్చు వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు
,, పప్పు సీతారామయ్యగారు, ఎమ్. ఏ.
,, మాలేపాటి వీరయ్యశ్రేష్ఠిగారు
,, నగరం గురురావుగారు, బి. ఏ.
,, గడియారము కృష్ణస్వామయ్యగారు
,, గజరాంపల్లి రామచంద్రరావుగారు
,, సూర్యవంశము వేంకటసుబ్బరావుగారు
,, గంగవరము వేంకటనారాయణరెడ్డిగారు, మిన్నాయగారిపల్లె
,, మాకము జంగం శ్రేష్ఠిగారు, చీమలపెంట
,, మద్దిరాల చెంచయ్యశ్రేష్ఠిగారు, నందిమండలము
,, రంగారెడ్డిగారు, బి. ఏ., బి. ఏల్, డిస్ట్రిక్టుబోర్డు, ప్రెసిడెంటు.
,, దేవతి పిచ్చయ్యశ్రేష్ఠిగారు

## క మ లా పు ర ము.

మ. రా. శ్రీ. బచ్చు రాఘవయ్యశ్రేష్ఠిగారు

మ. రా. శ్రీ, ఓ, సుబ్బరావుగారు
,, రాణువ ఫణిరావుగారు
,, హనుమగుత్తి చెంచిరెడ్డిగారు, గ్రామమునిసీఫ్, హనుమగుత్తి.

వల్లూరు.

,, సముద్రాల రామస్వామిగారు
,, బెస్తవేముల నరసయ్యశ్రేష్ఠిగారు
,, తంగటూరు చెన్నయ్యశ్రేష్ఠిగారు. [శ్రేష్ఠిగారు
,, వంకదారు మాచయ్యగారి మల్లయ్యకుమారుఁడు సుబ్బయ్య
,, పోలేపల్లి వెంగన్నశ్రేష్ఠిగారు, ఆరణిపోలేపల్లి సుబ్బయ్య శ్రేష్ఠిగారు

ఎఱ్ఱగుంట్ల.

మ. రా. శ్రీ. ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు, కరణము
,, ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు
,, మాలేపాటి నాగయ్యగారు, తల్లముసూరయ్యగారు
,, పేర్ల నాగిరెడ్డిగారు
,, ఏ. శ్రీనివాసులు నాయుఁడుగారు
,, శంకరయోగి సుబ్బరావుగారు, నిడుజువ్వి

పులివెందుల.

మ. రా. శ్రీ, మద్దాల బోగాదిశ్రేష్ఠిగారు, వేములక్రొత్తపల్లి [పల్లి
,, పోలేపల్లి సుబ్బయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, వేం
,, పుల్లగూర వేంకటశేషయ్యశ్రేష్ఠిగారు, వేంపల్లి
,, కావుటూరు ఆనందరావుగారు, పోలీసు సబ్ ఇన్ స్పెక్టరు
,, లింగిరెడ్డి గంగిరెడ్డిగారు, ఎద్దులాయగారిక్రొత్తపల్లె
,, వడ్లగుంట అశ్వత్థమయ్యగారు, వేంపల్లి
,, వద్దిరెడ్డి కొండారెడ్డిగారు, లింగాల [గారు చాగలేరు
,, ఘంటసాల చిన్నసుబ్బయ్యకుమారుఁడు వేంకటసుబ్బయ్య
,, సోముధర్మారెడ్డిగారు, పాపాయపల్లె, జమ్ములమడుగుతాలూకా

## ప్రొద్దుటూరు.

| | |
|---|---|
| మ. రా. శ్రీ. | కొప్పురపు వేంకటసుబ్బయశ్రేష్ఠిగారు |
| ,, | నారాయణము రామసుబ్బయ్యశ్రేష్ఠిగారు |
| ,, | వంగిపురము శ్రీనివాసాచార్యులుగారు, ప్లీడరు |
| ,, | సి. నరసరామశాస్త్రిగారు, బి. ఏ ప్లీడరు |
| ,, | యం. రామస్వామయ్యగారు, ప్లీడరు |
| ,, | రావులూరు సుబ్బరావుగారు, డిప్టీనాజరు |
| ,, | ఉప్పలూరు భద్రయ్యగారు |
| ,, | డి .రాజశేఖరకవిసింహులుగారు, శతావధానులు |
| ,, | ఆర్ గోవిందరావుగారు బి, ఏ, తహసీల్దారు |
| ,, | సి. యస్. కృష్ణమాచార్యులుగారు, బి. ఏ. బి. ఎల్. |

## రాజంపేట.

| | |
|---|---|
| మ. రా. శ్రీ. | ఆర్కాటు పరశురామరావుగారు, యమ్. యల్. సి. నెంద |
| ,, | నూకల వేంకటసుబ్బయ్యగారు, అప్పయరాజుపేట[లూరు |
| ,, | పిడతల చిన్నవేంకటసుబ్బయ్యగారు, పెనగలూరు |
| ,, | అచ్యుతన్న రామచంద్రరావుగారు, తంగుటూరు |
| ,, | మంచి వీరరాఘవయ్యగారు, మందపల్లె |
| ,, | ఏచూరు. చెంచుసుబ్బయ్యగారు, శేషమాంబాపురము |
| ,, | పుట్టా నాగసుబ్బయ్యశ్రేష్ఠిగారు, చిట్టివేలు |
| ,, | గాలా వేంకటరెడ్డిగారు పాటూరుగ్రామమునిసిపు. |

## సిద్ధవటము.

| | |
|---|---|
| మ. రా. శ్రీ. | చల్లా చెంచుపాపిరెడ్డిగారు, చంద్రపల్లిగ్రామమునిసిఫ్ |
| ,, | గోపవరము గోపాలరెడ్డిగారు, గోపవరము గ్రామమునిసిఫ్ |
| ,, | యాదాళ్ల వేంకటరామయ్యశ్రేష్ఠిగారు, చిన్నపురెడ్డిపల్లి |

## రాయచోటి.

మ. రా. శ్రీ. కోట బాలయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.

మ. రా. శ్రీ. రేవులూరు సిద్ధయ్యశ్రేష్ఠిగారు, కస్తూరివారిపల్లె
,, చిన్నబయ్యన్నగారిలక్ష్మన్నగారు, ఎఱ్ఱదొడ్డిపల్లె
,, కుర్నూతుల వేంకటరమణయ్యగారు, లక్కిరెడ్డిపల్లె
,, పర్వతరాజు వేంకటరమణయ్యగారు, నూలివేడు
,, పుల్లగూర బాలసుబ్బయ్యదత్తుకుమారుఁడు పిచ్చయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.

## అనంతపురము మండలము, హిందూపురము.

మ. రా. శ్రీ. కరణము కృష్ణరావుగారు, బేవినహళ్లి.
,, శ్రీరాముతిమ్మయ్యశ్రేష్ఠిగారు, ,,
,, పెద్ద నరసప్పగారి హనుమంతుగారు, నక్కలహళ్లి
,, రెడ్డిపల్లె అప్పారావుగారు, కొడిగిపల్లె
,, ఈడిగి అంజనప్పగారు, బేవినహళ్లి
,, బి. నారాయణరావుగారు, బ్యాడిగెర,మడకశిరతాలూకా
,, దొంతి భీమయ్యగారు, హిందూపురము
,, కట్టా అయ్యగారి గుండయ్యశ్రేష్ఠిగారు
,, మాకము సీనయ్యగారి నారాయణయ్యశ్రేష్ఠిగారు
,, సేగు బుచ్చయ్యశ్రేష్ఠిగారు
,, గోరంట్ల వెంకటేశయ్య శ్రేష్ఠిగారు
,, ఆర్. వేంకటేశయ్యశ్రేష్ఠగారు
,, పొచ్చిశెట్టి ఆదినారాయణయ్యశ్రేష్ఠిగారు

## అనంతపురము.

,, వెలమకూరు ఆత్మారామప్పగారు,పినాకినీముద్రాక్షరశాలాధికారులు
,, హట్టి శివరావుగారు, ప్లీడరు
,, పులమతి ఆదిమూర్తిరావుగారు, ప్లీడరు
,, జి. భద్రయ్యశ్రేష్ఠిగారు
,, జి. రామయ్యశ్రేష్ఠిగారు.

మ. రా. శ్రీ. బి. వేంకటప్పగారు
,, ఏ. జి. కృష్ణారెడ్డిగారు, గ్రామమునిసిఫ్
,, వి. ఓబుళేశప్పగారు.
,, కొమారుపల్లె వేంకటరావుగారు, అనుంపల్లె
,, రాచర్లతిప్పయ్యగారు, బెళుగుప్ప
,, రాధాకృష్ణయ్యగారు ,,

## గుత్తి.

,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., ప్లీడర్
,, వై. శేషప్పగారు, ప్లీడరు
,, వై. కొండలరావుగారు
,, సి. సుందరరామయ్యగారు, మునిసిపుకోర్టు
,, ఆర్కాటు గుండురావుగారు, బి. ఏ., బి. ఎల్.
,, సిద్ధవరము వేంకటసుబ్బయ్యగారు, బి. ఏ., ప్లీడరు
,, కోపూరు వేంకటరావుగారు, పెన్షనర్
,, నిట్టూరు లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ. ప్లీడరు
,, తరిమెల సుబ్బారెడ్డిగారు, తరిమెల
,, జంబులపాడు పెద్దవెంకటప్పగారు, ధర్మపురి
,, కాన్గోవి, కృష్ణమూర్తిరావుగారు, రివిన్యూ ఇన్స్పెక్టరు
(ఇప్పటినివాసము అవుకు.)
,, మొలకతాళ్ల చిన్నపుల్లయ్యగారు, గాండ్లపాడు

## బళ్లారి మండలము.

మ. రా. శ్రీ. విటా శేషప్పశ్రేష్ఠిగారు, ప్రజాసంఘకార్యదర్శులు.
,, రావుసాహెబు, జే. పాపయ్యశ్రేష్ఠిగారు
,, అయ్యగారిబుస్సెట్టిగారు
,, ఏ. భీమరావుగారు, వ్యాపారస్థులు, ఆదవాని

## కందనూలు మండలము.

మ. రా. శ్రీ. ఖాదర్ బాదర్ అంబాజీరావుగారు, నంద్యాల
,, అవధానము వేంకటనరసయ్యగారు, ఉయ్యాలవాడ
,, గాడిచెర్ల వెంకోబరావుగారు, అవుకు

## గుంటూరు మండలము.

మ. రా. శ్రీ. అక్కినప్రగడ లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ. బి. ఇ., డిస్ట్రిక్టుబోర్డు ఇంజనీయర్ గారు
,, మారుటూరు పుండరీకాక్షుడుగారు, పట్టిచెరుకూరు
,, పూరే కోదండరామయ్యగారు, నరసారావుపేట

## కృష్ణామండలము.

మ. రా. శ్రీ. నండూరు వీరభద్రరాయశర్మగారు, నూజివీడు
,, గానుగపెంట హరినారాయణరావుగారు, మాజేరు
,, పోలవరపు శోభనాద్రిగారు, చోరగుడి
,, కందిమళ్ళ సీతారామరావుబహద్దర్ జమీందారుగారు,గన్నవరము
,, చోరగుడి చిన్నవెంకటప్పయ్యగారు, గన్నవరము
,, సుంకర వెంకటరత్నముగారు, నూజివీడు
,, గానుగపాటి వేంకటరామయ్యగారు, నాగవరంపాడు

## గోదావరిమండలము.

మ. రా. శ్రీ. పి. యం. శ్రీనివాసయ్యంగారు, బి. ఏ., ఎమ్. ఎల్, డిస్ట్రిక్టు మునిసిపు, కాకినాడ
,, కలిదిండి వేంకటరాజుగారు, రాజమహేంద్రవరము
మ. రా. శ్రీ. శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావుబహద్దర్ జమీందారుగారు, ఏలూరు

మ. రా. శ్రీ. బొడ్డు మల్లికార్జునరావుగారు, బాపిరాజుగారు
,, గిరిగె మాణిక్యముగారు
,, ఏ. యస్. స్వామిగారు [ణము
,, దేశిరాజు సత్యనారాయణమూర్తిగారు, కరణము పెద్దపట్ట
,, పెద్దిరెడ్డి రామరావుగారు, కైకవరము

విశాఖపట్టణమండలము.

,, మాడుగుల వేంకటఅప్పారావుగారు, జమీందారులు
బొంతలకోడూరు

గంజాంమండలము.

మ. రా. శ్రీ. పుల్లెల వేంకటరమణయ్యపంతులుగారు, ఇచ్ఛాపురము

నెల్లూరుమండలము.

,, వెలంపల్లె రామకృష్ణమ్మగారు, నెల్లూరు
,, ములుమూడి లక్ష్మీనరసింహయ్యగారు
,, బొమ్మిశెట్టి లక్ష్మీనరసింహస్వామిశ్రేష్ఠిగారు
,, ఇడమకంటి వేంకటరామిరెడ్డిగారు, తాళ్లూరు
,, అల్లంపాటి పోలిరెడ్డిగారు, మంగుపల్లె
,, పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు, కుల్లూరు
,, పువ్వాడ సుబ్బరాయశ్రేష్ఠిగారు, పెన్నబద్వేలు.
,, అన్నలూరు చిన్నచెన్నప్పనాయుడుగారు, ఎనమదలగ్రామ
మునిసిపు, తూర్పుకంభంపాడు
,, గట్టుపల్లి రామబ్రహ్మముగారు, వేంకటగిరి

చెన్నపురము.

మ రా శ్రీ వి యస్ నరసింహాచార్యులుగారు, బి ఏ. బి ఎల్
,, కట్టా జోగయ్యగారు
,, వాకాటి కృష్ణయ్యశ్రేష్ఠిగారు, ఆదెప్పనాయనివీధి

## చిత్తూరుజిల్లా.

మ. రా. శ్రీ. జే కృష్ణరావుపంతులుగారు, ఏ. ఏ., బి ఎల్, అడ్వకేట్, చిత్తూరు.

,, పి. వి. చెన్నరాయశెట్టిగారు, వాయిల్పాడు



# విషయసూచిక.

శ్రీః.

# శ్రీకృష్ణావతారతత్త్వము.

## పదియవ ప్రకరణము.

శ్లో. పరిపాలయనః కృపాలయేత్యసకృజ్జల్పితమాత్మబాంధవః,
మురలీమృదులస్వనాంతరే విభురాకర్ణయితా కదానునః.

కదాను కస్యాంను విపద్దశాయాం
కైశోరగంధిః కరుణాంబుధిర్నః,
విలోచనాభ్యాం విపులాయతాభ్యాం
వ్యాలోకయిష్యన్విషయీకరోతి. ౬౩

మధురమధరబింబే మంజులం మందహాసే
శిశిరమమృతవాక్యే శీతలం దృష్టిపాతే,
విపులమరుణనేత్రే విశ్రుతం వేణునాదే
మరకతమణినీలం బాలమాలోకయే ను. ౬౪

మారస్స్వయంను మధురద్యుతిమండలంను
మాధుర్యమేవను మనోనయనామృతంను,
వాణీమృజాను మమ జీవితవల్లభోను
బాలోయమభ్యుదయతే మమ లోచనాయ. ౬౫

మాధుర్యేణ ద్విగుణశిశిరం వక్త్రచంద్రం వహంతీ
వంశీవీథీవిగళదమృతస్రోతసా సేచయంతీ,
మద్వాణీనాం విహరణపదం మత్తసౌభాగ్యభాజాం
మత్పుణ్యానాం పరిణతిరహో నేత్రయోస్సన్నిధత్తే. 2౨

మహాశయులారా! భక్త్యలంకృతమనస్కులారా! శ్రీకృష్ణావతారతత్త్వమునఁ దొమ్మిదవప్రకరణమున భగవంతుఁ డొనరించిన విచిత్రకార్యములం దెలుపు దివ్యగాథలం బఠించి యానందించితిరి. పరమేశ్వరత్వప్రదర్శన మనుపే రాప్రకరణమునకుఁ దగియున్నదని స్పష్టము. పరాత్పరుఁడగు శ్రీకృష్ణమూర్తి తల్లిదండ్రుల మనుకొను యశోదానందులకు జ్ఞానము నుపదేశించుటయు, రాధాంబిక యశోదకు భక్తిజ్ఞానములఁ దెలుపుటయుఁ, బారిజాతాపహరణమునకై హరి ప్రయత్నించుటయు, దానిం దెచ్చి సత్యభామ కొసంగుటయు, నాకార్యమునకై హరి శంకరుఁ బూజించుటయు, సత్యభామపుణ్యకవ్రతమును జేయుటయు, షట్పురదానవుల హరి సమయించుటయు, సముద్రయాత్రయు, భానుమతీరక్షణము, రుక్మిణీశ్రీకృష్ణుల సరసాలాపములు, సుభద్రావివాహము, ఖాండవదహనము, జరాసంధవధము, రాజసూయము ధర్మరాజు చేసి సభాపూజ చేయుట, యందు శిశుపాలుని హరి పొలియించుటయు, సాల్వాదుల వధించి హరి తనయవతారఫలమును దెలుపుటయు నను నీమొదలగు గాథ లా ప్రకరణమునఁ బ్రధానములు. అందును బారిజాతాపహరణము ప్రప్రధానము. అందుఁ బురాణభేదముల ననుసరించి కథయందుఁ బెక్కుమార్పులు గలవు. కాని యందలిసార మొక్కటియే. శ్రీహరి రుక్మిణితో సరసాలాపము

లాఁడు భాగమున నా వ్రాసినయర్థము సుసంగతమే యని భక్తుల మదిం బొడకట్టక తప్పదని నావిశ్వాసము. పలుభంగుల నాక్షే పింపవచ్చు. కాని దానిసారమును గ్రహింపవలయు నన్న భావముగలవా రీయాక్షేపములఁ బాటింపక యిందలిసారత రార్థమేమని యూహించిన భక్తి వారికిం దోడ్పడి సార మిది యని బోధించును. "వస్తుతస్తు" భక్తిలేనివారల కన్నియు నసంగతములుగాఁ దోఁచుచుండును. కావున వారివాదముల మనము చెవియొగ్గి వినరాదు. వినినచో లాభము లేకుండుటె కాక వృథాకాలము గడపినట్లగును. దాన వారు సాధింపఁ బోవుపురుషార్థ మేదియు లేదనుట యథార్థము. శ్రీకృష్ణుఁడేమి శంకరు నారాధించుటేమి యని యాక్షేపించువారు గలరని నే నెఱుంగుదును. వారిబుద్ధియందు నీటిమట్టమువలె భక్తి సమతఁ గాంచక విషమముగ నుండును. కావున వారికి విన్నదంతయుఁ జెవులకు బాధకముగాఁ దోఁచును. శివకేశవు లన్యోన్యము ధ్యానించుచుందురని చెప్పుపురాణములు వారికిం గిట్టవు. హరివంశము ప్రమాణమని నమ్మువారుకూడ నీభాగము నంగీ కరింపరు. కొందఱు ప్రక్షిప్తమని నాతో ముచ్చటించిరి. అంతయుం బ్రక్షిప్త మనరాదా యని బదులిడితిని. వారికిం దెల్పంబూనినఁ గాలహరణమేగాని లాభములేదు. "సర్వం విష్ణుమయం జగత్" అని యంగీకరించుభక్తులు శివుఁడుకూడ హరియే యనిభావించిన నిట్టిదురూహలు పుట్టవుకదా యని నే భావింతును. శివస్వరూపమునఁ గార్యార్థము శ్రీమహా విష్ణువే యున్నవాఁడనుకొన్నచో శివుని దూషింప నవకాశము గలుగదు. కొందఱు శివుని దూషింపవలయునని పట్టుదలఁ

బూనువారు కలరు. కాని వా రితరులకంటె శివనామము నుతించువారే యగుదురు. విరోధముచేనైన భగవన్నామస్మరణము చేయుట మంచిదని నాతలంపు. "వగనైన బగనైన భీతినైన" అన్న సూక్తి యందఱకుం దెలిసినదియే కదా. కావున దేవతాభక్తిగల వారు తమ యుపాస్యదేవతనే సర్వదేవతామయునిగ భావించుట వారికిం దరణోపాయము. అట్లుగానిచో ముక్తిదొరకదు. ఏలయనఁగా భగవంతుఁడుగూడ వేఱొకరూపమున నున్న తనను దూషించువారిని గృపంజూడఁడు. దీనికిం బ్రమాణములు చూప నక్కఱలేదు. సామాన్య జ్ఞానమున్నం జాలును. ఉన్నది పాపపంకసంకలితజ్ఞానమైనఁ జెప్పఁజాలను. గాని యేమాత్రము దేవతారాధనను చేసినను దనయుపాస్యదైవము పరమేశ్వరుఁడనియు సర్వదేవతలు తత్స్వరూపులే యనియుఁ దోఁపకమానదు. వారియుపాస్యదైవము సర్వాంతర్యామి కాదని వారూహించుచో నది వారివాంఛితముల నొసంగంజాలదు కదా.

శ్రుతి. "యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః,
తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః."

ఈశావాస్యోపనిషత్తు. 2. మంత్రము.

శ్రుతి. "నమో బ్రహ్మణే నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మావదిష్యామి సత్యం వదిష్యామి."

౧.

తైత్తిరీయోపనిషత్తు.

గీతా. "యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి సచ మే న ప్రణశ్యతి."

౬. అధ్యా. 30. శ్లో.

ఈశ్రుతులను గీతావాక్యములం దలంచినచో నీయర్థము విశదమగును. వాయుదేవుఁడా నీవే పరబ్రహ్మావు. అనఁగా భావమేమి? సర్వరూపములు భగవంతునియాకారము లనియు దేని నుపాసకుఁడు ధ్యానించినను, అదియే పరబ్రహ్మమను దృఢజ్ఞానముతో ధ్యానింపవలయుననియు నారూపము భగవత్స్వరూపమే గనుక నారూపమున భగవంతుఁడు తోఁచి రక్షించుననియేకదా సారము. ఇట్లు భావించువానికి నితరదేవతల దూషించునవకాశ మెట్లు కలదు? కావున శ్రీహరి శంకరు నారాధించెనన్నను, శంకరుఁడు శ్రీకృష్ణుని ధ్యానించెనన్న నాశ్చర్యమిందేదియు లేదు. ఊరక తిని కూరుచుండఁజాలక యీదేవత తక్కువ ఆదేవత గొప్పది అని మాటలాడుటయేగాని దీన సాధించుపురుషార్థ మించుకంతయు లేదు. ఊరకూరక పాపము నార్జింపనేల? శిశుపాలదంతవక్త్రుల హరించుట యనుకార్యముచేఁ దన యవతారఫలమును గనఁబఱచెను. సనకసనందనాదుల శాపమునుదీర్చి తనపార్షదులను ధన్యులను జేసెను. తదనుకూలము లగుకార్యముల నెట్లెట్లు సంధింపఁ దలఁచెనో యట్లు కుదురఁజేసి తనపనిని నెఱవేర్చెను. అందులకే యీశ్వరత్వప్రదర్శన మనుపే రాప్రకరణమునకుఁ దగియున్నది.

ఇట్లు తాఁ జేయవలసిన ప్రధానకార్యముల నెఱవేర్చి భగవంతుఁడు ద్వారకానగరమునఁ జేరి భవిష్యత్కార్యమాలోచించుచుండె నన్నంతదనుక నాప్రకరణమునఁ గలదు. ఇఁక నేయేకార్యములు చేసి జగద్వ్యాపారము నడంపవలయునో యని సర్వేశ్వరుఁ డాలోచించుకథ లిందుఁ వ్రాయఁబడును. తాఁ జేయుకార్యములకంటెఁ గర్మసిద్ధాంతమును సార్థకము

చేయుటకై యితరులనుండి చేయించుకార్యములు మెండనుట యీప్రకరణమున స్పష్టమగును. కావున శ్రద్ధాభక్తులు కలిగి కథలం బఠించుచుఁ దత్సారమును గ్రహింపవలయును. భక్తియే జ్ఞానమునకు మూలాధారము. అదియే లేకున్న జ్ఞానమలవడుట శశవిషాణమని విజ్ఞులెఱుంగుదురు. భక్తికుదురుటకు భగవంతుని యత్యద్భుతవిలాసములఁ దెలుపుచరిత్రములఁ బఠింపవలయు. పఠించునపుడు భగవంతుఁడు సర్వశక్తియుక్తుఁడని తలంపవలయును. అట్లు తలంపనిచో నాకథలయందుఁ గల యమానుషచర్యలు కల్పితములని తోఁచు. దాన దానిం జదువుశ్రద్ధ తగ్గును. ఇంక నాచోట భక్తియుండ నవకాశ మేలాగు కలుగును? సర్వకార్యములు మనుష్యులుచేయునట్లే పరమాత్మయుఁ జేయుచున్న నిఁక నాతనికి మానవులకుం గల తారతమ్యమేమి? అమానుషకృత్యములనఁగా మనుష్యులకుఁ జేయనలవిగానివనియే కదా యర్థము. భగవంతుఁడుకూడఁ జేయరానికార్యము లుండుననుశంకగలవారికి సర్వేశ్వరుఁడు శక్తిమంతుఁడన్నభావము లేదనవలయును. ఇంక వారికి భక్తి యుక్తియుండదే. కావున వారించుమించుగా నాస్తికప్రాయులు. వారికి బోధించి భక్తులనుగాఁ జేయఁబూనుట యసంగతము. ఆప్రయత్నమునకుం బూనరాదు. ఆస్తికులకు నెంతబోధించినను లాభముకలదు. కావున నాపనికై కడంగుదము. ఇఁక భగవత్కథలు వ్రాయఁ గడంగెదను. శ్రద్ధమై నాలకింపుఁడు.

## ధన్వోపాఖ్యానము.

* శ్రీకృష్ణుఁడు శిశుపాలదంతవక్త్రాదుల సంహరించి

---

* ఈకథ హరివంశవిష్ణుపర్వమున నూటపదియవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది. తక్కుంగల పురాణములయం దీకథ యీరీతిఁ గానరాదు.

ద్వారకాపురమున సకల పుత్త్రబంధుసమేతుఁడై యుండెను. జాంబవతి యను శ్రీహరిపత్ని కుమారుం గనెను. వానికి సాంబుఁ డనుపేరు పెట్టఁబడియె. ఆసాంబుఁడు పెద్దవాఁడయి బలరాము నొద్ద శస్త్రవిద్య నభ్యసించెను. యాదవులెల్ల రాసాంబుని శూరాగ్రేసరునిగాఁ దలంచిరి. శ్రీహరియు నీతఁడు నగర ముననుండ శత్రుభయము గలుగదని తలంచెను. కుమారులం గూడి వారివేడుకలు చూచుచు ద్వారక నుండెను. యాదవ లక్ష్మిం గాంచి యింద్రుఁ డోర్వఁజాలక యుండెను. రాజులం దఱు జనార్దనభీతులై హాయిగా నుండఁజాలరైరి. శిశుపాలా దుల హరి పాలియించుటచే నెట్టివారైన హరితో ద్వేషించిన బ్రదుకఁజాలరనుభీతి యెల్లరాజులచిత్తరంగముల నాట్య మాడుచుండెను.

కొంతకాలమునకుఁ గరినగరమున దుర్యోధనుఁ డొకక్ర యజ్ఞము చేయఁబూనెను. తదాహూతులై రాజులెల్ల హస్తి పురమునకుం బోయిరి. ఆయజ్ఞము సాంగముకాఁగా దుర్యో ధనుఁడు వారినెల్ల యథార్హముగాఁ బూజించెను. వారలాతని సత్కారమున కానందించిరి. లోకమున నాకాలమున యాదవ లక్ష్మి మాధవవర్ధితయై మిన్నంటుచుండుట వినిరి. సాగరాంతర మున ద్వారకానగరము నిర్మింపఁబడుటయు నది శత్రుదుర్భేద్య మగుటయు నాలకించిరి. తమతమదూత లానగరమున కరిగి కన్నులారఁ గాంచి వచ్చిచెప్పఁగా నిట్టిది గలదా యని విస్మితు లైరి. ఆయజ్ఞమును గాంచి తమతమనగరములకుం బోవుట మాని యెల్లరు మాటలాడుకొని ద్వారవతికిం బోయిరి. వారిం గూడి ధృతరాష్ట్రపుత్త్రులు పాండవులు, ధృష్టద్యుమ్నాది

పాంచాలకుమారులు పాండ్యచోళకలింగదేశాధీశులు, బాహ్లికద్రావిడులు, ఖశులు కలిసి తమసేనలు పదునెనిమిదియక్షౌహిణులు వెంటరాఁగా ద్వారవతిం జూడంబోయిరి. ద్వారకానగరము గోవిందభుజపరిపాలితమై సాటియే లేకయుండెను. వారెల్ల రైవతకపర్వతమును జుట్టుకొని నిలిచిరి. తమతమబలములు నివసింపఁదగినంతస్థలముల నాక్రమించి రాజులు నిలిచిరి.

రాజు లరుదెంచుట యాలించి హృషీకేశుఁ డానందపరవశుఁడై సబలవాహనుఁడై వారినెదుర్కొనెను. ఆరైవతకాద్రియందుఁ గలరాజభవనమున వారినెల్లం జేర్చి యథార్హములుగా సింహాసనముల నలవరింపఁబంచి వారి నుపవిష్టులనుగా నొనరించి తానును వారినడుమ స్వార్హపర్యంకమునఁ గూరుచుండెను. ఆతరుణమున నాసభనుజూడ రెండుకన్నులు చాలకయుండెను. కొంతసే పిష్టకథాలాపములు సాగెను. శ్రీహరి వినుచుండఁగా నారాజపుంగవులకును యాదవులకు నిష్టాగోష్ఠీప్రసంగములు సాగెను. అంతట వాయు వల్లనల్లన వీవసాగెను. వెంటనే యాకసమున మేఘము లావరించెను. స్తనితములు చెలరేఁగెను. విద్యుల్లతలు మెఱయసాగెను. క్షణకాలమున దుర్దినమయ్యెను. అట్లు సాంద్రముగా గగనమండలమును మేఘము లావరించియుండ నాఘనమండలమును భేదించుకొని వీణియ కరమునగలరార జటాభారము వ్రేలాడుచుండ నారదముని యచటికి తేంచెను. నరేంద్రులనడుమ దిగెను. అగ్నిశిఖవలె నాముని తేజ స్సలరుచుండెను. సింహాసనము నలంకరించుచుండు నవ్యయుని శ్రీకృష్ణుం గాంచి యిట్లు పలికెను. దేవతలకాద్యుఁడు నీ వొక్కఁడవే. పురుషోత్తమా! నీవు ధన్యుఁడవు.

లోకమున నింకొకఁడు ధన్యుఁడు గానరాఁడు. అని పలికిన నారదుం గాంచి చిఱునవ్వు మోమునందోఁప శ్రీకృష్ణుఁ డిట్లు పలికెను. ఆశ్చర్యభూతుఁడను ధన్యుఁడను దక్షిణలతోఁగూడిన నే నగుదును. ఈమాట విని రాజులనడుమనుండి యిట్లు బదులు పలికెను. శ్రీకృష్ణా! పర్యాప్తవాక్యుఁడ నైతిని. వచ్చిన వారిఁ బోయెదను. అని బయలుదేరఁబూను మహర్షినిం గాంచి యీశ్వరునితో రాజు లిట్లు మాటలాడిరి. ఆరాజు లా నారద వాక్యమునఁ గలగూఢార్థ మెఱుంగఁ జాలకుండిరి. మాధవా! ఆశ్చర్యమని ధన్యమని రెండుమాటలు చెప్పఁబడియె. దక్షిణలతోఁ గూడననియుఁ జెప్పఁబడియెఁ గదా. ఈభాషణములఁ గలయర్థ మిదియని యెఱుంగఁజాలక యున్నారము. మేము వినఁదగుదుమేని వినిపింపుము.

అని ప్రశ్నింపఁగా రాజులకు శ్రీహరి యిట్లు బదులు చెప్పెను. బ్రాహ్మణప్రవరుఁ డగునారదముని మీకీవృత్తాంతము నెఱిఁగించును. నారదా! రాజులెల్ల దీనియర్థము నెఱుంగఁ గోరిరి. కావున వినిపింపుము. నీవేమి ప్రశ్నించితివో నేనేమి బదులుచెప్పితినో దానినంతయు వినిపింపుము. అని శ్రీహరి యాదేశింపఁ గాంచనపీఠమున నున్న నారదుఁడు వారల కాభగ వంతుని దివ్యమహిమమును జెప్ప నారంభించెను.. భూజాని ప్రవరులారా! ఆలకింపుఁడు. ఏల యింద ఱిచ్చోటికి వచ్చితిరో తత్ఫలముగా నీ పరమేశ్వరుమహిమము నే నెఱింగినంతదనుక వచించెదను. ఒకానొకప్పుడు నేను గంగాతీరమునఁ ద్రికాల స్నానమాచరించునియతిం దాల్చి యొక్కరుండనే యుంటిని. ఒక్కనాఁడు సాయంకాలమునందు సూర్యుఁడు కనఁబడుచుండఁ

గనే పర్వతశృంగమంత పెద్దదై కపాలద్వయదేహముగలిగి క్రోశమండలవిస్తారముగలిగి దానికి రెండింతలపొడవుగలిగి నాల్గుపాదములు వెలయఁగాఁ బంకమువనుండి నావీణియవంటి యాకారము గలకూర్మ మొక్కఁడు నాకుం గానఁబడియె. దాని దేహకాంతి గజచర్మమును బోలియుండెను. నే నాజలచరమును హస్తమున స్పృశించుచు నిట్లు ప్రశ్నించితిని. ఓ కూర్మమా! నీ వాశ్చర్యశరీరము కలదానవు. ధన్యమ వేయని నాకుం దోఁచెను. నీ యీ రెండుకపాలము లభేద్యములు. నిశ్శంక ముగ జలములం దిరుగుచుందువు. ఇతరచింతలు నీకు లేవు. అని పలుకఁగనే నన్నుం జక్కఁగానాలోకించి మనుష్యవాక్కుల నాకూర్మ మిట్లు ప్రతిభాషించెను. మునీంద్రా! ఏమియాశ్చర్యము నాయందుఁ గంటివి? నేను ధన్యమ నెట్లయితిని? ఈగంగానది ధన్యురాలు. ఇంతకంటె నాశ్చర్య మేమికావల యును? నావలెనే యిందు నసంఖ్యాకజలచరములు తిరుగు చున్నవి. నేను నానందమున నీగంగానదిం బ్రవేశించితిని. అని యూరకుండెను. నారదుఁ డమ్మాటలాలకించి గంగానదిం జేరి యోభాగీరథీ! నీవు ధన్యురాలవు. ఆశ్చర్యభూషితురాలవు. మహత్తరదేహములు గలశ్వాపదకోటులు నీయందుఁ గలవు. నదీవతంసమవన నీవే. ఇన్ని జంతువులం గూడి తాపసాలయముల కషాయము లేకయుండ గాపాడుచు సాగరమును జేరఁబోవు దువు. అని వినుతింపఁగా నాగంగానది స్త్రీరూపమున నావిర్భ వించి నారదునితో నిట్లు సంభాషించెను. దేవగంధర్వా! నీ విట్లనకుము. సంగ్రామకలహప్రియా! నీవిట్లు నన్నుం బలుక కుము. నేను ధన్యురాలను గాను. ఆశ్చర్యము నాయం దొక్క

టియు లేదు. సత్యనివిష్టుఁడ వగునీవాక్కు నన్నుఁ బలుకుమా యని హెచ్చరించుచున్నది. లోకమున సర్వైశ్చర్యకరుండై ధన్యుఁడగువాఁడు సాగరుఁడు. నావంటి నదులెన్నియో సాగరునియందుఁ జేరుచున్నవి. అని పలికి యూరకుండెను.

రాజేంద్రులారా! ఇట్లు గంగానది పలుకఁగా నేనా వాక్యము నాలకించి సాగరముకడకుంబోయి యో మహార్ణవమా! ఆశ్చర్యభూతుఁడవు. ధన్యుఁడవు నగుదువు. జలములకాధారభూతుఁడవు. సలిలేశ్వరుఁడవు నగుదువు. జలప్రవాహసాంద్రము లగునేఱులన్నియు నిన్నుంజేరుట యుక్తమే. ఈనదులు లోకపావనములనఁ బ్రఖ్యాతిం గాంచినవి. నీకుఁబత్నులు. కావుననే నిన్నుంగలిసి సంతసించుచున్నవి. అని నేను బలుకఁగా విని సముద్రుఁ డిట్లు బదులుచెప్పెను. జలప్రవాహమును భేదించుకొని మానవరూపమున నాసాగరుఁడు కనఁబడియెను. ఓ దేవగంధర్వా! ఓ మునిచంద్రా! నీ వట్లనకుము. నే నాశ్చర్యభూతుఁడను గాను. ఈవసుధ ధన్యురాలు. నేను భూమిపైనఁగదా యున్నవాఁడను. ఈభూమికంటె నాశ్చర్య మేమియున్నది? అన విని నేను భూమింగాంచి లోకముల కాధారభూతురాలగు పృథ్వితో ని ట్లంటిని. ఓ జగద్యోని! భూమీ! నీవు ధన్యురాలవు. మంగళమూర్తీ! నీవు ధన్యురాలవు. ఇన్నిభూతములయం దోర్పుగలిగి యున్నదానవు. మనుజారణివి. ఇన్నిభూతముల ధరించుచున్నదానవు. క్షమ నీయందే కల్గినది. గగనచరులకు గతివి నీవే. అని స్తుతింపఁగా నామాటల నాలకించి సహజధైర్యమును వీడి స్త్రీరూపమున నాయెదుటం దోఁచి యిట్లు పలికెను. దేవగంధర్వా!

సంగ్రామకలహప్రియా! నీ వట్లనుట బాగుగాదు. నేను ధన్యు రాలను గాను. ఆశ్చర్యమొందఁజేయునంతటిశక్తి నాకు లేదు. ఈపర్వతములు ధన్యములు, నన్ను నివియే ధరించుచున్నవి. ఆశ్చర్యకరమహిమము గలవి. లోకహేతువు లివ్వియే. అని భూమిపల్కఁగా విని నేను బర్వతములచెంతకుం బోయి యో పర్వతశ్రేష్ఠులారా! మీరు ధన్యులరు. ఆశ్చర్యకరమహత్వ సంపన్నులరు. కాంచనమునకు దివ్యరత్నములకు నాకరములు మీయం దున్నవి. మీరు శాశ్వతులు. అని పలికితిని. నామాట లాలకించి స్థావరవర్యములగు నాపర్వతములు తమరూపమును వదలి పురుషరూపములఁ దాల్చి యిట్లు బదులుచెప్పెను. మేము ధన్యులము కాము. ఆశ్చర్యకరమహిమాఢ్యములము గాము. ప్రజాపతి యగుబ్రహ్మ ధన్యుఁడు. సర్వాశ్చర్యకరుఁడు. దేవాదిదేవుఁడు. అని యంతర్హితము లయ్యెను. నే నామాట లాలకించి సత్యలోకమున కరిగి పరమేష్ఠిం గాంచితిని. ఆతఁ డవ్యయుఁడు, జగత్కారణుఁడు, పితామహుఁడునని పిల్వఁ బడువాఁడు. కావున నమస్కరించి యవనతాననుండనై యి ట్లంటిని. పంకజసంభవా! నీవొకఁడవే యాశ్చర్యభూతుఁడవు. ధన్యుఁడవు. జగద్గురుఁడవు. నీవుతప్ప వేఱొకఁడు ధన్యము లే దని తలంచెదను. స్థావరజంగమాత్మకజగంబు నీవలనఁ గలిగినది. దేవదానవగంధర్వాదులు వారు వీ రననేల? యింద్రియములు గల భూతములెల్ల నీవలననే ప్రభవిల్లినవి. సకలబ్రహ్మాండ సృష్టికర్తవు. సనాతనుఁడవు. కావున దేవతలయం దుత్తముఁడ వగు నీవే ధన్యుఁడవు, ఆదిసంభవుఁడవు నీవే. అని పలికిన నన్నుం గాంచి లోకపితామహుఁ డగుబ్రహ్మ నారదా యని

పిలిచి సర్వాశ్చర్యవాక్యములచే నన్నేల పొగడెదవు ? ఆశ్చర్యములని వచింపఁదగినవి వేదములు. ధన్యములు నవియే. తత్త్వార్థదర్శనమున విఖ్యాతములు. కావుననే తమమహిమమున లోకముల ధరించుచున్నవి. ఋగ్యజుస్సామాథర్వణములను నావేదములే ధన్యములు. తన్మయుఁడనే నేనని యెఱుంగుము. నన్ను ధరించునవి యవియే యని తెలియుము. అని యిట్లు పరమేష్ఠిపలుకఁగా నావాక్యములచేఁ బురికొలుపఁబడి మహిమాస్పదములగు వేదములధ్యానించి మంత్రప్రవచనాత్మకము లగువానింగూర్చి యిట్లు పలికితిని. వేదములారా! మీరు ధన్యతం గాంచితిరి. పుణ్యస్వరూపములన మీరే ఆశ్చర్యభూషితములను విఖ్యాతికిం బాత్రములైతిరి. విప్రుల కాధారములు మీరని బ్రహ్మయే వచించెను. బ్రహ్మ యందఱకంటె గొప్పవాఁడు. మీ రతనికంటె విఖ్యాతముల రైతిరి. మీకంటె నుత్కృష్టము లోకమున నేదియు లేదు. అని పలికిన నన్నుంగని వేదములు నాకుం బొడసూపి యిట్లు పలికెను. మేము ధన్యులము కాము. యజ్ఞములు ధన్యములు, ఆత్మపరాయణములు. యజ్ఞప్రవృత్తినిమిత్తమే మేము సృజింపఁబడితిమి. కావున మాకంటె నుత్కృష్టములనఁదగినది యజ్ఞము. మేము స్వవశమున నుండఁజాలము. యజ్ఞవశమున నుందుము. అన విని వేదములకు నమస్కరించి యజ్ఞస్వరూపమును ధ్యానించి వేదవాక్కులం బొగడి యో యజ్ఞములారా! మీరు ధన్యములనఁదగుదురు. పరమతేజస్సు మీయందే కనంబడుచున్నది. బ్రహ్మయు వేదములు నిట్లే పలికిరి. మీకంటె నాశ్చర్యము నీలోకముల నేను జూడఁజాలను. కావున మీరే ధన్యులరు.

ద్విజాతికిం బ్రాణభూతములనఁదగినవారు మీరే. మీవలన నగ్నులు తృప్తినొందుచున్నవి. భాగములచే దేవతలు తృప్తి నొందుచున్నవారు. మంత్రములచే మహర్షులు సంతృప్తులగు చున్నవారు. అనిపలుకు నామాటల నాలకించి యగ్నిష్టోమాదు లగుయజ్ఞములు యూపధ్వజాకారములఁ గనంబడి యిట్లు ప్రతి భాషించెను. ఆశ్చర్యశబ్దము ధన్యశబ్దముగాని మాకుం జెల్లదు. ఆశ్చర్యశబ్దము విష్ణువునకుఁ జెల్లు. మాకుఁ బరమగతి యా విష్ణువే. అగ్నియందు హోమముచేయఁబడు పావనాజ్యమును మేము గ్రోలుచున్నాము. ఇదియంతయు లోకమూర్తియగు పుండరీకాక్షునందుఁ జేరును.

అని యజ్ఞములు తెలుపఁగా విని శ్రీమహావిష్ణువును దర్శింపఁగోరి యిచ్చటికి వచ్చితిని. మీతోఁ గూరుచుండియున్న శ్రీకృష్ణపరమాత్మను గాంచితిని. ఆశ్చర్యమను శబ్దమునకుఁ దగినవాఁ డీ శ్రీకృష్ణమూర్తియే. ధన్యుఁడన్నైతినని నేను మీరు వినుచుండఁ జెప్పినదిందులకే. దానికిబదు లీపరమాత్మ పలికెను. దక్షిణలతోఁగూడ ననుమాటయే నాకుఁ బ్రతివచనమని తలంపుఁడు. సర్వయజ్ఞములకు గతి శ్రీమహావిష్ణువు. దక్షిణలు యజ్ఞమునకుఁ బ్రధానములు. వానికి రెండింటికి విష్ణువే పరమ గతి. దక్షిణలతోఁగూడ ననునదియే నాప్రశ్నము. తొలు దొలుతఁ గూర్మము తెలిపెను. తద్వ్యాఖ్యానుసారము పరంపరగ నందఱుఁ దెలిపిరి. వానిననుసరించి యిచ్చటికి వచ్చితిని. మా యీసంభాషణమును మీరు ప్రశ్నించితిరి. మీకు నా యెఱింగినవిషయమెల్ల యథాపూర్వముగాఁ దెలిపితిని. ఇంకఁ బ్రయాణము సాగించెదను. అనిపలికి నారదముని వారినివీడ్కొని

స్వర్గమున కరిగెను. రాజులెల్ల విస్మయంబునం బొదలి శ్రీమహా విష్ణువు మాహాత్మ్యము నెఱింగి హరిచే ననుజ్ఞాతులై తమతమ బలములంగూడి తమదేశముల కరిగిరి. శ్రీకృష్ణుఁడు యదువీరులంగూడి యంతఃపురమును బ్రవేశించెను.

మహాశయులారా! ఈకథయందు సారము స్పష్టముగనే కనఁబడుచున్నది. సర్వధర్మముల కాధారభూతుఁడు శ్రీహరి యనియే యీగాథ తెలుపునీతి. శ్రీహరిని దృప్తినొందించు మార్గములు పెక్కువిధములనియు వానియం దొక్కమార్గము నైన నాశ్రయించి కృత్యము నెఱవేర్చిన హరి తృప్తినొందునని యు దీనినుండి యెఱుంగఁదగునీతి. మఱొక్కరహస్య మిందుఁ గలదు. గంగాపూజయు,సముద్రసందర్శనము,భూదేవిని హింసింపకయుండుటయుఁ, బర్వతములఁ బూజించుటయు, బ్రహ్మదేవుని సేవించుటయు, వేదములఁ బఠించుటయు, యజ్ఞములుచేయుటయు నివియన్నియు విష్ణుపాదారవిందసందర్శనము గలుగఁ జేయుననియు మన మెఱుంగవలయును. ఇన్నికార్యములు వరుసగా జేసినఁగాని భగవత్కృప కలుగదని కాదు. యథాభక్తిన్యాయమున భక్తిశ్రద్ధాయుతుండై యిం దేకార్యము చేసినను భగవంతుఁడు తృప్తినొందుననుటయే మనము చక్కఁగా నాలోచింపఁ దగువిషయము. ఇంకఁ దర్వాతి భగవచ్చరిత్రము నాలకింపుఁడు.

## వాసుదేవమాహాత్మ్యము.

* జనమేజయుఁడు వైశంపాయనమునిం గాంచి జగత్ప

---

* ఈకథయం హరివంశాంతర్గత విష్ణుపర్వమునందు నూటపదునొకండవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

తియగు శ్రీకృష్ణునిమహాత్వము వినంగోరి మునివర్యా ! ఇంకను శ్రీకృష్ణచరిత్రమును వినఁ గోర్కి కలదు. తచ్చరిత్రము వినినకొలఁదిని దృప్తికలుగక యింకను విననగునను కాంక్షయే పెరుగుచున్నది. కావున శ్రీకృష్ణునియత్యద్భుతచరిత్రమును వినిపింపుమాయని ప్రశ్నింపఁ గరము హర్షించు వైశంపాయనుం డిట్లు బదులుపల్కెను. నూఱువత్సరములు శ్రీహరిచరిత్రమును దెలిపినను దానియంతము కనుఁగొన శక్యముకాదు. గాండీవధరుఁడగునర్జునుఁడు హరిమాహాత్మ్యమును జ్యేష్ఠభ్రాతయగు ధర్మరాజు నొకనాఁడు కొలువుకూటమునందే సభామధ్యభాగమున నడిగెను. ఇట్లడుగుమని భీష్ముఁడు పురికొలిపెను. ఆసంవాదము నెఱింగించెద. అదియే నీప్రశ్నమునకుఁ బ్రతివచనంబగు.

అర్జునుఁడు ధర్మరాజుం గాంచి యన్నా ! మున్నొకతఱి బంధుదర్శనార్థినై ద్వారకకుం బోయితిని. భోజవృష్ణ్యంధకాదులగుయాదవులు నన్నుం బూజించిరి. అందుఁ గొన్నిదినములుంటిని. ఒక్కనాఁడు శ్రీహరి దీక్షఁబూనెను. ఆదీక్ష యొక్కపగటియందే పూర్తియగునని శాస్త్రము శాసించునఁట. అట్లు దీక్షాబద్ధుఁడై హరియుండఁగా నొకబ్రాహ్మణుఁ డరుదెంచి మహానుభావా! కాపాడుము. కాపాడుము. అని ప్రార్థించెను. శ్రీకృష్ణా ! జగద్రక్షణార్థమవతరించితివి. కావున నాయార్తిని బాపఁదగుభారము నీది *రక్షకుఁడగువాఁడు లోకులు చేయు ధర్మమున నాల్గవపాలు నాచికొనును. అని వేఁడఁగా శ్రీహరి యావిప్రునిం గాంచి భూదేవోత్తమా! భయంపడకుము. కాపాడెదను. ఎందుండి భయముకల్గుచున్నదో దానిందెల్పుము.

---

* చతుర్థాంశం హి ధర్మస్య రక్షితా లభతే ఫలమ్-అని మూలము.

యథార్థము వచింపుము. నీకు మేలగుఁగాక. ఆభయ మెంత దుష్కరమైనను నిన్నంటకుండఁ జేసెదను. అని పరాత్పరుఁ డానతీయఁగా బ్రాహ్మణుఁ డాతఁడుండు గావున స్వామీ! పుట్టినపుడెల్ల నాకుమారుఁడు హరింపఁబడుచుండును. ముప్వురు కొడుకు లిట్లెరి. నాల్గవవాఁడు జన్మింపఁబోవును. వానిని నీవు కాపాడవలయును. బ్రాహ్మణికిఁ బ్రసూతిసమయంబు డాయుచున్నది. రక్షించునట్టిపద్ధతి యెట్లో యోజింపుము. జనార్దనా! ఏయుపాయమున నాయపత్యము జీవించునో యాయుపాయము నాలోచింపుము. అని ప్రార్థించెను.

ఓ ధర్మనందనా! అత్తఱి గోవిందుఁడు నన్నుంగాంచి ధనంజయా! నేను దీక్షితుఁడను. బ్రాహ్మణరక్షణ ముత్తమధర్మము. ఎన్నిశ్రమములకు లోఁబడినను విప్రరక్షణ మవశ్యము కదా. అనిపలుకఁగా నేను శ్రీకృష్ణా! నన్నాజ్ఞాపింపుము. భయము గలుగకయుండ బ్రాహ్మణుం గాపాడెదను. అని నేను బలుకఁగా శ్రీహరి చిఱునవ్వున రక్షింపఁజాలుదువనెను. ఆమాట వినఁగనే సిగ్గుపడితిని. లజ్జితుఁడనగు నన్నుం గాంచి మరల శ్రీహరి యిట్లు పలికెను. రక్షింపశక్తిగలదేని బ్రాహ్మణునివెంట నరుగుము. వృష్ణ్యంధకమహారథులు నీవెంటఁ జనుదెంతురు. బలరామప్రద్యుమ్నులు నందఱు వత్తురు. అనఁగానే నేను బ్రయాణమయి యాదవసేనలు వెనుకొనఁగా విప్రుఁడు ముందు నడచుచుండఁగా విప్రగృహమున్నచోటికి కరిగితిని. అని పలికి యర్జునుండు మఱియు నిట్లు పలికెను.

### అర్జున గర్వభంగము.

* ధర్మనందనా! ముహూర్తమాత్రమున నావిప్రుఁడుండుగ్రామమును జేరఁగల్గితిమి. నివాసార్హమగుస్థలమున నుంటిమి. నేనా గ్రామమునడుమ నివసించితిని. నలుదెసల యాదవసేనలు నిలిచి కాపాడునట్లు లోనర్చితిని. కాని యత్తఱిఁ బక్షులు మృగములు ముందు దుష్ఫలముకలుగునని తెలుపునట్లు గూయిడసాగెను. దిక్కులు మండినట్లుండెను. వానింగని భయమందితిని. సాంధ్యరాగము జపావర్ణమునుఁ దాల్చెను. సూర్యుఁడు నిష్ప్రభుఁ డయ్యెను. అంబరమునుండి యొక యుల్క పడెను. భూమి కంపించెను. ఆయుత్పాతములు దారుణములై తనువును గగుర్పాటు నొందించెను. అట్టిగుఱుతులం గాంచి యెల్లరకు హెచ్చరికగానుండుఁడని యాజ్ఞాపించితిని. ఎల్లరును జాగరూకులై యుండిరి. నేను నట్లే జాగరూకుఁడనై యుంటిని. అర్ధరాత్రసమయమున నాబ్రాహ్మణుఁడు భయవిక్లబుఁడై వడఁకుచు నాయున్నచోటికి కరుదెంచి ధనంజయా! బ్రాహ్మణికిఁ బ్రసూతిసమయము చేరవచ్చెను. మీరందఱు వంచనచేయక జాగరూకులరై యుండుఁడు. అని పలికి పోయెను. మఱొక ముహూర్తమునకే దీననాదము వినంబడియెను. అయ్యో! శిశువు కొనిపోఁబడియె. శిశువు కొనిపోఁబడియె. అను వచనములు వినఁబడియెను. ఆకాశమునుండి బాలకునికంఠరవము వినఁబడియెను. కాని వానిం గొనిపోవు రాక్షసునిజాడ తెలియరాదయ్యెను. దిక్కులన్నియు మాశరవర్షములఁ గప్పఁ

---

* ఈకథయుం హరివంశవిష్ణుపర్వము నూటపండ్రెండవయధ్యాయము నుండి గ్రహింపఁబడినదని యెఱుంగవలయుం.

బడియెను. చీమయుఁ బోవుసందు లేదు. కాని యెట్లో బాలకు నెవ్వఁడో కొనిపోయెను.

కుమారుఁడు కనఁబడకపోవఁగా నాభూసురుఁ డార్త స్వరమొప్ప నన్నుఁగాంచి పరుషభాషణముల నలయించెను. యాదవులను దూఱుటకంటె నన్నే విశేషించి వాగ్బాణములఁ దూలించెను. ధనంజయా! రక్షింపఁగలనని డంబములు పలికితివి. కాని రక్షింపఁజాలకపోతివి. దుర్మతీ! నామాట యొక్కటి వినుము. సూక్ష్మబుద్ధి గలకృష్ణునితో ననుదినము స్పర్ధ వర్ధిల్లఁ బలుకుచుందువు. ఇందు గోవిందుఁ డుండునేని యిట్టియసంగత కార్యము సాగియుండదు కదా. ప్రజలరక్షించువాఁడు ధర్మమున నాల్గవపాలు గ్రహించునట్లు రక్షింపఁజాలనివాఁడు పాపమున నాల్గవపాలు గ్రహించును. రక్షింపఁగలననిపలికి రక్షింపఁజాలక పోతివి. నీగాండీవము వ్యర్థము. నీపరాక్రమము వ్యర్థము. నీయశస్సు వ్యర్థము. అని తూలనాడెను. కాని యావిప్రునితో నేనేమియు సంభాషింపక ప్రయాణముసాగించి నేనలంగూడి శ్రీకృష్ణునిచెంతకు మరలి వచ్చితిని శోకసంతాపమున మోము వెలవెలవాఱఁగా హరిం గాంచితిని. నావిన్నఁదనము నాశ్రీహరి యెఱింగెను. అంతలో నాబ్రాహ్మణుఁ డరుదెంచి నోటికివచ్చినట్లు నన్నుదూఱుచు నీ యర్జునునిమూఢత్వముఁ జూడుఁడు. క్లీబునివలె నందుండెను. ప్రద్యుమ్నబలరామకేశవు లందు లేకుండిరి. మఱెవ్వఁడు రక్షింపఁగలఁడు. డంబములు పలుకునర్జునుని జేరఁ్బోనేల? ఈతనికి గాండీవ మేటికో. దురదృష్టవశమున నాకీదుర్గతి గల్గినది. అని యిట్లు తూలనాడుచున్న బ్రాహ్మణునింగాంచి ప్రద్యుమ్నుఁడు వైష్ణవీ

మాయనుదాల్చి యమపురమున కరిగెను. అందు విప్రబాలకుఁడు లేకుండెను. స్వర్గమునకరిగెను. అట్లే సకలదిక్కులకు విదిక్కులకుం బోయెను. రసాతలమున కరిగెను. నాకపృష్ఠమును వెదకెను. ఎందు నాబాలకుఁడు కానరాఁ డయ్యెను. విసిగి యగ్నిప్రవేశము నొనరింపఁబూనఁగాఁ బ్రద్యుమ్నుని శ్రీహరి వారించి దుఃఖింపకుము. ద్విజకుమారునిం గనఁబఱచెద. బుద్ధిని దూషింపకుము. నీకీర్తిని లోకులు పొగడుదురు గాక.

అని ప్రద్యుమ్నుచింతంబాపి దీనాననుఁడనై యున్న నా మనఃకష్టమును దొలఁగించి యాతురుం డగువిప్రు నాశ్వాసించి యిట్లు పలికెను. సుగ్రీవ శైబ్య వలాహక మేఘపుష్పనామకములగు నశ్వములంగట్టి తేరాయత్తముచేసి తెమ్మనునంతలో సారథి దారుకుఁడు తెచ్చెను. విప్రుని రథమెక్కించి నన్నుం గాంచి దారుకుఁడు రథమెక్కెను. నీవు సారథ్య మొనరింపుము. అనఁగా నోఁగాకయని యంగీకరించి హరి యనుమతి చొప్పున నుత్తరదిక్కునకుం బయనమైతిమి. దారుకుఁడు బ్రాహ్మణుఁడు శ్రీహరియు నరదముపై నాసీనులయిరి. నేను సారథినై రథముగడపుచు నెందుఁబోవలయునో యేమి ముందుజరగునో తెలిసికొనఁజాలక సర్వము శ్రీకృష్ణానుమతముగ సాగునన్న నమ్మిక రథము గడపుచుంటిని. అని పలికి యర్జునుండు ధర్మరాజుతో మఱియు ని ట్లనియె.

**శ్రీహరి మృతవిప్రకుమారుని దెచ్చియిచ్చుట.**

* ధర్మనందనా! కొంతదూరము పయనము సాగించి

---

* ఈభాగము హరివంశము విష్ణుపర్వము నూటపదుమూఁడవయధ్యాయము ననుసరించి వ్రాయఁబడినది.

తిమి. ఎన్నియోపర్వతములు నదులు వనములు దాఁటితిమి. కొంతదూరము పోనుపోను వరుణాలయ మగుసాగరము దృగ్గోచర మయ్యెను. అంతలో నాసాగరము పురుషరూపమునఁ దోఁచి పూజాద్రవ్యములం గొని యెదురువచ్చి శ్రీకృష్ణుని బూజించెను. దోసిలొగ్గి మహాపురుషా! యేమియాజ్ఞ? సెల విమ్మని ప్రార్థించెను. తత్పూజ నంగీకరించి జనార్దనుఁడు సాగర వర్యమా! రథమునడువ మార్గము నొసంగుము. అదియే నేని ప్పుడు కోరునది. నీవొసంగినమార్గమున రథము చనుటొప్పును. అనుమాటలు శ్రీహరినోటినుండి వెడలఁగనే మహాత్మా! ప్రస న్నుఁడ వగుము. ఈత్రోవన వేటొకఁడు పోవఁజాలఁడు. జనా ర్దనా! నీవే తొలుత నన్ను స్థాపించితివి. నీవు చూపినమార్గ ముననే నడుచుచుందును. దర్పమోహితులగు రాజులెవ్వరు నిందుఁ బోవఁజాలరు. కావున నోగోవిందా! ఆలోచించి యేది చేయఁదగునో యది యాజ్ఞాపింపుము. అనవుడు వాసుదేవుం డిట్లు బదులిడెను.

సాగరవరా! విప్రకార్యార్థము నాకొఱకు నావచ నము నాలకింపుము. నేనుదప్ప వేటొకపురుషుఁ డే బ్రహ్మాండ మున నున్నవాఁడుగాని నిన్ను మీఱఁజాలఁడు. అనుటయు సాగరము భయమున మరల నిట్లు ప్రార్థించెను. మహాపురుషా! నీయానతిననుసరించి యీమార్గమును శోషింపఁ జేసెదను. అంతఁ బయనము నిరంతరాయముగా సాగును. ఆమార్గమున నీరథ మరుగును. అనఁగానే హరి సముద్రమా! పూర్వకాలము నీజలము శోషింపదని వర మిచ్చియుంటిని. నీరత్నరాసులను మానవు లెఱుఁగఁజాలరు. ఇపుడు మార్గము కనఁబఱచిన మేలు

గాదు. కావున నీజలముల స్తంభిపుము. వానిపై నారథ మరు గును. లోకమున నెవ్వఁడుగాని నీప్రమాణము నెఱుఁగఁ దరముగాకయుండు. అనఁగానే సాగరము జలముల స్తంభించెను, ఆజలములపై నొకమార్గము మణివర్ణమునఁ గనంబడియె. అత్రోవన సాగరము త్తరించి యుత్తరకురుభూములం దాఁటి గంధమాదనాద్రిని మీఱితిమి. అందున్న యేడుపర్వతములు మానవరూపముల శ్రీకృష్ణుని దర్శించెను. జయంతము, వైజయంతము, నీలము, రజతాద్రి, మహామేరువు, కైలాసము, ఇంద్రకూటము నను నీసప్తభూధరములు తమతమ వర్ణసమాన రూపములం దాల్చి చేతులొగ్గి మహానుభావా! ఏమి యొనరింతుము. ఆనతిండు. అని పలికి కానుక లర్పించెను. వానింగ్రహియించి మధుసూదనుఁడు పర్వతనాయకులారా! నారథము పోవుట కొకవివరమును మీయందుఁ గల్పింపుఁడు. అంతియ చాలును. అనునంతలో నవి యట్లే యొనరించెను. ఆవివరముల నుండి రథము నిరంతరాయముగా మేఘములనడుమనుండి సూర్యుఁ డరుగునట్లు పోయెను. నాకెంతయో యచ్చెరు వయ్యెను. కొంతదూరము పోయిపోయి లోకాలోకాచలము నతిక్రమించితిమి. అవ్వల గాఢాంధకారము తోఁచెను. అతి కష్టముగా నశ్వములు రథము నీడ్వసాగెను. స్పర్శమున నాతిమిరము పంకమువలెఁగనఁబడెను. పర్వతాకారముగనున్న యాతిమిరమున నడువఁజాలక గుఱ్ఱములు నిలిచెను. హరి యావిధ మెఱింగి చక్రప్రకాశమున నాతిమిరమును భేదించెను. ఆకాశ మగపడెను. రథమార్గము తోఁచెను. నామదిం గలభీతియుఁ దొలఁగెను. ముందు నడువఁగలమనియుఁ దోఁచెను.

ఆయాంకాశమున వెలుతురు కనఁబడెను. అందొకమార్గము స్పష్టమయ్యెను. అంత నొకరూపము కనఁబడియెను. అది సర్వలోకములనావరించి పురుషాకారమున నుండెను. తేజోనిధి యనందగు నారూపమున శ్రీహరి ప్రవేశించెను. నేనును బ్రాహ్మణుఁడును రథమునందే యుంటిమి. ఒకముహూర్తకాలముననే మరల నందుండి హరి వెడలివచ్చెను. విప్రకుమారుల నలువ్వురం గొనివచ్చెను. బ్రాహ్మణునకు వారి నొసంగెను. మువ్వురు పూర్వమే యపహరింపఁబడినవారలును, దొలిదినమున నపహరింపఁబడిన బాలకుఁడును గలిసి నలువురు విప్రబాలకులు తండ్రికడ నుండఁగాంచితిని. ఆకొడుకులం గాంచి యాపృథ్వీసురవరుఁడు పొందినయానందమునకుఁ బారమే లేదు. నేనాశ్చర్యావిష్టమానసుఁడ నైతిని. మరల మేమందఱము బాలకులు నలువురును బోయినమార్గముననుసరించియే యరుదెంచి ద్వారకానగరమును జేరితిమి. క్షణకాలముననే యింతకార్యము సాగినది. శ్రీహరి యావిప్రుని నతనికుమారులను మృష్టాన్నమున సంతుష్టులనుగా నొనరించి యథోచిత ధనమొసంగి పంపెను. అని పలికి యర్జునుండు మఱియు ని ట్లనియెను.

## శ్రీకృష్ణార్జునసంవాదము.

* శ్రీహరి యవ్వల విప్రప్రవరులంగూడి భుజించి కృతకృత్యుఁ డయ్యెను. నేను యదుప్రవరులంగూడి భుజించితిని. హరి విచిత్రగాథలం దెల్పుచుండఁగా నాకథాంతమునందు నేను శ్రీహరి చెంతకరిగి యంతకుముందు జరగిన కథయందలి

* ఈకథయుం హరివంశాంతర్గతవిష్ణుపర్వమునఁ గలనూటపదునాల్గవ యధ్యాయము నాధారముగా వ్రాయఁబడినదని యెఱుంగవలయు.

తత్త్వమును ప్రశ్నించితిని. సముద్రజలములు స్తంభించుట యెట్లు? పర్వతములు వివరము లొసంగు టెట్లు? తిమిరము చక్రముచే భేదించుట యెట్లు? నిరుపమానతేజస్సు కనఁబడ నేల? ఆతేజోనిధి బ్రాహ్మణపుత్రుల నపహరింపనేల? ఇంత దూర మార్గము నొకక్షణకాలమునఁ జేరఁగల్గితిమి కదా. ఎట్లు? ఈవృత్తాంతము నున్నదున్నట్లు వచింపుము. అనఁగనే వాసుదేవుఁడు దరహాసాలంకృతవదనుఁడై యిట్లు పలికెను. అర్జునా! నాదర్శనమునుగోరి యామహాత్ముఁ డాబాలకుల నపహరించెను. బ్రాహ్మణకార్యార్థముగాక వేఱొక కారణము శ్రీహరి రాఁడని యతఁ డట్టులొనర్చెను. * నీవు కాంచిన బ్రహ్మతేజోమయవ్యక్తి నేనే యని యెఱుంగుము. మాయిరువురకు భేదములేదు. ఆతేజస్సు నాతేజస్సు. సనాతన మదియని యెఱుంగుము. ఆ తేజోనిధి యగువ్యక్తియే పురుషరూపమున నీకుం దోఁచెఁగదా. ఆవ్యక్తియే మూలప్రకృతి. వ్యక్తావ్యక్తస్వరూపిణి సనాతనియు నగు. ఆపరశక్తిని బ్రవేశించిననే ముక్తికలుగునని యెఱుంగుము.

---

* బ్రహ్మతేజోమయం దివ్యం మహాద్యద్దృష్టవానసి, అహం స భరతశ్రేష్ఠ మత్తేజస్తత్సనాతనమ్. ౯. ప్రకృతిస్సా మమ పరా వ్యక్తావ్యక్తా సనాతనీ, యాం ప్రవిశ్య భవంతీహ ముక్తా యోగవిదుత్తమాః. ౧౦. సా సాంఖ్యానాం గతిః పార్థ యోగినాం చ తపస్వినాం, తత్పదం పరమం బ్రహ్మ సర్వం విభజతే జగత్. ౧౧. మామేవ తద్ఘనం తేజో జ్ఞాతుమర్హసి భారత, సముద్రస్థతో యోఽహ మహం స్తంభయితా జలమ్. ౧౨. అహం తే పర్వతాస్సృష్టయే దృష్టా వివిధాస్త్వయా, పంకభూతం హి తిమిరం దృష్టవానసి యత్స్థితత్. ౧౩. అహం తమో ఘనీభూత మహమేవచ పాటకః, అహం చ కాలో భూతానాం ధర్మశ్చాహం సనాతనః. ౧౪. అని మూలము.

సాంఖ్యులకు యోగులకుఁ దపోనిధులకు సమ్మతమగుము క్తిస్థాన మదియే. ఆపదమే పరబ్రహ్మము. జగములనెల్ల నదియే విభజించును. ఆ తేజస్సు నాస్వరూపమనియే యెఱుంగుము. స్రబత్రోయుఁడగు సముద్రుఁడను నేనే. స్తంభింపఁజేసినవాఁడను నేనే. నీ వచ్చటం గాంచిన సప్తపర్వతములు నేనేయని తలంపుము. పంకభూత మగు తమస్సును గాంచితివి కదా. ఘనీభూతతమస్సు నాస్వ రూపమే. దానిని విరియించినవాఁడను నేనే. భూతముల నడం చుకాలము నాస్వరూపము. సనాతనధర్మస్వరూపుఁడను నేనే. చంద్రాదిత్యులు, మహాశైలములు, నదులు, సరస్సులు, నాల్గు దిక్కులు, నాయాత్మలు * నాల్గుజాతులను సృజించినది నేనే. నాలుగాశ్రమములను నిర్మించినది నేనే. చాతుర్విద్యమునకుఁ గర్తను నేనేయని యర్జునా! యెఱుంగుము. అని యుపదే శించెను.

ఆయుపదేశమును విని మహాత్మా! పురుషోత్తమా! నీమహిమమును వినఁగోరెదను. నేను బ్రపన్నుఁడను. నీకు నమ స్కరించుచున్న వాఁడను అని ప్రశ్నించితి. నావచనములకు హరి ప్రసన్నుఁడై యిట్లనియెను. బ్రహ్మము బ్రాహ్మణులు తపస్సత్య ములు ఉగ్రము బృహత్తమము నసునివన్నియు నావలననే యుద్భవించినవి. నేను నీకు మిత్రుఁడను. నీవు నాకుఁ బ్రియుఁ డవు. కాన నే నీకుఁ జెప్పుచున్నాఁడను. ఇతరులకుం జెప్ప సాహసింపను. ఋగ్యజుస్సామాథర్వణములు, ఋషులు, దేవ తలు, యజ్ఞములు, మత్తేజస్సంభవములే యగు. పృథివ్యప్తేజో

* చాతుర్వర్ణ్యం మత్ప్రసూతం చతురాశ్రమమేవచ, చాతుర్విధ్యస్య కర్తాహమితి బుధ్యస్వ భారత = అని మూలము.

వాయ్వాకాశములు, చంద్రాదిత్యులు, అహోరాత్రములు, పక్షమాసతిథులు, ఋతువులు, ముహూర్తములు, కలలు, క్షణములు, సంవత్సరములు, వివిధమంత్రములు, సకలశాస్త్రములు, సకలవిద్యలు, నావలననే యుద్భవిల్లెనని యెఱుంగఁ దగు. లయోద్భవములు నావలననే కలుగుచుండునని నిశ్చయింపుము. సదాత్మయు నసదాత్మయు నేనే యగుదును. సదసత్పరము నేన యగుదును. అన నేను భగవత్కరుణకు సంతోషించుచు జనార్దనునందు మనస్సు నిల్పితిని. శ్రీకేశవునిమాహాత్మ్యము శ్రుతముదృష్టము నిట్టిది. అని యర్జునుండు పలికినవిని ధర్మరాజు భక్తియుక్తుఁడై భగవంతుని శ్రీకృష్ణమూర్తిని బూజించెను. విస్మితాంతఃకరణుఁ డయ్యెను. సహోదరులు నచ్చెరువందిరి. అప్పు డాకొలువునందున్న రాజులందఱు హరిం గొనియాడిరి.

మహాశయులారా! వాసుదేవమాహాత్మ్యమును దెలుపు నీకథను బఠించితిరి. అర్జునగర్వభంగ మిందుఁ గలదు. ఈకథాసారము నించుక యాలకింపుఁడు. అర్జునునకుఁ దనంతటిరథికుఁడు లేఁడన్నగర్వము గలదు. మనోగర్వము వృద్ధికి హానిని గల్గించునది. భగవంతుఁ డీవిషయ మెఱింగెను. తన చెలికానికి హాని గలుగరాదని తలంచి దాని నడంపఁ బూనెను. తా నొకదీక్షఁ బూనెను. ఆనాఁడే విప్రుఁడు రాఁగలఁడని హరి యెఱుఁగును. కావుననే దీక్షఁ బూనియుండెను. అర్జునుఁ డాసమయమున ద్వారకయందుండెను. విప్రవాక్యములవినుచున్న యర్జునునకు నేనీపని సాధింపఁజాలనా యన్నయూహ కలదని హరియెఱింగి విజయుని దత్కార్యమును సాధించిరమ్మని పంపెను. శరపరం

పరలు పరఁగించి పాపము గ్రామమునంతయుఁ గాపాడుచుం డెను. శిశువు కానరాఁ డయ్యెను. చేతఁగానిపని కేలఫ్రానితివని విప్రుఁడు విజయునిం బదరెను. నీగాండీవము గాల్పనేయనెను. ఆమాటలకు నరుఁడు తలవంచి బదులుపలుకక పోయినదారిన ద్వారకకు వచ్చెను. బ్రాహ్మణుఁడు వచ్చి యీ యవివేకు నేల పంపితివని హరిసమక్షమునఁ బాండుకుమారునిం దూరెను. హరి శివ యనక యర్జునుఁ డూరకుండెను. ఈయవమతిచే నరు నకు మనఃకష్టముకలుగుటయుఁ దనగర్వమే త న్నింతకుఁదెచ్చె నని నరుఁ డూహించుటయు శ్రీకృష్ణుఁడు తెలిసికొని యింకను గష్టపెట్టుట న్యాయముకాదని యూహించెను. ప్రద్యుమ్నుఁ డు తాఁ జేయఁగలనని మాయాకోవిదుఁడ ననుగర్వమున నెల్ల తావులం దిరిగివచ్చెను. కాని యెందునుగానరాక శిశు వెందో యుండెను. ప్రద్యుమ్నుఁడు మాయాకోవిదుఁడనని గర్వించి తిని. అవమతి గలిగెనని సిగ్గుపడెను. అంతట హరి యావిప్రుని విజయుని దోడుకొని రథమెక్కి యుత్తరమునకుఁ బయనము సాగించెను. నరుని సారథ్యమున నియోగించెను. క్షణకాలమున నుత్తరసముద్రమును జేరఁబోయెను. పర్వతములు మార్గమొసం గుట యర్జునునకు నచ్చెరువు గల్గించెను. హరిమహిమ యెట్టిదో యందుఁ దనశక్తి కోట్యంశమునకుఁగూడఁ జాలునో లేదో స్పష్టమయ్యెను. సాగర మపారము. గాఢాంధకార మావల నున్నది. సముద్రము దాఁటుటెట్లు? సముద్రుఁడు హరితో సంభాషించునపుడు హరి సర్వేశ్వరుఁడు సర్వకర్తయని నరునకు బోధపడియెను. జలమును స్తంభింపుమని హరి యాజ్ఞాపించు టయు నతఁ డట్లుచేయుటయు నామార్గమున రథముసాగున.

ట్లగుటయు సారథ్య మొనరించునరునకు స్పష్టము లయ్యెను. ఆవల గాఢాంధకారము తోఁచెను. గుఱ్ఱములు నిలువఁబడియె. ఇంక రథముసాగదు శ్రీహరీ! యని నరుఁడు మొఱ్ఱపెట్టెను. చక్రాయుధమున నాతిమిరపంకమును హరి విరియించెను. రథము సాగిపోయెను. తేజోరాశియగు నొకపురుషవ్యక్తి కనఁబడియెను. దానిలోఁ బ్రవేశించి హరి విప్రకుమారుల నల్వురం దెచ్చియిచ్చెను. క్షణమాత్రమున ద్వారకానగరమునకు రథము రాఁ జాలెను. అర్జునుఁ డచ్చెరువుపడి హరిని బ్రశ్నించి నా యీసంశయములం దీర్పుమనియె. ఆప్రశ్నమునకు హరి యొనరించినయుపదేశము సకలశాస్త్రసారము.

తేజోనిధి యగువ్యక్తిని నేనే. అదియే ప్రకృతి. పరాత్పర యనంబడును. అది సనాతని. దానిం జేరిన ముక్తియగు. అని హరి పల్కెను. ప్రకృతిపురుషుల కభేద మనికదా దీని సారము.

"ప్రకృతిస్సా మమ పరా వ్యక్తావ్యక్తా సనాతనీ,
యాం ప్రవిశ్య భవంతీహ ముక్తాయోగవిదుత్తమాః."

అను నీ హరివంశశ్లోకమే సకలసంశయములను దొలఁగింపఁజాలును. అది నాప్రకృతియనఁగా దానికి నాకును భేదము లేదనియు నేనెట్లు సనాతనుఁడనో యదియు నట్లే సనాతనియనియు స్త్రీలింగ పుంలింగభేదములు లోకమునకుగాఁ గల్పింపఁబడినవనియు మాయిరువురకు భేదము కల్పింపఁగూడదనియు దీనిభావము. ఇట్లు హరి యర్జునున కుపదేశించుచుండఁగాఁ బ్రకృత్యుపాసనమనఁగానే కొందఱులికిపడుదురే. ఏలొకో తెలియఁజాలక యున్నాఁడను. ప్రకృతివిశిష్టుఁడు కానిపరమేశ్వ

రునకు నామరూపకల్పన మెట్లో తెలియఁజాలక యున్నాఁడను. ఈవిషయమునే యితరపురాణము లెట్లు తెల్పుచున్నవో పరిశీలింతము.

విష్ణుపురాణము:—

"శ్లో. త్వం భూతిస్సన్నతిఃకాంతి ర్ద్యౌః క్షాంతిః పృథివీక్షితిః,
లజ్జాపుష్టిరుషా చైవ కాచిదన్యా త్వ మేవ సా. ౮౩
యే త్వాం మూర్యేతి దుర్గేతి వేదగర్భేఽంబికేతి చ,
భద్రేతి భద్రకాళీతి క్షేమదే సుఖదేతి చ." ౮౬
౫ అంశము.

వాయుపురాణము:—

"అరణ్యే ప్రాంతరేవాపి జలే వాపి స్థలేఽపి వా,
వ్యాఘ్రకుంభీరచోరేభ్యో భయస్థానే విశేషతః
ఆధిష్వపి చ సర్వేషు దేవ్యా నామాని కీర్తయేత్."

హరివంశము:—

"బ్రహ్మావిష్ణుశ్చ రుద్రశ్చ చంద్రసూర్యాగ్నిమారుతాః,
అశ్వినౌ వసవశ్చైవ విశ్వేసాధ్యా స్తథైవచ.
మహేంద్ర స్సహపర్జన్యో ధాతా భూమిర్దిశోదశ,
గావో నక్షత్రవంశాశ్చ గ్రహా నద్యో హ్రదా స్తథా.
సరితస్సాగరాశ్చైవ నానావిద్యాధరోరగాః,
తథా నాగాస్సుపర్ణాశ్చ గంధర్వాప్సరసాంగణాః,
కృత్స్నం జగదిదం ప్రీతం దేవ్యా నామానుకీర్తనాత్."

ఈ పురాణములన్నియుఁ బ్రకృతినామపారాయణము సకలాపదలఁ దొలఁగించుననియుఁ బ్రకృతియే బ్రహ్మావిష్ణ్వాదిరూపముల

ధరించి సకలబ్రహ్మాండముల సృష్టిస్థితిలయకార్యముల నొనరించుచున్నదనియు స్పష్టపఱచు చున్నవి. విష్ణుపురాణము హరివంశము నీరెండు విశేషించి సకలము ప్రకృతియే యని తెల్పుచున్నవి. ఇట్టులుండఁగాఁ బ్రకృతియన్నంతన యులికిపడవలసినంతయవసరము కానరాకున్నది. భేదబుద్ధినిమాని భగవంతునకును బ్రకృతికి నభేదమని భావించి సగుణబ్రహ్మము నుపాసించుట యనఁగాఁ బ్రకృతివిశిష్టు నుపాసించుటయే యని నిశ్చయించి కృతకృత్యులు గావలయును.

శ్రీహరి యీకార్యముచేత నర్జునునకుం గల్గినగర్వమునుదీర్చి భక్తవర్యునిగాఁ జేసెను గాన భక్తులు సర్వకార్యములు భగవదాజ్ఞచేతనే సాగుననియు స్వపౌరుషము పనికిరాదనియు నేకార్యము తదిచ్ఛలేక సాగదనియు నమ్మి యహంకరణముమాని భగద్దాస్యమును సదా కోరుచుండవలయునని యీ కథాసారము. ఇంకఁ దరువాతికథ నాలకింపుఁడు.

## శ్రీకృష్ణమహాత్త్వము.

* శ్రీహరియద్భుతకథల నాలకించి జనమేజయుఁడు వైశంపాయనమునివరా! భగవత్కథ లద్భుతజనకము లనవలయు. అసంఖ్యలనియు విందు. ఇంకను వినంగూరెద. ఎన్ని విన్నను దృప్తికలుగకున్నది. కావున నింకను దెలుపుమా యని ప్రశ్నింప నతఁ డిట్లు పలికెను. రాజేంద్రా! వాసుదేవుని యద్భుతకార్యము లిట్టివని యిన్నియని పరిగణింపఁ దరంబుగాదు. వానిం బరిశీలింప నెవ్వరికిని శక్యముగాదు. కావున

---

* ఈకథ హరివంశాంతర్గత విష్ణుపర్వమున నూటపదునైదవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని తెలియవలయును.

నందు లేశమాత్రమే వచియింపఁజాలుదు. విను ముఖ్యవిషయమును దెలిపెద. ద్వారకయందుండి ధర్మసంస్థాపనము చేయఁబూని రాష్ట్రములను ధ్వంసముచేయఁబూనిన విచక్రుఁడు నరకాసురుఁడు లోనగువారిం బొలియించి వాసవునోడించి పారిజాతమును గొనివచ్చి భూలోకమున నునిచి దంతవక్త్రాదులం దునిమి శిశుపాలుని కష్టములందీర్చి మఱియు నెన్నియో యద్భుతకృత్యముల నొనరించెను. జరాసంధు వధింపఁజేసి తద్బద్ధు లగు రాజుల విడిపించెను. పాండవులం గాచుపాంటె శపథ మొనరించెను. ఖాండవవనము నర్జునునిచేఁ దాను జెంత నుండి నగ్నిమూలమునఁ గాల్పించెను. గాండీవమగ్నిచే నర్జునున కిప్పించెను. యదువంశమునకుం గలయపకీర్తిని దొలఁగించి గౌరవము సంపాదించి వృద్ధిచేసెను. జనమేజయా! భారత యుద్ధము వింటివిగదా. ఇన్నియద్భుతకార్యముల నొనరించి మహర్షులకు నుపదేశించి భారతభూభాగమున స్థిరముగా ధర్మమునిలుచున ట్లొనరించి తనయవతారమును సార్థకముగా నొనరించెను. బాణాసురునిబాహుసహస్రమును ఖండించి కాపాడెను. శోణితనగరమును శంకరుఁడు గాపాడుచుండెను. దాని నశ్రమంబునంజొచ్చి బాణాసురునిగర్వము నిర్మూలించి శంకరుఁడు ప్రార్థింపఁ గాపాడెను. ఇట్టి వనేకకార్యము లొనరించి భూభారము నడంచెను. ఆకథలను వివరింప నాకుఁ దరమా యనిపలికి శ్రీహరిపాదారవిందముల ధ్యానించుచు వైశంపాయనమునియుండ జనమేజయుండును నిశ్చలహృదయంబున శ్రీహరిని నిలిపి ధ్యానించెను.

## ఉషాకన్యాచరిత్రము.

* భగవంతుని ధ్యానించి జనమేజయుండు వైశంపాయన మునీ! భగవత్కథల వచించునపుడు బాణాసురునివృత్తాంతము చెప్పితివి. దాని విస్తరించి వినఁగోరుచున్నాఁడను. బలిపుత్రుఁ డగుబాణాసురుఁ డీశ్వరానుగ్రహము నెట్లుపొందెను? కుమారస్వామితో నెట్లు చెలిమిని సంపాదించెను? బాహుసహస్రములుగలిగి మహాదనుజవీరసేనాన్వితుఁడై యుద్ధమున శ్రీహరిచే నెట్లు పరాభవింపఁబడియె? వచింపుమా యని ప్రార్థించెను. వైశంపాయనుఁ డిట్లుచెప్ప నారంభించెను. రాజేంద్రా! తచ్చరితము వచియింతు. అవహితుండవు కమ్ము. బలిపుత్రుఁ డగుబాణాసురుని శ్రీహరి ప్రాణములతో విడిచిపుచ్చెను. దీన శ్రీహరిమహిమము తేటపడును. బలిచక్రవర్తి నెఱుంగుదువుకదా. ఆతనికి నూర్గురుకుమారులు. అందు బాణనామకుఁడు జ్యేష్ఠుఁడు. పరాక్రమశాలి. ఆహవకాంక్ష యాతనికి మెండు. లోకములం గ్రుమ్మరుచుండువాఁ డొక్కనాఁడు కైలాసప్రాంతమునఁ, గుమారస్వామి యాడుచుండఁ గాంచెను. ఆశ్చర్యమందెను. అత్తఱి నాతని కొక బుద్ధిపుట్టెను. తీవ్రతపస్సొనరించి భగవంతుఁ డగుశంకరు నారాధించి తత్పుత్రసమానత నొంద

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండమున నూటపదునాల్గవయధ్యాయమునుండియుం, బ్రహ్మపురాణము తొంబదియాఱవయధ్యాయమునుండియుం, హరివంశవిష్ణుపర్వమున నూటపదాఱవయధ్యాయమునుండియుం, విష్ణుపురాణమునఁ బంచమాంశమున ముప్పదిరెండవయధ్యాయమునుండియుం, శ్రీభాగవతము దశమస్కంధమున నఱువదిరెండవయధ్యాయమునుండియుం గ్రహింపఁబడినదని యెఱుంగవలయుం.

వలయుననియే యాతనియూహ. వెంటనే తపశ్చర్య కారంభిం చెను. తపోనియతిని దేహమును శోషిల్లఁ జేసెను. దాన శంకరుఁడు ముదమంది పార్వతిం గూడి యచ్చటికరిగి తన్నియతిం గాంచి పరమప్రమోదమానసుండై దనుజకుమారా! నీకు మేలగుంగాక. వరము గోరుము. నీమదిఁ గలభావమును దెల్పుము. ఆమాటలు చెవులఁజొరఁగనే కృతాంజలిపుటుండై మహాత్మా పార్వతీపుత్రత్వము నభిలషించుచున్నాఁడను. ఇదియ నా కోరువరము. అనుటయు * శంకరుఁ డట్లయగుఁగాక యని పలికి పార్వతిం గాంచి రుద్రాణీ! కార్తికేయునకు వీఁ డనుజుండగు. కొండికవానిగా గ్రహింపవలయును. ఎచ్చోట నగ్నిహోత్రునుండి కుమారస్వామి యుదయించెనో ఆచోటనే యీపుత్రునకు నగరము కాఁగలదు. సంశయము లేదు. శోణితపురమని దానికిఁ బేరుగల్గును. నగరోత్తమం బదియగును. నాచే నది రక్షింపఁబడును గావున దాని నెవ్వఁడును జయింపఁ జాలఁడు.

ఆవరమునొంది శంకరానుజ్ఞాతుఁడై బాణాసురుఁడు శోణితనగరంబు నిర్మించుకొని యందు నివసించెను. రాజ్యమును బాలించుచు దేవతలఁ గలవిలపాటొందఁజేయుచుఁ దన బాహుసహస్రసంలబ్ధగర్వమున దేవతల లెక్కింపక సర్వదా యుద్ధమునే కోరుచుండెను. కుమారస్వామి యగ్నివలెఁ బ్రకాశించు ధ్వజమొసంగెను. మయూరవాహనముకూడ నొసంగెను. శంకరానుగ్రహము కలుగుటంజేసి యాబాణాసురుని

* ఈకథ భాగవతమున నిట్టులేదని తెలియందగు హరివంశమునఁ గలదు.

దేవదానవగంధర్వపన్నగులు రణాంగణమున నిల్వఁజాలకుండిరి. శంకరుఁ డానగరమును గాపాడుటయు బలాన్వితుఁడు వాఁ డగుటయుఁ గారణంబులుగా నానగరముప్రక్కనైనం జూడఁ జాలక యుండిరి. ఒక్కనాఁడు బలగర్వమున నాయసురుఁడు కన్నుగానక శంకరుకడకరిగి నమస్కరించి వృషభధ్వజా! పలు సారులు దేవతల నోడించితిని. సాధ్యమరుద్గణముల నెన్నియో సారులు జయించితిని. నీసహాయమున నీనగరమున నున్నాఁ డను. నన్ను నోడింపఁబూని నిరాశులై యందఱరిగిరి. దేవతలు మరల నానగరమునైనఁ జూడఁదలంపలేదు. యుద్ధముచేయు నవకాశములేని నాకు జీవితముపైఁగూడ నాశ లేకున్నది. యుద్ధము దొరకదేని యీ బాహుసహస్రము వ్యర్థముకదా. వృథాభారమును మోయుచున్నవాఁడను. నాతో యుద్ధము చేయ నెవ్వఁడైన వచ్చునా. యుద్ధముసేయక యూరకుండఁ జాలను. ప్రసన్నుఁడవై యానతిమ్మా యని వేఁడెను.

వృషభధ్వజుఁ డామాటల నాలకించి పక్కున నవ్వి ముందు యుద్ధము కాఁగలదు. దానవేశ్వరా! నామాట లాల కింపుము. వత్సా! నీయీధ్వజమునకు భంగ మెప్పుడు కలుగునో యందును స్వస్థానమునన్నప్పు డాభంగ మేకాలమునఁ గలు గునో యప్పుడు యుద్ధము కాఁగలదు. ఆమాటలనాలకించి నవ్వుచు బాణాసురుఁడు ప్రసన్నవదనుఁడై నమస్కరించి యంత వనుక నెట్లో యీబాహువుల ధరించియుందును. మరల యుద్ధ మున సహస్రాక్షు నోడింపఁజాలుదుఁ గదా. అని పలుకుచు నానందాశ్రుజలముల మహేశ్వరుపాదములం దడిపి లేవకుం డెను. శంకరుఁ డపు డసురవరా! లెమ్ము. లెమ్ము. నీవంశమునకు

బలమునకుఁ దగినయుద్ధము సేయంగల్గుదువు. నావిని లేచి యానందించుచు మహాదేవునిచే సెలవంది తనయతఃపురమున కరిగి సుఖంబుండెను.

ఒక్కనాఁడు రహస్యగోష్ఠినుండి కుంభాండునిం గాంచి నవ్వుచు నామనోగతమును బ్రియవార్తనుగా నీ కెఱింగించె దను. అన విని కుంభాండకుఁడు సంతోషమున రాజేంద్రా! నాకుఁ బ్రియవార్తను జెప్పఁబూనితివి. పరమానందము. విస్మయోత్ఫుల్లనయనుఁడవై ప్రహర్షము నొందియున్నట్లు మీమాటలవలనఁ దెలియవచ్చెడిని. మీవలన నొక్కమాట వినఁగోరెదను. శంకరువలన వరమేమి పడసితివి? భగవత్ప్రసాదమునను, గుమారస్వామి రక్షణమునను నీకుఁ గొఱంతయుండదని నమ్మెదను. త్రైలోక్యరాజ్యము నీకు శంకరుఁడు ప్రసాదించెనా. కొందఱు రాక్షసులు విష్ణుమూర్తి చక్రభయమున జలాశయమున నివసించియున్నవారు. విష్ణువు శార్ఙ్గగదాపాణియై యుద్ధముననిలువ మార్కొనఁజాలక జలాశయముల దాఁగి ప్రాణముల నిల్పుకొనిరి. అట్టిరాక్షసు లిప్పుడు భయవిముక్తులై హాయిగా నున్నవారు. ఇంద్రుఁడు నీభయమునఁ బాఱిపోయి పాతాళమున నున్నవాఁడా యేమి? విష్ణువువలనిభయము రాక్షసకులమునకుఁ దొలఁగినదా యేమి? పాతాళవాసమునుమాని నీసాయమున నిర్భయులై సురపురమును దానవు లాక్రమించిరా యేమి? తొల్లి విష్ణువు నీతండ్రియగు బలిచక్రవర్తిని బంధించెను గదా. అట్టి బలిబంధవిముక్తుఁ డయ్యెనా యేమి? బలి పాతాళమునువీడి బలి రాజ్యమునొందెనా యేమి? దివ్యమాల్యాంబరధారియై దివ్యస్రగ్గంధలేపనముల విరాజిల్లుచున్న

బలిచక్రవర్తిని మరలఁ జూడఁగలమా. విష్ణువు వామనావతారే మునఁద్రిపాదముల లోకములం గొల్చి యపహరించెను గదా. ఆరాజ్యమును మరల మేము పొందఁజాలుదుమా యేమి? స్నిగ్ధగంభీరఘోషము గలశార్ఙ్గధనువును ధరించి సమితింజ యుండనంబరఁగు విష్ణుమూర్తిని మరల జయింపఁగలభాగ్యము మాకుఁ గల్గినదా యేమి? వృషభధ్వజుం డగుశంకరుఁడు ప్రసాదసుముఖుఁడై కృపావీక్షణముల నిన్ను గాంచుచు న్నాఁడా యేమి? ఈశ్వరసంతోషమునను, గార్తికేయానుమత మునను, మాకెల్ల నుత్తమరాజ్యసుఖములఁ గల్పింతువా యేమి?

అని యిట్లు కుంభాండకుఁడు పలుకఁగాఁ దద్వాక్యప్ర చోదితుఁడై బాణాసురుఁ డసంగతముగా నిట్లు పలికెను. కుంభాండా! చిరకాలమునుండి యుద్ధము కలుగలేదు. కావున నేను సంతోషావిష్టుఁ డగుశంకరుని దర్శించి స్వామీ! యుద్ధా భిలాషము విశేషించియున్నది. మనస్తుష్టిని గల్గించుయుద్ధము నాకుం గల్గునా యని ప్రశ్నించితిని. నాప్రశ్నము నాలకించి నవ్వి శంకరుఁడు దీర్ఘముగా యోజించి మహాయుద్ధము కాఁగ లదు. అట్టిసంగర మీవటకు సాగలేదు. ఎత్తరుణమున మయూ రధ్వజభంగము కనఁబడునో యప్పుడు ఘోరాహవము గల్గును. అని బదులిచ్చెను. ఆమాటలకుఁ బరమప్రీతినంది శంకరుం గొని యాడి నమస్కరించి నీచెంత కరుదెంచితిని. అని పలుకఁగా విని కుంభాండుఁ డిట్లు పలికెను. రాజేంద్రా! నీయీపలుకు శుభప్రదము గాదు. అని పలుకునంతలోఁ బైకెత్తియున్న మయూరధ్వజము నేలఁగూలెను. దానిపై నొకపిడుగు పడినం

దున గుబేలుమని వ్రాలెను. ఉత్తమోత్తమధ్వజ మిట్లుకూ లఁగాఁ బరమానందభరితాంతరంగుఁడై బాణాసురుఁడు యుద్ధ మునాగుచున్నట్లే భావించెను. కనఁబడకయుండి పిల్లిగర్జించెను. ఇంద్రుఁడాశోణితనగరముపై రక్తవర్షమును గురియించెను. సూర్యమండలమును భేదించుకొని మహోల్కయొక్కటి భూత లమునఁ బడియెను. స్వపక్షచోదితుండై భాస్కరుఁడు భరణీన క్షత్రమును బాధించెను. చైత్యవృక్షములయందు ధారలుగా రక్తము కురిసెను. నక్షత్రములు రక్తధారలు గురియుచుఁ బడెను. రాహుగ్రహము తనకు ముందరుగుచున్న భానుని బర్వేతరకాలమందు లోకక్షయము నెఱింగించుచు బాధించి క్రిందఁబడియెను. దక్షిణదిక్కునాశ్రయించి ధూమకేతువు కనం బడియెను. నిరంతరము బాధలఁగల్గించుచు భయంకరముగా వాయువులు వీవసాగెను. కోసలయందు శ్వేతలోహితవర్ణ ములుకలిగి కృష్ణగ్రీవమై, మెఱపుతీఁగవలె మెఱయుచున్న త్రివర్ణపరిఘము సూర్యునస్తమయకాలములందు నావరించు చుండెను. భయంకరుఁడగు నంగారకుఁడు కృత్తికానక్షత్రము లయందు వక్రించెను. బాణాసురుని జన్మనక్షత్రమును జిందఱ వందఱ చేయువానివలెఁ గనంబడియెను. చైత్యవృక్షముల నుండి పెక్కుకొమ్మలు ధరణిం బడియెను. ఆవృక్షములను దాన వాంగనలు కన్యకలు నిరంతరము పూజించుచుండువారు. అట్టి మహావృక్షములు శాఖాహీనము లయ్యెను. ఇట్టి భయంకర నిమిత్తములు కనఁబడుచున్నను బలమదోన్మత్తుఁడై బాణాసురుఁ డించుకంతయు వగపునొందక సంశయాకులమానసుఁడు కాక సుఖముగ నుండెను. కుంభాండుఁ డనుదానవుఁడు తత్వవేత్త

కావునఁ జింతాక్రాంతుఁ డయ్యెను. ఆతఁడు బాణాసురసచివుఁడు. కావున నప్పటి యవలోకనములంగాంచి విచారింపసాగెను. ఇన్ని యుత్పాతములు కలుగనేల? ఇవన్నియు నమంగళమును దెల్పుచున్నవి. దానవరాజ్య వినాశనహేతువులని నాకుం దోఁచెడిని. సంశయము లేదు. అని రాజుంగాంచి దానవేంద్రా! నేను నితరులును నీ భృత్యులము. మాకెల్ల నేదోవినాశనహేతువు సమీపించుచున్నది. పార్థివదుర్నయమే దీనికిం గారణము. శక్రధ్వజతరువునకు స్వదర్పమున నాశమెట్లుకల్గునో మోహమున బలమునుగోరు నీకు శంకరప్రసాదమునఁగల్గిన త్రైలోక్యవిజయము యుద్ధాకాంక్షవగుటచే నాశమునొంద నున్నది.

ఈమాటల నాలకించియుఁ బ్రీతచిత్తుఁడై యత్యుత్తమ మద్యమును ద్రాగెను. దైత్యదానవకాంతలంగూడి మధుపానము నిరంతరము చేయసాగెను. కుంభాండుఁడు చింతావిష్టుఁడై రాజమందిరమున కరిగి యాయాయుత్పాతములం దెల్పి సుమతులం గూర్చుకొని రాజు ప్రమాదమునకు గుఱియయ్యెను. దుర్బుద్ధియానెను. జయశాలియయ్యును యుద్ధమునే సదా కోరుచున్నవాఁడు. స్వదోషములు గొప్పవియైనను దలపోయఁడు. మహోత్పాతభయ మాతనికిం గలుగదయ్యెను. కావున నపకారము తప్పక కల్గును. ఇది యసత్యము కాదు. ఇన్నియుత్పాతములు కలిగినపుడు దుష్ఫలములు కలుగక యుండునా. ఈనగరమునందే శంకరకార్తికేయులు గలరు. ఐనను రాజదోషమునఁ బరాభవము మనకెల్లం గల్గును. ఉత్పన్నదోషప్రభవ మగుక్షయము కలుగకవదలదు. దోషములు

నశింపవని నాకుం దోఁచెడిని. ఇది నిశ్చయముగా రాజదోషమే. సంశయములేదు. బాణాసురుఁడు దుర్మతి కావున దానవులెల్ల దుర్మతులైరి. దేవదానవసంఘపాలకుఁడు భగవంతుఁడు నగు కార్తికేయుఁడే యీనగరమును నిర్మించెను. ప్రాణములకంటెఁ బ్రియతరముగా దీనిం గాచుచుండును. ఆకార్తికేయప్రియుఁడగు నీబాణాసురుఁడు శంకరప్రియుఁడు నగు, బాణుఁడు దర్పాతిశయమువలన శంకరుని స్వనాశముంగోరి వరము గోరెను. యుద్ధమునుగోరువా రుందురా. విష్ణుపురోగము లగు దేవతలు దండెత్తివత్తురేని శంకరుఁ డపుడు వారించునా. బాణ సాహాయ్యమునుగోరి శంకరకార్తికేయులు యుద్ధముచేయఁ బూనుదురేని వీరిని మార్కొనువా రెవ్వరుందురు? కాని భగవద్వాక్యము మిథ్య గానేరదు. సర్వదైత్యక్షయకర మగు సంగరము కాఁగలదు. అని యిట్లు కుంభాండుఁ డాలోచించి చింతావిష్టుఁడై సర్వప్రాణిహిత మగునాలోచనము చేయుచుండెను. ఎవరు దేవవిరోధమునుదాల్తురో వారెల్ల బలివలె బద్ధులగుదురని యాతఁడు తలంచెను.

### ఉషాకన్య పార్వతివలన వరమునొందుట.

* పార్వతీపరమేశ్వరులు జలక్రీడకై మనోహరనదీతటమునకు దయచేసిరి. వారినిసేవింప నచ్చరమిన్నలు పెక్కుమంది యరుదెంచిరి. ఆనదీతీరము మనోహరసర్వర్తుకుసుమఫలభరితముగ నుండెను. గంధర్వనాయకులు భవానీపరమేశ్వరసేవార్థ

* హరివంశము విష్ణుపర్వము నూటపదునేడవయధ్యాయమునుండి గ్రహింపఁబడినవి. తక్కినపురాణములయందు ముం దుదహరించిన యధ్యాయములనుండియే యీకథ వ్రాయఁబడును.

మే తెంచిరి. కల్పవృక్షప్రసూనముల నాయాదిమదంపతులం బూజింప నా నదీతీరమంతయుఁ బుష్పమయముగా నుండెను. బహువిధవాద్యములు చెలంగ నాపరమేశ్వరులవారెల్ల గాన విశేషముల నలరించిరి. చిత్రలేఖాద్యప్సరఃకాంతలు పార్వతీ రూపమువలె నలంకరించుకొనిరి. తత్పతులెల్ల శివరూపముల నలవరించుకొనిరి. ఒక్కొక్కకుటుంబము పార్వతీపరమేశ్వర మయముగా నుండెను. పార్వతీపరమేశ్వరు లావినోదమును గన్నులారఁ గాంచి యానందించిరి.

బాణాసురకన్యక యుషయనుకన్యకామణి యానదీతీర మున విహరింపఁబోయి యాయాదిమదంపతులం గాంచి కరము హర్షించి పార్వతీదేవికి సంతోషము గల్గింపఁబూని బహువిధ ముల వేషములఁ దాల్చెను. దాని కాయంబిక యానందించెను. ఉష తనమనోరథమును బార్వతి కెఱింగింపఁ బూనెను. తాను గూడ ననురూపుఁ డగుపతిం గూడి విహరించిన బాగుండునన్న మనోభావమును దేవి కెఱింగింపఁ దలంచెను. మహాదేవియు నాయుషామనోభావము నెఱింగెను. ఉషాకన్యను జేరఁబిలిచి యామె యానందసాగరమున నోలలాడునట్లుగా నిట్లు పలి కెను. ఓ కన్యకామణీ! నీవును త్వరగా ననురూపకాంతునిం గూడి విహరింపఁగలవు. నన్నుంగూడి శంకరుఁ డానందించు నట్లు నిన్నుంగూడి నీప్రాణనాయకుఁ డానందించును గాక. ఆమాటలాలకించి యుషాకన్య యెన్నఁడట్టికాలమువచ్చునో యెఱుంగఁదలఁచెను. ఆ యాశయమెఱింగి పార్వతినవ్వి యిట్లు పల్కెను. కన్యకామణీ! యెప్పుడు పతిసమాగమ మగునో తెల్పెదవినుము. వైశాఖమాసమున శుక్లద్వాదశియందు రాత్రి

సౌధాగ్రభాగమున శయనించియున్న నిన్నెవ్వఁడు స్వప్నమున సుఖింపఁజేయునో యతఁడే నీకు భర్తయగును. అని యాశీర్వాదిం పఁగా వినమితకంధరరయి భవానికిమ్రొక్కి సఖిగణములుకొలువ యథాపూర్వముగా వనవిహారము సల్పి తనయింటికి వచ్చెను. మార్గమధ్యమునఁ జేడియలందఱు పరిహాసవచనములు పల్కు చుఁ జప్పటులుచఱచుచు నుల్లసము లాడుచుండిరి. ఆబాణ పుత్రికకుఁ గిన్నరకన్యకలు, యక్షదైతేయకన్యకలు, నచ్చరలు, చెలికత్తియలై యుండిరి. ఆ చేడియలెల్ల నుషాకన్యకామణీ! పార్వతీవరమహిమమున నీకుఁబతి యచిరకాలమున దొరకును. ఆ జననివాక్యము తప్పదు. రూపాభిజనసంపన్నుఁడు పతియగు నని దేవియే వచించెను గదా. అనఁగా వారిమాటల కానందిం చుచు నాయుష భగవతీవాక్య మెపుడుఫలించునో యని యువ్విళ్లూరుచు నింటికి వచ్చి యథాపూర్వముగ నుండ నాచే డియలెల్ల నెలవంది తమతమనివాసముల కరిగిరి. ఆనాఁడుమొద లాబాణపుత్రిక కామాతురయై పతిదర్శనమును గాంక్షించుచుఁ బార్వతీవరమును బలుసారులు స్మరించుచు రాత్రులయందు నిద్రయుఁ బగలు భోజనములేక పతినేదలంచుచుఁ జింతించుచు శీతాంశుఁ డగపడిన నిందించుచు జందనచర్చల నొల్లకయుం డెను. కాముఁడు నిష్కరుణుఁడై యాలేమను మఱింత బాధింప సాగెను. జ్వరములేకున్నను జ్వరార్తగాఁ దలంచి చెలికత్తె లాకన్యక నుపచారములఁ దన్పుచుండిరి. క్రమక్రమముగాఁ జెక్కిళ్లు పాండువర్ణముగా మాఱెను. నయనారవిందములు సలిలావృతము లయ్యెను. ఆవులింతలు మెండయ్యెను. నిద్ర పట్టుట కఱవయ్యెను. మన్మథానలమున బాధింపఁబడు నాయు

హాహృదయఫలకమునఁ బద్మినీకందచూర్ణమును బలుసారులఁ వైచుచు సఖీగణము సేవించుచుండెను. నళినీదళకల్పితవ్యజనముల విసరుచుఁ గతమేమని ప్రశ్నించుచు నమ్మా యేమిబాధ? శరీర మెట్లున్నది? ఎవరివంక నీబాధ యుప్పతిల్లెను. నీకేమిఁ దోఁచునో దాని మాకుం దెల్పుమా యని గ్రుచ్చిగ్రుచ్చి యడుగసాగిరి. అభిసారికలు చెంతఁజేరి మనోగతమును దెల్పుమని ప్రశ్నించిరి. ప్రియసఖీబృందము తల్లీ! నీతండ్రి త్రిలోకముల జయించినవాఁడు. దేవతలు వడంకునట్లు చేసినవాఁడు. ఆమహావీరునెదుట నిల్వఁగలవాఁ డొక్కరుఁడును లేఁడు. బలిచక్రవర్తి కుమారుఁడు అమరావతిని జయించి యీ శోణితనగరమును గట్టించెను. శంకరుఁడు ప్రమథులంగూడి యిందున్న వాఁడు. నీతండ్రిని శంకరుఁడు నీపుత్త్రుఁడని భావింపుమని పార్వతికిచ్చెను. నీముద్దులమోము వాడిపోయినది. ఏల?

ఆని పెక్కుభంగుల వారు ప్రశ్నింపఁగా సఖీవాక్కోలాహలము నాలకించి తన్మాత యరుదేర నాచెలికత్తెలు తద్వృత్తాంతంబు విన్నవించిరి. ఆమెయు విచారించి వైద్యులం బిలిపించి రోగశాంతిం జేయంబంచెను. అని పలికి తనయ యుండు తావునకుం బోయి శిరీషకుసుమకోమలహస్తమునఁ గూఁతు గాత్రమునుదడవి గ్లానియడంగుఁ గాకయని యాశీర్వదించెను. అమ్మా! నీ కేమి కావలయును? ఏవిధమగుకష్టము శరీరముననున్నది? వైద్యులు వత్తురు. వారికిం దెల్పుము. అనునంత వైద్యు లరుదెంచి తల్లీ! మన యుషాకన్య జలక్రీడార్థమరిగి యందుఁ బార్వతీపరమేశ్వరులం గాంచి శ్రమచెంది వచ్చినట్లు విన్నారము. ఆశ్రమమువలన నంగ గ్లానికలిగినది. దాన నావ్య

లింతలు వచ్చుచున్నవి. క్రమముగా నిద్రపట్టును. భయంపడ నవసరము లేదు. అన విని రాణి యిట్లనియె. హృదయమున నునిచిన హిమసహితచందనము బుద్బుదమువలెఁ గనఁబడియె డీని. ఏల? అతిదాహము, మహాస్వేదము, పిపాసయు, క్షుత్తు లేకుంటయు ప్రలాపము ననునివి కలుగనేల? శాస్త్రపద్ధతి నాలోచించి చెప్పుఁడు. అనఁగా విని తల్లీ! జలవిహారము చేయుచున్న గౌరీశంకరుల మనయుష చూచెను. వారెల్ల మనకన్నియం జూచిరి. ఆకాలమున దృష్టిదోషము తగిలినది. దాన దేహతాపము గలిగినది. రక్షామంత్రములచేతను, జలాభిషేకములచేతను శాంతికల్గును. అని పలికి వారుపోయిరి. కామాభిలాష జనితవ్యథను సూచించి వైద్యులుపోఁగాఁ దల్లి యేకాంతమున నడుగఁగా నెట్టకేలకు నుష యిట్లు పలికెను. అపుడు లజ్జాదేవి యామె నావేశించి యుండెను. తల్లీ కారణమును దెలుపఁజాల, మాటలాడ బుద్ధిపోడమదు. భోజనము చేయ నిచ్ఛయంకురింపదు. ఉత్సాహము మది లేనేలేదు. హృదయము పరితపించుచున్నది. అనిమాత్రము తెలిపి మఱేమియుఁ బలుకక యూరకుండెను. సఖీగణమంతయుఁ గూడి యావనము నిర్భరముగా నున్నది. భర్తృయోగ్యరాలుగ నున్నది. ఇఁక నేమిచెప్పఁగలదు? తల్లిదండ్రుల యనుగ్రహమున ననురూపుఁడగు నాయకునిం బడసి సుఖించుఁగాక. అని పలికినఁ దల్లియు దాని యాథార్థ్యము నెఱింగి యింటికిం బోయెను. * ఉషాకన్యయు నిరంతరచింతాసాగరతరంగడోలిక

* ఈకథ హరివంశమును బ్రధానముగాఁ గైకొని వ్రాసితిని. శ్రీకృష్ణజన్మఖండమునం దిట్లు గానరాదు. అనిరుద్ధుఁడు ద్వారకయందుండి నిద్రలోఁ

లలో మునుఁగుచుఁ దేలుచు నూఁటాట యనునవియే లేకయుండెను.

---

దానొక నవయువతిం గూడినట్లు, ఆమె త్రిభువనసుందరి యైనట్లును, ఆవిహారమునం దానానందాంభోరాశి నోలలాడినట్లును, మెలఁకువరాఁగా నాకాంతామణి కనంబడనట్లును, ఆదిమొదలు విచారసాగరనిమగ్నుఁడై యుండ శ్రీహరియెఱింగి యాతనికోరిక నెఱవేర్తునని పలికి పార్వతీమూలమున నుషకును గల వచ్చునట్లు చేసినట్లు కనఁబడుచున్నది. శ్రీభాగవతమునందు నుషకే స్వప్నమువచ్చినట్లు గలదు. విష్ణుపురాణమునందు హరివంశము ననుసరించియే పార్వతిం గాంచి యుష తనకుఁ బతిసంగమవాంఛ గలుగ నావాంఛ నంబకెఱిఁగింపఁదలంప నాజగజ్జనని యెఱింగి వరమిచ్చినట్లు కలదు. బ్రహ్మపురాణము విష్ణుపురాణమునకు మూలాధారము గావున నందు నీకథ గలదు. బాణాసురుఁడు యుద్ధమునుగోరి శంకరునడుగ ధ్వజభంగవృత్తాంతమును దెల్పినకథ యన్నింటియందును గలదు. శ్రీభాగవతమునందు నీకథ యుషాస్వప్నముతోనే యారంభింపఁబడుటకుం గలకారణమేదో తెలియకున్నది. పార్వతీవరమున స్వప్నమున నొకపురుషుఁడు తోఁచెననుట సమంజసముగాఁ గానంబడియెడిని. భాగవతమున నాకథవదలి తత్ఫలభూతకథను దెల్పిరన్నను సమాధానమే యగును. శ్రీకృష్ణజన్మఖండమున ననిరుద్ధునకుఁ గలరాఁగా నాతఁడు విరహజ్వరార్తుఁ డగుటెఱింగి హరి యుషాకన్యకకుఁ గలగలుగునని యూహించినట్లు, మాధవు నూహాప్రకార ముష పార్వతిని దర్శించినట్లు నామె వరమొసఁగినట్లు, పిదప నుషాకన్యకకు ననిరుద్ధునితోఁ గలిసినట్లు స్వప్నమురాఁగాఁ జిత్రలేఖ యావృత్తాంతము నెఱింగి యనిరుద్ధునిం దెచ్చెనని కలదు. దీనిచే సర్వజ్ఞుఁ డగుభగవంతుఁడు తానే సర్వసాక్షి గావున బాణాసురుని జయింపఁబూని యీకథ నిట్లు కల్పించెననుట తత్సర్వనియంతృత్వమును దెలుపును. శ్రీకృష్ణమహిమమును బ్రధానముగాఁ దెలుపుటలో నిన్నిపురాణములకంటె

## ఉషాకన్యకలగాంచుట.

* చెలికత్తియలందఱు నుషాకన్యక మదిఁగలచింత యిది యని యెఱుంగఁజాలక యుండిరి. ఉషపరితాపము నివారించు సాధనమేదియో యెఱుఁగఁజాలక తోఁచినట్లెల్ల శీతలోపచారములు చేయుచుండిరి. వానివలన నించుకంతయు లాభము లేకుండెను. పార్వతి యనుగ్రహించినప్రకారము వైశాఖమాస శుక్లపక్ష గతద్వాదశి యరుదెంచెను. రాత్రియందుఁగూడ నెందఱో చెలికత్తియలు కొలుచుచుండుట వాడుక. మఱియు నీబాధ కలిగినప్పటినుండి హెచ్చరికల వారామెను గొలుచుచుండిరి. ఆ ద్వాదశిరాత్రియందు భగవత్యనుగ్రహమునఁ గాఁబోలు ఉషాకన్యకకు నిద్రపట్టెను. గాఢనిద్రలోనున్నట్లు చేడియ లెఱింగి సంతసించి వారును గూర్కిరి. ఆరాత్రి నుషాకన్యక

శ్రీకృష్ణజన్మఖండము ముందంజవైచినదనక తప్పదు. తక్కినవి చప్పిడిగా నున్నవని నాభావము కాదు. మహిమమునన్నియుం దెల్పునవియే. ఆతెల్పునపుడు స్పష్టముగా దెల్పునది బ్రహ్మవైవర్తపురాణమే యనవలయును. కావున నన్నింటినుండి వ్రాయక సమానకథ నొక్కదానినుండియే గ్రహించితిని. భేదమునుమాత్రము తెలుపుచున్నాఁడను. ఇఁక సాగఁబోవు కథ నన్నింటియందును సమానముగా నున్నతావులను దెలుపను. భేదముగా నున్నభాగమునసే భేద మింతమాత్రమని తెలిపెదను.

* ఈకథ హరివంశాంతర్గత విష్ణుపర్వమున నూటపదునెనిమిదవయధ్యాయమునుండి గ్రహింపఁబడినది. భాగవతాదులలో నీకథలోపల వ్రాసినయధ్యాయములందే కలదు. కావున వానినుండియు నుచితరీతి గ్రహింపఁబడినదని యెఱుంగవలయు.

కొకస్వప్నము వచ్చెను. అందొక సుందరాంగుఁడు తన్నుం గూడినట్లును, పార్వతి చెప్పినయట్లే యానాఁడు కలవచ్చినట్లును, గావున నాతఁడే తనకు మనోహరుఁడు కాఁగలఁడని తోఁచినట్లును మదికిఁ దట్టెను. ఆసుందరాంగుఁడు తన్నానందాంబుధి నోలలాడించిన ట్లుష నిశ్చయించుకొనెను. అంతియ కాక తాను నాపురుషుఁ డన్యోన్యవిహారములఁ గ్రొత్తవారి వలెఁ గాక యనఁగి పెనఁగినట్లు భావించెను. క్రీడాంతమున నామెకు మెలఁకువ గలిగెను. ఉలికిపడి మేలుకొనియెను. తన మనోహరుఁడు కానరాఁడాయెనే యనుచింత మదినిండినందున బోరున విలపింపసాగెను. మహానిధిం గోలుపోయిన నిరుపేద వలె నాయుష పరితపించెను. ఈఘట్టమున భాగవతమున,

"శ్లో. సాతత్ర తమపశ్యంతీ క్వాపి కాంతేతి వాదినీ,
సఖీనాం మధ్య ఉత్తస్థౌ విహ్వలా వ్రీడితాభృశమ్." ౧

అని కనుపెట్టెడు. ఈఘట్టమున మహాకవిపోతన,

చ. "కలగని యంత మేలుకని కన్నుల బాష్పకణంబులొల్కఁగాఁ, గలవలెఁ గాకనిశ్చయముగాఁ గమనీయవిలాస విభ్రమా, కలిత తదీయరూపము ముఖంబున వ్రేలినయట్లు తోఁచినం, గలవలమందుచుక్ బిగియఁ గౌఁగిటిచేబయు లప్పళించుచుక్.

చ. సరసమ్ము హూర్తులుక్ గుసుమసాయక కేళియు శాటికాకర్షణముల్ నఖక్రియలుఁ గమ్రకపోల లలాట మేఖలా కరకుచబాహుమూలములుఁ గైకొనియుండుట లాదిగాఁ దలో, దరి మదిగాఢమైతగిలె దర్పకుఁడచ్చున నొత్తినట్లుగా.

సీ. కలికిచేష్టలు భావగర్భంబులైనను
ప్రియుమీఁది కూరిమి బయలుపఱుపఁ
బిదపిదనై లజ్జ మదిఁ బద నిచ్చినఁ
జెలిమేనఁ బులకలు చెక్కులొ త్త
మదనాగ్నిసంతప్తమానస యగుటకు
గురుకుచహారవల్లరులుకందఁ
జిత్తంబునాయకాయత్తమై యుంటకు
మఱుమాటలాడంగ మఱపుగదుర

తే. సతివ మనమున సిగ్గుమోహంబు భయము
బొడమ నునుమంచు నెత్తమ్మిఁ బొదువుమాడ్కి
బ్రథమచింతాభరంబునఁ బద్మనయన
కోరి తలచీర వాటింప నేరదయ్యె."

అని వ్రాసి తన కవితాచమత్కారమును సహస్రముఖములఁ దెల్పెను. ఇం దొక్కొక్కపదము సుధామయముగ నున్నది. ఈపద్యములు మూలమును జప్పిడిగాఁ జేయుచున్నవి. ఈభాగముననే హరివంశమునందు శంభుదాసుఁడు పెంచి వ్రాసెను. దానికి మెఱుఁగుపెట్టఁదలఁచి నాచనసోమనాథుఁడు తనచమత్కృతిఁ జూపెను. ఆభాగమును దెనిగించుచు మనపోతనగారు వానికి మెఱుఁగుపెట్టవలయునని వ్రాసెనని మనమూహించుట పొరపాటు గాదు. మహాపరాధము కాదు. కథానీతికి భంగము దీన లేదు, కొంద ఱీపుస్తకమునఁ దెనుఁగుకవుల పద్యములేలయని యనిరి. శ్రీకృష్ణచరిత్రామృతమును సేవించిన భక్తులు నాకుఁ బూజ్యులును గురువులునగుట వారి నామస్మరణము చేయుటయు నొకసేవయే యని నాభావము.

"శ్లో. యథోక్తః పురుషస్స్వప్నే రమయామాసతాం శుభాం
విచేష్టమానారుదతీ దేవ్యా వచనచోదితా
సాస్వప్నే రమితాతేన స్త్రీభావంచాపి లంభితా
శోణితాక్తా ప్రరుదతీ సహసై వోత్థితానిశి" 3

హరివంశము.

"సీ. కలలోన నయ్యింతిఁ గదిసి మోమున నవ్వు
గడలొత్తఁ దీయని పలుకుఁబలికి
కెంగేలితోఁ గేలు కీలించి నెమ్మేను
మేనను బెరయించి మెలపుతోడ
బిగియారఁ గౌఁగిట సొగియించి మనసులు
రెండును గరఁగి యొక్కండ కాఁగ
నేర్కొర్కు లేమిటి కెలసి వానికి వేగ
చుమ్బనచూఱలై చొప్పడంగఁ
తే. జతురసంభోగరసములు చవులవెంట
నిద్దఱును గ్రొత్తగాఁగని యేపు మిగుల
నట్టిచందంబుఁ గావించి యాత్మమూర్తి
యబల తలఁపున నచ్చోతి నట్లుచేసె"

శంభుదాసుఁడు.

విశేషించి పెంచి వ్రాయఁబూనను గాని ప్రథమకవిని ద్వితీయకవి యీసందర్భమున మీఱఁజాలఁడని మోమోటములేక చెప్పఁగలను. ఇంకఁ గథవంకకు మరలెదను.

ఇట్లుషాకన్యకలగాంచి లేచి విలపించుట చెవులంబడ నులికిపడి లేచి చేడియలందఱు భయంపడిరి. అందు బాణాసుర మంత్రియగు కుంభాండునికొమరిత చిత్రలేఖ ప్రాణప్రియసఖి

గావునఁ జెంతకరిగి బుజ్జగించుచు నుషాకన్యా! భీతిల్లకుము. ఏల యిట్లు విలపించెదవు. పరితపించెదవే. ఏల? నీవు బలిచక్రవర్తి పుత్రునకుఁ బుత్రికవు కదా! ప్రఖ్యాతివంశమున జనించితివి. ఇట్టి నీవు భీతినొందఁదగునే. అందఱుమాట యటుండనిమ్ము. నీ కేవిషయమునను భయము కలుగరాదు నీతండ్రి దేవాధిపులకుంగూడ భయంకరుఁడు. కావున నీవు భయపడుట కులగౌరవమునకును హాని. లెమ్ము. లెమ్ము. నీకు మేలొనఁగూడు. విషాదము గనకుము. నాపైఁ గోపింపకుము ఇట్టి మంగళకరమహూహూర్తములయందు భయముకలుగ నవకాశము కలదా. బృందారకనాయకుఁ డగునింద్రుండు పెక్కుసారులు మీతండ్రితోఁ బోరాడి వోడి పాఱి యీనగరమును జూడనైనఁ బ్రయత్నింపఁడు. దేవసముదాయమునుండి భయము మనకుం గలుగదు. వారికే నీతండ్రివలన భయము కలుగుచుండు. నితండ్రి సామాన్యుఁడు కాఁడు. బలిచక్రవర్తికుమారుఁడు సుమీ. త్రిలోకవిశ్రుతుఁడు. ఆమహాత్ముని ముద్దులపట్టివి నీవు. నీ కెట్లు భయము కలుగును?

ఇట్లు చిత్రలేఖ తన్ననునయింపఁగా విజ్ఞానసంపన్నురాలగు బాణపుత్రిక యుష తనకుఁ గలయం దెట్టిపురుషరూపము కనఁబడియెనో దాఁపక యారూపమును దెలుపుచు నిట్లు పలికెను. ఇట్టిపురుషుఁడు నన్ను మోసపుచ్చిపోయెను. ఎట్లు తాళుదునే చెలీ! దేవతాభయంకరుఁ డగుతండ్రియున్న నేమి లాభము? నాకిఁక మరణము శ్రేయస్కరము. బ్రదుకుట మేలు గాదు. నా కోరికలపంట, నా నోములఫలము. అట్టిపురుషుఁడు నన్నెడఁబాసిపోయెను. నేను నిద్రించినట్లు లేదు. మేలుకొని

యే యున్నట్లు తోఁచెడిని. నన్నిట్లు మోసపుచ్చిపోయెఁ గదా. రాత్రి మేలుకొనియున్న నన్నిట్లు మోసముచేసిపోయిన దెవ్వఁడు? ఇట్లు మోసపుచ్చఁబడిన యేకన్య జీవింపఁదలంచును? కులమునకుఁ గళంకమును గలిగించి, వంశమున కంగారమువంటిదయి, నిరాశ్రయురాలై సాధ్వీమణులయెదుట జీవింప నెవ్వతుక కోరును? అని యిట్లు పలుకుచు బాష్పవారిపూర్ణగాత్రియై చెలికత్తియలు చూచుచుండ బోరన విలపించెను. ఎంతచెప్పినను వినక చాలసేపు విలాపము చేసెను. దిక్కులేనిదానివలె నేడ్చుచున్న యా దానవనాథకుమారిం గాంచి సఖీజనమెల్ల విచారము నొందిరి. కన్నీరు మున్నీరుగా విలపించుచుఁ జుట్టు నిల్చిరి. దుష్టాత్ములమనస్సు శుభాశుభములఁ జేయ నుంకించును. ఏపాపమెఱుంగని నీమది కీకష్ట మేల కలిగెను? దైవసంయోగమువలన స్వప్నమున నేపురుషునిచే ననుభవింపఁబడినను కల్యాణీ! వ్రతలోపము లేదు. దాన భయంపడకుమా. స్వప్నవ్యభిచారమున మర్యాదాతిక్రమదోషము కలుగదు. చింతిల్లకుము. *మానవలోకమున నున్నవారలకు స్వప్నకృతదోషము దోషములలోఁ బరిగణింపఁ బడదు. మామాట నమ్ముము. మనోవాక్కాయకర్మములను నీమూఁడుదోషముల నేస్త్రీయొనరించునో యాస్త్రీ పాపాత్మురాలని వేదతత్త్వమ్ము నెఱింగిన బ్రహ్మర్షులు పలుకుదురు. నీయం దీమూఁడుదోషములు కానరావు. నీమనస్సు చలిం

* న చ స్వప్నకృతో దోషో మర్త్యలోకేఽస్తి సుందరి, ఏవం విప్రర్షయో దేవి ధర్మజ్ఞాః కథయంతి హై. మనసా చైవ వాచా చ కర్మణా చ విశేషతః, దుష్టా యా త్రిభిరేతైస్తు పాపా సా ప్రోచ్యతే బుధైః. ౨౧ హరివంశము.

పదు. అట్టినీవు దోషమొనరించిన ట్లేల యనుమానించెదవు? నియతురాలవు. బ్రహ్మచారిణివి. సాధ్వీ నిదురించునపుడు పరిశుద్ధభావయైనను దోషము స్వప్నమునఁ గలుగునేని దోషములేదని పెద్దలు పలుకుదురు. నీకు ధర్మలోపభయము నుంతయు లేదు. ఏయువతి మనస్సు నిద్రకుఁబూర్వమే దుష్టమగునో, కర్మమునను దుష్టమగునో ఆస్త్రీని యసతి యని యార్యులు వచింతురు. నీయం దట్టిదోషము లేదే. ఏల భీతిల్లెదవు? సత్కులమునంబుట్టి రూపసంపన్నవై నియతింజేకొని బ్రహ్మచారిణివై యున్న నీ కిట్టియవస్థ కలిగెను. కాలము దురతిక్రమము కదా.

అని ధర్మవాక్యము లెవ్వ రెన్నిచెప్పినను జెవిఁబెట్టక బాష్పావృతలోచనపంకజాతయై విలపించుచున్న యుషాసుందరిం గాంచి కుంభాండకతనూజ యగుచిత్రలేఖ రహస్యముగా నిట్లు హిత ముపదేశించెను. విశాలాక్షీ! దుఃఖమును వదలుము. నీవు నిర్దోషురాలవు. నావాక్యమును జక్కఁగా నాలకింపుము. సత్యమని నమ్ముము ఊరక నిన్నాడింపనెంచితి ననుకొనకుము. ఉషాదేవీ! భర్తను దలంచుచు నీవు పార్వతిని దర్శించినపు డాసర్వమంగళాదేవి యేమిచెప్పెనో దానిం దలంపుము. వైశాఖ శుక్లద్వాదశిరాత్రి నీకు స్వప్నమునఁ దోఁచినపురుషుఁడు పతి యగునని కదా పార్వతీవాక్యము. అది యమోఘము కదా. నీపతి శూరుఁడు శత్రునిబర్హణుఁడు కాఁగలఁడు. నీ మనోగతమెఱింగితి యా జగజ్జనని పలికెను. పార్వతి యాదేశించినవాక్కులలో నొక్కయక్కరమైన వ్యర్థముకాదని తలంపుము. కావున నీవేల యిట్లు నిరంతరచింతలం జివికి విలపించెదవు? అని హెచ్చరించినంతనే యుషాకన్య తనకుఁ

పార్వతి యిచ్చినవరమును స్మరించెను. బాణపుత్రికకు వెంటనే శోకము తొలఁగెను. చిత్రలేఖం గాంచి యిట్లు పలికెను. శివపార్వతులు విహారార్థ మరుదెంచి నన్నుం గాంచిరి. అత్తఱిఁ బార్వతీదేవి పలికినపలుకులన్నియు సత్యములయ్యెను. హర్మ్యతలమున నిద్రయందుఁ దోఁచినవాఁడే నీకు భర్త కాఁగలఁడన్నమాట సత్యమగును. అట్లే నాకుఁ గనఁబడియెను. అతఁడెట్లు నాకు భర్తయగునో యాకార్యము సాధింపవలయును. అని యుష పలుకఁగనే కుంభాండతనయ మరల నిట్లు పలికెను. ఆపలుకు న్యాయసమ్మతమై తత్త్వసహితమై యుండెను. కన్యకామణీ! నీమనోహరుని కులముగాని విఖ్యాతిగాని పౌరుషముగాని యెవ్వరెఱుంగరు. అట్టివానిని స్వప్నగతుని దలంచుకొని యేల మోహమందెదవు? వీఁ డిట్టివాఁడని చూడఁబడక వినఁబడక యుండువాఁడు స్వప్నమునఁ దోఁచినమాత్రమున వాని నెఱుంగ నెట్లు శక్యమగును? వాఁడు మిగుల దొంగయునంబడు. కావుననే యసితాపాంగివయి మత్తకాశిని వగునిన్నుఁ బౌరుషమున నాంతఃపురమునఁజొచ్చిలోఁగొనిపోయినాఁడు. అట్టి దొంగనుగుఱించి యేల విలపించెదవు? దీనిం బట్టిచూడ నతఁడు సామాన్యపురుషుఁడు కాఁడని తోఁచెడిని. బలవంతముగా నంతఃపురమును జొచ్చెఁగదా. ఈనగరము త్రిలోకవిఖ్యాతము. దీనిని జొరఁబడువాఁడు సామాన్యుఁ డగునా? ఆదిత్యులు, వసువులు, రుద్రులు, నశ్వినీదేవతలు లోనగువా రీనగరమును జూడనైన శక్తులు గారు. ఆపురుషుఁడు వీరికంటె శతగుణాధిక పౌరుషము గలవాఁడగుటకు సందియము లేదు. కాఁబట్టియే బాణాసురుని తలపైనెక్కి యీనగరమును జొచ్చెను. ఇట్టి

వాఁడు భర్తకాకపోయినచో నట్టికామిని బ్రదికియు లాభమేమి? భోగము కేల? హర్షాదు లేల? ఇట్టివాఁడు నీకుఁ బతియగును కాఁబట్టియే నీవు ధన్యురాలవు. పార్వత్యనుగ్రహపాత్రురాలవు. కందర్పసమవిక్రముఁడు నీకు నాథుఁడు కాఁగలఁడు. ఇఁక మనము చేయఁదగినపని యాతఁ డేకులమువాఁడో పేరెయ్యదియో యని యెఱుంగవలయును.

*అని కుంభాండతనయ చిత్రలేఖ పలికినంతనే కామమోహితయై యుష సఖి! వానివంశాదు లెఱుంగుటెట్లు? నీవే

* ఈఘట్టమున శ్రీకృష్ణజన్మమునఁ గలకథాచమత్కారము నించుక వ్రాసెదను. అది నీతిబోధకమై యుండెను. అనిరుద్ధునకు స్వప్నమున నొకయన్నులమిన్న కానరాఁగాఁ దదేకధ్యానమున నుంచి యాహారనిద్రల మానెను. అతని చింతయిట్టిదని యెవ్వరు కనుఁగొనఁ జాలకుండిరి. శ్రీహరి సర్వజ్ఞుఁడు కావున నావిధ మెఱింగి యిట్లు చెప్పెను. స్వప్నగత యగు కాంత బాణపుత్త్రిక. ఆకాంతామణి పార్వతీపరమేశ్వరులకుఁ గల ప్రీతిం గాంచి తాను నట్టిప్రీతి ననుభవింపం గోరి దుర్గాంబవలన నొకవరమును బడసెను. స్వప్నమున దోఁచినవాఁడే నీకు భర్త కాఁగలఁడనియే యావరము. ఇపుడు నాపౌత్రుని ననిరుద్ధు నామెకలలోఁ గనఁబడఁజేసి నిన్ను వివాహము చేసికొనునట్లు లొనరించెద. చింతింపకుమని యనిరుద్ధు నూఱడిల్లఁ జేసి యచిరకాలముననే నీకామె పత్నికాఁగలదని నమ్మఁబలికి సర్వభూతాంతర్యామిగావునను, సర్వసిద్ధిప్రదాత కావునను, బాణపుత్రికకుఁ గలలో ననిరుద్ధుఁడు కనఁబడునట్లు చేసెను. ఆరాత్రి యంతఃపురమునఁ బుష్పకల్పితతల్పమున నాయుష శయనించియుండెను. నవయౌవనవతి గావునను రత్నభూషణభూషితాంగియై శయనించియుండుతఱి నర్ధరాత్రమునకుముందు నవీన నీరదశ్యాముఁడై నవయౌవనసంపన్నుఁడై సకలభూషణభూషితాంగుఁడై కందర్ప

యూహింపసమర్థురాలవు నాకేమియుఁ దోఁపకున్నది. లోకము స్వకార్యవిషయమున నజ్ఞానమునఁ బడుస్వభావము కలదికదా.

---

కోటిలావణ్యశాలియై యలరుపురుషుఁ డొకఁడు తోఁచెను. ఆఁతడు ధరించిన పీతవస్త్రము బాణపుత్రిక కానందమును గూర్చెను. ఆపురుషతల్లజుం గాంచి ప్రీతి యభివృద్ధియగుచుండ మధురవాక్కుల నిట్లు ప్రశ్నించెను. ఆతని యాశయము తన్నుఁ గామింపనెంచినట్లు తలంచెను. కాముకుఁడా! నీ వెవడవు? నీకు మేలు గలుగుఁగాక. నేను నన్ను వాంఛించెదను. కావున నన్ను నంగీకరింపుము. నవయౌవనసంపన్నురాలనై నీసేవఁ గోరియున్నదాన. గాంధర్వవివాహమున న న్నంగీకరింపుము. ఎనిమిదివిధములఁ బరిగణింపఁబడు వివాహములయందు గాంధర్వవివాహము సులభమైనది. తనయం దనురక్తయగు నారీమణిని గపటమున నేపురుషుఁడు త్యజించునో ఆపురుషాధముని వదలి లక్ష్మి పరుగిడును. శపించియుఁ బోవును. కావున న న్నంగీకరింపుమనియె. అత్తరి నాయనిరుద్ధుఁ డాకన్యకం గాంచి యిట్లు పలికెను. నేను శ్రీకృష్ణమూర్తి పౌత్రుఁడను. కామదేవాత్మజుఁడను. కాంతామణీ! వారియనుమతిం గొనక ని న్నెట్లు పరిగ్రహింతును? అని పలికి యంతర్హితుఁ డయ్యెను. అంత నాయుష విచారసాగరమగ్నయై యుండఁగాఁ జిత్రలేఖ యామెం జేరి అమ్మా! భయంపడకుము. చింతింప నవసరమేమియో తెలియఁజాలను. ఈనగరమునఁ బార్వతీపరమేశ్వరు లున్నవారు. నీకు సర్వమంగళాంబ సకలమంగళముల నిచ్చుఁగాక. ఆమాటల కాసుందరి బదులు పలుకకుండెను. చిత్రలేఖ యావిధ మెఱింగిపోయి బాణునకు నతని భార్యకుఁ బార్వతీపరమేశ్వరులకును, కుమారగణపతులకు నుషావృత్తాంతమును దెలిపెను. బాణుఁడు చింతాక్రాంతుఁడై శంకరుకడకరిగి నమస్కరించి తనవిచారమును దెల్పఁజాలక యుండెను. ఆతని చిత్తతాపము నెఱింగి శంకరుఁడు పార్వతియు, స్కందగణపతులు ఫక్కన నవ్విరి. గణపతి యిట్లుపలికెను. దానవనాయకా! నీకుమారిక మున్ను పార్వతీశంకరుల విహారమును గాంచి తాను

సఖీ! నాప్రాణములు నిలుచునట్లు చేయుము. అని కరుణముగాఁ బలుకు నాయుషపలుకులాలించి యామె దుఃఖమును గాంచి మనస్సు వెన్నవలెఁ గరఁగఁగా నిట్లు పలికెను. అమ్మా! సంధివిగ్రహముల తత్త్వమెఱింగిన చిత్రలేఖ యనునచ్చరమిన్నను దలంచి

---

నట్లు విహరింపఁ దలఁచెను. పార్వతి యావిధ మెఱింగి వరమిచ్చెను. స్వప్నదృష్టపురుషుఁడే నీకు భర్తయగునని యే యావరము. ఆవర ప్రభావమే కలలో నీకొమరిత కొకపురుషుని గనఁబడఁ జేసెను. యువతి ప్రాయంపుఁబురుషునిం గాంచినచో వాంఛించుట సహజము. ధర్మభీతిచే నతనిం గూడకయున్నను వాంఛ వదలఁజాలకుండును. నీచకులమునఁ బుట్టి పుంశ్చలి మనోహరాకారుం జూచినంత నే నిద్రాహారములను, జాతిధర్మములను, బతిపుత్రధనాదులను వదలును. సత్కులజాతయుఁ జింతించుచుండును. అట్టి కన్యకకోర్కెని బ్రాజ్ఞుఁడగు తండ్రి నెఱవేర్పవలయును. ప్రాణములకంటె నెక్కుడుగ. యువతియగు దుహితవాంఛను భావించి సమకూర్పవలయును. మాయావతియైనచో నమ్మరాదు. హృదయము క్షురధారాతుల్యము. వచనములు మధురములు. ఇట్లు స్త్రీలకు నుండుట సహజము. * స్త్రీలమనస్సును సాధువులు వేదములు వైదికులు నెఱుంగఁజాలరు. కావున నిపుడు కృత్యమును వినుము. యోగశాస్త్రవిశారద యగుచిత్రలేఖ ద్వారకకిప్పుడే యోగబలంబునం బోయి యనిరుద్ధుని దేవలయును. ఆమె కాశక్తి గలదు. అని పలుకఁగా విని గణపతి వాక్కులు బాణున కెఱుకపడకుండఁ దనశక్తిం జేసి గణపతితో నిట్లు పలికెను. ఈకార్యము బాణున కెఱుకపడకయుండఁ జేయుము. అన విని గణపతియు నట్లే తెలిపెను. చిత్రలేఖ గణపతి యానతిం గొని ద్వారకానగరమున కరిగి సర్వజనదుర్లభ మగునంతఃపురమును బ్రవేశించి తనయోగబలంబున నిద్రించు ననిరుద్ధునిం గైకొని రథముపై నిడుకొని స్మృతియతనికిఁ గలుగకుండఁజేసి ముహూర్తమాత్రమున శోణితనగరమునకుం గొనివచ్చెను.

---

* తాసాం మనో న జానంతి సంతో వేదాశ్చ వైదికాః. అని మూలము.

యామెకుం దెల్పుము. ఆచిత్రలేఖ త్రిలోకములనుండు వృత్తాంతముల నెఱుంగఁజాలు. అని పలికినంతనే హర్షము విస్మయము గదుర నాయుషాకన్య యా యచ్చరమిన్నను బిలువంబంచి యామె తనకుఁగూర్చునదియు, ప్రియసఖియునౌట నంజలిఁబట్టి దీనయై జరగినవృత్తాంతమును విడువకుండ సర్వ మెఱింగించెను. ఆచిత్రలేఖయు నుషావాక్కులనాలకించి యామెచింత తొలఁగునట్లు లాశ్వాసించెను. అంతలో నుష విస్మయావిష్టయై నిరాశం దెలుపువాక్కు లిట్లుపలికెను. సఖీ! ప్రణయము నాధారముగాఁ జేసికొని యిట్లు పలుకుచున్నాను. వేరొండుగా భావింపకుము. ఒక్కరహస్యమునుజెప్పెదవినుము. నాకు స్వప్నమునఁ దోఁచిన భర్తను నీవు తేఁబూనవేని, పద్మపలాశాక్షుని మత్తమాతంగగమనుని నాప్రాణనాథు నాతని జూడఁజాలనేని యచిరకాలముననే ప్రాణముల వదలెదను. ఇదిసత్యమని నమ్ముము, పావని యాచిత్రలేఖ యిట్లు విన్నవించెను. కన్యామణీ ఈవిధ మెఱుంగఁ దరము కాదు. జాతివయశ్శీలనామములు తెలుపక యాదొంగ యెటకో పోయెను. ఇపుడు నేనేమి చేయవలయునో యెఱుంగఁ జాలకున్నాఁడను. అయిన నీకోరిక యీడేర్చు నావాక్యము నాలకింపుము దేవదానవులయు, యక్షగంధర్వులయు సర్వరాక్షసులయు రూపములు చిత్రించి నీకుం గనఁబరచెదను. ముల్లోకములయందు రూపమున సద్వంశమున

ద్వారకానగరమున ననిరుద్ధుం గానక యందున్న స్త్రీలందఱు విలపించిరి. మాముద్దులకొమరుఁ డెచ్చటికిఁ బోయెనో. ఏభూత మెకొత్తుని పోయెనో యని చింతింపసాగిరి. సర్వజ్ఞుఁ డగు శ్రీహరి తా నెఱిఁగియుఁ దెలుపక యుద్ధమునకుఁ బోయెను.

యౌవనమున నెవరు విశిష్టులో వారినేలిఖించి తత్ప్రభావాదికమును నీకుం దెల్పెద. విశేషించి మానవలోకవాసులలో నుత్తమోత్తములను సప్తరాత్రములలో లిఖించి నీకుం దెల్పెద వారింగాంచి తత్ప్రభావముల నాచే నెఱింగి వలసినవానిం గోరుకొనుము. లభింపగలఁడు. అని తనప్రియమును గోరి చిత్రలేఖ పలుకఁగా నుష యట్లే యొనరించి తెమ్మని పలికెను.

కుశలహస్తయగు నాచిత్రలేఖ యొకపటమున నేడు దినములకే తాఁ జేర్కొనినవారిని లిఖించి యెనిమిదవదినమున నాపటముదెచ్చి యుషాకన్యకకుఁ గనఁబఱచెను. ఆపటమును విప్పి చెలికత్తియ లందఱకు నుషకును గనఁబఱచుచు నిట్లు పలికెను. బాణపుత్రీ! ఈవరుసలో లిఖింపఁబడినవారు దేవతలలోఁ బ్రధానులు. వీరు దానవవంశసంభూతులలో నుత్తములు. వీరెల్లఁ గిన్నరోరగ రాక్షసప్రధానులు. అని తెలుపుచు గంధర్వులను, నింకనుం గలవారిని దెల్పెను. మానవులలో సద్వంశసంజాతులు సుప్రసిద్ధులు నగువారిని గనఁబఱచుచు వీరిం గాంచుము నీస్వప్నమున దోఁచినవాఁ డెవ్వఁడు? వయస్సెంత? రూపమెట్టిది? పరికింపుము. స్వప్నమునఁ గాంచినగుఱుతులం దలంపుము ఇందాగుఱుతులు గలవాఁ డెవ్వఁడో కనుఁగొనుము. అని పలుకఁగా నుష తాఁ గన్నచిహ్నములు గలవాఁ డిం దెవ్వఁడుగ నుండునా యని పరికించి పరికించి వరుసగాఁ జూచుచుఁ గన్నులతో నీసడించుచు యాదవులంబరికించునపు డనిరుద్ధునిం గాంచి విస్మయోత్ఫుల్లనయనయై చిత్రలేఖా! యీచోరుఁడే నాకుఁగనఁబడి మోసఁగించినవాఁడని యె. శుద్ధాంతపురాంతరమున నున్ననన్ను దూషితచరిత్రగ నొనరించినవాఁ డీ

తఁడే. స్వప్నమునఁ గనంబడిన రూపమిదియే. రతితస్కరుండితఁడే. చిత్రలేఖా! ప్రాణసఖీ! ఈతనిగుఱించి యథార్థము వచింపుము. కులశీలములఁ దెల్పుచుఁ బేరెఱింగింపుము. ఆవలఁ గార్యనిశ్చయము నెఱింగింతును. అనుటయుఁ జిత్రలేఖ యిట్లు పలికెను.

ఉషా! వినుము. త్రిలోకాధినాథుఁడగు శ్రీకృష్ణునకీతఁడు మనుమఁడు. నీ కీతఁడే ప్రాణనాథుఁడు. ప్రద్యుమ్నపుత్త్రుఁడని యెఱుంగుము. పరాక్రమశాలి. త్రిలోకముల నిట్టిపరాక్రమశాలి యుండుటరుదు. పర్వతములఁ బెకలించి పర్వతములపై వైవఁ గలఁడు. ధన్యురాలనైతివి. అనుగ్రహింపఁబడితివి. శంకరపత్నియగు భవానీదేవితగినభర్తను నీకుఁ బ్రసాదించెను. పరమానందభరితురాలనైతివి. అనిచిత్రలేఖ పలుక నుష యిట్లనియె. విశాలాక్షీ! నాప్రాణదానమొనరింపఁగల యోగ్యురాలవు నీవే. ఇతరులకిట్టి సాహసములేదు. దిక్కులేని నాకీతరుణమున దిక్కు నీవైతివి. నీవంతరిక్షసంచారిణివి, యోగినివి. కామరూపిణివి. ఈయుపాయమున నీకుసాటి నీవే. ఇంకసత్వరమున నీతనిం గొనిరమ్ము. ఎట్లుతేఁదగునో యాయుపాయము నాలోచింపుము. నా ప్రియునకు మనఃఖేదము కలుగకుండునట్టు లొనర్పుము. కృతకృత్యురాలవై త్వరగా మరలిరమ్ము. ఆపత్కాలమున నెవరు మైత్రిఁ జాటింతురో యాతఁడే మిత్త్రుఁడని పెద్దలుపలుకుదురు. నేనిపుడు కామార్తురాలను. నాప్రాణములు నిలుచునట్టు లొనరింపుము. దేవసమాను నీసుందరాంగుని భర్తనుగాఁబడసిన బ్రదుకఁగలను. ఇంకఁ ద్వరగా నీపురుషవరుని నాచెంతకుం జేర్పవేని నాప్రాణములు నిలువవు. అని యుషాకన్య పలుకఁగా విని చిత్రలేఖ యిట్లు పలికెను. శుచిస్మితా! కల్యాణీ! నామాట చక్కఁగా

నాలకింపుము. ఈబాణనగర మెట్లు చక్కఁగా సర్వకాలము రక్షింపఁబడునో యట్లే ద్వారకానగరము రక్షింపఁబడును. దేవతల కేనది చొరనశక్యము. లోహప్రాకారములనప్రధృష్యమగును. ద్వారములకడ జాగరూకులై కావలియుందురు. శ్రీకృష్ణకుమారులు నగరము కాపాడుచుందురు. యదుకుమారులు జాగరూకులై నగరరక్షణమున బద్ధాదరులై యుందురు. సముద్రమునడుమ విశ్వకర్మచే నానగరము నిర్మింపఁబడినది. పద్మనాభుని శాసనమున భయంకరాకారులగు శూరులచే నది సర్వదా రక్షింపఁబడుచుండును. శైలప్రాకారము, సముద్రపరిఖా సముదయము గలదిగాన దుష్ప్రవేశమనందగును. పర్వతప్రాకారము లేదు దానిమహిమముం దెల్పుచుండును. తదీయ రహస్యవేత్తలకుందప్పఁ బ్రవేశింపఁదరముగాదని యెఱుంగుము. నన్ను విశేషించి తండ్రిని గాపాడుము. అనవిని యుష యిట్లు బదులు చెప్పెను.

చిత్రలేఖా! నీయోగమహిమమున ద్వారకానగరము ప్రవేశమున కర్హమగును. విశేషించి నాదుఃఖమును దెలుప నేల? ఒక్కమాటచెప్పెద. దాని నాలకింపుము. నిండుచందురుఁ గ్రిందు చేయు ననిరుద్ధుని మోము నేఁజూడఁజాలనేని యమసదనమున కరుగుదును. తగినదూతవలనఁ బెక్కుకార్యములు సాధింతురు. నీవు నాకు దూతగానరుగుము. నన్ను బ్రదికియుండఁజూడఁ గోరుదువేని నాస్నేహమునుగోరుదువేని నిక్కమగుప్రీతి నాపై నీకుంగలదేని త్వరగా నాతనిం గొనిరమ్ము. ఇదె నేను నీశరణు చొచ్చితిని. జీవితమునకు సందేహమనికాని కులక్షయమగునని కాని కామార్తలగునారీమణులు పరికింపరు. మదవిక్ల

బలుకదా కాంతలు. కార్యమునకుఁ బ్రయత్నింపక యూరకుండ రాదని శాస్త్రమర్యాద. ద్వారకానగరమును బ్రవేశింప నీవుస మర్థురాలవు. నీపైనాకు విశ్వాసముకలదు. త్వరపడి ప్రియుని గనఁ బఱుపుము. అనుటయుఁ జిత్రలేఖ నవ్వుచు బాణపుత్త్రీ! సుధా సోదరతుల్యములగు నీవాక్యముల కానందించితిని. సముద్యోగ మొనరించెదను. ఇదె పోవుచున్నదానను. త్వరగ ద్వారకంజేరి నీకుఁ బ్రియుని గొనివచ్చెద. దుష్ప్రవేశమయినను ద్వారకం జొచ్చి యంతఃపురమున నున్న మహాబాహువు ననిరుద్ధుని దెచ్చెద. అని దానవుల కమంగళకరమగుమాట నిట్లుపలికి యంతర్హిత యయ్యెను. మనోవేగమున ద్వారక కరిగెను. ఉషయుఁ జేడియలం గూడి చింతించుచునుండెను. రాత్రి మూఁడవ ముహూర్తమున శోణితనగరమునుండి ప్రయాణమై చిత్రలేఖ సఖిప్రియమునే కోరి మహర్షులను ధ్యానించుచు యోగబలమున క్షణకాలమున ద్వారకానగరమును బ్రవే శించెను. కైలాసశిఖరాకార సౌధము లందుండెను. తారాగణ పరిశోభితమగు నాకాశమువలె సౌధములచే నానగరము పరి శోభితమై యుండెను.

### చిత్రలేఖ యనిరుద్ధుం దెచ్చుట.

* ద్వారకానగరమున కరిగి చిత్రలేఖ యనిరుద్ధుం దెచ్చువిషయమున నాలోచించుచు బుద్ధిప్రద్యోతనిశ్చయముగల నారదముని సుదకములనుండి భగవంతుని ధ్యానించువారిం

---

* ఈకథయం విష్ణుపర్వము నూటపందొమ్మిదవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

జూచెను. ఆమునిం గాంచినంతనే హర్షోత్ఫుల్లనయనకుముడ యై చెంతకరిగి నమస్కరించెను. లోకపూజితుఁడగు నాముని చెంతఁ గృతాంజలిఫుటయై నిలిచి యిట్లు ప్రార్థించెను. మునీంద్రా! దూతీత్వమూని యిటకువచ్చితిని. అనిరుద్ధుంగొని పోవుటయే నాయీ యాగమనమునకు హేతువు. శోణితనగర మున బాణనామక మహాసురుఁడు కలఁడు. ఆతని కొమరిత యుషయనునది లోకవిశ్రుతయగు. ఆబిడ ప్రద్యుమ్న కుమా రునియం దనురాగము కలది. ఆమెకు భవాని వరప్రదాన రూపముగ నీభర్తయని నియమించెను. ఆపురుషలలాముని గొనిపోవచ్చితిని. కార్యసిద్ధి యెట్లగు నుపాయమూలోచిం పుము. నేనాతనిం గొనిపోయినపిదపఁ బుండరీకాక్షునికాకుమా రుని ప్రవృత్తినెఱింగింపుము. శ్రీకృష్ణునితో నారాక్షసునకు సంగరము తప్పకకాఁగలదు. అనిరుద్ధుఁడే చాలఁడాయునకును. వాఁడు భీమసంగ్రామదక్షుండుకదా. కావునవానినీకుమారుఁ డోడింపఁ జాలఁడు. శ్రీహరి వానిశస్త్రమునంబున నోడించు. నేనిట కేలవచ్చితినో యాకార్యము సిద్ధింపఁజేయుము. నీయా శ్రయమున నాకుఁ బుండరీకాక్షుని వలన భయముకలుగక యుండు గాక. తత్త్వార్థదృష్టిగల యాకుమారుని హరించు టెట్లు? ఆకుమారుఁ డాగ్రహించిన ముల్లోకముల దహింపఁ జాలుంగదా. పౌత్రశోకాభితప్తుఁడగు హరిశాపమున నన్ను భస్మీ కరింపక యుండునా. ఈవిషయమున నుపాయమాలోచింప వలెం తివి నీవ. ఉష మనోరథము ఫలించునట్లు నాకు భయమొదవక యుండునట్లు నీవాలోచింపుము.

అని చిత్రలేఖ యుక్తియుక్తముగాఁ బలుక విని నారద
ముని చిత్రలేఖా! నీవు భయపడకుము. కార్యము ఫలించును.
ఉపాయమెఱింగించెద ఆలకింపుము. నీవనిరుద్ధకుమారకుం గొని
పోయి యంతఃపురమును జేర్చినపిదప బాణాసురునితో యుద్ధ
ముపొసఁగునేని నన్ను స్మరింపుము. చిత్రలేఖా! యుద్ధముచూచు
కౌతూహలము నాకు మెండు. దానింగాంచి పరమానందమం
దెద. నా ప్రవృత్తియు ఫలింపఁజేసెద. సర్వలోక సమ్మోహిని
యగు తామసీవిద్యనిచ్చెద గ్రహింపుము. నీదేవి కృతికృత్యురా
లగుంగాక! ఉపదేశించెద కైకొనుము. అని నారదమహర్షి
పలుకగనే యాచిత్రలేఖ యట్లేయనిపలికి దానిం గ్రహించి
మునిప్రవరునకు నమస్కరించి యనిరుద్ధకుమారుని యంతఃపుర
మును జొచ్చిదానియందమును మెచ్చుకొనుచు నందు నారీజ
నులనడుమఁ జంద్రుఁడుదయించినట్లు కానంబడుచు మధుమాధ్వీ
కములంగ్రోలి పరమశ్రీవిరాజమానుఁడై దివ్యశయ్యయందుఁబ
రుండిన వానింగాంచెను. ఆటపాటల నాతనిని నందుండు కాం
తలు సంతోషింపఁజేయఁజాలక పోయిరని యామెయెఱింగెను.
ఈకార్యమేలాగు సాధింతును? అని యంతర్హితయైయుండియే
యాలోచించి బుద్ధిసంపన్నురాలు గావున నారదోపదిష్ట తామసీ
విద్యచే నాయనిరుద్ధు నాచ్ఛాదించి యంతరిక్షమునుండి యే మె
ల్లఁగా నాతనిచెంతకుం దిగివచ్చి యనిరుద్ధునితో మధురముగా
మెల్లగనిట్లుపలికెను. *నిద్రయందే యాతనికన్నులు కనఁబడఁ

---

* ఈఘట్టమున శ్రీభాగవతమునందు. శ్లో. తత్ర సుప్తం సుపర్యంకే
ప్రాద్యుమ్నిం యోగమాస్థితా, గృహీత్వా శోణితపురం సఖ్యై ప్రియమదర్శ

జేసెను. నిర్జనముగానుండునట్లు లోనరించెను యదునందనా! నీకుంగుశలమా? నామనవి నొకదాని నాలకింపుము. నాప్రియ సఖియగు నుషాకన్యవాక్యమును జెప్పెదను. స్వప్నమున నీవా మెకుఁ దోఁచి సుఖసాగరమున ముంచితివఁట. అదిమొదలు హృదయమున నిన్నే నిలిపి వేఁగుచున్నది. నన్ను నీకడకుంబంపి నది. నీదర్శనమునే కోరి విలపించుచు నొక్కపుడు నిదురరామి నాపులించుచు నొక్కప్పుడు నిట్టూర్పులుపుచ్చుచు నిన్నే దర్శింపఁగోరి యాకన్య పరితపించుచున్నది. నీవరుదెంచితి వేని ప్రాణముల నిల్పుకొనును. కనఁబడక నిరాకరించితివేని మృతి నొందుట నిశ్చయము. శంకలిందు లేవు నీహృదయమున వేయి మందికాంతలుండినను గోరినకాంతను బాణిగ్రహణమొనరిం చుట ముఖ్యము. పురుషునకది యవశ్యకర్తవ్యము. భగవతి శంకరురాణి మాచెలికత్తెకు వరమిచ్చినది. ఆరీతిగా నీవు స్వప్నమునఁ దోఁచితివి. నేనామె పరితాపమును గాంచి చిత్ర పటమున వ్రాసి యందఱరూపములు చూపఁగా నీరూపమును గుఱించి దానినే చూచుచుఁ బ్రాణముల నిలుపుకొనియున్నది. కావున నట్టికాంతయందు సానుక్రోశుఁడవు కమ్ము. ఆమెమనో రథము నీడేర్పుము. మాయుషాకన్య తలవంచి నీయడుగులం బడుచున్నది. మేమెల్లనట్లే చేయుచున్నారము. ఆమె పుట్టు

యత్. అనికనుపట్టెడిని. విష్ణుపురాణమునందు శ్లో. ఏతస్మిన్నేవ కాలేతు యోగవిద్యాబలేన తు, అనిరుద్ధమథానిన్యే చిత్రలేఖా వరాప్సరాః. అని కనుపట్టెడు. శ్రీకృష్ణజన్మఖండమునందున్న కథ ముందే వ్రాయఁబడినది కదా. ఈ పురాణములన్నియు నొకవిధముగా నీభాగమున నున్నవి. హరి వంశమునందు విచిత్రముగా కథ వ్రాయఁబడియున్నది.

కను గుణశీలముల నాలకింపుము. స్థితియుఁ బ్రకృతియు నెట్టివో తండ్రి యెవఁడో వచింతును.

బలిచక్రవర్తియన లోకప్రసిద్ధుఁడుకదా ఆతనికుమారుఁడు బాణాసురుఁడు కలఁడు. ఆదానవనేత శోణితపురమున నుండువాఁడు. ఆతని కుమారితయే యిపుడు నిన్నుఁ గోరునది. నీయందే మదినిల్పెను. ఆమెజీవితము త్వదధీనము. నీమనోరథమునఁదగిలిన వాఁడే నీకుభర్తయగునని భగవతి వరమిచ్చెను. ఇదియసత్యమని భావింపకుము. నీసంగమమువలన నింతవఱకుఁ బ్రాణధారణము చేయుచున్నది. అని చిత్రలేఖ వచింపఁగా ననిరుద్ధుఁ డామెకిట్లు బదులుచెప్పెను. చిత్రలేఖా! నాస్వప్నమునను మీయుషాకన్యయే కనఁబడినది. అవిధమెఱింగించెద. * ఆకన్యక కెట్లుతోఁచితినో రూపము కాంతియు మఱియు సంయోగము రుచితము నన్నియు నట్లే యామె నాకుం గనఁబడినఁదున నాకును గల్గినది. అహోరాత్రములుమనే తలంచుచు వగచుచున్నవాఁడను. చిత్రలేఖా! నాయందు నీకను గ్రహముకలదేని నాసఖ్యము నీవుకోరుదేని నన్నటకుం దీసికొనిపొమ్ము. నీచెలికత్తె యగు నాప్రియురాలిని జూడఁ గోరెదను. కామసంతాపసంతప్తుఁడనై ప్రియాసంగమమును గోరుచు నిదిగో చేతులొగ్గి నిన్నుఁ బ్రార్థించుచున్నాఁడను. నాస్వప్నమును సత్యముగ నొనరింపుము.

---

* ఈభాగము శ్రీకృష్ణజన్మఖండమునఁనున్న యట్లే యిందను జెప్పఁబడినది. అనిరుద్ధునకుఁ గలవచ్చినట్లు అందను పాకన్య తోఁచినట్లు నింతకుముందిందుఁ జెప్పకుండుట పొరపాటని యూహింపరాదు.

అనిపలుకు ననిరుద్ధునిమాటల నాలకించి యప్సరోవర యగునాచిత్రలేఖ నాప్రయత్నము ఫలించినది. నాక్లేశము నాచెలియాతురము తొలఁగినది. నాసఖి యాచించినది సార్థకముచేయఁ గల్గితిని. అని యూహించి యనిరుద్ధునియీప్సితము నెఱిఁగి సంతుష్టురాలయి యట్లే యొనరించెదనని ధైర్యము చెప్పి తనయోగవిద్యాబలంబున నంతర్హితునిగా నొనరించి నారదోపదిష్ట తామసీవిద్యాసహాయమున నాతని నెత్తుకొని యంతరిక్షమార్గమున సిద్ధచారణులు వెఱఁగంది చూచుచుండఁ ద్వరగ శోణితపురమును మనోజవంబలరార నాతనిం జేర్చెను. తన మాయాబలంబున నాతని నితరులకుం గనఁబడనీయక యుషాకాంతయున్న చక్కటికిం బోయి యామెకుఁ గనఁబడఁజేసి విచిత్రమాల్యాలంకారములచే నలరారుచుఁ జిత్రాంబరమును ధరించి దేవతవలెఁ దేజరిల్లుచు నిరుపమాకారమున నలరు ననిరుద్ధునిగాంచి యుష మనోరథము ఫలించెనని భావించెను. హర్మ్యాగ్రమున వానినునిచి చిత్రలేఖ యింటికిఁబోవ నుండఁగా నుషాకన్య యనిరుద్ధునిం బూజించి చిత్రలేఖను గౌఁగిలించుకొని ప్రియాఖ్యానములచే నలరించి త్వరపడి యంతరంగమున భయమంకురింప నిట్లు పలికెను.

కార్యవిశారదురాలా! చిత్రలేఖా! ఈరహస్యవృత్తాంతమును రక్షించుటెట్లు? ఈరహస్యము రక్షించిన మేలుకలుగును. బయలుపడిన జీవితక్షయము గల్గును. అని పలికి కాంతునిగూడి భయపడుచునే యుండెను. చిత్రలేఖయు నామెమాటల పాటింగాంచి పురుషప్రయత్నమును దైవము మార్పఁగలఁడు. దైవప్రయత్నమును బురుషుఁడు మార్పఁజాలఁడు. శంకరురాణి

యనుగ్రహము నీకుఁ గల్గునేని యనుకూలమే గల్గును. ఇప్పటి యీనా మాయాశక్తికృతకార్య మేనరుఁ డెఱుంగఁజాలఁడని నమ్ముము. అని యుషనాశ్వాసించి యనిరుద్ధునింజూచి మాసఖి యదృష్టమున స్వప్నగతుఁడవగు నీవు లభించితివి. నీకొఱకే మేమందఱము ఖిన్నల మగుచుందుము. అట్టినీవు దొరకితివి. మహాబాహూ! నీకు సర్వత్ర కుశలము గలుగుఁగాక. కాంతామణులహృదయము మృదుతమము. కావున మరలమరల నిన్నభ్యర్థించుచున్నదానను. అని చిత్రలేఖ పలుక నాయదుకుంజరుండిట్లు బదులుచెప్పెను. ఆతని మోమునఁ జిఱునవ్వు కనఁబడుచుండెను. మితభాషిణీ! నాకు సర్వత్ర కుశలమే కలుగును. నీయనుగ్రహమున నాకేలాటివిపత్తులు కలుగవు. నీకుఁ బ్రియమువచించెద. ఈప్రదేశ మింతకుఁబూర్వము చూచినది కాదు. స్వప్నమున నేరూపము నాకగపడినదో యదియే యిపుడును గనఁబడినది. నీయనుగ్రహమున నేనిందు జేరఁ గల్గితిని. ఈశ్వరపత్ని వాక్య మేనాటికిని మిథ్యకాదు. నీదేవికిఁ బ్రీతినుత్పాదింతును. నమ్ముము. నీదయవలన నిచ్చటికి వచ్చితిని. నీశరణుచొచ్చితిని. అనిపలికి రహస్యప్రదేశమున నుండనెంచెను. ఉషాకన్యయుఁ పితృభీతిచే నాకాంతునిం గూడియుండెను.

అత్తఱి గాంధర్వవిధిననుసరించి వారిరువురకు వివాహము చెల్లెను. అన్యోన్యానురాగమునఁ జక్రవాకమిథునముం బోలి వారుండిరి! అనురూపనాయకుం గూడి యుష సంతోషాంబుధి నోలలాడెను. దివ్యవస్త్రాభరణములందాల్చి తన ప్రాణనాథునిం గూడి, లోకమేమఱచిపోయి యాకాంతామణి యుండెను. అనిరుద్ధుఁడు కామినీమోహనముపొంది దివ్యాలంకరణములఁ దాల్చి,

యితరుల కంటఁబడక యే స్వేచ్ఛావిహారములఁ బ్రొద్దులుపుచ్చుచుండెను. ఎంతరహస్యముగా నీయిరువురు విహరించుచుండినను శుద్ధాంతరక్షకులు కనిపెట్టిరి. ఇట్టియకార్యము సాగుచుండ రాజునకుఁ దెలుపకయున్నఁ బ్రాణము పైకి వచ్చునని భీతిల్లి త్వరగఁజని బాణాసురుం గాంచి చేతులుజోడించి తమకెఱింగిన విషయమెల్లఁ దెలుపనెంచి భయగద్గదకంఠులై యిట్లు తెలిపిరి.

పిడుగులవంటి యామాటలు, చెవులసోఁకఁగనే భయంకరపౌరుషము కలవాఁడు కావున శత్రువులఁ జెండాడువాఁడు కనుకను కింకరులం గాంచి కింకరులారా! మీరెల్ల నొక్కమొగి నరిగి యంతఃపురమున నున్న దుర్మతి వధింపుఁడు. ఆతఁడెవ్వఁడో నాకులచారిత్రమును దూషితముగ నొనరించెను. ఉషయొక్కతె దూషితయైన నాకులమెల్ల దూషితమయ్యెను. మాచే నీయఁబడని కన్యకను స్వయంగ్రాహవిధిని గైకొనియెనట. ఔరా! యతనివీర్యము! బళీ! యతనిధైర్యము! సెబాసు! దుష్టత్వము! ఎట్టిదుర్గతిగ నతఁ డుండనోపు? నానగరమునందు నంతఃపురమును బ్రవేశించెనుగా! ఎంతబాలిశుఁడతఁడు? అని పలికి యాకింకరులను ద్వరగ నరుగుఁడని యాజ్ఞాపించెను. కింకరులా బాణాసురుశాసనము మౌళులం దాల్చి యుద్ధసన్నద్ధులై వెడలి యనిరుద్ధుఁ డున్నచోటి కరిగిరి. నానావిధశస్త్రముల ధరించిరి. బహురూపములఁ గనుపట్టిరి. భయంకరులుగ నుండిరి. ప్రద్యుమ్నకుమారుని జిత్రగతి వధింపనెంచిరి.

ఉషాకన్య యాసేనలం గాంచి, బాష్పసలిలావృతలోచనయై విలపించెను. ప్రాణనాథుని బొరిగొందురనియే తలంచెను.

హారిణాయతాక్షిని దుఃఖితను ప్రాణనాయికం గాంచి యనిరుద్ధుఁడు నాథానాథా యని విలపించు నంగనామణి నూఱడిల్ల నెంచి సుశ్రోణీ! భయంపడకుము. నేను జెంతనుండ నీకుభయం పడ నవసరమేమి? సంతోషకాల మిదియని నమ్ముము. భయకారణ మిం దేదియుఁ గనఁబడదే ఏల భీతిల్లెదవు. బాణాసుర బలమెల్లవచ్చినను భయపడను. నావిక్రమమును వీక్షింపుము; అని పలుకునంతలోఁ గింకరుల భీషణారావము వినంబడఁగా నిది యేమనిపలుకుచు వారల నెదుర్కొనెను. పరుగెత్తివచ్చు నా బాణసైన్యముం గాంచెను. వా రాయుధపాణులై వచ్చుటఁ బరికించెను. వారెల్ల నంతఃపురమును నలుఁగడల నావరించి నిలువంబడిరి. అనిరుద్ధుఁడు వారల మార్కొనఁ బయనమగు తఱి నెఱింగి చిత్రలేఖ నారదమునివరుని స్మరించెను.

చిత్రలేఖ తన్ను స్మరింపఁగనే యాదేవర్షి క్షణమాత్రమున శోణితనగరమున కరుదెంచెను. అంతరిక్షముననే నిలిచి యనిరుద్ధునితో నిట్లుభాషించెను. ప్రద్యుమ్నకుమారా! భయం పడకుము. నీకు శుభంబగుంగాక. ఇదె వచ్చుచున్నాఁడను. అను నారదవచనములు వినఁబడఁగనే యనిరుద్ధుఁడు నమస్కరించి చేతులుజోడించి యుద్ధప్రయత్నమున నిలిచెను. తన యంతఃపురము నావరించి యార్భటించుచు నిలిచిన కింకరులనుగని తోత్రహతమగు ద్విపముపలెఁ గుపితుఁడై పెదవులదర వారినొక్కెత్తుగఁ బొరిగొననుంకించెను. ఆతనివారెల్లఁ జుట్టుముట్టిరి. ద్వారప్రదేశముననున్న పరిఘమును గైకొని వారిపై వైచెను. వారెల్ల బాణములఁ బ్రయోగించియు, గదలను ముసలములను మహాసినామకము లను శక్తులను శూల

ములను నొప్పించియు నాతనికిఁ దమవిక్రమమును, గనఁబఱచిరి. ఆప్రేటుల కాతఁడు, చలింపక పరిఘమును జేనంది మేఘము వలెనార్చి వారినడుమ నిలిచి మేఘములనడుమ నున్న భాస్కరునివలె నొప్పెను. దండకృష్ణాజినములఁ దాల్చి యున్న నారదుఁడు మేలుమేలు ప్రద్యుమ్నకుమారా యని పొగడెను. అంతటఁ దనవిక్రమమేర్పడ నా పరిఘమునే త్రిప్పుచు, వారలనొప్పింప నాప్రేటులకుఁ దాళఁజాలక కాలికి బుద్ధిచెప్పిరి. మహావాతమున నెగురఁగొట్టఁబడు మేఘములవలె వారు చెల్లాచెదరైరి. అనిరుద్ధుఁడు సింహనాద మొనరించెను. ఆనినదము ఘర్మాంతమున మేఘములు ధ్వనించినట్లుండెను. నిలునిలుండని వారించుచు నిలిచిన వారినెల్ల నడంచెను. హతశేషులగు కింకరులట నిలువఁజాలక బాణాసురునికడకుఁ బాఱిపోయి నిట్టూర్పులు పుచ్చుచు రక్తసిక్తాంగులై భయవిహ్వలచేతస్కులై మాటాడఁజాలకుండిరి. భయంపడకుఁడు భయంపడకుఁడని బాణుఁ డూఱడించెను. దాన భయమును వదలిరి. యుద్ధము చేయుచు నేలవచ్చితిరి? అని భయవిహ్వలలోచనములుగల కింకరుల నదలించి యడిగెను. లోకవిఖ్యాతమగు యశమును దిగనాడఁజనునే యనియె. నపుంసకులవలెఁ బిఱికితనము నేలపొందితిరి? మీకు భయముకల్గించిన దెవఁడు? నానాయుద్ధవిశారదులయ్యుఁ గులకళంకము నేల కల్పింపఁ బాఱివచ్చితిరి? యుద్ధముననే మృతినొందుఁడు. నా చెంత నిలువకుఁడు.

అని వారిం దిరస్కరించి పలికి బాణాసురుఁడు తీవ్రక్రోధమునఁ గన్ను లెఱ్ఱవాఱఁగా శూరులగు భటులను బిలిచి

యాశుద్ధాంతద్రోహిని బొలియించిరండని పంపెను. వారు ప్రయాణముచేయుతఱి నాకాశమున విద్యుద్గణావృత మేఘము వలె నగరమున వారే కనఁబడుచుండిరి. అందుఁ గొందఱు భూమిపై నిలిచి గజములవలె ఘీంకరించిరి. కొందఱంతరిక్షమున నిలిచి మేఘములవలె గర్జిల్లిరి. నిలునిలు మెందుఁబోయెదవను శబ్దమెల్లయెడల వ్యాపించెను. అనిరుద్ధుఁడు యుద్ధశూరుఁడుగావున నామాటలకు భీతిల్లక వారినెదుర్కొన సిద్ధముగనుండెను. వారు సమీపింపఁగానే నిరాయుధుఁడయ్యు వారినెదిరించి వారుధరించియున్న పరిఘతోమరాది సాధనములను లాగికొని వానిచేతనే వారినెల్లఁ జావఁగొట్టెను. పూర్వముభంగిఁ బరిఘమును త్రిప్పుచు రణమూర్ధమున నిలిచి క్రీడించువానిచందమున నెందెందుండి యెవరిపైఁ బడునదియుఁ దెలియకయుండ నొప్పించెను. కొందఱిశిరములు బ్రద్దలుచేసెను. కొందఱా వ్రేటులకు రక్తసిక్తాంగులైరి. కొందఱవయవములు శకలములుకాఁగా శరీరయాత్రను జాలించిరి. ముప్పదిరెండువిహారములు యుద్ధశాస్త్రమునఁ జెప్పఁబడినవి కాన వానినెల్లఁ గనఁబఱచుచు వారిఁ ద్రుంచుచుండెను. ఒక్కఁడయ్యు వేయిమందిగా వారికిం గనంబడుచు యమునిం బోలి వారిఁ దునుమాడుచుండెను. వారెల్ల రక్తసిక్తాంగులై బాణాసురుఁడున్న తావునకుం బారిపోయిరి. కావుకావుమను నార్తస్వరములు మిన్నుముట్ట వారు పరుగిడి యొకరిపై నొకరుగా భయపీడితులై రక్తమును గ్రక్కుచు రణవిముఖులై బాణు శరణుచొచ్చిరి. దేవతలమార్కొని యెన్నిసారులో సంగరమొనరించిరి. కాని యిట్టిదుస్స్థితి వారికెప్పుడును గలుగలేదు.

ఇట్లొక్కఁడైనను నిలువఁజాలక యుద్ధమును వదలి రాఁగా వారింగాంచి బాణాసురుఁడు క్రోధాగ్నిజ్వాలల భయంకరాకారుఁడయ్యెను. నారదుఁ డాయుద్ధమును గాంచి సాధుసాధు శబ్దముల నుచ్చరించుచు మహాసంతోషమున ననిరుద్ధుని జూచుచు నృత్యము చేసెను.

బాణాసురుఁడంతలోఁ గుంభాండసంగృహీతమగు రథము నెక్కి వీర్యవంతుఁడుగావున ననిరుద్ధుని బాహుబలము లెక్కింపక యసివిలసత్కరుఁడై పోయెను. ఆతని సహస్రభుజముల ననేక విధాయుధములుండెను. ధనుస్సులఁ బట్టుకొనుటకు నుడుము తోలుతిత్తులు పెక్కులు తొడుగుకొనిన చేతులు కనఁబడుచుండెను. నానావిధాయుధ విశేషములం దాల్చియున్న యాబాణాసురుఁడు చూడంజూడ భయంకరాకారుఁడుగఁ గన్పట్టెను. సింహనాద మొనరించి యట్టహాసముల బ్రహ్మాండ కటాహమును బగులించెను. త్వరగ శుద్ధాంతమును జేరి నిలు నిలు మెందుఁ బోయెదవని యదలించెను. ఆబాణాసురవాక్యము విని ప్రద్యుమ్నకుమారుఁడు తానపరాజితుండు గావున నాతని మోముఁజూచి నవ్వుచుఁ జిఱుగంటల మ్రోఁతలు వినంబడ రక్తధ్వజపతాకములరార ఋష్యచర్మము పఱచియుండఁబడినల్వములయున్నతిచేఁ జూడఁదగియున్న మహారథమును గాంచెను ఆరథమునకు వేయిగుఱ్ఱములు కట్టియుండుటం బరికించెను. హిరణ్యకశిపువా యేమను శంకకల్గించునట్లుండెను. తనపై కరుదెంచుచున్నవాఁడని యెఱింగెను. అసిచర్మాంబరములం దాల్చి యించుకంతయు జంకులేక యుద్ధాభిలాష యొప్పారుచుండఁగా నరసింహాకృతిం దాల్చి యెదుర్కొనెను.

తనకభిముఖుఁడై వచ్చుచున్న యామహావీరుని ఖడ్గచర్మములం దాల్చియున్నవానిం బదాతిగ నున్నదానిం బరికించి త్వరగ వీనింజంపందగుఁగదా యని సంతోషించెను. అనిరుద్ధుఁడు కవచహీనుఁడు ఖడ్గపాణియైనను రణాంగణమున నజేయుఁడని తలంచి బాణాసురుఁడు క్రోధమున మండిపడుచుఁ జూడనలవిగాని తేజంబునఁ గింకరులం గాంచి పట్టుఁడు, కొట్టుఁ డని పలికెను. ఆమాటలువిని భీతిల్లునుపాకన్యకను జేసన్నల నాశ్వాసించి యెదుర్కొనఁగాఁ గత్తివాతియమ్ములవాన వానిపైఁగురియించి బాణాసురుఁ డార్చెను. అనిరుద్ధుఁ డాబాణముల ఖడ్గమునఁ ద్రుంచి యాతనిం బరిభవింపఁబూనెను. దనుజుఁడచ్చెరువంది మరల నతనివధించు కోరిక ననేకశరముల వర్షించెను. బాణపరంపరలఁ జర్మమున నే విదలించుచు సూర్యుఁడుదయాకాలమున వెలుంగునట్లు చూపట్టెను. మఱియు భయంకర మృగేంద్రము కాననమున నొంటిగ గజమును గాంచినట్లా బాణుని వీక్షించెను. దానవనేత యంత నెక్కుడగు పరాక్రమమున విజృంభించుచు మర్మములవిదలించు బాణముల ననిరుద్ధునొప్పించుచుఁ దనబాణములు సోఁకుటఁ గ్రోధముప్పొంగ వానిని సరకుగొనక తనపైకడరు ననిరుద్ధుం దిలకించి నిశాతసాయకముల నొంచెను. ఆబాణములకు నొచ్చి హరిపౌత్రుఁడు మండిపడి దుష్కరకర్మము నొనర్పఁబూని యొడలంతయు రక్తమునం దడిసి యుండఁ ద్వరపడి బాణాసురుని యరదముపైకి లంఘింప నుంకించెను. ఆతనియాటోపంబును గని దనుజనాథుఁడు పరశు పట్టిస భిండివాల ప్రముఖాయుధంబుల నొంచెను. కాని వానికించుకంతయు నతఁడు కంపింపకుండెను.

వెంటనే రథమును సమీపించి వానియాయుధములు తన్నుం దాఁకకయుండఁ గాచుకొనుచు వాని యశ్వములను ఖడ్గమున నఱికెను. యుద్ధపద్ధతుల నెఱింగిన దానవుఁడు మరల నాయ నిరుద్ధుని బాణజాలముల నొంచెను. ఆతఁడు కానరాక యుండ జేసెను. అనిరుద్ధుఁడు పొలిసెనని తలంచి యాతు ధానులార్చిరి! అంతలో మెఱుఁగు మెఱసినట్లు కనఁబడి యెగిరి రథము ప్రక్కకుఁ జేరిన యనిరుద్ధు నెఱింగి బాణాసురుఁడు భయంకరాకారము గలశక్తిని గొనియెను. ఆశక్తిఁ జూడ శక్యముగాక యుండెను. ఘంటానముదాయము దానఁ గనంబడెను. జ్వలనాదిత్యమండలమువలె నది వెలుఁగు చుండెను. కాలదండమే మోయను శంక నంకురింపఁ జేయు చుండెను. అట్టి శక్తిని మహోల్కాకృతి నున్నదాని ననిరుద్ధునిపైఁ బ్రయోగించెను. తనపై కరుదెంచు నాశక్తిని గాంచి ప్రాణాంతమును గల్గించునదియని యెఱింగి తటాలున నెగిరి యత్యుచ్ఛ్రితతేజమలరార దానినొడిసిపట్టుకొని దానినే బాణాసురునిపైఁ బ్రయోగించెను. దానితాఁకున నాతఁడు మూర్ఛిల్లెను ధ్వజయష్టి నాధారముగాఁగైకొనియెను. ఇట్లు మూర్ఛిల్లి తెలిసినదానవునిం గాంచి కుంభాండుఁడు దాన వేంద్రా! ఇంక నుపేక్షించుచున్నాఁడవే ఏల? శత్రువు పైకొ నునపు డుపేక్షింపఁదగునా? శత్రుమర్మముల నెఱింగినవాఁడు నిర్వికారుఁడై యున్నవాఁడు. కావున మాయాబలము నాశ్ర యించి పోరాడము, లేకున్న వీఁడు సాధ్యుఁడు కాఁడు. నిన్నును సారథినగు నన్నుఁ గాపాడంజను. ప్రమాదమున నూరకున్నా వేల? వీఁడు మనలనందఱఁ జంపకముందే వధింపుము. ఆల

సించిన. వీఁడు మనలఁ బొలియించి యుష్మాకన్యకం గొని పోఁగలఁడు.

అని యిట్లు సారథి తనను బ్రోత్సహింపఁగా రూక్ష తామ్రాక్షుఁడై బాణాసురుఁ డిట్లుపలికెను. ఇదిగో వీనిఁబొలియించెద. గరుత్మంతుఁడు పన్నగము గ్రహించునట్లు వీనిం బట్టుకొనియెద అని పలికి రథముతోడ సందే యదృశ్యుఁడై మాయాబలంబున నంతరిక్షమున నుండి నిశాతసాయకజాలంబులం బఱపెను. ఆ బాణములు భీకర సర్పాకారములుగనుండెను. వానిచే ననిరుద్ధుఁడునొచ్చెను. ఆ బాణసర్పములు వాని సర్వాంగములను జుట్టుకొనియెను రజ్జులవలె నవి చుట్టుకొనఁగా నాతఁడటునిటు కదలఁజాలక యుండెను ఆతని ప్రయత్నము లన్నియు నిష్ఫలములయ్యెను. పెనుమ్రాఁకులంబోని విషముగ్రక్కుచు నాసర్పములు బంధింపఁ గదలఁజాలక పడి యుండెను. ఇట్లు సర్పాకారశరములు తన్నలయించుచున్నను గదలలేకున్నను భీతిల్లకయుండఁగా బాణాసురుఁడు క్రూరవాక్యముల నలయించుచుఁ దనమదిం గలకోపము వెలిఁబుచ్చుచుఁ గుంభాండా! వీనిం జంపుము. ఈకులపాంసను వదలకుము. దుర్మార్గుఁడగు వీనిచేఁ బవిత్రమగు నావంశము దూషింపఁబడినది. అనిపలుకఁగా నాతండిట్లు లనియెను.

దానవేంద్రా? ఇంచుక నాభావమును విన్నవింపఁ దలంచితిని. దానిని జిత్తగింపుము. ఈతఁ డెవ్వఁడు? ఎక్కడ నుండి యెట్లిచ్చటికేతెంచెను? ఎవ్వరితని నిటకుఁ జేర్చిరి. శక్రతుల్య పరాక్రముఁ డీతఁడెట్లు తేఁబడియెను? పెక్కుసారులు యుద్ధరంగములయందీతని నేఁజూచినట్లు తోఁచెడిని ఈయుద్ధ

మునందును దేవరాజతనయుఁడగు జయంతుని వలె విహరిం
చుచు యుద్ధము చేయుచున్నాఁడు. బలవంతుఁడు సత్వసంప
న్నుఁడు సర్వశాస్త్ర విశారదుఁడుగాఁ గనుపట్టెడిని. కావున
వీఁడు వధింపఁదగఁడు. నీకొమరిత నీతఁడు గాంధర్వవివాహ
విధిఁ బరిగ్రహించెను. ఇఁక నీపుత్రిక వేఱొకరి కీయఁదగదు.
ఈతని సంబంధమునుండి ప్రతిగ్రహింపను దగదు. కాఁబట్టి
యాలోచించి శిక్ష చేయందగు. వీఁడు వధింపనర్హుఁడా పూజిం
పనర్హుఁడా యని యూహింపవలయును. ఈతని వధించినచో
మహాదోషముగల్గును. రక్షించిన మహాపుణ్యము లభించును.
వీఁడు పురుషవరేణ్యుఁడు. కనుక సమ్మానమునకుఁ దగిన
వాఁడు. సర్పములు చుట్టుకొని సర్వాంగముల నలయించు
చున్న నీతఁడు బాధింపఁబడనట్లున్నవాఁడు. కుల శౌండీర్య
వీర్యముల సాటిరాక సత్త్వశాలియై యున్నవాఁడు. దాన
వేంద్రా! నీవును జూడుము. మహావీర్యసమగ్రుఁడై పురుషోత్తము
నింబోలి యున్నవాఁడు. వధింప నుంకించుచున్నను బలశాలి
గావున మనలలెక్కచేయక యున్నవాఁడు. నీవు మాయా
బలంబునాశ్రయించి కట్టివేయక పోయినచో సురగణమొక్క
టియై వచ్చిన నీతఁడు పోరాడియుండును. ఇందులకు సంశయ
ములు లేవు. సర్వసంగ్రామమర్మజ్ఞుఁడు. బలమున నీకంటె నధి
కుఁడు. రక్తధారల నవయవములు తోఁగుచున్నను సర్పరజ్జులు
తన్నుబంధించినను భ్రుకుటిని ద్విశిఖలుగా నొనరించి మనల
లెక్కచేయక యున్నవాఁడు చూడుము. ఇట్టియవస్థలోనున్నను
స్వకీయబాహుబలమునే యాశ్రయించి నిన్నులక్ష్యపెట్టక
వీర్యోద్రేకముననున్న యీప్రాయంపుఁబురుషుఁ డెవ్వఁడై యుఁ

డును? సహస్రబాహు వొనరించుసంగరమున ద్విబాహువెవి రించి యున్నవాఁడు. ఇదిచాలదా. నీవీర్యము నీతఁడులెక్క గొనఁడని తలంపుము. ఇట్టివాని బొలియించుటుచితమే యనియూహింపుము. ఈతనిం గూడిన నీకన్య మఱొకని కీఁదగదు. న్యాయముకాదు. మహాత్ములవంశమున బుట్టిన వీఁడు నీకిష్టతముఁడేయైనఁ బూజింపుము రక్షింపఁబడుఁగాక. అదియే యుచితమని నాకుందోఁచెడు. అని మహామతి కుంభాండుఁడు పలుకఁగా వినియాతనిమాటల నంగీకరించి వధించుటమాని యతనింగావా డందగువారి నియోగించి యంతఃపురమున కరిగెను. మాయాబలమున ననిరుద్ధుని బంధించుటెఱింగి నారదముని ద్వారకానగరమున కరిగెను. ఆకాశమార్గము నాశ్రయించి ద్వారకకుం బోయి తనపూన్కి నెరవేర్పం దలంచెను. అనిరుద్ధుఁడు దానవుఁడు కనఁబడకుండు టెఱింగి నా యీవృత్తాంతమును శ్రీకృష్ణున కెఱింగించును. సంశయము లేదని యూహించుచుండెను. నాగపాశముల బద్ధుఁడగు ప్రాణనాయకు ననిరుద్ధుం గాంచి యాతురయై యుషాకన్య విలపించెను. ఆమెనుగాంచి యనిరుద్ధుఁడు ప్రేయసీ! ఏల దుఃఖించెదు? నాకొఱకై శ్రీహరి వచ్చునని యెఱుఁగుము. వచ్చినట్లే నిశ్చయింపుము. ఆశ్రీహరి పాంచజన్యనాదమును, యాదవవీరుల బాహునాదముల నాలకించినంతనే దానవులు నశింతురు. దానవాఁగనలగర్భములు విచ్ఛిన్నములగును. అనిపలికిన నాయుష తద్వాక్యముల విశ్వసించి ఘాతకుఁడగు తండ్రినిగుఱించియే దుఃఖించుచుండెను.

మహాశయులారా! ఈకథయే భాగవతమున నించుప క్షేదముగాఁ గనుపట్టెడిని. ఉష కలలో నొకపురుషుఁడు తోఁక

గా మేల్కొని చింతించుచున్నట్లు చిత్రరేఖ పటమున నెల్లరఁ జిత్రించి చూపఁగా ననిరుద్ధుని గుఱుతించినట్లు, చిత్రరేఖ ద్వారకకరిగి తనయోగవిద్యామహాత్వంబున నాతని నెత్తుకొని వచ్చి యుషచెంతం జేర్చినట్లు, వారిరువురు సంతోషమునఁ గాలముగడపుచున్నయట్లు, కొలఁదికాలమునకే యుషగర్భవతియైనట్లు, రక్షకులాహార్తభాగంబున కెఱింగించినట్లు, కోపంబున నాతఁడు సేనలంబంపి పిదపఁ దాఁజని నాగపాశంబులబంధించినట్లు, నాలుగునెలలు గడువఁగా నాతనితల్లులు దుఃఖించుచుండ హరియెఱింగియు నెఱుంగనియట్లుండ నారదముని ద్వారకకుఁబోయి యీవృత్తాంతమును దెలిపినట్లున్నది. విష్ణుపురాణమునం దీకథ యతిసంగ్రహముగ వ్రాయఁబడినది. కాని భాగవతమునకును దీనికిని భేదములేదు. * ఇఁక బ్రహ్మవైవర్తపురాణమున నీవిషయము భేదముగనున్నది. కావున దానిని వ్రాసెదను.

చిత్రరేఖ దుర్వాసుఁడను మునికి శిష్యురాలు; యోగవిశారద. కావున నే ధన్యురాలు. సర్వజనమాన్యురాలు కావున యోగమహిమశక్తి ననిరుద్ధునిం గొనిపోయి యుషాంతఃపురమును జేర్చెను. అతఁ డులికిపడి లేచి దుఃఖించెను. చిత్రరేఖ యాతని నాశ్వాసించి సర్వాలంకారములఁగైచేసి యాహారనిద్రలుమాని కృశించుచున్న యుషఁజూపి వారిద్దఱు కలియునట్లు బోధించి తానింటికిఁ బోయెను. సతీపురుషులు పరస్పరానురాగమున విహరించిరి. నవసంగమలాలసయై యాకామిని

* శ్రీకృష్ణజన్మఖండము నూటపదునైదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

యుండఁగా. నావార్తనెట్లో రక్షకభటులు లెఱింగి రాజునకుం దెల్పిరి. దానవేంద్ర! కాలము దుష్టము దురతిక్రమము. స్త్రీతంత్రురాలయి యుష ప్రౌఢ కావున భర్తనుగోరెను. జేఁడా! అసంగసంగమము దుఃఖదాయకము కదా. మానవులకు సంపర్గము నుండి గుణములు దోషములు కలగును. చిత్రరేఖ తానేమాతీ కృత్యము నెఱపి పరపురుషుని గోనివచ్చెను. ఆవరుఁడు రణశూరుఁడు మహావీరుఁడు మహారథుఁడు రాజేంద్రుఁడు నవయౌవన సంపన్నుఁడు. వ్యాధిహీనుఁడు. కందర్పునిమించిన సుందరాంగుఁడునగు దంపతులుగ నున్నవారు. ఉవానికములభేదము నెఱుంగరు కావున నుష గర్భవతియయ్యెను. మాతృపితృవంశము లకుఁ గళంకముం దెచ్చెను. ఈవంశములకుఁ దీప్తాంగారిస్వరూపిణి యయ్యెను. ఏలినవారికి గాహిత్రుఁడో దౌహిత్రియో కలుగును. ఇత్తెఱఁ గన్యకను బరీక్షింపుఁడు. వరాధీనయై, చంచలాంతఃకరణయై యున్నది. ఆపురుషుఁడు భయవిరహితుఁడై నవసంగమలాలసుఁడై యున్నవాఁడు.

అని రక్షకులు విన్నవింపఁగా బాణాసురుఁడు సిగ్గుపడి క్రోధపరీత మానసుండయ్యెను. యుద్ధసన్నద్ధుఁడయ్యెను. శంకరుఁడు వలదని వారించెను. గణపతియుఁ గుమారస్వామియు వలదనిరి. పార్వతి వలదనిబుద్ధిచెప్పెను. తక్కుంగలశంకరపరివారమెల్లఁ ద్వారపడకుమని హెచ్చరించిరి. తుదకు నగరాధిదేవతలు కూడ వలదనిరి. శంకరుఁ డత్తఱి బాణాసురుఁడు పండితమానియై మూఢుఁడై యుండుటెఱింగి, నీతిశాస్త్రసారమై హితమై పరిణామసుఖావహమై యుండువాక్యము నిట్లు పల్కెను. బాణాసురా! పురాతనకథను వినిపింతు ఆలకింపుము.

భూభారహరణార్థమై యీశ్వరుఁడవతరించెను. రాజేంద్రుల నెల్ల నోడించి ద్వారకానగరమున నున్నవాఁడు. ఆమహాత్ముని రోమములనుండి జగములెల్ల నుద్భవిల్లెను. వాసుదేవుఁ డన నతఁడే యీకృష్ణుఁడని జ్ఞానులు కీర్తింతురు. బ్రహ్మకు జనకుఁడు. చక్రపాణి. భగవంతుఁడు.* బ్రహ్మవిష్ణు శివాదులకు నీశ్వరుఁడు. ప్రకృత్యతీతుఁడు. నిర్గుణుఁడు. నిరీహుఁడు. భక్తానుగ్రహార్థమై యాకారతలను ధరించువాఁడు పరమబ్రహ్మము. పరాత్పరుఁడు. ఎవ్వఁడు లేకున్న జీవుఁడు శవమో యట్టి భగవంతునితో సంగ్రామమేల? బాణములతో నాకాశమును గట్టివైచునట్లు హరిని జయింపనెంచుట యని తలంపుము. ఆతఁడు నిరాకారుఁడే యయ్యు ధ్యానార్థము దేహముగలవాఁ డగును. ఆమహాను భావునిపుత్త్రుఁ డనిరుద్ధుఁడు. మహాబల పరాక్రమశాలి. ఈయని రుద్ధుఁడే మూఁడులోకముల నాశనమొనరింప సమర్థుండగును. దేవతలెల్ల బలవంతులు మహారథులు గావున నాతనికిం దోడ్పడుదురు. ఆదేవతలెల్ల ననిరుద్ధుని శక్తియందుఁ బదాఱవభాగమునకు సరిరారనితలంపుము.

## శంకర ప్రభృతులు బాణునకు హితముఁ జెల్పుట.

విత్తము బలము ననునివి యేయిర్వురకు సమానముగా నుండునో వారికే వివాహము మైత్రియు సాగఁదగును. విత్తబలము సమములుగా లేనివారలకవి చెల్లవు. మహారథుఁడు జ్ఞానియనగు బలిచక్రవర్తి నీకు జనకుఁడు క్షణమాత్రమున సురలోకమునుండి సుతలమునకు నాహరిచేతఁ గొనిపో

---

* బ్రహ్మవిష్ణుశివాదీనా మీశ్వరః ప్రకృతేఃపరః, నిర్గుణశ్చ నిరీహశ్చ భక్తానుగ్రహవిగ్రహః. అని మూలము.

వంబడఁడా. పరిపూర్ణతముఁడగు నాపరమాత్మకుఁ దక్కుంగ లవారెల్ల నంశకలామాత్రులు. బృందావనేశ్వరుఁడు. పరమాత్మయు శ్రీకృష్ణుఁడేయని యెఱుంగుము. అని యుపదేశింప విని పార్వతి యిట్లుపలికెను. దానవేశా! బ్రహ్మయు మహాదేవుఁడు శేషువు సనాతనుఁడగు నాభగవంతుని హృదయకమలమున నిల్పి ధ్యాననిష్ఠుఁడై ధ్యానింతురు. సుమా దినేశ్వర గణేశ్వర యోగీశ్వరులకుఁ బరమగురు వా శ్రీకృష్ణుఁడే. సనత్కుమారుఁడు కపిలుఁడు నరనారాయణులు పరమాత్మయగు శ్రీకృష్ణుని ధ్యానింతురు. మనుమునీంద్ర సిద్ధేంద్ర యోగీంద్రులు ధ్యానింపనలవి గాని యాసనాతనుని ధ్యానింతురు. ఆతఁడే సర్వాది సర్వబీజభూతుఁడు. సర్వేశ్వరుఁడు. పరాత్పరుఁడు. జ్ఞానులంద ఱాశ్రీకృష్ణుని ధ్యానింతురు. అట్టి భగవంతునితో నీకేలవిరోధము? అని యుపదేశింప గణాధిపతి యిట్లునుడివెను. మహాత్ముఁడై విష్ణుభక్తుఁడునగు బలిచక్రవర్తి యభాగ్యమేమో కాని నీవంటిమూఢుఁడు కుమారుఁడయ్యెను. విశేషించి యతఁడు ప్రహ్లాదుని మనుమఁడుకదా. అన విని కుమారస్వామి యిట్లుపలికెను. ఓసోదరుఁడా బాణదానవేంద్రుఁడా! హిరణ్యకశిపుని గాథ వినలేదా. హిరణ్యాక్షుని చరిత్రమెఱుంగవా. మధుకైటభుల వృత్తాంతమెఱుంగవో. నీవు వారెల్లఁ బూర్వులే. మహాబలపరాక్రమసమగ్రులే వారెల్ల శ్రీవిష్ణువు చేతనే యమలోకమునకుఁ గ్రమముగాఁ బంపఁబడిరి. అట్టిభగవంతుఁడు సంహరింపఁబూనఁగా నీక రక్షించువాడెవ్వఁడు?

* యయోరేవ సమం విత్తం యయోరేవ సమం బలమ్, తయోర్వివాహో మైత్రీ చ న తు పుష్టవిపుష్టయోః. అనిమూలము.

మరలుము. యుద్ధప్రయత్నమును మానుము. నీ కది శుభముకాదు. అని యిట్లు హితముఁ దెలుపుచున్నవారల వాక్యము లాలకించి బాణాసురుం డిట్లనియె. ఆతనికన్నులు కోపమున నెఱ్ఱవాఁడి యుండెను. ధనుర్ధారియై యమునకు యముఁడై యిట్లు పలికెను. తల్లీ! పార్వతీ! తండ్రీ! శంకరా! సోదరులారా! గణేశకార్తికేయులారా! నామనవి నాలకింపుఁడు. ప్రాక్తనకర్మానుసారము శుభాశుభఫలములు గలుగును. స్వకృతకర్మవ్యతిరిక్తఫల మెవ్వారికిం గలుగదు కదా. శరశతవిద్ధుఁడైనను మృతికాలము రాక మృతి గాంచఁడు కదా. ప్రాప్తకాలమునఁ దృణస్పర్శమాత్రమున మరణింపకయుండఁడు కదా. బ్రహ్మచే నెవని కెవరిచే మరణము కల్గునని వ్రాయఁబడినదో యదితప్పదుకదా. అదియే సత్యము. నిత్యము. వ్రాఁత మరలింపఁ దగముకాదు. ఎవ్వఁడు సంగ్రామమున భీతిల్లునో వాని జీవనము వ్యర్థము. జయించెనేని యశస్సు కల్గును. మరణించెనేని స్వర్గముకల్గును. శంకరపరిరక్షితంబగు నగరమును బ్రవేశించి కన్యను గ్రహించెను. పార్వతియు నామెతనయులు నగరమును గాపాడుచున్నవారు కదా. బ్రదుకదలంచుకొన్నవాఁ డిట్టి యకార్యము నొనరించునా? సభాముఖమునందు రక్షకులు నీకొమరిత గర్భవతి యయ్యెనని పల్కిరి. నా శ్రవణముల కది వజ్రకోటి యయ్యెను. కాన ననిరుద్ధుని జంపి కన్యకను శిక్షించెదను. లేకున్న నా యీకళేబరమును జ్వాలదగ్నియందు వ్రేల్చెద. అని పలుకు బాణాసురునితో నపుడు కోటరి యిట్లు పల్కెను.

వత్సా! నామాట నాలకింపుము. నేను నీకుఁ దల్లిని గదా. కొఱగాని తనయుఁడైన మాతృపితృలకు దురంత దుఃఖముక ను. కన్య వేఱొకరిచేఁ బరిగ్రహింపఁబడినది. ఇంక నొకరికీయ వలనుపడదుకదా. శ్రీకృష్ణునకుఁ బౌత్రుఁడు, ప్రద్యుమ్నునకుఁ బుత్త్రుఁడునగు ననిరుద్ధునకు నాకన్యకనిమ్ము. భారతవర్షమునఁ బవిత్రుఁడవగుదువు. నీకుఁ బూర్వు లేడుగురు పవిత్రులగుదురు. నీకున్న యైశ్వర్యమంతయు యాతకముగ నిమ్ము. యశస్సుకలుగును. లేకున్న సంగరరంగమున, నిన్నా కృష్ణుఁడు వధింపఁగలఁడు. సుదర్శనమను చక్రమును బ్రయోగింప నన్నురక్షించువా రెవ్వరుందురు. అను నాకోటరీవచనముల కెంతయు గోపించి దైత్యపుంగవుఁడు రథమెక్కి హరి పౌత్రుఁడున్న చోటికిఁ బోయెను. స్కందుఁడు సేనాపతియై శంకరానుమతి నతని వెంటనరిగెను. శంకరగణనాథు లాతనికి స్వస్త్యయనకర్మమును నడపిరి. పార్వతి యతనికి శుభాశిషముల నొసంగెను. కోటరియు నాశీర్వదించెను. అష్టభైరవులు, ఏకాదశరుద్రులు శస్త్రాస్త్రపాణులై యరిగిరి.

ఈనడుమ గౌరిపంపినదూత యనిరుద్ధుని కడకుం బోయెను. బాణపత్నియు నాకార్యమునకు సమ్మతించెను. ఆదూతి యనిరుద్ధా! లెమ్ము. లెమ్ము. నీకు మేలుఁగోరినపార్వతి వచనముల నాలకింపుము. యుద్ధసన్నద్ధుఁడ వగుము. సంగర మొనరింపుము. వెలుపలనుండుము. నీ ప్రియురాలగు నుష రోదనము చేయుచుఁ బార్వతిని స్మరించెను. మహామాయా దేవీ! నన్నుఁ గాపాడుము. కాపాడుము. నా ప్రాణనాథునిం

గావుము. అభయవుగాన నాకభయమిమ్ము. భయంకరసంగ్రామమున పాయపడుము. నీవేకదా లోకజననివి. ఎల్లఱియందు నీకుస్నేహము సమముకదా. అని ప్రార్థించెను గానం బార్వతి యనుకంపాతరంగితాంతరంగ యయ్యెను. అని దూత తెలుపంగనే సన్నాహమొప్ప యుద్ధమొనరింప ననిరుద్ధుండు సిద్ధపడియెను. శస్త్రపాణియై నిలువంబడియెను. ఉష యేర్పఱచిన రథమునెక్కెను. అంతఃపురము వెలువడి నిలిచెను. బాణునిం గాంచెను. యుద్ధసన్నాహమున వచ్చి శస్త్రపాణియై యున్న యనిరుద్ధుని బాణుండు గని యాతని రక్తాంతాయతలోచనాస్యములను లక్షించి రోషమున నిట్లు పలికెను. ఆవాక్యము ప్రజ్వలద్విషమువలె నుండెను. ఓరీశూరుండా! నీవు మిగుల దుష్టుండవు. నీతిశాస్త్రవిరహితుండవు. చంద్రవంశ దానవపావకుండవు. పుణ్యక్షేత్రమున కపయశంబు గల్గించు నీచుండవు. నీతండ్రి శంబరుం జంపి తద్భార్యను గ్రహించెను. ఆతనికి నీవు కొడుకవు. ఇతరులనడ్డగించుట మీకులమర్యాద. పితామహుండగు వాసుదేవుండు మధురానగరమున మాత్రము క్షత్రియుండు. గోకులమున వైశ్యపుత్రుండు. పేరు నందనందనుండని కదా. బృందావనమున గోపాలకుండగు నందుని పశురక్షకుండు. ప్రత్యక్షముగా గోపికాజారుండు. దుష్టుండు. నిరంతరకాంతాలంపటుండు. పూతనయను నాతి నొక్కక్షణమున వధించెను. స్త్రీహంత యధార్మికుండని స్మృతిప్రసిద్ధము కదా. మధురానగరమునకరుదెంచి కుబ్జతోం గ్రీడించెను. దుర్బలుండగు నరకునివధించి మనోహరస్త్రీసమూహమును గ్రహించెను. యోనిలుబ్ధుండు. భీష్మకుని దుర్బలుండగు నతని సుతుని.

జయించి దేవయోగ్యయగు రుక్మిణిని గ్రహించెను. సూర్య భక్తుఁడగు సత్రాజిత్తు రవిప్రసాదమున మణివరమును సంపాదించుకొన నుపాయమున నతనివధించి మణికన్యకను సంగ్రహించెను. కురుపాండవులకు భేదమును గల్పించి ధర్మరాజు చేయుయాగమున శిశుపాలుని వధించెను. దంతవక్త్ర శాల్వ జరాసంధుల నెట్లో వధించెను. నరకాసురు నుపాయమునఁ జంపి సర్వస్వమును గైకొనియెను. దుర్బలుఁడు రాజభీతుఁడు కావుననే సముద్రమును శరణుపొందిన వాఁడు. భార్య మాటలు విని తోఁబుట్టువగు నింద్రునిజయించి పారిజాత ప్రసవమును స్వర్గదుర్లభమును సంగ్రహించెను. తల్లికిసోదరుఁడగు కంసుని నధర్మమార్గంబున సంహరించెను. ఆతని సర్వస్వమును గైకొనియెను. ఇంతకంటె విశేషించి వచింప నేల? భల్లూకము నోడించి తత్తనయను బెండ్లియాడెను. ఆతని పితృభగినియగు కుంతి నలువురకు భార్య కదా. ద్రౌపది పంచపాండవులకుఁ బత్ని. మీతాత నిరంతరకాంతాకనకలంపటుఁడు. ఆతని యన్నయగు బలదేవుఁడు పలుమాఱులు వారుణిని ద్రాగుచుండును. భార్త్రిపత్నియగు యమున నాహ్వానించెను. కనుకనే యతని తోఁబుట్టువగు సుభద్రను కౌంతేయుఁడు మాతులసుత యని యెన్నక యెత్తుకొనిపోయెను. వంశమర్యాద చక్కఁగా నిట్టిదని తలంపుము.

అని యీచందమున బాణాసురుండాక్షేపింప ననిరుద్ధుఁ డాగ్రహించి తగిన ట్లుత్తర మీరీతిఁజెప్పెను, నాతండ్రియగు కామదేవుఁడు బ్రహ్మపుత్త్రుఁడు శుచియేయగు. ఆతని యస్త్ర స్పర్శమున జగత్త్రయము వశీభూతమగును. శివకోపానలంబుననే

ప్పాకర్మమువలన భస్మీభూతుండయ్యెను. ఆతండిప్పుడు పరమాత్మ యగు శ్రీకృష్ణునకుం బుత్త్రుండు. పతివ్రతయగు రతీదేవి పతివియోగదుఃఖమున నుండ శంబరాసురుండు మాయాబలంబున హరింపంగా నాతనియింటం బాతివ్రత్యబలంబున నుండెను. ఆయమ తనతపోబలంబున మాయరతిని గల్పించి స్వధర్మభంగముగాక యుండ ధర్మసాక్షిగా నుండ నుండెను. అట్టిమహాద్రోహిని శంబరుని వధించి తనప్రియురాలిని దెచ్చుకొనియె. ద్వారకకుం దెచ్చెను. చంద్రసూర్యులుసాక్షులు. పితామహుండగు వాసుదేవుని నీవెఱుంగుదువు. మూఢు లాతని నెఱుంగంజాలరు. మహాసాధువులే యతని నెఱుంగంజాలరన నిఁక నీవంటి మూఢు లెఱుగంజాలుదురా. నాలుగు వేదములు తన్మహిమను నెఱుంగంజాలవు. వాసుపదమునకు విశ్వములని యర్థము. ఆవిశ్వములే తల్లోమములు. ఆప్రపంచములకు దేవుండుగాన వాసుదేవుం డనంబడు. బాణదానవా! తన్మహిమ మెట్టిదో శంకరునడుగుము. శంకరభృత్యుండవు కదా నీవు. శ్రీకృష్ణభృత్యుండగు బలిపుత్త్రుండవుకాన గింకరాత్మజుండవు. జ్ఞానదుర్బలుండవు. కావున గోకులమున హరికి వైశ్యపుత్త్రత్వము నారోపించితివి. క్షత్త్రియవైశ్యులకు భోజనము వేదవిహితము. ద్రోణుండు ప్రజాపతి. ధరాదేవి తత్పత్ని. తపోబలంబునం బరమాత్మ పుత్త్రుండుగాం గల్గునట్లు వరమును బడసిరి. ద్రోణుండే నందుండు. వైశ్యరాజు. ధరాదేవియే యశోద. వృషభానుసుత రాధ. సుదాముని శాపకారణమున జనించెను. ముప్పదికోటులను గోపికలును గ్రహించి భర్తయానతిమెయి గోలోకమునుండి యవతరించెను. అందువలననే

యీభారతవర్షము పుణ్యసంపన్నమైనది. భార్యలతో విహారించుట పాపమని నీవనుట నీచము. రాధను పాణిగ్రహణవిధి వివాహమయ్యెను. బ్రహ్మ పురోహితుఁడై కార్యము నడపించెను. గోపాలకులు కోటిసంఖ్యాకులు గోలోకమునుండి వచ్చిరని నమ్ముము. వారెల్ల తేజంబున హరితుల్యులు. పార్షదప్రవరులగుదురు. గోపవేషమున హరి గోరక్షణముచేయుట ధర్మమేకదా. గోపశిశురక్షణము మాయేశుఁడు మాయచే నొనరించుటుత్తమ మనకతెప్పదు. పూతన బలికన్యక. నీవుఁదోఁబుట్టువు. పూర్వము వింధ్యాంబిక వామనమూర్తిని గాంచి పుత్త్రిబుద్ధి నవలంబించెను. ఇట్టికొడుకు నాకుం గల్గునేని ముద్దాని యక్కునంగదియించి చనువాలిత్తుఁ గదా! యని తలంచెను. ఇట్టిసుందరాకారుని గాంచు భాగ్యము నాకుం గల్గునా! యనివగచెను. అవతారాంతరమున నట్లేయగుఁగాక! యని భగవంతుఁడు వరమిచ్చెను. ఆమెయే పూతనగా నవతరించి బాలు నెత్తుకొని ముద్దాడి స్తనదానమునఁ బవిత్రయై గోలోకమున కరిగెను. ఈవిషయ మెఱుంగక భగవంతు నాక్షేపించెదవే ఏల? దురాత్ముఁడగు రావణాసురునకుఁ గుజ్జచెలియలు. శూర్పణఖ యని యామె యప్పటిపేరు. కామాతిరేకమున శ్రీరాముని గామించెను. ధార్మికోత్తముఁడగు లక్ష్మణుఁడు తన్నాసికను ఛేదించెను. తపస్సొనరించి బ్రహ్మవలన నామెవరము నొందెను. ఆవరప్రభావమున శ్రీకృష్ణావతారమున భగవంతుని సేవించి గోలోకమునకరిగెను. శ్రీకృష్ణాలింగనమున గోలోకమునగోపిక యయ్యెను. నరకాసురుఁడు పూర్వకర్మఫలంబుగ హరిచే వధింపఁబడియెను. సూర్యచంద్రులు సాక్షిగానుండఁ

గన్యకలను హరి వివాహమాడెను. కావున నిందు దోషమునఁ దగిన దేది? భీష్మక రాజపుత్రిక మహాలక్ష్మియే. హరిప్రియయే యగు. వైకుంఠమునుండియే బ్రహ్మదేవుని ప్రార్థనానుసారము వచ్చెను. కావున నామెను గ్రహింపనర్హులు పరుల గుదురా. సత్రాజిత్తు కూఁతురు సాత్రాజితి సత్యభామయనియుఁ బ్రఖ్యాతినొందిన యంగనామణి వసుంధరాదేవి యని యెఱుఁగవో? స్యమంతకమణిని వివాహకాలమున యౌతుకముగా నాతఁడు హరికొసంగెను. శ్రీహరి ప్రయాణము భూభారహరణార్థమే. కావునఁ గురుపాండవ యుద్ధమున నాపని దీర్చెను. శిశుపాలదంతవక్త్రులు జయవిజయులను పేరుగల హరిపార్షదప్రవరులు. భక్తాగ్రేసరులు. ద్వారపాలకులుగ శ్రీహరిని సేవించుచుండిరి. సనత్కుమారమునివరు శాపంబున మూఁడుజన్మములెత్తిరి. హిరణ్యాక్షహిరణ్యకశిపులను నిర్వురు నీకుఁ బూర్వులే. హిరణ్యాక్షుఁడు వరుణునోడించెను. నృసింహరూపమున హరి హిరణ్యకశిపుని వధించెను. ఆదివరాహరూపమున హిరణ్యాక్షుని బొలియించెను ఇది పూర్వవృత్తాంతము. దీనిని జక్కఁగా నాలకింపుము. ఇదియే జయవిజయుల తొలిజన్మవృత్తాంతము. వారే రెండవజన్మమున రావణ కుంభకర్ణులైరి. వారిరువురు శ్రీరామచంద్రునిచే వధింపఁబడిరి. శిశుపాలదంతవక్త్రులు మూఁడవజన్మమున శ్రీకృష్ణునిచే నిహతులైరి. వారిశాపము పోవ మరలఁ బార్షదులైరి. జరాసంధుఁడు శాల్వుఁడు దురాత్ముఁడగు కంసుఁడు ప్రాక్తనకర్మవశమున భూభారమును దీర్ప నవతరించిన హరిమూలముననే హతులైరి. మాంధాతృపుత్త్రిలలో నొకఁడగు యవనుఁడు ప్రాక్త

నపుణ్యవశముననే హరిచే నిహతుఁ డయ్యెను. రాజులధనం బపహరించితివని హరిదూషించితివి కదా! లక్ష్మీనాథున కీస్వల్పధనంబున నేమేని లాభముకలదా? యనియోజింపవైతివి. పుణ్యకవ్రతకారణమున సత్యభామప్రీతికై శపథమొనరించి పారిజాతమును దెచ్చెను. జాంబవతి దుర్గాంశజనితురాలు భల్లుకాత్మజ యయ్యెను. తపఃఫలముగా శ్రీహరిం బెండ్లియాడెను. కుంతికి భర్త యాజ్ఞచే క్షేత్రజులుగాఁ బాండవులు కలిగిరి. పలపైతృకము కలియందే నిషిద్ధము. కృత త్రేతా ద్వాపరములయందు విహితమే. ధర్మదేవతాపుత్రుఁడు యుధిష్ఠిరుఁడు. పవనాత్మజుఁడు భీముఁడు. మహేంద్రాత్మజుఁడర్జునుఁడు. అర్జునునకే పాశుపతము శంకరుఁడొసఁగెను. అశ్వమేధము గోమేధము, సన్న్యాసము, పలపైతృకము, దేవరునిచే నగు సుతోత్పత్తియు ననునివి కలినిషిద్ధములు. ద్వాపరమున నిషిద్ధములు కావుకదా. శంకరవరప్రభావముననే ద్రౌపదికిఁ బంచపతులైరి గాని వేఱుకాదు. భగవదాజ్ఞయుక్రమమనరానిది. బలదేవుఁడు పుష్పమధువునే పవిత్రమని భావించి నిత్యము త్రాగుచుండును. స్నానార్థమై యమునానది నాకర్షించెనుగాని వేఱుకారణమేమి కలదు. సుభద్రను శ్రీహరియే యర్జునునకు దానముచేసెను. మాతులకన్యాపరిగ్రహము దాక్షిణాత్యసమ్మతమని యెఱుంగుము. ఇతరదేశములయందీ మాతులకన్యాపరిగ్రహణము దోషమేయని కమలోద్భవుఁడాజ్ఞాపించెను. అని పలికి యనిరుద్ధుఁడు స్వప్రయత్నమున జాగరూకుఁడై యుండెను.

## రతీ ద్రౌపదుల పూర్వజన్మవృత్తాంతము.

*బాణాసురుఁడు ప్రద్యుమ్నకుమారుఁడు తెలిపిన పలుకులు విని యనిరుద్ధా! నీవు తెలిపిన విషయములు బాగున్నవి. శంకరునిచేఁ గొన్ని తెలిసియే యుంటిని. శంకరవరమునఁ బతిపంచకము గల్గెనని వచించితివే. దానిని వినఁగోరెద. నీతల్లి శంబరాసురునిచే హరింపఁబడె నంటివి. దేవతలచే నామె యీయఁబడిన దంటివి. ఆతనిచే దేవత లెట్లు లోడింపఁబడిరి. వినఁగోరెద చెల్పుమా! యన ననిరుద్ధుఁ డిట్లు తెల్పెను. బాణాసురా! వినుము. ఒకానొక కాలమందు శ్రీరామచంద్రుఁడు సీతయు లక్ష్మణుఁడు చెంతనుండఁగా స్నానముచేసి పంచవటీతీరమునఁ గూరుచుండి యుండెను. సీతయుఁ జెంతనుండెను. జలము నిర్మలముగను సుశీతలముగ నుండెను. అన్నము వ్యంజనములు సర్వము సుశీతలములుగ నుండెను. ఫలములను గోసి సీతకు శ్రీరామమూర్తి ప్రీతిమై నొసఁగెను. పిదప లక్ష్మణున కిచ్చెను. పిదపఁ దాను భుజించెను. లక్ష్మణుఁడు వాని గ్రహించెను గాని భుజింపఁ డయ్యెను. మేఘనాధవధార్థము సీతోద్ధారణ కారణమునను నీరెండును భక్షింపకుండుటకుం గారణములు. నిద్రయు నాహారము నాతఁడు వదలెను. పదునాల్గు వత్సరము లీనియమమున నే యుండెను. ఇట్లుండిన పురుషుని చేతనే రావణాత్మజుఁడు వధింపఁబడునని నియమము కలదు.

ఆసమయమున శ్రీరామమూర్తిని జూడఁగోరి వహ్ని బ్రాహ్మణరూపమున వచ్చెను. రామమూర్తితో భవిష్యద్వృ

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండమున నూటపదాఱవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

త్తాంతము నిట్లు చెప్పెను. రామచంద్రా! మహానుభావా! ఆలకింపుము. సీతను దాఁచి యుంచుము. ఏడుదినములలో పల దుష్టుఁడగు రావణాసురుఁడు దుర్నివారుఁడు. కావున జానకినిహరింపఁగలఁడు. బ్రహ్మవ్రాఁతను మార్పఁ దరముకాదు. కదా! ప్రాక్తనకర్మ మనుభవింపక తొలంగదు. పరమేష్ఠియుఁ బ్రాక్తన కర్మ మిట్టిదని యెఱింగియే స్పష్టముగా వ్రాయును. దానిని దుడిచివేయఁ దరముగాదు. దేవతలందఱు నివార్తఁ దెల్పిరి. అని పలుక శ్రీరామచంద్రుఁ డిట్లు పలికెను. హుతాశనా! నీవే సీతను గైకొని పొమ్ము. ఈ మెచ్ఛాయ యిందుండును గాక! కళత్రవర్జన కర్మమెల్లర కేవగింపును బుట్టించును. అని పలికినంతన యగ్ని భర్తృసాన్నిధ్యము నెడఁబాయువలసెనే? యని విలపించు సీతను గైకొని పోయెను సీతాప్రతికృతియగు ఛాయ శ్రీరామసాన్నిధ్యమున నుండెను. ఆఛాయనే బలశాలి యగు రావణాసురుఁడు దొంగిలించికొని పోయెను. ఆ రావణు సపుత్రమిత్రబాంధవుని బొలియించి రామమూర్తి తనకీర్తి నెఱపెను. రామమూర్తి పరీక్షించుకాలమున నగ్నినేఛాయ ప్రవేశించెనో? ఆఛాయనే యగ్ని తానవిచికొని సీతను దెచ్చి యిచ్చెను. ఆజానకింగొని రామచంద్రుఁ డయోధ్య కరిగెను. చాయ వహ్నిపార్శ్వమునఁ దత్తఱపడుచుఁ దన్నుతో నుండెను. నారాయణసరోవరమున నాఛాయ తపమొనరించి నూఱువత్సరములకు శంకరుకరుణకుఁ బాత్రురాలై మహాదేవుఁడు వరము కోరుము కల్యాణీ! యని పలుక భర్తృవియోగదుఃఖితయై ఐదు సారులు పతిననుగ్రహింపుమా? యని ప్రార్థించెను. శంకరుఁడాలోచించి యుల్లేఖర మొసంగెను. అపుడు మహాదేవుఁ డిట్లు పలి

కేను. సాధ్వీ! నీవు వ్యాకులచిత్తవై పంచవారములు పతిని మ్మని ప్రార్థించితివి. ఇంద్రులైదుగురు శ్రీహర్యంశమున జనించిన వారు. నీకుఁ బ్రాణనాథులగుదురు. బాణాసురా! ఆ యైదుగు రింద్రులే యిపుడు పంచపాండవు లనఁబరఁగుదు రని యెఱుంగుము. ఆఛాయయే యజ్ఞకుండజనితయగు ద్రౌపదియనియుఁ దెలియుము. కృతియుగమున వేదవతియుఁ ద్రేతాయుగమున జానకియు ద్వాపరమున ద్రౌపదియు నాఛాయయేయయ్యెను. కావనే ద్రౌపదికిఁ గృష్ణ యను నామము కల్గెను. విష్ణుభక్తిఁ గలిగి శ్రీకృష్ణపాదారవిందముల సేవించుటంజేసి ద్రౌపది కృష్ణ యనునామమునఁ బ్రఖ్యాతయయ్యెనని యెఱుంగుము. మహేంద్రుల స్వర్గలక్ష్మిగా మార్పునొందఁగలదు. స్వయంవరమున ద్రుపదుఁ డర్జునునకొసంగెను. ఆయర్జునుఁడు తల్లిచెంతకరిగి యోజననీ! యొకవస్తువు లభించినదనెను. అనుడు నాకుంతి సోదరులం గూడి యనుభవింపుమనియెను. శంభువరమునఁ దొలుతను గుంతి యాజ్ఞవలన రెండవమాఱును బంచ పతులయిరి. పదుసల్వు రింద్రులలో నయిదుగురు మాత్రము పంచపాండవులుగ నవతరించిరి. రతీదేవి శంకరునిచే శపింపఁబడి తల్లిచేఁ దిరస్కరింపఁ బడియె. నీపతి భస్మరూపుఁ డగుఁగాక యనియే యాశాపము. హరకోపానలమున భస్మభూతుఁడు నీపతియగు ననియు నాశాపాక్షరములం గలదు. రతీ! నీవు దైత్యగ్రస్తవగుదువు గాక! యని పలుకుచు మహాశూరుఁడై యింద్రాదుల మాయాబలమున గెలిచిన శంబరుఁడు నిన్నుఁ గొనిపోవఁగలఁడు. అని శపియించి మరల ననుగ్రహమున నీసతీత్వము చెడకుండునట్లు నీఛాయ నాతని యింటనునిచి నీపతి మరల బ్రదికినంతదనుక.

నాశంబరునింటనుండుము. నిన్నితరు లెఱుంగఁజాలరు. ఆఛాయ నే నిన్నుగా వాఁడుభావించును. బాణాసురా! ఈపురాతనేతిహాసమును వివరించితిని. దేవతలీరహస్యము నెఱుంగుదురు. అని యనిరుద్ధుఁడు పలికెను.

బాణాసురుఁ డిట్లు సంగరాంగణమున ననిరుద్ధుని మాట లాలకించుచుండఁ గాంచి కుంభాండుని సోదరుఁడును సేనాధిపతియునగు సుభద్రుఁడను దానవుఁడు బలశాలిగావున బాణాసురు నాక్షేపించుచు శస్త్రపాణియై చక్రపాణిపౌత్రునిపై శూలమును బ్రయోగించెను. అది ప్రళయాగ్నివలె నడరెను. అనిరుద్ధుఁ డద్దాని నర్ధచంద్రబాణమున ఖండించెను. సుభద్రుఁడాగ్రహావేశమున సూర్యప్రభాభాసమానమగు శక్తిని బ్రయోగించెను. ఆశక్తిని హరిపౌత్రుఁడు వైష్ణవాస్త్రమునఁ దునిమెను. అంత నాదానవుఁడు నారాయణాస్త్రమును బ్రయోగించెను. దానిమహిమము నెఱుంగును. కావున బ్రద్యుమ్నకుమారుఁడు రథమునుండి దిగి సాష్టాంగనమస్కారమొనరించి దాని శాంతించునట్లు దానిం జేసెను. ఆ దివ్యాస్త్రమంబరమందే యించుకసేపు వెలుంగుచు శాంతప్రకాశమై యడంగెను విశ్వసంహారము నొనరించు నాయస్త్రమిట్టులడంగ ననిరుద్ధుఁ డసింగొని యాసుభద్రునరదంబు చెంతకుఁబోయి రథమును రథ్యములను సారథిని ద్రుంచెను. అంత నూరికుండక యాసుభద్రుని ఖండించెను. సుభద్రుని పాటుగాంచి బాణాసురుఁడు తనబలపరాక్రమముల వెలయింపఁబూని నూఱుబాణములాతనిపైఁ బ్రయోగించెను. అగ్నిబాణమున నాబాణశతకము నడంచి యనిరుద్ధుఁడు వెలయుటం గాంచి సృష్టిసంహార

కారణంబగు బ్రహ్మాస్త్రమును బాణుఁడు ప్రయోగించెను. దాని రాకఁ గాంచి మంత్రపూర్వకముగా బ్రహ్మాస్త్రమునే ప్రయోగించి విలాసమున దానిని మరలించెను. బాణుం డాగ్రహించి పాశుపతముం బ్రయోగింప నుద్యుక్తుఁ డగుట నెఱింగి గణపతియు స్కందుఁడు శంకరుఁడును వలదని నివారించిరి. ఆవిషయము నెఱింగి యనిరుద్ధుఁడు జృంభణాస్త్రమును బ్రయోగింపఁగా బాణుఁడు నిశ్చేష్టుఁడై యుండెను. వెంటనే నిద్రాస్త్రమును హరిపౌత్రుఁడు వైవఁగా నసురుఁడు నిద్రంజెంది పడిపోయెను. బాణుఁ డిట్లు నిద్రాపరవశుఁడై పడియుండుటం దెలిసి ఖడ్గముగొని దానవుం జంపఁబూని పోవ నాతని గుమారస్వామి నివారించెను. కాని యనిరుద్ధుఁడు నిలువక పోవుచుండంగని బాణశతికమును బ్రయోగించి స్కందుఁడు మూర్ఛఁగొనియెను. అనిరుద్ధుఁడు నాకుమారస్వామి యరదమును దురత్యయమగు శక్తిచేఁ జూర్ణమగునట్టు లొనరించెను. కార్తికేయుం డందులకాగ్రహించి గదంగొని యనిరుద్ధునరదమును క్షణమాత్రమున లీలచేఁ జూర్ణము గావించెను. హరిపౌత్రుఁ డాకుమారుని ధనుస్సును భల్లాస్త్రమునఁ గూర్పఁబడి యున్నదానిఁగ నెఱింగి క్షురధారగల యర్ధచంద్ర బాణమున ఖండించెను. కుమారస్వామి యాగ్రహించి దురంతయగు గదచే నాతనినొప్పించెను. మదనాత్మజుఁడును గదాయుధమునే గైకొనియెను. స్కందుఁడు శూలముం గొని యతనిఁ జంపంబూనెను. గద ననిరుద్ధుఁడు విసరివైవఁగా గార్తికేయుఁడు పరుగున వచ్చి కామపుత్రునిం బట్టుకొని విలాసమున నటునిటు త్రిప్పి పడవైచెను. అంతట ననిరుద్ధుఁడు ఖడ్గముంగొని లేచెను. వారిరువురు విరోధమును

గణపతి తోఁచినట్లు మాటలాడుచు వారినకుమ నిలువ నీరు వురు మరలిపోయిరి. గణపతి శివునకావార్త నెఱింగింపఁ బోయెను.

—॥ శంకరగణనాయక సంవాదము. ॥—

* గణపతి శంకరుకడకరిగి నమస్కరించి బాణాసురున కనిరుద్ధునకు సంగరము సాగుటయు లోనగు వార్తలనెల్ల వేఱువేఱ నెఱింగించెను. సుభద్రునిధనము కుమారానిరుద్ధులకు ననిసాగుట యందనిరుద్ధుని విక్రమము గణపతివచనముల వలనఁ దెలిసికొని మహాదేవుఁడు ఫక్కున నవ్వి మధురోక్తుల నిట్లు బదులుచెప్పెను. గజాననా! నామాటలాలకింపుము. నాను డువునది హితము తథ్యము నీతిసారము పరిణామసుఖావహము నగు నని తలంపుము. బ్రహ్మాండముల సంఖ్యాకములు. అన్నియుఁ గృష్ణమయములని తలంపుము. ఏదికార్యమో ఏది కారణమో అది కృష్ణుఁడే యని యెఱుంగుము. కారణకారణుఁడు కృష్ణుఁడేయని నిశ్చయింపుము. గజాననా! బ్రహ్మాదితృణపర్యంతము గల జగంబంతయు సనాతనుఁడగు శ్రీకృష్ణుని స్వరూపమగును. ఇది సత్యము. గోలోకమున ద్విభుజముల శాంతరూపుఁడై రాధాకాంతుఁడై మనోహరుఁడై యున్న శ్రీకృష్ణమూర్తి శిశురూపమునగోపాలవేషమున నివుడున్నవాఁడు. కామధేనువులు గోపికలుగా నవతరించు హరి సేవించుచున్నవి. గోలోకమునుండి గోపాలకులు భూమి నవతరించిరి. బృందా

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము నూటపదునేడవ యధ్యాయము నుండి సంగ్రహింపఁబడిన దని యెఱుంగునది.

వనము పవిత్రతమము. అందును రాసమండల మతిసుంద రము. పుణ్యాతిశయము. అందు శ్రీహరి మురళీహస్తుఁడై చరిం చుచు బ్రహ్మేశ్వర శేషవందితచరణారవిందుఁడై యుండును. శతశృంగపర్వతమందును వటమూలమందును భాండీరవన మందును గోష్ఠమందును నిర్మలవిరజాతటమునందును నవీననీరదశ్యాముఁడై పీతవసనాభిరాముఁడై నవీనజలధర సంహతిసౌదామినిచేఁ బోలె వెలయుచునుండును. ఈస్థానము లన్నియు భగవద్విహారార్థ మాగోలోకమునుండి యుండును రాసమండలమునుండి వచ్చినవి. అన్నియు బృందావనమున నలరుచున్నవి. ఇవన్నియు వీరందఱును భగవదంశాంశములు. శ్రీకృష్ణుఁడు పరిపూర్ణుఁడు. కాముఁడు బ్రహ్మశాపమునఁ దన్నెఱుంగక యున్నవాఁడు. అనిరుద్ధుఁడు వానికుమారుఁడు. మహాబలపరాక్రమవంతుఁడు. కుమారుని బాణాసురుని యుద్ధమునఁ గాపాడుమని పంపితిని. లేకున్న బాణుఁడు మృతి నొందియే యుండును. కుమారుఁడా బాణుని రక్షించెను. స్కందానిరుద్ధ యుద్ధమునందు సమత్వమే కల్గెను. దేవతలంద ఱును కుమారపురస్సరులై పోరాడినను శ్రీహరిపౌత్రుని గెల్వఁ జాలరు. అనిరుద్ధుఁడు బ్రహ్మాంశసంభూతుఁడు ప్రద్యుమ్నుఁడు కాముఁడు. బలదేవుఁడు శేషుఁడు. శ్రీకృష్ణుఁడు ప్రకృతి పరుండగు భగవంతుఁడు. ఈరహస్యము నెఱింగించితిని. బాణాసురుని రక్షింపుము. నీవు శుభస్వరూపుఁడవు. విఘ్న ములను దొలఁగించువాఁడవు. శీఘ్రకాలమున శ్రీహరి సుదర్శనధారియై రాఁగలఁడు. ఆచక్రము నిష్ఫలముకాదు. సూర్యకోటిప్రభాభాసమానము. అది బాణునిపై నడరక

ముందే బాణుని గాపాడఁ బ్రయత్నింపుము అని గజాననున కుపదేశించి శంకరుఁడు స్వప్రయత్నమున నుండెను.

— శ్రీకృష్ణుఁడు బాణాసురునిపై దండెత్తిపోవుట. —

* గణపతిని సాగనంపి శంకరుఁ డభ్యంతరమందిరంబునకరిగి దుర్గాదేవియు భైరవియు భద్రకాళియు లోనగు వారు తన్నుంగని నమస్కరింపనుండెను. కుమారగణనాథు లచ్చటికరిగిరి. వారింగూడి బాణవీరభద్రాదులు పోయిరి. అత్తఱి మణిభద్రుఁ డరుదెంచి సింహద్వారసమీపమున శంకరుంగాంచి యీరీతి విన్నవించెను. మహాదేవా! లెక్కపెట్టఁ దరముగాని యాదవసేనలు వచ్చుచున్నది. బలదేవుఁడు ప్రద్యుమ్నసాత్యకి సాంబోగ్రసేనభీమార్జునులు, నక్రూరోద్ధవులు శక్రతనయుఁడగు జయంతుఁడు వచ్చుచున్నవారు. దివ్యరథమెక్కి శ్రీకృష్ణమూర్తి పార్షద ప్రవరులగు గోపాలకు లేడ్గురు కొలువ వచ్చుచున్నాఁడు. చక్రము కరమున మెఱయుచుఁ గోటిసూర్యుల నపహసించునట్లున్నది. కౌమోదకి యుగ్రభంగి నున్నది. శూలము తేజరిల్లుచున్నది. పాంచజన్యము శత్రుసంహారకారకంబగుట రథముపై నలరుచున్నది. రథముల లెక్కింపఁ దరము కాదు. రథికుల వర్ణింపరాదు. శోణితనగరమంతయు వీరిచే నిండిపోవును. లంకానగరమును శ్రీరామసేన లావరించినట్లున్నది. గరుత్మంతుఁ డొక్కయెత్తుగా నగరమును రూపుమాపఁ జూచుచున్నవాఁడు.

---

* ఈభాగము శ్రీకృష్ణజన్మఖండము నూటపదునెనిమిదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

బలదేవుఁడు లాంగలాయుధమునఁ బ్రాకారముల భజించు చున్నవాఁడు. ఉద్యానముల విదళించి ద్వారపాలకులఁ బొలియించి నగరమును యదువీరులు ప్రవేశించుచున్నారు. అను మాటలాలకించి మహాదేవుఁ డెల్లరు విన నిట్లు పలికెను. గోలోకనాయకుఁడు చక్రపాణియై వచ్చినాఁడు. క్షణకాలమున సకలప్రపంచముల నశింపఁజేయు నామహాత్మున కీనగర మన నెంత ? సర్వోపాయములచేతను మీరెల్ల రీబాణాసురుని రక్షింపవలయు. బాణాసురుఁడు గణపతిని సంస్మరించుచు రణమున కేగవలయు. బాణునకు దక్షిణభాగమునఁ గుమారస్వామియు ముందుగణపతియు వామపార్శ్వముల భైరవులు రుద్రులును నందీశ్వరుండును నిలువందగు. మహాకాలుఁడు వీరభద్రుఁడు లోనగు మహావీరులెల్ల నాతనిం గాపాడుదురు గాక. ఊర్ధ్వమున దుర్గయు భద్రకాళియు నుగ్రచండయు నుందురు గాక. దుర్గతి నాశిని యగు దుర్గ బాణు గాపాడుంగాక. కృష్ణశక్తి దుర్గయే. కాననే నారాయణి యనుపే రామెకుం జెల్లును. విష్ణుమాయయు జగన్మాతయు సర్వమంగళప్రదాయినియు నాదుర్గయే కదా. ఆమె విశేషించి చక్రాయుధ జ్వాలల కసురనాథుఁ డాహుతిగాక యుండఁ గాపాడుఁ గాక. ఈబాణుఁ డెల్లరకంటె నాకుం బ్రియుఁడు. గణనాథ కార్తికేయులకంటె నెక్కుడు. కావున దుర్గాదేవి పాదాబ్జ రజస్సుతోఁ గూడ బాణశిరంబునఁ గరం బునుచుఁగాక.

అని శంకరుఁడు పలుకఁగా దుర్గాంబిక విని ఫక్కున నవ్వి సమయోచితము న్యాయసమ్మతము నగు నట్లు వచించెను. బాణదానవా! నీయింటఁగలమణిసారములు రత్నసారములు

లోనగు నమూల్యపదార్థములతో నుషాకన్యకనుఁ దగినవరుఁ
డగు ననిరుద్ధున కొసఁగుము. ముందు శ్రీకృష్ణుకడకు నీకొమ
రితం దోడుకొని పోయి శరణుచొచ్చి నీరాజ్యమును నిలుపు
కొనుము. నీతో నీకు సంగరమేల? ఎవ్వఁడుపోయినఁ బ్రాణము
లుఁ బోవునో యతఁడు జీవుఁడు. ఇంద్రియముల కధిపతి. నేను
శక్తిని. మనస్సు బ్రహ్మ. జ్ఞానము శివుఁడు. శివుఁడు వెడలిపోయి
నచో దేహమప్పుడే పడిపోవును. చక్రజ్వాలలం గాంచి సంగ్రా
మమున నెవ్వఁడు నిలువఁగలఁడు. ఆత్మాకాశమునందు
బాణుఁడు తనతో దాను సంగ్రామముచేయవలయును. భక్తా
నుగ్రహావిగ్రహుఁడగు భగవంతుఁడు నిత్యసత్యస్వరూపుఁడు.
శ్రీకృష్ణుఁడు వేఱని తలంపకుము. నీయాత్మయే యనినమ్ముము.
అని శంకరుం గూర్చి మహాదేవా! స్కందగణపతులెట్లో
బాణుఁడు నీకట్టివాఁడే కింకరులయందు బాణుఁడు ప్రియుఁడు.
శ్రీకృష్ణునకంటెఁ బ్రియుఁడగునా? వైకుంఠమున మహాలక్ష్మియని
పిలువఁబడుదానను నేనే గోలోకమున రాధికయను దానను
నేనే. శివలోకమున గౌరియను పేరు నాకే కలదు. బ్రహ్మ
లోకమున సరస్వతియన నుందును. మున్ను దక్షకన్యయగు
సతిగా నవతరించి దానవులం బొలియించితిని. నిన్ను దక్షుఁడు
నిందించుటచేఁ దనువు వదలి పార్వతియను పేర హిమ
వంతునకుఁ గూఁతురనైతిని. రక్తబీజునితో యుద్ధముచేయఁ
గోరి కాళియనుపేరును ధరించితిని. వేదమాతయగు సావిత్రిని
నేనే. జనకకన్యకయగు సీతను నేనే. భీష్మకన్యకయగు
రుక్మిణియు నారూపమే. ఇప్పుడు సుదాముని శాపకారణ
మున వృషభాను పుత్రికనై రాధయన నున్నదానను. బృందా

చన మనంబడు పరమపవిత్రస్థలమున నుండి కృష్ణపత్నిగా రాధకలదు. నీచెంత నీరూపమున నున్నదానను. ఇంక నేనేమి చెప్పఁ దగును? అంతయు వివరించితిని. మీయాజ్ఞ నతిమెయి నొనర్తునని దుర్గాంబ యూరకుండెను.

## బలిచక్రవర్తి శోణితనగరమున కరుదెంచుట.

* ఇట్లు దుర్గాంబ పలుకఁగా శంకరాదు లాదుర్గను ప్రశంసించిరి. శంకరుఁడాదుర్గతో నిట్లు సంభాషించెను. ఆమె జ్యోతిస్స్వరూపిణి యని, మూలప్రకృతి యనియు నీశ్వరి యనియు శంకరుఁ డెఱుంగును. కావుననే యుక్తవచనముల నిట్లు ముచ్చటించెను. పరదేవి! నీవు చెప్పినదంతయు వేదార్థమే. భగవంతునితోటి సంగరమయుక్తము పరిహాసపాత్రము నగు. సర్వభూషణభూషితురాలగు నుషాకన్యను బాణాసురుఁ డొసంగుఁ గాక. అట్లొసంగుట సమంజసముగ నుండును. కీర్తికరము. సర్వకార్యశుభావహము. హిరణ్యకశిపుసంతతి లోని వాఁడగుట నీయ సమ్మతింపఁడేని పరాభవము తప్పదు. అపయశస్సు వాటిల్లును. దానికి సమ్మతించు నేని సమర సన్నాహమున బాణాసురుఁ డరుగును గాక. మేమెల్ల వార్గాన మును బాకించు సమరసన్నాహములనరుగుదుము. అనిపలికి కన్య కనిమ్మని బాణునకుఁ బోధించెను. అతఁ డంగీకరింపఁ డయ్యెను. దుర్గయు బాణాసురుంగాంచి శివోక్తి మంచిదని హెచ్చరించెను. కాని యతఁ డంగీకరింపక పోయెను.

---

* ఈగాథయు శ్రీకృష్ణజన్మఖండమున నూటపందొమ్మిదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడిన దని యెఱుంగునది. ఇతరపురాణముల యం దీగాథ లేదు.

ఆసమయమున నాపవిత్రమహాసభకుఁ బరమధార్మికులలో నుత్తముఁ డని పేర్కొనందగిన బలిచక్రవర్తి యరుదెంచెను. దివ్యస్యందనమునుండి దిగి సభా మధ్యమునకువచ్చి గణాధిపతి లోనగు వారికి నమస్కరించెను. ఆమహాధార్మికుని గాంచి యందఱు లేచి గౌరవించిరి. శంకరునకు నమస్కరింపఁగాఁ బ్రీతిమెయి నామహాదేవుఁ డిట్లుపలికెను. పరమధార్మికశేఖరా! సర్వసంపదలు భగవంతునకర్పించిన చతురుఁడవు. విష్ణుభక్తులెల్ల నీఁదుఁజేరుట పరమలాభము. విష్ణుభక్తులు స్పృశించినంతన తీర్థములు పవిత్రము లగును. సర్వాశ్రమములవారిలో శుచియగు బ్రాహ్మణుఁడు పూజ్యుఁడు. ఆబ్రాహ్మణుఁడు విష్ణుభక్తుఁడు కూడనయ్యేనేని పరమపూజితుఁడు. విష్ణుభక్తుఁడగు బ్రాహ్మణునికంటెఁ బూజింపఁదగువాని నెందును గానము. వాయువునకంటె నగ్నికంటె సకలతీర్థములకంటె నతఁడు పవిత్రుఁడు. ఆతనిం జూచినంతన పాపములు భయంపడును. పాపము లాతని దేహమున నగ్నింబడు శుష్కదారువులం బోలి భస్మీభూతములగు. అన విని బలిచక్రవర్తి యిట్లనియెను. *

---

*బలిచక్రవర్తికృత శ్రీకృష్ణస్తుతిః.

శ్లో. ఆదిత్యాః ప్రార్థనేనైవ మాతుర్దేవ్యా వ్రతేన చ, పురా వామనరూపేణ త్వయాహం వంచితః ప్రభో. ౧. సంపద్రూపా మహాలక్ష్మీ ర్దత్తా భక్తాయ భక్తితః, శక్రాయ మత్తో భక్తాయ భ్రాత్రే పుణ్యవతే ధ్రువమ్. ౨. అధునా మమ పుత్రోఽయం బాణ శ్శంకర కింకరః, ఆరాచ్ఛరక్షితః సోఽపి తేనైవ భక్తబంధునా. ౩. పరిపుష్టశ్చ పార్వత్యా యథా మాత్రా సుత స్తథా, గృహీతవాంశ్చ సత్కన్యాం బలేన యువతీం సతీమ్. ౪. సముద్య

మహాదేవా! పరమేశ్వరా! జగన్నాథా! నన్నేల నుతించెదవు? నేను నీకు సదా భృత్యుండను గదా. పరమ దుర్లభైశ్వర్యము నీవే నాకుఁ బ్రసాదించితివి. ఇప్పుడు నీవే నన్ను నన్నిలోకములకుం గ్రిందనుండు సుతలమున నునిచితివి. భక్తకల్పద్రుమా! నావలన నింద్రునకైశ్వర్యము నిప్పించితివి.

---

తశ్చ తం హంతుం శార్తికేనాఽపి వారితః, ఆగతోఽసి పునర్హంతుం పాత్రస్య దమనేచ్ఛయా. ౫. సర్వాత్మనశ్చ సర్వత్ర సమభావ శ్రుతౌ శ్రుతః, కరోషి జగతాం నాథ కథమేవం వ్యతిక్రమః. ౬. త్వయా చ నిహతో మోహీ తస్య కో రక్షితా భువి, సుదర్శనస్య తేజో హి సూర్యకోటి నిభం పరమ్. ౭. కేషాం సురాణామస్త్రేణ తదేవ మనివారితం, యథా సుద ర్శనం చైవ మస్త్రాణాం ప్రవరం వరమ్. ౮. తథా భవాంశ్చ దేవానాం సర్వేషామీశ్వరః పరః, యథా భవాం స్తథా కృష్ణో విధాతా వేధసామపి. ౯. విష్ణుస్సత్వగుణాధార శ్శివస్సత్వా శ్రయస్తథా, స్వయం విధాతా రజస స్సృష్టికర్తా పితామహః. ౧౦. కాలాగ్ని రుద్రో భగవాన్ విశ్వసంహార కారకః, తమసశ్చా శ్రయస్యాఽపి రుద్రాణాం ప్రవరో మహాన్. ౧౧. సఏవ శంకరాం శశ్చాప్యన్యే రుద్రాశ్చ తత్కలాః, భవాంశ్చ నిర్గుణస్తేషాం ప్రకృతేశ్చ పరస్తథా. ౧౨. సర్వేషాం పరమాత్మా వై ప్రాణా విష్ణుస్వరూ పిణః, మానసం చ స్వయం బ్రహ్మా స్వయం జ్ఞానాత్మక శ్శివః. ౧౩. ప్రవ రా సర్వశక్తీనాం బుద్ధిః ప్రకృతి రీశ్వరీ, స్వాత్మనః ప్రతిబింబస్తే జీవ స్సర్వేషు దేహిషు. ౧౪. జీవ స్స్వకర్మణాం భోగీ స్వయం సాక్షీ భవాం స్తథా, సర్వేయాంతి త్వయిగతే నరదేవేయథానుగః. ౧౫. సద్యః పతతి దేహశ్చ శవోఽస్పృశ్య స్త్వయా వినా, బుద్ధా స్సంతో నజానంతి వంచితా స్తవ మాయయా. ౧౬. త్వాం భజంత్యేవ యే సంతో మాయా మేతాం తరంతితే, త్రిగుణా ప్రకృతి ర్దుర్గా వైష్ణవీచ సనాతనీ. ౧౭.

వామనరూపమున నీవేకదా నావలనఁ గైకొని యింద్రుని కిచ్చితివి. సర్వరూపధరుఁడవు. నీవే బాణాసురునకు నుపదేశింపుము. వీఁడు నాకుమారుఁడు. ప్రాణములకంటె నెక్కుడు మక్కువతోఁ బోషించితిని. ఆత్మతో సంగర మొనరించుట సర్వదా విగర్హితము. అని పలికి శిరస్సువంచి శంకరునకు

---

పరా నారాయణీశానీ తవమాయా దురత్యయా, త్వదంశాః ప్రతి విశ్వేషు బ్రహ్మవిష్ణుశివాత్మకాః. ౧౮. సర్వేషామపి విశ్వేషా మాశ్రయో యోమహాన్ విరాట్, సశేతేచ జలేయోగా ద్విశ్వేశో గోకులే యథా. ౧౯. సఏవ బాణస్త్వం భగవా న్తస్యదేవో భవాన్ పరః, వాసుదేవ ఇతి ఖ్యాతః పురావిద్భిః ప్రకీర్తితః. ౨౦. త్వమేవ కలయా సూర్య స్త్వమేవ కలయా శశీ, కలయాచ హుతాశశ్చ కలయా పవనస్స్వయమ్. ౨౧. కలయా వరుణశ్చైవ కుబేరశ్చయమస్తథా, కలయా త్వం మహేంద్రశ్చ కలయా ధర్మ ఏవచ, ౨౨. త్వమేవ కలయా శేష ఈశానో నైరృతి స్తథా, మునయో మనవశ్చైవ గ్రహాశ్చ ఫలదాయకాః. ౨౩. కలాకలాంశయా శ్చాంశేన సర్వే జీవా శ్చరాచరాః, త్వం బ్రహ్మపరమంజ్యోతి ర్ధ్యాయంతే యోగినస్సదా. ౨౪. తం త్వాద్రియంతే భక్తాస్తే ధ్యాయంతేచ తపంతరే, నవీననీరదశ్యామం పీతకౌశేయ వాససమ్. ౨౫. ఈషద్ధాస్య ప్రసన్నాస్యం భక్తేశం భక్తవత్సలం, చందనోక్షిత సర్వాంగం ద్విభుజం మురళీధరమ్. ౨౬. మయూరపింఛచూడం చ మాలతీ మాల్య భూషితం, అమూల్యరత్న నిర్మాణ కేయూర వలయాన్వితమ్. ౨౭. మణి కుండల యుగ్మేన గండస్థల విరాజితం, రత్నసారాంగుళీయంచ క్వణన్మంజీర రంజితమ్. ౨౮. కోటికందర్ప లీలాభం శరత్కమలలోచనం, శరత్పార్వణేందు నిందాస్యం చంద్రకోటి సమప్రభమ్. ౨౯. వీక్షితం సస్మితాభిశ్చ గోపీనాం కోటికోటిభిః, వయస్యైః పార్షదైర్గోపై స్సేవితం శ్వేతచామరైః.

నమస్కరించెను. సామవేద ప్రతిపాదిత స్తోత్రమున శంకరు వినుతించెను. అత్తరి నాబలి తనువు పులకాంకితముగ నుండెను. ఆనందబాష్పములు నిరంతరధారలుగాఁ బ్రవహించు చుండెను. హృత్పద్మమున శంకరు ధ్యానించుచు శుక్రుఁ డుపదేశించిన యేకాదశాక్షర శివమంత్రమును జపించెను. అంత శ్రీకృష్ణుని ధ్యానించి యిట్లు వినుతింపసాగెను. భగవంతుఁ డా తని ధ్యానమునకు మెచ్చి సాక్షాత్కరించెను. భగవంతుని జక్కఁగఁ జూచి తత్పాదారవిందములు శరణములని భావించి బహుభంగుల స్వానుభవపురస్సరముగా వేదాంతార్థము కనఁ బడునట్లు నుతించెను. ఉపనిషత్తులుకూడ వినుతింపఁజాలని నిన్ను నెవరు వినుతింపఁగలరు ; నాకైశ్వర్యమును బ్రసాదించితివి. దాని నింద్రున కిప్పింపఁదలంచి వామనరూపమున నన్నా

---

౩౦. గోపబాలక వేషంచ రాధావక్షస్థలేస్థితం, ధ్యానాసాధ్యం దురారాధ్యం బ్రహ్మేశ శేషవందితమ్. ౩౧. సిద్ధేంద్రైశ్చ మునీంద్రైశ్చ యోగీంద్రైః ప్రణతం స్తుతం, వేదా నిర్వచనీయంచ పరం స్వేచ్ఛామయం విభుమ్. ౩౨. స్థూలస్థూలతమం రూపం సూక్ష్మసూక్ష్మతరం పరం, సత్యం నిత్యం ప్రశస్తంచ ప్రకృతేః పరమీశ్వరమ్. ౩౩. నిర్లిప్తంచ నిరీహంచ భగవంతం సనాతనం. ఏవంధ్యాత్వాచ తేపూతాః స్నిగ్ధ దూర్వాక్షతా జలమ్. ౩౪. పద్మా పద్మార్చితే పాద పద్మేచ దాతుముత్సుకాః, వేదాస్తోతు మశక్తాస్త్వా మశక్తాసా సరస్వతీ. ౩౫. శేషస్తోతు మశక్తశ్చ స్వయంభూ శ్శంభురీశ్వరం, గణేశశ్చది నేశశ్చ మహేంద్రశ్చంద్రఏవచ. ౩౬. స్తోతుంనాలంధ నేశశ్చ కిమన్యే జడబుద్ధయః, గుణాతీత మనీహంచ కింస్తౌమి నిర్గుణంపరమ్. ౩౭. అపండితోయమసురో నసురః క్షంతుమర్హతి.

బలికృతాస్తుతిస్సమాప్తా.

శ్రయించిన చందమునఁ గైకొని యిచ్చితివి. స్వర్గమున నుంచిన నీవే నన్ను రసాతలమునకుం బంపితివి. నీమహిమ యమేయము. ఈనాపుత్త్రుఁడు బాలుఁడు మూర్ఖుఁడు. నీశక్తి నెఱుంగఁడు. ఆకారణమున వీనిం గాపాడుమా! యని యనేక భంగులం బ్రార్థించెను. ఆస్తుతికలరి శ్రీకృష్ణపరబ్రహ్మము బలిం గాంచి యిట్లు పలికెను.

వత్సా! బలిదానవేంద్రా! భయంపకుము. సుతలమున కరుగుము. నిన్నురక్షించు భారము నాయది. నావరానుగ్రహమున నీకుమారుఁడు జీవించును. కాని దర్పహాని నొనరించెదను. మూర్ఖుఁడు కావున దర్పమునఁ దన్ను నొరులనెఱుంగక యున్నవాఁడు. మున్ను తపస్వియు మద్భక్తాగ్రేసరుఁడు నగు ప్రహ్లాదునకు నీవంశసంభూతులం బొలియింపనని వర మిచ్చితిని. ఆవరమును గాపాడెదను. ప్రీతిమై నొసంగిన వరము సర్వదా కాపాడుచుందును. నీకుమారునకు దర్పహానిం గల్గించి మృత్యుంజయంబగు జ్ఞానము నొసంగెదను. సామవేదప్రతిపాదితమగు నీయీస్తోత్రము మున్ను సనత్కుమారుఁడు ప్రార్థింప బ్రహ్మ యుపదేశించెను. పుణ్యతమమగు సిద్ధాశ్రమమున సూర్యగ్రహణపుణ్యకాలమున నది యుపదేశింపఁబడియె. దానినే పార్వతీదేవి మందాకినీతీరమందు గౌతమున కనుగ్రహించెను. కరుణానీరధియగు శంకరుఁడు పాత్రుఁడగు శిష్యున కీస్తుతినే యుపదేశించెను. బ్రహ్మకు శివునకు నేనే గోలోకమున విరజానదీతీరమున నుపదేశించితిని. కుమారస్వామి దీనినే భృగుమహర్షి కెఱింగించెను. నీవీతరుణమునఁ గుమారుఁడగు బాణాసురున కుపదేశింపుము. అతఁ డీస్తుతిచే నన్ను వినుతించుం

గాక. ఈస్తుతిని మహాపుణ్యమునొసంగఁజాలునది యని తలంచి గురువును బూజించి యుపదేశమును గొని సుస్నాతుఁడై పఠించువానికి విశేషించి పూజాకాలమున జపించువానికి సకల పాపములు నశించుటయు ముక్తి కరతలామలక మగుటయుఁ గల్గును. ఆపదలు నశించును. సర్వసంపదలు లభించును. దుఃఖ శోకము లడంగును. భయంకర సంసారసాగరము దాఁట నను వుపడును. గర్భవాసశ్రమము కలుగదు. జరామృత్యుభయ ములు తొలఁగును. బంధనములు రోగములు గలుగవు. భక్తి వృద్ధియగును. దీక్షించు నాతఁడు సర్వతీర్థముల స్నానము చేసినవాఁడును, సర్వయజ్ఞముల నొనరించినవాఁడు నగు. సర్వ వ్రతములు సర్వవిధతపస్సులు చేసినవాఁడగు. సర్వదానఫల ములం బొందుననుట సత్యము. సామాన్యస్తుతులు లక్షవార ములు పఠించినఫలము గలుగును. సిద్ధస్తోత్రమయ్యాది యగు నేని సర్వసిద్ధులుగలుగును. ఈలోకమున దేవతుల్యుఁడగు. అంతమున హరిలోకము నొందు. అనిపలికి శ్రీహరి యదృశ్యుఁ డయ్యెను.

## బాణాసురుఁడు శ్రీకృష్ణునితో యుద్ధము చేయుట.

*శ్రీకృష్ణమూర్తి సకలసేనాసమేతుఁడై వచ్చి శోణ పురము నావరించి సేనలు నిలుచునట్టు లొనర్చి బలదేవు నుద్ధ

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండమున నూటయిరువదవయధ్యాయము నుండి గ్రహింపఁబడినదని యెఱుంగవలయు. శ్రీభాగవతము, హరివంశము, బ్రహ్మవిష్ణు పురాణములనుండియు నీకథను గైకొని వ్రాసెదను. విశేషముల మాత్రమే వానినుండి గ్రహింతును. సామాన్యకథను బ్రహ్మవైవర్తము నను సరించియే వ్రాసెదను.

పునిజేరి యాలోచించి శంకరుచెంతకు దూతను బంపెను. ఆదూత శంకరుఁడు పార్వతి గణపతి కుమారస్వామి దుర్గాంబయు నున్నయెడకుం బోయి నమస్కరించి యందుంగలవారలకు నుచితరీతి మర్యాదలు జరపి యిట్లు పలికెను. శంకరా! శ్రీకృష్ణమూర్తి యుద్ధమునకు బాణాసురునిం బిలుచుచున్నవాఁడు. యుద్ధము చేయఁబూనని చో నుషాకన్యకనిచ్చి యనిరుద్ధుని బిలుచుకొని వచ్చి శరణుచొరవలయు. యుద్ధమునకుం బిలువంబడి భయంపడి యెవఁడు రాకుండునో వాఁడు నరకమునంబడును. తత్పితరులు నరకభాగు లగుదురు. అని దూత పలుకఁగా నాలకించి తత్కాలోచితముగాఁ బార్వతీదేవి శంకరుసాన్నిధ్యమున నిట్లుపలికెను. బాణాసురా! త్వరగ నీకొమరితయగు నుషను యౌతకపదార్థములను గొనిపోయి శ్రీకృష్ణుని శరణుచొచ్చుము. సర్వేశ్వరుఁడనియు, బీజభూతుఁడనియు, సర్వసంపత్ప్రదాతయనియు శ్రీహరిని నమ్ముము. కరుణాళువు, భక్తులయందు విశేషించి వాత్సల్యము గలవాఁడు. శరణాగతరక్షకుఁడు. వరేణ్యుఁడు నగు పరమేశ్వరుని భజింపుము. అని యిట్లు పార్వతియుపదేశింపఁగా నందున్న దేవతలందఱు బాగు బాగని యాదేవిం బ్రశంసించిరి. ఆమాటలకు వారివినుతులకు గడుంగోపించి బాణాసురుఁడు రభసమున లేచి ధనుష్పాణియై యుద్ధసన్నద్ధుఁడై శంకరునకు నమస్కరించి యెల్లవారు వలదువలదని వారించుచున్నను లెక్కపెట్టక రక్తలోచనుఁడై తనువు కంపించుచుండఁగాఁ బ్రయాణముచేసెను. రాక్షసవీరులెల్లరు నాతని ననుసరించిరి. కుంభాండుఁడు కూపకర్ణుఁడు కుంభనికుంభులు నను సేనాధీశ్వరులు తమతమబలములం గూడి యని

కినడచిరి, ఉన్మత్తభైరవ, సంహారభైరవులు, నసితాంగభైరవ, రురుభైరవ, మహాభైరవ,కాలభైరవ, ప్రచండభైరవ, క్రోధభైరవులను నెనమండ్రు భైరవులు తమతమవాహినులం గదలించుకొని యుద్ధమునకు నడచిరి. కాలాగ్నిరుద్రుఁడనుగణాధీశుఁడు తనరుద్రసైనికులతోఁ బోయెను. ఉగ్రచండయుఁ బ్రచండయుఁ జండికయుఁ జండనాయికయుఁ జండేశ్వరియుఁ జాముండయుఁ జండయుఁ జండకపాలికయు నను నీయెనమండ్రు చండికలును భయంకరాయుధములందాల్చి సంగరమునకరిగిరి. శోణితనగరాధిదేవతయగు కోటిరీదేవి రత్నయానము నెక్కి వెడలెను. వదనపంకజము వికసింపఁగా ఖడ్గఖర్పరాయుధములందాల్చి యాకోటరీదేవి యరుగుటచ్చెరువు గల్గించెను. చంద్రాణియు వైష్ణవియు శాంతియగు బ్రహ్మాణియు బ్రహ్మవాదినియుఁ గౌమారియు నారసింహియు వారాహియు మాహేశ్వరియు ననునీయెనమండ్రు శక్తులును రథముల నధివసించి పయనము సాగించిరి. భద్రకాళి దివ్యరత్నయానము నెక్కి వెడలెను. రక్తవర్ణయుఁ ద్రినేత్రయుఁ జిహ్వాలలనభీషణయు నై శూలశక్తిగదాఖడ్గఖర్పరములను బూని యాభద్రకాళి సమరమునకరుగుటఁజే ముల్లోకములనుండువారెల్ల భీతిల్లిరి. మహేశ్వరుఁడు వృషభాధిరోహుఁడై శూలాయుధమును దాల్చి పయనము చేసెను. నెమిలినెక్కి కుమారస్వామియు శస్త్రధనుర్బాణములందాల్చి నడచెను. గణపతియుఁ బార్వతియుఁ దప్పఁదక్కంగలవారెల్ల బాణాసురసహాయము చేయ వేడ్కనరిగిరి.

శ్రీహరియు నీశ్వరుని భద్రకాళికను బరికించి యథోచితముగా సంభాషించెను. బాణాసురుఁడు శంఖంబొత్తి శంకరు

నకుఁ బ్రదక్షిణమాచరించి దివ్యాస్త్రమునుగూర్చిన ధనుస్సును బూని యనికినడువఁగా నెల్లవారు వలదన్నను సాత్యకి తన యాటోపమేపార నాతనిమార్గంబున వెడలెను. సాత్యకి తనపై కరుదెంచుటంగని మహాక్రోధంబున బాణాసురుఁడు గ్రీష్మా దిత్యప్రభాభాసమానంబై యెందును వ్యర్థముకాక వెలయు నంజనాస్త్రము నాసాత్యకిపైఁ బ్రయోగించెను. దానింగని సాత్య కినమస్కరించెను. దాన నాయస్త్రమాతనిం గాల్పక యాకాశ మునందే యదృశ్య మయ్యెను. బాణుఁ డాగ్రహించి యాగ్నే యాస్త్రమును బ్రయోగించెను. వారుణాస్త్రమున సాత్యకి దానినడంచెను. బాణుఁడు వాయుదేవతాకంబగు నస్త్రంబును వైచెను. సాత్యకి పర్వతాస్త్రమున దానిని మరలించెను. అంత నాయసురనాయకుఁ డాసాత్యకిం జురచురంగాంచి నారాయణా స్త్రమును వైవఁగా నర్జునుఁ డుపదేశించియున్నయట్లే భూమి యందు దండాకారమునఁ బ్రణమిల్లెను. దాన నది మరలెను. శస్త్రవిద్యాధుర్యుఁడగు బాణుఁడు మాహేశ్వరమను నస్త్రవర్యముం గాని సమంత్రకముగా బ్రయోగింప సాత్యకి వైష్ణవాస్త్రమున దాని భంజించెను. అంత నిసున బాణాసురుఁడు బ్రహ్మాస్త్రమును బరఁగింప దాన నాసాత్యకి క్షణమాత్రము మూర్ఛిల్లి లేచెను గాని యతని నాయస్త్రము చంపఁజాలకపోయెను. రణవిశార దుఁడగు బాణుఁడు నాగాస్త్రమును వైవఁగా గారుడాస్త్రమున శైనేయుఁడు దానినడంచెను. అంత శంకరుఁడొసఁగిన మహాశూ లమును వైవఁగా సాత్యకి దుర్గాస్తోత్రముచేయ నది కంఠమునఁ బూలహారమయ్యెను. అయ్యది చూచి బాణుఁడు పాశుపతాస్త్ర మును ధనుస్సునంగూర్పఁగా నాబాణముతోడనే యతఁడు స్తం

భించునట్లు సాత్యకి యొనరించెను. అట్లొనరించునది జృంభకాస్త్రము. ఆయస్త్రమున నసురుఁడు స్తంభీభూతుఁడగుటం దిలకించి యర్ధచంద్రబాణమున స్కందుఁ డాయస్త్రమునుచ్ఛేదించెను. ఆయర్ధచంద్రబాణమును గాముఁడు పొడిచేసెను. కోపించి కుమారస్వామి గదను బ్రయోగింప నా కాముఁడు వైష్ణవాస్త్రమున దానిం జెండెను. త్వరపడి గుహుఁడునారాయణాస్త్రమును వైవ బ్రద్యుమ్నుఁడు భూతలంబునం బడి నమస్కరించు దాని మరలించెను. అగ్నికుమారుఁడు శక్తి వైవ దానిం బ్రద్యుమ్నుఁడు నారాయణాస్త్రమున నడంచెను. శరవణభవుఁడు బ్రహ్మాస్త్రమును బఱఁగింప దాననే దానిమాన్చెను. ఆగ్రహమున దేవసేనాపతి పాశుపతమును గైకొన నదియెఱింగి ప్రద్యుమ్నుఁడు నిద్రాస్త్రమున నాతని నిద్రాపరవశుం జేసెను.

బాణాసురుని స్తంభించుటయుఁ గుమారు నిద్రాపరవశునిగాఁ జేయుటయు నెఱింగి భద్రకాళిక కోపమునఁ గాము నిమ్రింగి కార్తికేయుని బాణుని దీసికొని పార్వతిచెంతకుం బోవఁ దద్దర్శనమాత్రమున నిరువురు లేచిరి. కాముఁ డామె నాసారంధ్రమునుండి వెడలి పరుగిడి రణభూమిం జేరెను. కాముని రాక నెఱింగి యాదవులందఱు నవ్విరి. శంకరకింకరు లీయద్భుతముం గాంచి భీతిల్లిరి. బాణుఁడు రథమెక్కి మహాకోపమునఁ గార్తికేయుంగూడి యరుదెంచెను. బలదేవునిమూర్కొని బాణపంచకమున నొప్పింప నతఁ డర్ధచంద్రబాణముల వానినిఖండించెను. బలదేవునరదమును బాణదానవుఁడు పొడిచేయ లాంగలాయుధమును గేలఁబూని బలరాముఁడు వాని రథమును జూర్ణముగానొనరించి యతనిచ్ఛేదించుట కుపక్రమింప

భగవంతుఁడగు కాలాగ్నిరుద్రుఁడతని వారించి మార్కొని
యెను. ఆతనిరథమును ముసలమున రాముఁడు పొడిచేయఁగాఁ
గాలాగ్నిరుద్రుఁ డాగ్రహించి యుల్బణజ్వరమును బలదేవు
నిపైఁబరఁగించెను. హరి తప్పఁ దక్కినయాదవులు బలరా
ముఁడు నాజ్వరమున బాధితులైరి. శ్రీహరి యాజ్వరము
నడంప వైష్ణవజ్వరమును బ్రయోగించెను. ఆజ్వరములకు
రెండింటికి మహాత్తరసంగ్రామము సాగెను. శైవజ్వరము వైష్ణవ
జ్వరమునకు నోడిపోయి శ్రీహరి నిట్లు వినుతించెను.

జగన్నాయకా! నాప్రాణములను గాపాడుమా! భక్తా
నుగ్రహావిగ్రహా! నన్నురక్షింపుము. సర్వజంతువులకు నీవా
త్మవు. పరిపూర్ణుఁడవు. సర్వగతుండవు. నీశరణుచొచ్చితిని.
అని శైవజ్వరము ప్రార్థింపఁగా నాశ్రీహరి వైష్ణవజ్వరము నుపసం
హరించెను. శివజ్వరము ప్రాణభీతింబరుగిడెను. అత్తరి బాణాసు
రుం డరుదెంచి కృష్ణమూర్తిని మార్కొని వేయిబాణముల
నొప్పించెను. అవన్నియు మంత్రపూతములు. అర్జునుండవ్వానిని
హరితనువు సోఁకకముందే లీలచే ఛేదించెను. విజయునిపై
శక్తిం బ్రయోగింప నతఁ డద్దాని నవ్వుచు భంజించెను. పాశు
పతమువైవఁగా నది జగత్సంహారకారకంబు గావున శ్రీకృ
ష్ణుఁడు చక్రమును బ్రయోగించెను. ఆచక్ర మాపాశుపత
మును మరలించి యాతని సహస్రబాహువులను ఛేదించెను.
వాఁడు ధరిఁబడెను. పాశుపతము హరునికరంబు నలంకరిం
చెను. బాణాసురుఁడు రక్తసిక్తాంగుఁడై ధర వ్రాలఁగా
హాహాకారములు చెలరేఁగెను. అత్తఱి మహాదేవుఁడు సాక్షా
త్కరించి బాణాసురుని నెదనిడుకొని విలపించెను. శివాస్త్ర

పతనమున నచ్చోట సరోవర మొండుకల్గెను. కరుణాసాగరుఁడగు శంకరుఁ డాబాణుని నేదదీర్చి జనార్దనునిచెంత కాతనిం దీసికొనిపోయెను. శంకరుఁ డాచక్రపాణిని బెక్కుభంగుల వినుతించెను. వేదోక్తస్తుతిచే హరిం బొగడఁగా బాణాసురుఁడు భక్తిచే నాశ్రీకృష్ణుని వినుతించెను. రత్నభూషణభూషితాంగియగు కన్యక నుషను దీసికొనివచ్చి యచ్చటనే హరిపాదసన్నిధి నర్పించెను. దాసీదాసనికరగజాశ్వస్యందనరత్నముల నొసంగెను. శంకరాజ్ఞచే బాణుఁడు తనశక్తికిం దగినట్లు యౌతకము నర్పించెను. తన యపరాధమును సైఁపుమని విలపించుచు నశ్రుజలంబుల హరిపాదారవిందముల నభిషేకించెను. శ్రీహరి యతనియెడం బ్రసన్నుండై బాణాసురునకు వరమొసంగెను. శంకరానుమతినొంది ద్వారకకుంజని కన్యను ననిరుద్ధునిభార్యలకుఁజూపి వారిదుఃఖము నివారించెను. ద్వారకానగరమున మహోత్సవములు సాగెను.

ఈకథ భాగవతమున నించుకభేదముగ నిట్లుకలదు. బాణాసురుఁడు కన్యకాంతఃపురమున నున్న యనిరుద్ధునిఁగట్టివైచి కారాగారమున నునుపఁగా నాలుగుమాసములు గడచిన పిమ్మట నారదుఁడు పోయి శ్రీహరికిం దెల్పెననియుఁ దాను సర్వ మెఱింగియు నెఱుఁగనట్లున్న హరి యామాటలువిని సైన్యములతో శోణపురముపై నెత్తి చని బాణాసురునితో యుద్ధము జేసి శివుఁ డొనరించినస్తుతిచే బాణాసురుని జంపక బాహుసహస్రములు ఖండించి వదలెననియు ననిరుద్ధులం దోడుకొని ద్వారక కరిగెననియు దానిసారము. విష్ణుబ్రహ్మపురాణములయందుం దించుక భేదముగా నిట్లేకలదు. హరివంశము ననుస

రించి యీకథ తొలుత వ్రాసితిని గాన దాని యనుబంధముగా నిందు వ్రాసెదను భేదముః విశేషముగలదు.

*ఇపుడు బాణాసురుఁడనిరుద్ధునోడింపఁజాలక మాయా యుద్ధముచేయుంబూని నాగపాశములబంధించెనని తలంచి తరు వాతికథను బఠింపుఁడు. అనిరుద్ధుఁడు తన్ను బాకన్యకచూచు చుండ బాణాసురుఁడు నాగపాశములబంధించి కారాగారమున నునుపఁగా నేమిచుంద్రోఁపకయుండి యొక్కతిరి శోణపురాధి దేవతయగు కోటవతీదేవినిగూర్చి యిట్లు వినుతించెను. తొలుత నతఁడు శ్రీహరిని ధ్యానించెను. పిదపఁ బార్వతిందలంచెను. ఆమీఁద భక్తిభారమున జేతులొగ్గి కోటవతి నిట్లుపొగడెను.

† జగజ్జననీ! నిన్నాశ్రయించినవారు కష్టములపాలుగారు. వేద ము లుపనిషత్తులు శాస్త్రములు నిన్నుఁబొగడుచున్నవి. నీమహిమ

---

* ఇది హరివంశాంతర్గత విష్ణుపర్వమునందు నూటయిరువదవయధ్యా యమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగవలయును.

## అనిరుద్ధకృత దేవీస్తుతిః.

†. శ్లో. మహేంద్రవిష్ణుభగినీం నమస్యామిహితాయవై, మనసాభావ శుద్ధేన శుచిస్స్నేష్యకృతాంజలిః.౧. గౌతమీం కంసభయదాం యశోదానంద వర్ధనీం, మేఘ్యాంగోకులసంభూతాం నందగోపస్యనందినీమ్. ౨. ప్రజ్ఞాం దక్షాం శివాం సౌమ్యాం వసుపుత్ర విమర్దినీం, తాం దేవీం సర్వదేవస్థాం సర్వభూత నమస్కృతామ్. ౩. పర్ణినీం పూరణీం మాయాం వహ్ని సూర్యశశిప్రభాం, శాంతిం ధ్రువాంచ జననీం మోహినీం శోషణీం తథా. ౪. సౌమ్యాం దేవై స్సర్షి గణైః సర్వదేవనమస్కృతాం, కాళీంకాత్యాయనీం దేవీం భయదాం భయనా శనీమ్. ౫. కాళరాత్రిం కామగమాం త్రినేత్రాం బ్రహ్మచారిణీం, సౌదామినీం మేఘరవాం బేతాళీం విపులాననాం. ౬. యూథస్యాద్యాంమహాభాగాం

మపారము. సకలకష్టములు తొలఁగించుటకు నీకే శక్తికలదు. నాకీయిక్కట్టును దొలఁగింపుము. సకలరాక్షసులను బొలియిం

---

శకునీం రేవతీంతథా, తిథీనాం పంచమీం షష్ఠీం పూర్ణమాసీం చతుర్దశీం. ౭. సప్తవింశతిఋక్షాణి నద్యస్సర్వాదిశోదశ, నగరోపవనోద్యానద్వారాట్టాలకవాసినీం. ౮. హ్రీం శ్రీం గంగాంచ గంధర్వాం యోగినీం యోగదాం సతాం, కీర్తిమాశాందిశంస్పర్శాం నమస్యామి సరస్వతీం. ౯. వేదానాంమాతరంచైవ సావిత్రీంభక్తవత్సలాం, తపస్వినీం శాంతికరీమేకానంశాంసనాతనీం. ౧౦. కాటీర్యాంమదనాంచండామిలాం మలయవాసినీం, భూతధాత్రీం భయకరీం కూశ్మాండీంకసుమప్రియాం. ౧౧. దారుణీంమదిరావాసాం వింధ్యకైలాసవావాసినీం, వరాంగనాంసింహరథీం బహురూపాం వృషధ్వజాం. ౧౨. దుర్గభాందుర్జయాందుర్గాం నిశుంభభయదర్శినీం, సురప్రియాంసురాందేవీం వజ్రపాణ్యాయుజాం శివాం. ౧౩. కిరాతీంచీరవసనాం చోరసేనానమస్క్రియాం, ఆజ్యపాంసోమపాంసౌమ్యాం సర్వపర్వతవాసినీం. ౧౪. నిశుంభశుంభమథనీం గజసుంభోపమస్తనీం, జననీం సిద్ధసేనస్యసిద్ధచారణసేవితాం. ౧౫. చరాం కుమారప్రభవాం పార్వతీం పర్వతాత్మజాం, పంచాశద్దేవకన్యానాం పతోష్వ దేవ గణస్యచ. ౧౬. కద్రుపుత్రసహస్రస్య పుత్రపౌత్రవరస్త్రియః, మాతా పితాజగన్మాన్యాదేవిదేవాప్సరోగణైః. ౧౭. ఋషిపత్నీగణానాంచ యక్షగంధర్వయోషితాం, విద్యాధరాణాంనారీషు సాధ్వీషుమనుజాసుచ. ౧౮. ఏవమేతాసునారీషు సర్వభూతాశ్రయాహ్యసి, నమస్కృతాసి త్రైలోక్యే కిన్నరోద్గీతసేవితే. ౧౯. అచింత్యాహ్యప్రమేయాసి యాసిసాసినమోస్తుతే, ఏభిర్నామభిరన్యైశ్చ కీర్తితాహ్యసిగౌతమి. ౨౦. త్వత్ప్రసాదాదవిఘ్నేన క్షిప్రంముచ్యేయ బంధనాత్,అవేక్షస్వ విశాలాక్షి పాదౌతే శరణంవ్రజే. ౨౧. సర్వేషా మేవ బంధానాం మోక్షణం కర్తుమర్హసి, బ్రహ్మవిష్ణుశ్చ రుద్రశ్చ చంద్రసూర్యాగ్నిమారుతాః. ౨౨. అశ్వినౌ వసవశ్చైవ ధాతాభూమిర్దిశో

చితివి. సకలామరులకు సహాయము నొనర్చితివి. నాకీబంధవిముక్తి ననుగ్రహింపుమని యనిరుద్ధుఁడు ప్రార్థింపఁగా దుర్గతినాశని యగు నాదుర్గాంబిక సాన్నిధ్యమును గల్పించెను. శరణాగత వత్సలయగు నాయంబిక కారాగారముననే పొడసూపి బంధ విముక్తింగావించెను. ఆవీరుని నూఱడించెను. అనిరుద్ధుఁడా దేవినారాధించి వినుతించెను. ప్రసాదభాసురముఖియై యుషా కన్యాహృతచేతసుఁడగు నాయనిరుద్ధునకు నాగపాశములను గరాగ్రమునఁ ద్రెంచి వరమనుగ్రహించెను. దయమెయినిట్లు పలికెను. అనిరుద్ధా! చక్రపాణి నీపితామహుఁడరుదెంచి యీ బాణాసురుని సహస్రబాహువులను ఛేదించి నిన్నుఁజెఱనుండి వదలించికొనిపోవఁగలఁడు. ఇంచుకకాలము నోర్చుకొనియుం డుము. అనియానతీయఁగా నాలకించి యనిరుద్ధుఁడు మఱలఁ

---

దశ, మరుతా సహ పర్జన్యో ధాతాభూమిర్దిశోదశ. ౨౩. గావోనక్షత్రవంశా శ్చ గ్రహానద్యో హ్రదాస్తథా, సరితస్సాగరాశ్చైవ నానావిద్యాధరోరగాః. ౨౪. తథా నాగాస్సుపర్వాణో గంధర్వాప్సరసాంగణాః, కృత్స్నం జగదిదం ప్రోక్తం దేవ్యానామానుకీర్తనాత్. ౨౫. దేవ్యాస్తవమిదంపుణ్యం యఃపఠే త్సుసమాహితః, సాతస్మైసప్తమేమాసి వరమగ్ర్యం ప్రయచ్ఛతి. ౨౬. అష్టా దశభుజాదేవీ దివ్యాభరణభూషితా, హారశోభితసర్వాంగీ ముకుటోజ్జ్వల భూషణా. ౨౭. కాత్యాయనీ స్తూయసేత్వం వరమగ్ర్యం ప్రయచ్ఛసి,అత స్తలీమితాందేవీం వరదే వామలోచనే. ౨౮. నమోఽస్తుతే మహాదేవి సుప్రీ తామేసదా భవ, ప్రయచ్ఛ త్వం వరం హ్యాయుః పుష్టిం చైవ క్షమాం ధృతిం. ౨౯. బంధనస్థో విముచ్యేయం సత్యమేతద్భవేదితి.

దేవీస్తుతిస్సమాప్తా.

గేలు మోడ్చి పెక్కుభంగుల నుతించెను. *ఈ కారాగారము నుండి నన్ను ముక్తినిగావింపుమా యని ప్రార్థించెను.

## నారదుఁడు హరికి బాణునివృత్తాంతముఁ జెప్పుట.

† ఇట్లుశోణపురంబున కారాగారమున ననిరుద్ధుఁడు దుఃఖించుచుండెను. అతఃపురమున నుషాకన్యకయు దుఃఖార్ణవ నిమగ్నయగుచుండెను. ఇట్లిక్కడనుండఁగా ద్వారకానగర మున వార్తలెట్లున్నవని యించుక విచారించుట న్యాయము. ద్వారకానగరమునఁ దటాలున ననిరుద్ధుఁడు కానరాకపోఁగా నందున్నస్త్రీలందఱు నొక్కపెట్టున విలపించిరి. ఆతనిపత్నులు తమనాథుఁడున్నట్టుండి శయనమందుఁ గాన రాకపోఁగా

---

అనిరుద్ధకృత ద్వితీయదేవీస్తుతిః.

*నమోఽస్తు తే దేవి వరప్రదే శివే నమో ऽస్తు తే దేవి సురారినాశని, నమోఽస్తుతే కామచరే సదాశివే నమోస్తుఽతేసర్వహితైషిణి ప్రియే. ౧. నమోస్తుతే భయకరి విద్విషాంసదా నమోఽస్తుతే బంధనమోక్షకారిణి, బ్రహ్మాణీంద్రాణి రుద్రాణి భూతభవ్యభవే శివే, త్రాహి మాం సర్వభీతిభ్యో నారాయణి నమోఽస్తుతే. ౨. నమోఽస్తుతే జగన్నాథే ప్రియేదాంతే మహావ్రతే, భక్తిప్రియే జగన్మాతః శైలపుత్రి వసుంధరే. 3. త్రాహి మాం త్వం విశాలాక్షి నారాయణి నమోఽస్తు తే, త్రాయస్వ సర్వదుఃఖేభ్యో దానవానాం భయంకరి. ४. రుద్రప్రియే మహాభాగే భక్తానామార్తినాశినీ, నమామి శిరసా దేవి బంధనస్థో విమోక్షితః. ౫. ఆర్యాస్తవమిదం పుణ్యం యఃపఠేత్సుసమాహితః, సర్వపాపవినిర్ముక్తో విష్ణులోకం స గచ్ఛతి, బంధనస్థో విముచ్యేతసత్యం వ్యాసవచో యథా. ఇతి.

† ఈకథ హరివంశాంతర్గత విష్ణుపర్వమునందు నూటయిరువదొక యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

నాఁడు జింకలవలె దుఃఖించిరి. నాథా! మనకు దిక్కుగా శ్రీహరి యుండ నిట్టికష్టము కలిగెనే. ఏల! మేము నాథులవలె దుఃఖించుచున్నవారము. జగన్నాథుఁడు సాయముండియు నిట్లగుటకుఁ గతమేమి? ఇంద్రాదిదేవతలే హరియాశ్రయమున సుఖముందురో యట్టిహరియాదృతి మాకేల కలుగలేదు? సర్వలోకాభయదునియింట నిట్టిభయము గలుగనేల? సర్వలోకశరణ్యునిపౌత్రుఁడు కదా యనిరుద్ధుఁడు. ఆతని నెవ్వరో కొనిపోయిరి. ఆదుర్గతికి శ్రీహరివలన భయము కలుగకయుండునా? శ్రీహరిని ద్వేషించువాఁడు మృత్యుదేవతాకరాళవక్త్రమునఁ జొరఁబూనినవాఁడే యగును. ఇంద్రుఁడైనను బ్రదుకఁజాలఁడన నిఁక నితరులమాట యిటఁ జెప్పనేటికి? అని యనేక భంగులఁ బలవించుచుఁ గన్నీరు మున్నీరుగాఁ బ్రవహింపఁ జేసిరి. వారి శోకధ్వనినాలకించి పురుషపుంగవులెల్ల నిదియేమని యరుదెంచిరి. అనిరుద్ధునింట నిట్టిశోకధ్వనిగాఁ గతంబేమని విచారించిరి. ఏమియుఁదోఁపక శ్రీహరింగాఁబోయి మహాత్మా! నీయాధారమున యాదవులందఱు దుఃఖవిముక్తులై సుఖంబున్నవారు. ఇపుడిట్టికష్టముగాఁ గతంబేమి? అని పెక్కుభంగులఁ బ్రార్థింపఁగా శ్రీహరియు నేమియు నెఱుంగనట్లు నిట్టూర్పులుపుచ్చి వారికెల్ల విచారము తొలఁగునట్లుగా నిట్లు పలికెను. అనిరుద్ధుని గొనిపోయినవారెవ్వరో యెఱుంగఁగలయను. మున్ను మనకధిపతియగు నాహుకుని శాల్వుఁడు గొనిపోయెఁగదా. మనము యుద్ధముచేసి మరల నాతనిందెచ్చితిమి కదా. నాకుమారుఁడు ప్రద్యుమ్నుఁడు శంబరాసురునిచే హరింపఁబడియె. వానివధించి యతఁడు మరలవచ్చెను. ఇప్పుడని

రుద్ధుఁ డెవరిచేతనో కొనిపోఁబడియెను. వాని సమిత్రపుత్ర బాంధవముగా సంహరించెదను.

అని శ్రీహరి పలుకఁగా సాత్యకి యిట్లు పలికెను. శ్రీకృష్ణా! అనిరుద్ధుఁ డున్నతావు తెలిసికొనివచ్చుటకు దూతల నంపవలయును. పర్వతకాననాదులం గూడ వెదకవలయును. అనఁగా సాత్యకింగాంచి హరి చారులెల్లయెడలకుం బోవ నాజ్ఞచేయుము. అనఁగానే యాసాత్యకియుఁ జారులం బిలువంబంచి వారికిఁ గార్యపద్ధతిం దెల్పి పంపెను. అంత సేనాపతియగు ననాధృష్టి కృష్ణునిం గాంచి భయపడుచు నిట్లు పలికెను. శ్రీకృష్ణా! నరకాసుర ప్రభృతులు మృతినొందిరి. రాక్షసులు గాని రాజులు గాని మనతో ద్వేషించు వారు లేరు. పారిజాత హరణమందు నీతో నింద్రుఁడు ద్వేషించి యోడిపోయెను. అతఁడే యనిరుద్ధుని గొనిపోయి యుండును. ఆ సమయమున శక్తిగలిగియు నాతని జంపక వదలితివి. ఇప్పుడైన నాతనిం బొలియించుట శ్రేయము. అనుటయు నామాటల నాలకించి నాగసర్పమువలె నిట్టూర్పులు పుచ్చి సేనాపతీ! దేవతలు నీచకార్యములొనరింపరు. కృతఘ్నులుగారు. మందులుగారు. గర్వముగలవారు కారు. బాలిశులు కారు. దేవకార్యార్థమే దానవుల జంపితిని గదా. ఇంకనట్టివారిని వధించెద. దేవకార్యముల నొనరింపఁ బాటుపడు చుండునాకు వారేల యపకార మొనరింతురు? తమపనికై నేను బాటుపడుట వారెఱుంగరా? దేవతలు క్షుద్రులు కారు. సత్యమందభిరుచి కలవారు భక్తులయందుఁ గృపగలవారు. వారివలన నించుకయుఁ గీడు కలుగదు. తెలియక యట్లంటివి. ఎవ్వతయో యొకదూతికచే ననిరుద్ధుఁడు

కొనిపోఁబడియుండును. అంతియ కాని దేవతలిట్టిపనిని జేయరు. అనునంత నక్రూరుఁడిట్లు పలికెను. ప్రభూ! ఇంద్రునికార్యము మనకార్యమే. మనకార్యమింద్రునికార్యమే. మనలను దేవతలు కాపాడుచున్నవారు. మనము వారికి సాయపడుచున్నారము. పరస్పరమీసంబంధము కలిగియున్నవారము. ఇంతియకాక * దేవకార్యార్థమే కదా మనము మనుజులముగాఁ బుట్టితిమి. అను నక్రూరువచనములను విని స్నిగ్ధగంభీరవాక్కుల శ్రీహరి యిట్లు పలికెను. దేవగంధర్వయక్షాదు లీపనిచేయరు. పుంశ్చలులగు మాయావిదగ్ధలు కావున మనయనిరుద్ధుని మోహనాకారమును గాంచి కొనిపోయియుందురు. అంతియకాని యితరులపని యెన్నటికిని గానేరదు.

ఇట్లు శ్రీహరి పలుకఁగా నాలకించి యాదవులందఱు చింతలమానిరి. దూతలాహుకప్రేషితులై యెల్లతావుల వెదుకఁబోయిరి. శక్తివంచనసేయక వెదకి వచ్చి గద్గదవాక్కుల నన్నితావుల వెదకితిమి. పరిశీలించితిమి. ఎందైనఁ గానరాఁడు. వేఱు ప్రయత్నము చేయుట మంచిది. మఱేయుపాయమునైనఁ దెలిపినఁ బోయి వెదకుదుము. అనిపలికి కన్నీరు ప్రవహించుచుండఁ దమకార్యము ఫలింపకపోవుటకు లజ్జించుచు నాచారులుండ ననిరుద్ధుఁడింకెట్లు దొరకునని గుసగుసలు కలుగసాగెను. ఒకరిమోముల నింకొకరు చూచుకొనసాగిరి. ఎట్లో యారాత్రి గడచెను. ప్రభాతమయ్యెను. మంగళతూర్యరావములు రాజమందిరములయందు మ్రోసెను. శ్రీహరి మేలు

* దేవతార్థం వయం చాపి మానుషత్వముపాగతాః. ౫౮. శ్లో.

కొనియెను. కాలోచితకృత్యములు తీర్చినంత నారదమహర్షి శ్రీకృష్ణదర్శనార్థమే తెంచెను. యాదవులందఱు శ్రీకృష్ణునిం గూడి మంతనము సలుపుచుండిరి. ఆసుసమయమున నారదుఁడు నవ్వుచు వచ్చెను. జయజయశబ్దముల నుచ్చరించుచు మాధవుని సమీపించెను. ఎల్లరును లేచి యెదురుగఁబోయి పూజించిరి. విశేషించి శ్రీహరి యాతనిం బూజించెను. యథాస్థాసనమునఁ గూరుచుండి నారదుఁడు తమతమ పీఠముల నలంకరించిన యాదవవీరులను శ్రీహరిని గాంచి యథాన్యాయముగ నిట్లు పలికెను.

మహాశయులారా! ఏల యిట్లుచింతాకులమానసులై మతిప్రభతొలఁగ నున్నవారు? ఏమియాలోచించుచున్నవారు! ఉత్సాహముతొలఁగినట్లు మీయునికి తెలుపుచున్నవి. క్లీబసమానులై యిటుకూరుచుండి యాలోచింపఁ గారణమేమి? అని యిట్లు నారదముని పలుకఁగా శ్రీహరి యిట్లు బదులుచెప్పెను. మహాముని! సువ్రతా! మాయనిరుద్ధు నెవరో రాత్రికాలమందుఁ దోడ్కొనిపోయిరి ఆతనికొఱకే యెయాలోచనలును బాలుపోవక యిట్లు చింతించుచున్నవారము. అనుటయు నారదుండు పక్కుననవ్వి మధుసూదనా! నాకతి ప్రియమగు నీవార్తను విన్నవించెద. అవధరింపుము. దేవాసుర సంగ్రామములు తగ్గిపోయినవి. బాణాసురానిరుద్ధులకు మహాసంగ్రామము చెల్లెను. బాణాసురుఁడు మిగులఁ బ్రతాపశాలి, ఆతనికొక్కకొమరిత గలదు ఆమెకొఱకు మనయనిరుద్ధునిఁ జిత్రలేఖయను నుషాప్రియసఖి యెత్తుకొని మాయాబలంబున శోణపురమును జేర్చెను. ఆవిధమెఱింగిన బాణునకు ననిరుద్ధు

నకు మహాసంగ్రామము చెల్లెను. బలివాసవులకువలె నాయుద్ధము సాగుచుండఁగా మేము సంతోషమున దానిఁగాంచితిమి. అందు బాణుఁ డనిరుద్ధునిసాహసమునకుభీతిల్లి మాయాసంగ్రామ మొనరించి నాగపాశములబంధించెను. అనిరుద్ధుంజంప నాజ్ఞాపించెను గాని మంత్రియగు కుంభాండుఁడు వారించెను. ఇపుడు నాగపాశబద్ధుఁడై కారాగారమున నున్నవాఁడు. లెండు లెండు యుద్ధమునకు సిద్ధముచేయుఁడు. ఇది ప్రాణములు దాఁచుకొను సమయము కాదు. యశోవిజయముల సంపాదింపఁ దగునదను. అనిరుద్ధుఁడు పాశబాధితుఁడయ్యు ధైర్యమూనియున్నవాఁడు.

అని నారదుఁడు పలుకఁగా శ్రీహరి సర్వసైన్యములను యుద్ధమునకు వెడలనాజ్ఞాపించి వారిఁగూడి ప్రయాణము సాగించెను. నారదముని యాప్రయాణసన్నాహముఁగాంచి మాధవా! గరుడారూఢుఁడవు కమ్ము. ఇదియాలస్యము చేయు సమయము కాదు. పదునొకండువేల యోజనములిచ్చటికి శోణితపురముకలదు. కాన నీప్రయాణము సమంజసముకాదు. మహావేగవంతుఁడగు వైనతేయుఁడు ముహూర్తమాత్రమునఁ జేర్పఁగలఁడు. అనఁగానే హరి గరుడుని స్మరించెను. వెంటనే యెదుట నాతఁడు నిలిచెను. ఏమియాజ్ఞయని వేఁడెను. శ్రీహరియు: వినతాప్రియనందనా! బలితనయుఁడు బాణుఁడు శోణితనగరమున నాపౌత్రు ననిరుద్ధు నుషాకారణమున నాగపాశముల బంధించెను. ఆతని విడిపింపఁబోవలయును. వేగమున నీకంటె నధికుఁడు లేఁడు కాననన్నతివేగమున నచటఁ జేర్పుము నీసాయమునఁ బెక్కుమారులు విజయమునొందఁ గల్గితిని. అనఁగా నాగరుడుఁడు చేతులొగ్గి మహాత్మా! నీసన్నిధిమాత్రమున నాకు విజ

యము కల్గెను. ధన్యుఁడను. అనుగ్రహపాత్రుఁడను. సకలచరాచర ప్రపంచముల కాదికారణమవై వేదాంతవేద్యుఁడవై చతురాశ్రమ ధర్మసంస్థాపకుఁడవై దానవులవధింప నవతరించుచు వెలయు పురాణపురుషుఁడవు. అని మఱియుఁ బెక్కుభంగుల భగవత్కార్యముల స్మరించి మహానుభావా! సన్నిధిష్ఠింపుము. నావ్రుఁడు గరుడునతిప్రీతిఁ గౌఁగిలించుకొని మిత్రుఁడా శత్రువినాశనముకొఱకీప్రాణము ప్రతిగ్రహింపుము. అని యాతిథేయుఁడు నొసంగిన సర్వాయుధములఁ దాల్చి యతనిపై నధిరోహించెను. దేవతలు పూలవానలఁ గురియించి జయింపుమని యగ్గించిరి.

## రుద్రజ్వరము శ్రీహరితోఁ బోరుట.

* ఇట్లు శ్రీహరి ప్రయాణమునా కరనెంచి గరుడారూఢుఁడయ్యెను మహాత్ములు జయము నొందుమని దీవించి స్వస్త్యయన కర్మము నడిపిరి. † గరుడారూఢుఁడగు హరి యెనిమిది బాహువులుగలిగిన పర్వతాకారముగన్పడఁగా బాణాసురసంక్షయమును గోరి పుండరీకాక్షుఁడను నామము సార్థకము చేయు నయనములు భాసిల్లఁగా ఖడ్గచక్రగదాబాణములు దక్షిణభాగకరములందు వెలయఁగా ధను శ్శార్ఙ్గచాపశంఖశ్చం

---

* ఈకథ హరివంశవిష్ణుపర్వమునందలి నూటయిరువదిరెండవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

† అథాష్టబాహుః కృష్ణస్తు పర్వతాకారసన్నిభః, విబభౌ పుండరీకాక్షో వికాంక్షన్ బాణసంక్షయమ్. అని మూలము.

గములు వామహస్తములందు వెలయుచుండఁగా నుద్యద్దివాక రుంబోలి ప్రయాణము సాగించెను. అత్తఱిఁ బ్రద్యుమ్నరూప ధారియగు శ్రీహరికి సనత్కుమారునియాకార మొప్పెను, అత్తఱి గరుడుఁడు పక్షవిక్షేపముగావించుచుండు నంతబలరా ముడు హరిం గూడి పయనముసాగించుచు శ్రీకృష్ణా! మాతే జస్సులు క్షీణించినవి. ఇదిక్రొత్తపద్ధతి. కనకవర్ణమాకలిగినది. ఇదేమివిచిత్రము? మేరుపర్వతపార్శ్వమునకు వచ్చితిమా? తెలుపుమనగా హరి యిట్లు బదులు పల్కెను. బల దేవా! శోణనగరసమీపమున కేతెంచితిమని తలంచెదను. ఆనగరమును రక్షించువాఁ డగ్ని హోత్రుఁడు. ఆహవనీయాగ్ని జ్వాలలు మన తేజస్సులఁ గ్రిందుపడఁజేసినవి. దాన వర్ణవైరూ ప్యముకల్గినది.అనఁగా హలాయుధుఁడు సోదరా! అట్లు మనము వర్ణవైరూప్యము నొందనచో నిఁక ముందు మన మొనరింపఁదగు కార్యమేమని బుద్ధిచే నాలోచింపుము. ఆమాటలాలకించి హరి గరుడునితో వైనతేయా ఇఁకఁ జేయఁదగుపని నూహింపుము. నీయాలోచనంగాంచి నేను కృత్యము నెఱపెదను. ఆశ్రీహరి యానతి నాలకించి కామరూపిగావున ముఖముల వేయింటిని గనఁబడఁజేసెను. గంగాతరంగిణింజేరి యందు మునింగి సమృ ద్ధిగా జలములఁద్రావి యాశోణనగరముపై నుండి యాజలము లవర్షించెను. దాన నాయగ్ని చల్లారెను. విస్మితుఁడై వైనతే యుఁడు సకలప్రాణులను బ్రళయకాలమునదహించు నీయగ్ని శ్రీహరికి వర్ణవైరూప్యము నొదవించెను. ఈయగ్నులు మూఁడు నొక్కొక్కటి యొక్కొక్కలోకమును గాల్పఁజాలునని తలంచెదను. అని పక్షవిక్షేపమొనరించెను. అంత రుద్రగణము

లచ్చెరువడి బలదేవ శ్రీకృష్ణ ప్రద్యుమ్నులను గాంచి యీపురుషవరేణ్యు లేలవచ్చిరని విస్మితులైరి.

అంత హరిబలములటఁగొన్ని ముందే ప్రయాణము చేసి చేరియుండినవి గాన హరిరాక నెఱింగి యుద్ధసన్నాహ మొనరింప నాధ్వని మిక్కుటముగ నెల్లయెడల వ్యాపించెను. ఆమహానాదము నాలకించి యంగిరసుఁడు తనపురుషు నొక్కని నాయుద్ధము సాగుచోటికిఁ బొమ్మని పంచెను. త్వరగా నాయుదంతమును గనుఁగొనిరమ్మని యాజ్ఞాపించెను. ఆపురుషుండాచోటికిం బోవునప్పటికి గన్నులకు వాసుదేవునకు యుద్ధము సాగుచుండెను. కల్మాషుఁడు, కుసుముఁడు, దహనుఁడు, శోషణుఁడు, బలశాలియగు తపనుఁడు నను నీయైదుగురు స్వాహాకారవిషయమునఁ బ్రఖ్యాతిం గాంచియుండిరి. మఱియుఁ బిఠరుఁడు పతగుఁడు, స్వర్ణుఁడు శ్వగాధ భ్రాజులునను నీయైదుగురు స్వధాకారవిషయమునఁ బ్రఖ్యాతులు. ఈపదుగురువహ్నులు తమతమసేనలతో వాసుదేవుని నిలువరించి పోరాడుచుండిరి. జ్యోతిష్టోమవిభాగమునందుఁ బ్రాల్గొనునట్టియు వషట్కారాశ్రయము గల్గినట్టియు నిరువురగ్నులు మహాబలపరాక్రమము లుప్పతిల్లఁ బోరాడుచుండిరి. ఈవార్త తనచారుఁడు చూచివచ్చి చెప్పఁగనే యంగిరసుఁ డాగ్నేయమగు స్యందనము నెక్కి భాస్వరంబగు చాపంబును దాల్చి పోయి యాద్వాదశాగ్నులనడుమ నిలిచి యుద్ధముచేయ నారంభించెను. వహ్నులనడుమ నిలిచి బాణములవర్షించు నయ్యంగిరసుం గాంచి నవ్వుచు శ్రీకృష్ణుఁడు మదినించుక కోపము పొడసూప నోయగ్నులారా! ఇంచుక నిలువుఁడు. మీపంత మడంచెద. నాయస్త్రాగ్నులు దహింపఁ

బూన నిలువఁజాలక దశదిశలకుఁ బరుగిడుదురుగాక. అనుచుండ నంత నంగిరసుఁడు శూలాయుధమును దాల్చి శ్రీకృష్ణ ప్రాణానిలములఁబీల్చువాఁడుపోలెఁ బరుగిడెను. శ్రీహరి యాత నిరాక నెఱింగి తీవ్రసాయకముల నాత్రిశూలమును శకలములుగ నొనరించెను. అంతట మానక చక్రపాణి యమునిం బోలిన యర్ధచంద్రాకార బాణములచేతను, బ్రళయకాలమృత్యువును మేలమాడు బాణముచేతను నంగిరసుని వక్షమును జీల్చెను. రక్తధారలు స్రవించుచుండఁగా నాముని విహ్వలుండును బోలె మూర్ఛిల్లెను. బ్రహ్మాదినయములగు నల్వురగ్నులు బాణనగరమునకుం బరుగునఁబోయిరి. తక్కినవారూరకుండిరి. కాన నగ్నిప్రాకారమును దాఁటి శ్రీహరి బాణనగరమును జేరెను. అత్తఱి నారదముని మహాభుజా! శ్రీకృష్ణా! అదియె బాణనగరము చూచుచు ఇంట భవానిగూడి శంకరుఁడు నివసించును. బాణరక్షణము సేయుచుండెఁ గుమారస్వామియు నున్నవాఁడు. అని నారదముని పలుకఁగా నవ్వుచు మునీంద్రా! క్షణకాలము చూచుచుండుము. బాణరక్షణముపొందెను రుద్రుఁ డవతరించినను శంకరునితోఁ బోరాడెదము అనుపలుకులు పూర్తినొందక ముందే గరుడుఁడు బాణనగరముచేర్చెను. పుండరీకాక్షుఁడు శంఖమొత్తి భయముప్పతిల్లఁ జేసి నగరముఁ బ్రవేశించెను.

అంత బాణాసురునిసేనలు భేరీనాదముల దిక్కులుపిక్కటిల్లఁజేయుచు యుద్ధమునకు నడచినవి. కింకరసేనలు తొలుత మార్కొని హరిప్రముఖుల నిలుపఁగా బలరాముఁడు హలాయుధమునుదాల్చి కృష్ణా! ఈబలమును దొలుత వధింపుమని

యాజ్ఞాపింపఁ దద్వధార్థ మాగ్నేయాస్త్రమును సంధించి ప్రయోగించెను. దానఁ గొందరు నశించిరి. తద్బలమసంఖ్యాకమగుట సముద్రము పొంగినచందమున నుండ బలదేవుఁడు కృష్ణా! నేను వీరితోఁ బోరాడ నుత్సహించెద. అనుటయు కృష్ణుం డన్నా! నాకు యుద్ధకాంక్ష మిక్కుటముగా నున్నది. ప్రద్యుమ్నుఁడు వామభాగమునందును, నీవు దక్షిణభాగమందును, గరుత్మంతుఁడు ముందును నిలిచి నన్నుఁ గాపాడుచుండుఁడు. అనుచుండఁగనే వారితోఁ బోరాడుచున్న హలాయుధుని యాకారము రౌద్రముగాఁ జూపట్టెను. యుగాంతకాలమున మృత్యువా యని తోఁపఁ జేయుచుండెను. లాంగలమును దగిలించి లాగుచు ముసలమున నలుగఁగొట్టుచు విహరించుచుండెను. ప్రద్యుమ్నుఁడు యుద్ధకాంక్షయావేశింపఁగా శరజాలములఁ బరఁగించుచు నురుమాడుచుండెను. శ్రీహరి పాంచజన్యనాదమునఁ గొందఱఁ బడఁజేసెను. స్వపక్షచాలనవాతముల గరుడుఁడు కొందఱఁ దూలించెను. నఖముఖవిదారణముల మఱికొందఱఁ జెండెను. ఇట్లు ప్రమథనిశాచరగణములు తూలి పోవుచుండునంత రౌద్రజ్వరము హరిఁగాచుపొంటె నడరెను. మూఁడుపాదములు మూఁడుశిరస్సులు షడ్భుజములు తొమ్మిది కన్నులు గలిగి యారౌద్రజ్వరము భస్మప్రహారణముచేయుచుఁ గాలాంతకయమసంకాశమై మేఘసహస్రగర్జనములఁ గ్రిందుచేయు మహారవమొనరించుచు నావులించును నిద్రాపరవశమగు తనువు వెలయఁగా నేత్రములచే నాకులమగు వక్త్రముగలిగి త్రుళ్లుచు సంహృష్టరోమములు వెలయఁగా గ్లానాక్షులు కనంబడఁగా భగ్నచిత్తుంబోలె నూర్పులు వెసవదలుచు

హలాయుధుఁ జేరవచ్చి సాక్షేపముగా మార్కొనెను. యుగాంతాగ్నినిభములగు ముష్టులం జూపి యందఱ భీతిల్లఁ జేయుచుండెను. క్షణమాత్రమున నన్నితావులఁ గనఁబడుచుండెను. మఱియు హలాయుధునిపక్షమున భస్మమును బ్రయోగించెను. అది స్పృశింపఁగనే మహాబాధకలుగ నాతఁడు నావులించుచు శోషిల్లుచు నిట్టూర్పులు పుచ్చుచు నిద్రావిష్టుఁడువలెఁ గన్నులు మూతలుపడుచుండఁగా నేమియుఁ జేయఁజాలక కృష్ణునిం బిల్చి యిట్లు పలికెను. కృష్ణా కృష్ణా! చిక్కుపడితిని. కాపాడుము కాపాడుము. దేహమంతయు మండుచున్నది. రక్షింపుము. ఈబాధ శాంతినొందఁజేయుము. అని యిట్లు మహాబలశాలి హలాయుధుఁడు పలుకఁగా నాలకించి నవ్వి యుద్ధాభిలాషులలో మేటి కావున నిట్లు పలికెను.

అన్నా! భయంపడకుము. భయంపడకుము. ఇదె వచ్చితి. అని పోయి కౌఁగిలించుకొనెను. శ్రీకృష్ణాశ్లేషమున నాతని తనూతాపము చల్లారెను. ఇట్లు జ్యేష్ఠసోదరు బాధ మాన్పి మహత్తరకోపమున నాజ్వరమును జూచి యిట్లు పలికెను. ఓరౌద్రజ్వరమా! రమ్ము. రమ్ము. నాతో రణమొనరింపుము. నీశక్తినంతయుఁ జూపుము. నీపౌరుషమునంతయుం జూపుము. నీరెండుచేతుల బలముం జూపుము. అనిపలుకఁగా నాజ్వరము హుంకరించి జ్వాలాగర్భమగు భస్మమును జల్లెను. ముహూర్తమాత్ర మాభస్మము దేహమును మండఁజేయఁగా నాబాధ ననుభవించెను. అవ్వల నాబాధ శాంతించెను. అంత నాజ్వరము త్రిభుజములచే శ్రీకృష్ణుని బ్రహరించెను. కంఠమునఁ జిటికిటఁ బొడిచెను. ఉరస్సును ముష్టిఘాతమున నొప్పించెను. ఆదెబ్బ

లచే నించుక హరి బాధితుఁ డైనట్లు చూచువారలకుం దోఁచెను. దీనినింకనిలువనిచ్చినఁ గీడుమూడునను ధ్వని చెలరేఁగెను. ముహూర్తమాత్ర మాజ్వరమునకు హరికి ద్వంద్వయుద్ధము చెల్లెను. అత్తఱి నాశివజ్వరము కనకవిచిత్రభూషణములొప్పారఁగాఁ దన బాహుబలమున హరినొప్పించుచు జగత్త్రయకాలమున మృత్యువుంబోలి వెలుంగుచుండెను.

## శివజ్వర శ్రీకృష్ణసంవాదము.

* అంతట శ్రీకృష్ణుఁడు శత్రునిషూదనసమర్థుఁడు గావున నిది మృతినొందవలయునని యూహించుచు బాహువుల దానింబట్టుకొని భూతలమునఁ బడవైచెను. అది కృష్ణకరవిముక్తమై తనశరీరమును వదలక శ్రీకృష్ణదేహమును బ్రవేశించెను. అది తనువునఁ బ్రవేశించినంతనే యొడలుపరవశము కాఁగా భూతలమున గాఢనిద్ర నొందినవాఁడు వలెఁ బడియెను. ఆవులించెను నిట్టూర్పులఁబుచ్చెను. గగుర్పాటు గలుగఁగా నా బాధ ననుభవించెను. నిద్రపోయెను. ముహూర్తకాలమీరీతి సకల బాధల ననుభవించెను. అంతలో ధైర్యమూని పరసంహార ప్రచండపాండిత్యమండితుఁడు కావున దానియావేశమున నావులించుచు జ్వరాభిభూతునిగాఁ దన్నెఱింగి దానినడంచు వేఱొకజ్వరమును బ్రయోగించెను. అది వైష్ణవజ్వరమను విఖ్యాతి గలది. అతిభయంకరాకారము గలది. సర్వప్రాణిభయంకరమైనది. అట్టిజ్వరమును రుద్రజ్వరవధార్థమై ప్రయోగించెను.

---

* ఈకథయు హరివంశాంతర్గత విష్ణుపర్వమున నూటయిరువదిమూఁడవ యధ్యాయము ననుసరించి వ్రాయఁబడినది.

శ్రీహరి తనకాజ్ఞచేయఁగా నావైష్ణవజ్వరము బలమలరఁగా నారుద్రజ్వరమును బట్టుకొని తనువునుండి వెడలించి హరికప్పగించెను. హరి దానిం బట్టుకొని మహత్తరక్రోధమునఁ దన దనువు నావహించినదానిని దనజ్వరమును వెడలించి నూఱుసారులు గిరగిరంద్రిప్పి, భూతలముననైవ నుంకింపఁగా నది భీతిల్లి స్వామీ నన్ను రక్షింపుము. రక్షింపుమని మొఱ్ఱపెట్టసాగెను. హరి దాని గిరగిరఁ ద్రిప్పుచుండుతఱినే యాకాశమునుండి యశరీరవాక్యొక్కటి యదుకులానందవర్ధనా! మహాబాహూ! కృష్ణా! కృష్ణా! ఈజ్వరమును బొలియింపకుము. దీనిని గాపాడుము. ఇది రక్షింపఁదగినదియే అనివినఁబడియెను. శ్రీహరియు నామాట లాలకించి భూతభవ్యభవిష్యత్ప్రభువు, జగజ్జాలమునకుఁ బరమగురువునగుట దానిని బొలియింపక వదలెను. ఆజ్వరమతిభీతిమై హరిపాదములకడ వ్రాలి తత్పాదపద్మములఁ దలఁ దాల్చి శరణమొందిా యిట్లు ప్రార్థించెను. యదునందనా! గోవిందా! నావిన్నప మాలకింపుము. నామనోరథము నీడేర్పుము. నే నొక్కఁతుక నే జ్వరమనఁ బరఁగుదును. నీప్రసాదమున నీవర మడుగుచున్నాను. నేనే యుండునట్లనుగ్రహింపుము. శ్రీహరియు దానిప్రార్థనము నట్లేయగుఁగాక యని చెల్లించి జ్వరమా! నీకోరిక చెల్లించితిని. నా శరణుచొచ్చితివి. ఇంతకుముందున్నట్లే నీవొక్కదానవే జ్వరమన నుండుదువుగాక. ఇపుడు నాచే సృజింపఁబడిన యీజ్వరము నాయందే విలీనమగుంగాక. అనిపలికి మఱియు నాజ్వరముంగాంచి జ్వరమా! నీ వెట్లు లోకమున సంచరింపవలయునో తెల్పెద నాలకింపుము. సర్వజాతులయందును స్థావరజంగమాత్మకమగు నీప్రపంచము

నందు నీతనువును మూఁడుగావిభజించి నాయానతిమెయిఁ బ్రవర్తింపుము. ఒక్కతినువునఁ జతుష్పాజ్జంతువుల నాశ్రయింపుము. రెండవతనువున సావరముల నావరింపుము. మూఁడవ దేహమున మానవకోటి నావేశింపుము. మూఁడురూపములుగా మరల నామనుష్యులయం దున్నరూపమును భాగించి పక్షులయందుండుము. మూఁడవదేహమునందున్న నాల్గవభాగము నీకు ధ్రువముగ నుండఁగలదు. మూఁడవభాగము చాతుర్థికజ్వరమనఁ బరఁగును. మానుషులయం దొక్కరీతిగాక తారతమ్యమును బట్టియుండుము. వృక్షములయందుఁ గీటరూపమున నుండుము. సంకోచపత్రరూపమునను నుండుము. పాండుపత్రములని వానికిఁ బేరుగలుగును. జలములయందు నీలికారూపమున నుండుము. నెమిళ్లయందు బర్హచ్యుతిరూపముగ నుండుము. తామరతీఁగ లోనగువానియందు కామరూపముగా నుండుము. భూమియం దూషరరూపమున వెలయుము. పర్వతమునందు గైరిక మనుపేర నొప్పుదువుగాక. గోవులయం దపస్మారకమన నుందువు. వాని కదియే చరణరోగమగును. దానిపేరు ఖోరక మనఁబడును. ఇట్లు బహురూపంబుల భూతలంబున వ్యాపించి యుందువు. దర్శనస్పర్శనములఁ బ్రాణివధ మొనరింతువు. దేవమానవులుదప్ప నిన్నితరు లోర్వఁజాలరు.

అని యిట్లు శ్రీకృష్ణమూర్తి యాజ్ఞాపింపఁగా నారుద్రజ్వరము హర్షించి నమస్కరించి చేతులొగ్గి యిట్లు మరల బ్రార్థించెను. సర్వజాతిప్రభుత్వము నొసంగితివి. ధన్యచిత్తనైతిని. మరల నీవాక్యము నాశించుచున్నదానను. గోవిందా! నే నేమి భూతలమునఁ జేయువలయునో మఱియు నాజ్ఞాపింపుము.

రాక్షసకులముల ధ్వంసముచేయ మహాదేవుఁడు నన్నుఁబుట్టించెను. నీచేత రణరంగమున నోడింపఁబడితిని. కాన నాకుఁ బ్రభువవైతివి. నేనిపుడు నీకుం గింకరుఁడను. ధన్యతగంటిని. అనుగ్రహింపఁబడితిని. నాకుఁ బ్రియముగల్గించితివి. నీకుఁ బ్రియముగా నే కార్య మొనరింపఁదగునో ఆజ్ఞాపింపుము. అని జ్వరము పలుకఁగా వాసుదేవుం డనుగ్రహమున నాయభిసంధిని వినుము. బాహుబలము లొప్పార మన మిద్దఱము యుద్ధముచేసితిమి. ఈయుద్ధవృత్తాంతమ్ము నెవ్వఁడు పఠించునో వారిని నీవు బాధింపకుందువు గాక. వారి నావేశించియున్నను వదలిపోవుదువుగాక. నీబాధనుండి విముక్తులు కాఁగోరువార * లీశ్లోకములఁ బఠింతురుగాక. అని శ్రీహరిపలుకఁగా నట్లే యగుఁగాక యని పలికెను. ఇట్టు లాశివజ్వరము హరివలన వరములనొంది నమస్కరించి రణాంగణమును వదలిపోయెను.

## హరిహరయుద్ధము.

† ఆవల నాముువ్వురును గరుత్మంతు నధిష్ఠించి యాబాణాసురుని సేనలతోఁ బోరాడిరి. బాణవర్షమున నావీర భటులను ముంచిరి. బాధించిరి. శంఖధ్వనుల వారినలయించిరి. చక్రలాంగూలాది ప్రహరణములకుఁదాళఁజాలక యాకింకరులు

---

### జ్వరహరణస్తుతిః.

* శ్లో. త్రిపాద్భస్మప్రహరణ స్త్రిశిరా నవలోచనః, సమేప్రీత స్సుఖం దద్యా త్సర్వామయపతిర్జ్వరః. ఆద్యంతవంతః కవయఃపురాణాః సూక్ష్మా బృహంతో ఉప్యనుశాసితారః, సర్వాన్ జ్వరాన్ ఘ్నంతు మమానిరుద్ధ ప్రద్యుమ్నసంకర్షణవాసుదేవాః. అని. † ఈకథ విష్ణుపర్వము నూటయిరువదినాల్గవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

మడసిరి. శుష్కేంధనముల నగ్ని కాల్చునట్లు వారినెల్ల శ్రీహరి బాణములు కాల్చెను. హతశేషులు కోపిల్లిరి. పరుగిడసాగిరి. వారిపాటుగాంచి బాణాసురుఁడు పాఱిపోవ నేల యని నిలిపి యిట్లుపలికెను. దానవవీరులారా! లాఘవమునొంది కులమున కపకీర్తిందెచ్చి యేల యిట్లు పాఱిపోయెదరు? మీకింత భయ మేల? సకలాయుధములధరించియు వానియెడ విశ్వాసము మాని కులమర్యాదను వీటఁబుచ్చి హరసంవాసమును మఱచి పోవఁ బాడియే. నిలువుఁడు. ఇదె నేనరుదెంచితిని. అని యెంత యొత్తిచెప్పినను భయమోహితులై మరలకపోయిరి. ప్రమథ గణములు నిలిచి పోరాడుచునే యుండినవి. దానవవీరులు కొందఱు బాణప్రోత్సాహితులై యనిసేయఁ బూనిరి. బాణా సురమంత్రియగు కుంభాండుఁడు బలశాలిగావున భయార్త లగు సైనికులంజూచి యిట్లు పలికెను. దానవులారా! ఇదిగో బాణాసురుఁడు సంగరముచేయ నరుదెంచెను. ఇదె శంక రుఁ డరుదెంచెను. కుమారస్వామియు నేతెంచెను. మీరేల భయమునఁ బరువెత్తెదరు? అని యెంతచెప్పినను భయార్తులు గావున నిలువక పోవసాగిరి.

తనబలములు శ్రీకృష్ణభీతిఁ బాఱిపోవుటంగాంచి సంరక్త నయనుండై శంకరుఁడు యుద్ధమున కాయత్తపడెను. బాణ సంరక్షణాదరంబున రథమునధిరోహించెను. కుమారస్వామియు రథము నెక్కి వెడలెను. నందీశ్వరసమాయుక్తరథమునధిష్ఠించిన యీశ్వరుఁడు కృష్ణుఁ డున్నచోటికిం బోయెను. సింహనాద మొనరించుచుఁ దనప్రమథు లనేకరూపంబులుదాల్చి తోడఁన నడచిరి. తన కభిముఖముగా నేతెంచు శంకరుస్యందనముం

గాంచి గరుడు నధిష్ఠించియున్న తాను నెదుర్కొనెను. తన్నెదుర్కొనుచున్న హరిపై హరుఁడు నారాచములఁ బ్రయోగించెను. హరియుఁ బర్జన్యాస్త్రమును బ్రయోగించెను. భూమివడంకెను. నాగములు విషముఁ గ్రక్కెను. పర్వతము జలధారల వదలెను. కొన్ని శిఖరములు పడినవి. మఱియు బెక్కు నుత్పాతములు తోఁచెను. అంతలో లోకపితామహుఁ డగు బ్రహ్మదేవుఁడు దేవగణంబులంగూడి యరుగుదెంచెను. శ్రీహరి యాయస్త్రరాజమును వదలెను. దానం బ్రభవిల్లిన నారాచములు వేనవేలుగా హరరథముపయిం బడియెను. అంత రోషమున శంకరుఁడు హుంకరించి యాగ్నేయాస్త్ర మును నారింగూర్చి ప్రయోగించెను. ఆయద్భుతము వర్ణనా తీతము. ఆయస్త్రజ్వాలల గరుడ శ్రీకృష్ణ బలరామ ప్రద్యు మ్నులు సమావృతులైరి. దాన హరిపోలిసెనని దానవులు సింహనాద మొనరించిరి. దానికోర్వక కృష్ణుఁడు దివ్యాస్త్ర విద్వర్యుఁడు గావున వారుణాస్త్రమును సంధించి దాని యాటోపము నాపెను. శంకరుఁడు వరుసగాఁ బైశాచ రాక్షస రౌద్రాంగిరో నామకాస్త్రములం బ్రయోగింప శ్రీకృ ష్ణుఁడు వాయవ్య సావిత్ర వాసవ మోహనాస్త్రములం బ్రయోగించి వానిని మరల్చెను. పిదప హరి వైష్ణవాస్త్ర మును వైచెను. దానవ నెల్లరు భయంపడిరి. కొండలు పరు గిడెను. దిక్కులు తిమిరావృతము లయ్యెను. బాణాసురుఁ డాయుఃద్రవ మడపంగఁగోరి యనేకదానము లొనరించెను. తాను సంగరమునకుఁ బ్రయాణ మయ్యెను. సేనాసాగర మాతనితోడ బయలువెడలెను. లోకంబులెల్ల నాకలంబు

బయ్యెను. వైష్ణవాస్త్రము గాడాంధకారమును గల్పించెను.

## హరిహరస్తుతి.

* ఈరీతి జగంబంతయు నంధకారమయము కాఁగా నాపరశివుఁడు దానివిరియించి స్వకీయ తేజమున నెంతయుఁ బ్రకాశించెను. అంధకారమునందు శంకరుఁడు గాని నందీశ్వరుఁడు గాని యరదముగాని కనంబడకుండిరి. అంత రోషమునఁ ద్ర్యక్షుంబకుఁ డుప్పొంగి తన తేజమున నాయంధకారమును విరియించి ధనుస్సు మెఱయించి బాణమును సంధించెను. † ఆ బాణసంధానమేటికో యీయుద్ధము చేయఁబూనుటేలో కో మహాత్ముఁడగు వాసుదేవుఁ డెఱుంగును. కావుననే యీయిరువురును బోరాడసాగిరి. శంకరుఁడు విజృంభించి యుద్ధము చేయఁబూనఁగా వైష్ణవాస్త్రము వృథకాఁగా వాసుదేవుఁడు జృంభణమను నస్త్రమును బ్రయోగించెను. దాన శంకరుఁడు మూర్ఛిల్లినట్లుండెను. ‡ సర్వసురాసుర సంఘ విజేతయయ్యు సంజ్ఞ నొందక యుండెను.

ఇట్లు ధనుర్ధారియయ్యు మహాదేవుఁడు మూర్ఛిల్లియుంటఁ గాంచి బాణాసురుఁడు శంకరుఁ బురికొల్పెను. కాని యట్లే యుండెను. హరి పాంచజన్యమును బూరించెను. అట్టహాస మొనరించెను. శంకరుఁడు మూర్ఛిల్లుట నెల్లరు భీతిల్లిరి. అంతటఁ బ్రమథబలములు మాయాయుద్ధమునఁ బ్రద్యుమ్నుఁ

---

* ఈకథయు హరివంశవిష్ణుపర్వము నూటయిరువదియైదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుంగవలయును.

† విజ్ఞాతో వాసుదేవేన చిత్తజ్ఞేనమహాత్మనా. అని మూలము.

‡ సంజ్ఞాం నలేభే భగవాన్ విజేతా సురరక్షసామ్. అని మూలము.

జుట్టుముట్టిరి. ప్రద్యుమ్నుఁడు వారినెల్ల నిద్రాపరవశులం గావించి దానవుల నొంచెను. అత్తరి శంకరవాసుదేవుల తేజస్సున భూమి పీడింపఁబడి భూదేవి బ్రహ్మనుగాంచి మహాత్మా! శంకరవాసుదేవుల తేజస్సును భరింపఁజాలక యున్నదానను; నన్నుఁగాపాడుము. ఈభారము నోర్వఁజాలను. దుర్భరముగా నిది కనఁబడుచున్నది. చరాచరముల లాఘమున నేను ధరించునట్లు లోనరింపుము. అనఁగా భూమితో హిరణ్యగర్భుఁడు జననీ! ముహూర్తమాత్ర మోర్చుకొనుము. ఈభారము తొలంగును. అని పలికి యామె భీతిఁదొలఁగించి శంకరుం గాంచి మహాత్మా! మహాసురవధము కల్పించి మరల వారినేల కాపాడఁబూనెదవు? నీకును గృష్ణునకును యుద్ధముచెల్లునా? † నీరెండవరూపమే యాకృష్ణుఁడని నీవెఱుంగవా. అని హెచ్చరింపఁగా నవ్యయుండగు నామహాదేవుఁడు ‡ యోగనివిష్టమతియై మున్ను తాఁ గృష్ణునకొసంగిన వరముల నాలోచించి ద్వారవతియందుఁ దాఁ గృష్ణునితోఁ బల్కిన విధమును స్మరించి యేమియుఁ బలుకక మరలెను. తనకుఁ గృష్ణునకించుకంతయు భేదము లేదనుట సంస్మరించెను. యుద్ధనివృత్తుఁడై బ్రహ్మనుజూచి పంకజాసనా! యుద్ధముచేయను. ఇంక భూభారముతగును గాక భూదేవి స్వస్థురాలగుంగాక.

---

† నచబుద్ధ్యసికృష్ణంత్వ మాత్మానంతు ద్విధాకృతమ్. అని మూలము.

‡ ప్రవిశ్యపశ్యతేకృత్స్నం త్రీన్ లోకాన్ సచరాచరాన్, ప్రవిశ్య యోగం యోగాత్మా పరాం స్థానను చింతయన్, ద్వారవత్యాంయదుక్తంచ తదనుస్మృత్యసర్వశః, జగాదనోత్తరం కించిన్నివృత్తోఽసౌభవస్తదా. అని మూలము.

అనుటయు గృష్ణుం డవ్విధమెఱింగి మహాదేవుం గౌఁగిలించుకొనియె. శివుండును హరి నాలింగనము చేసికొనియె. ఇట్లు పరస్పరాలింగనములఁ దమ యైకమత్యమును దెలుపుకొనిరి. ఒండొరులమాఱుకొను ప్రయత్నమును మానుకొనిరి. అత్తఱి వారిమహత్వము నెఱింగిన బ్రహ్మ మార్కండేయుని నారద మునిని గాంచి యిట్లు పల్కెను. మునులారా! మందరగిరి పార్శ్వమున నళినియందు రాత్రి స్వప్నావస్థయందు హరకేశవులు నాచేఁజూడఁబడిరి. హరుఁడు హరిరూపమును దాల్చెను. హరియు హరరూపమును దాల్చెను. శంఖచక్రగదాపాణియై పీతాంబరమునుదాల్చి హరుఁ డొప్పెను. త్రిశూలపట్టిసములం దాల్చి వ్యాఘ్రచర్మమునుగట్టి హరి యలరారెను. శంకరుఁడు గరుడారూఢుఁడయ్యెను. శ్రీకృష్ణుఁడు వృషభము నెక్కియుండెను. ఈపరమాద్భుతవృత్తాంతమును గాంచి యచ్చెరుపడితిని. దీనిసార మేదో తెలుపుఁడు. అని బ్రహ్మ ప్రశ్నింపఁగా మార్కండేయుఁ డిట్లు బదులుచెప్పెను. * శివుఁడు విష్ణురూపుఁడు

* శివాయవిష్ణురూపాయ విష్ణవేశివరూపిణే, యథాన్తరం నపశ్యామి తేన తౌ దిశతశ్శివమ్. అనాదిమధ్యనిధన మేతదక్షరమవ్యయం, తదేవతే ప్రవక్ష్యామి రూపం హరిహరాత్మకం. ౩౦. యోవిష్ణుస్సతువైరుద్రో యోరుద్రస్సపితామహః, ఏకామూర్తిస్త్రయోదేవా రుద్రవిష్ణు పితామహః. ౩౧. వరదా లోకకర్తారో లోకనాథా స్స్వయంభువః, అర్ధనారీశ్వరాస్తేతు వ్రతం తీవ్రం సమాశ్రితాః. ౩౨. యథాజలేజలంక్షిప్తం జలమేవతు తద్భవేత్, రుద్రం విష్ణుః ప్రవిష్టస్తు తథా రుద్రమయోభవేత్. ౩౩. అగ్నిమగ్నిః ప్రవిష్టస్తు అగ్నిరేవయథాభవేత్, తథా విష్ణుం ప్రవిష్టస్తు రుద్రో విష్ణుమయోభవేత్. అని మూలము.

విష్ణువు శివరూపుఁడు. వీరియందుఁ దారతమ్యము గానరాదు. కాన వారిద్దఱు శివుల నొసంగుదురు గాక. ఆదిమధ్యాంతములు లేక యక్షరము నవ్యయము నగు నొకతత్త్వము హరిహరాత్మక మనంబడును. విష్ణువనఁబడువాఁ డెవ్వఁడో వాఁడే రుద్రుఁడు. రుద్రుఁ డనఁబడువాఁడే పితామహుఁడు. ఒక్కదేహమే మూఁడుగా నేర్పడి బ్రహ్మవిష్ణుశివు లనునామములఁ దాల్చెను. ఈముువ్వురు వరదానదక్షులు. లోకకర్తలు. స్వయంభువులు. అర్ధనారీశ్వరులు. తీవ్రవ్రతము నవలంబించి యున్నవారు. జలమునందు జలముపోసిన నది జలమేయగును. రుద్రునియందుఁ బ్రవేశించినవిష్ణువు రుద్రమయుఁడేయగును. అగ్నిలో నగ్నిప్రవేశించిన నగ్నియేయగును. అట్లె విష్ణువులోఁ బ్రవేశించిన రుద్రుఁడు హరిమయుండగును. అగ్నిమయుఁడు రుద్రుఁడు. సోమమయుఁడు విష్ణువు. అగ్నీష్టోమాత్మకమే యీస్థావరజంగమాత్మక ప్రపంచమని యెఱుఁగఁ దగు. వారిద్దఱు జంగమస్థావరాత్మక ప్రపంచమునుబుట్టింపఁ ద్రుంప సమర్థులు. లోకములకు శుభదాయకు లీవిష్ణుమహేశ్వరులే. కర్తృకారణకర్తలు, కర్తృకారణకారకులు, భూతభవ్యభవులు, నారాయణమహేశ్వరులు. వీరియ్యరే వర్షించుచున్నవారు. వీచుచున్నవారు. ప్రకాశించుచున్నవారు. సృజించుచున్నవారు. పితామహా! ఈరహస్యము నాయెఱింగినంత వచించితిని. ఈవిషయము నెవ్వఁడుతలఁచునో వినునో వాఁడు బంధవిముక్తిం గాంచి పరమపదమునొందును. ఈహరిహరులు పితామహుని తోఁగూడిరి. రుద్రునికంటె విష్ణువేయధికుఁడు. విష్ణువుకంటె రుద్రుఁడధికుఁడు. ఒక్కదేహమే రెండుదేహములుగా మాఱె

షది. చరించుచున్నది. శివుఁడులేక విష్ణువులేఁడు. విష్ణువులేక శివుఁడులేఁడు. కావున నీయిద్దఱొక్కరూపముగా నుందురు. అనిపలికి భక్తినమ్రకంధరుఁడై పరమాదరంబున మార్కండేయముని యిట్లువినుతించెను.సర్వకారణులు సర్వలోకకర్తలు. సర్వలోకాధారులు హరిహరులు. అట్టివారు పరమేష్ఠింగూడి యిందువేంచేసి యున్నవారు. 'వారికి నమస్కారములు' ఓహరిహరరూపధరా! పరమేశ్వరా! నీకునమస్కారములు. అని స్తుతివిశేషముల భక్తిపరవశుఁడై సంస్తుతించి తదేకాగ్రచిత్తుఁడై యుండెను.

---

### మార్కండేయకృత హరిహరస్తుతిః.

శ్లో. నమోరుద్రాయ కృష్ణాయ నమస్సంహతచారిణే, నమష్షడర్ధనేత్రాయ సద్వినేత్రాయవైనమః౧.నమః పింగళనేత్రాయ పద్మనేత్రాయవైనమః, నమః కుమారగురవే ప్రద్యుమ్నగురవేనమః ౨. నమోధరణీధరాయ గంగాధరాయవైనమః, నమోమయూరపింఛాయ నమఃకేయూరధారిణే. ౩. నమః కపాలమాలాయ వనమాలాయవైనమః, నమస్త్రిశూలహస్తాయ చక్రహస్తాయవైనమః. ౪. నమఃకనకదండాయ నమస్తే బ్రహ్మదండినే, నమశ్చర్మనివాసాయ నమస్తే పీతవాససే. ౫. నమోస్తులక్ష్మీపతయే ఉమాయాః పతయే నమః, నమఃఖట్వాంగధారాయ నమోముసలధారిణే. ౬. నమోభస్మాంగరాగాయ నమఃకృష్ణాంగధారిణే, నమశ్శ్మశానవాసాయ నమస్సాగరవాసినే. ౭. నమోవృషభవాహాయ నమోగరుడవాహనే, నమస్త్వనేకరూపాయ బహురూపాయవైనమః. ౮. నమఃప్రళయకర్త్రేచ నమస్త్రైలోక్యధారిణే, నమోస్తుసౌమ్యరూపాయ నమోభైరవరూపిణే. ౯. విరూపాక్షాయదేవాయ నమస్సౌమ్యేక్షణాయచ, దక్షయజ్ఞవినాశాయ బలేర్నియమనాయచ. ౧౦. నమఃపర్వతవాసాయ నమస్సాగరవాసినే, నమస్సురరిపుఘ్నాయ త్రిపుర

## బాణాసురునకు శ్రీకృష్ణుఁడు వరము లొసంగుట.

* ఇట్లుమహాదేవుఁడు యుద్ధముమానఁగాఁ గుంభాండకుఁడు రథముగడపుచుండ బాణాసురుఁడు యుద్ధరంగమును ప్రవేశించెను. కుమారస్వామియు నాతనిం దలకడచి కృష్ణుని ప్రద్యుమ్నుని మార్కొనఁబోయెను. శతశరముల వారినినొప్పించి సింహనాదమొనరించి హలాయుధుని గరుడుని నొప్పించెను. ఆమువ్వురు శరసంవృత శరీరులైరి. రక్తధారలు తనువుల

---

ఘ్నాయవైనమః. ౧౧. నమోస్తునరకఘ్నాయ నమఃకామాంగనాశినే, నమస్త్వంధకనాశాయ నమఃకైటభనాశినే. ౧౨. నమస్సహస్రహస్తాయ నమోఽసంఖ్యేయబాహవే, నమస్సహస్రశీర్షాయ బహుశీర్షాయవై నమః. ౧౩. దామోదరాయదేవాయ ముంజమేఖలినేనమః, నమస్తే భగవన్విష్ణో నమస్తే భగవన్ శివ. ౧౪. నమస్తేభగవతేదేవ నమస్తేదేవపూజిత, నమస్తే కర్మణాం కర్మన్నమోఽమితపరాక్రమ. ౧౫. హృషీకేశనమస్తేఽస్తు స్వర్ణకేశనమోఽస్తుతే. ఇమంస్తవంయో రుద్రాయ విష్ణోశ్చైవమహాత్మనః, సమేత్యఋషిభిస్సర్వైః స్తుతో స్తౌతిమహర్షిభిః. వ్యాసేనవేదవిదుషా నారదేనచధీమతా, భారద్వాజేనగర్గేణవిశ్వామిత్రేణవైతథా, అగస్త్యేన పులస్త్యేన ధౌమ్యేనచ మహాత్మనా. యఇదంపఠతే నిత్యం స్తోత్రం హరిహరాత్మకం, అరోగోబలవాంశ్చైవ జాయతే నాత్రసంశయః. శ్రియంచ లభతేనిత్యం నచస్వర్గాన్నివర్తతే. అపుత్రోలభతే పుత్రంకన్యావిందతిసత్పతిం. గుర్విణీశృణుతేయాతు వరంపుత్రంప్రసూయతే. రాక్షసాశ్చ పిశాచాశ్చ విఘ్నానిచ వినాయకాః, భయంతత్ర నకుర్వంతి యత్రాయం పఠ్యతేస్తవః.

ఇతి హరిహరస్తుతి స్సమాప్తా.

* ఈకథ హరివంశాంతర్గత విష్ణుపర్వమున నూటయిరువదాఱవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగునది.

నిండఁ గుమారునిమాఁగొని సకలాయుధములఁ బ్రయోగించిరి. ప్రత్యస్త్రముల నాతఁడు వానిని మరల్చెను. క్రోధమున బ్రహ్మశిరోనామకాస్త్రమును గుహుఁడు గ్రహించెను. అది మిగులభయంకరము. ప్రళయకారణము. దాని బ్రయోగింపఁగా శ్రీహరి జనుల హాహాకారముల విని చక్రమును ధరించెను. దాన నా బ్రహ్మశిరోనామాస్త్రము నిర్వీర్యమయ్యెను. దాన స్కందుఁ డాగ్రహించి దివ్యశక్తిని గ్రహించి ప్రయోగించెను. ఆశక్తియె తారకాదిమహాదానవుల వధించెను. దేవతలు హాహాకారములుచేయ శ్రీకృష్ణుఁడు చెంతకువచ్చుచున్న దానిని హుంకారమున నిలిపెను. అది భూతలమునఁబడియెను. దేవత లానందించిరి. శ్రీహరిచక్రమును మరలఁ బ్రయోగించెను. గుహుని రక్షించుపొంటెఁ గోటవీదేవి ప్రవేశించి నగ్నయై కుమారకృష్ణులనడుమ నిలువఁబడెను. దేవతలే యామెను బంపిరి. పరాఙ్ముఖుఁడై హరి యిట్లుపలికెను. సీ! సీ! తొలఁగుము. తొలఁగుము. చంపఁబూనిన నా కేలయిట్టి విఘ్నమొనరించెదవు. అని పలికిన ఆమె వస్త్రమును ధరింపక కుమారరక్షణధృతిఁ గాంచెను. ఓకోటవీ! కుమారస్వామిం గొని తొలఁగిపొమ్ము. దాన మేలుగలుగును. అని పలికి చక్రము నుపసంహరించెను. ఆదేవియుఁ గుమారస్వామి నిగైకొని యీశ్వరుసన్నిధి కరిగెను.

కుమారస్వామి కనఁబడకపోఁగా బాణాసురుఁడు యుద్ధముచేయఁబూని యాప్రదేశమునకరిగెను. తూర్యరావములు పిక్కటిల్లెను. బాణుఁడు వచ్చుటంగాంచి హరిగరుడారూఢుఁడై యెదుర్కొనియెను. బాణుఁ డాగ్రహమున హరితోఁ

నిట్లుపలికెను. కృష్ణా! నిలువుము. నిలువుము. నాకంటఁబడితివి. ప్రాణములతో మరలిపోవఁజాలవు. ద్వారకను ద్వారకావాసులను జూడఁజాలవు. బంగారువృక్షములం జూడఁగలవు. కాలచోదితుఁడవయియే * నన్నుమార్కొన నరుదెంచితివి. అష్టభుజుఁడు సహస్రభుజునితో నెట్లుపోరాడునో చూచెదఁగాక. నాశక్తిని ద్వారకాపురమున స్మరింతురుగాక. అని యిట్లనేకభంగుల బాణాసురుఁడు పలుకఁగా నాయపవిత్రవాక్యముల నాలకించి నారదుఁడు ఘక్కున నవ్వెను. యోగపట్టమును దాల్చి యుద్ధము చూచు వేడుక నాకాశమున నిల్చెను. కౌతూహలమున నయనములు వికసింప నటునిటు సంచరింపఁదొడఁగెను, అంతట బాణాసురుం గూర్చి కృష్ణుఁడిట్లుపల్కెను. బాణా! ఏమో గర్జించుచున్నవాఁడవే ఏల? శూరులు బీరములాడరుసుమా! రమ్ము.రమ్ము. యుద్ధమొనరింపుము. వృథామాటలేల? వాక్కులచే యుద్ధములు సాగునెడల నీకే విజయము కల్గును, అది యాచారము కాదు. కావునఁ దులువమాటలు పలుకక యుద్ధమొనరింపుము. రమ్ము. రమ్ము నన్ను జయింపుము. ఓడిపోయి యమవాక్కుఖుఁడనై యుండెదనులే. అనిపలికి మర్మముల భేదించు నిశితబాణముల నొప్పించెను. ఆబాణములమోఘములు. వానిచే నొచ్చి బాణుఁడు నిశాతబాణములఁ గురిపించెను. అంతట మానక పరిఘాద్యాయుధములచే హరిని నొప్పించెను. అత్తఱి హరి ద్విబాహువయి యే యుండెను. సహస్రబాహువు ద్విబాహుచే నొప్పింపఁబడియెను. అంత బాణాసురుఁ డాకయన్త్రరాజమును బ్రయోగించెను.అది బ్రహ్మ

* అద్య బాహు సహస్రేణ కథమష్టభుజో రణే. అని మూలము.

నిర్మితము. తపస్సారము. అరిజన నాశకము. అప్రతిమానము. దాన దిక్కులు తెల్వితప్పెను. దానఁ బెక్కులస్త్రములు ప్రభవిల్లెను. దానవులు మేలుమే లని పొగడిరి. ఆయస్త్రమునఁ గల్గుతిమిరమును పర్జన్యదేవతాకమగు నస్త్రమునఁ దొలఁగించెను.

బాణుండాగ్రహించి ముసలాదులఁ బ్రయోగించి హరిని నొప్పించెను. హరి నవ్వుచు వానిం దునియలు గావించెను. వానికవచమును జించి చేతుల నున్న కార్ముకవ్రాతమును ఛేదించెను. ఒక్కకత్తివాతియమ్మున నురమ్ము భేదింపఁగా నాబాణుఁడు మూర్ఛిల్లెను. చంకలుతట్టుచు నారదుఁ డాడెను. ఓహో! నాజన్మముసఫలము. జీవితమును జీవితమయ్యెను. భగవత్పరాక్రమమును గన్నులారఁ జూడనోచితిని. దేవకంటకునోడించి జయలక్ష్మిని జేకొనుము. నీయవతార మిందులకే కదా. అవతారమును సఫలముగ నొనరింపుము. అత్తఱి నాయిరువురసంగరము దుర్భరమయ్యెను. గరుడుఁ డాతని మయూరధ్వజమును బడనేసెను. దాన బాణుఁడు తత్తఱపాటొందెను. ఆవిధ మాత్మ నెఱింగి శివుఁడు బాణునిఁగాపాడ నందీశ్వరుని బంపెను. నందీశ్వరుఁడు రథమును గొనిపోయి బాణాసురుం గాంచి యసురేంద్రా! యీరథమెక్కుము. దానవాంతకునితో సంగర మొనరింపుము. అనఁగా నారథము నెక్కి బాణుఁడు యుద్ధాభిముఖుఁడయ్యెను. ఆరథ మప్రతిహతముగా బ్రహ్మచే నిర్మింపఁబడినది. దానినెక్కి మహారౌద్రాస్త్రమును బ్రయోగించెను. అదియే బ్రహ్మశిరోనామకంబనం బరఁగును. దానిని జక్రజ్వాలల మరలించి కృష్ణమూర్తి దానవా ఇంతకుముందు

ప్రల్లదములాడితివి. ఇపుడేమి యూరకున్నాఁడవు. ఇదె నేనీ యెదుట నున్నాఁడను. పురుషుఁడవుకమ్ము. యుద్ధమొనరింపుము. కార్తవీర్యార్జునుఁడు సహస్రబాహువులనుదించి ద్విబాహువగు రామునిచే నోడింపఁబడియెను. నీసహస్రబాహుత్వము నాద్విబాహుత్వము చూతువుగాక. ఈయుద్ధమున నీదర్పమడంచెదను. అనిపలికి సర్వతేజస్సంభృతమగు చక్రమును గైకొనియెను. ఆవిధమెఱింగి రుద్రాణి పరశివునిగాంచి యజేయమగు చక్రమును గృష్ణుఁడు గ్రహించెను. చక్రాయుధమును హరి ప్రయోగింపకుండఁగనే దానవుని గాపాడుము. అన నాలంబాదేవింగాంచి దేవీ నీవరిగి బాణాసురుని గాపాడుమనియె. ఆదేవియు సర్వభూతాదృశ్యయై కృష్ణునకు మాత్రమే తనరూపమును గనఁబఱచుచు వస్త్రవిహీనయై వాసుదేవుని యెదుట నిల్చెను. మరలనరుదెంచిన యాదేవింగాంచి యీబాణునివధించెదను. సంశయములేదనియె. ఆదేవియు శ్రీహరీ! నీవుపరమపురుషుఁడవని యెఱుంగుదును. వీనివధించుట న్యాయముకాదు. అభయమిమ్ము. నేనీతని జీవింతువుగాకని వరమిచ్చితిని. నావాక్కు మిథ్యకాకయుండునట్లు చేయుము. అనుటయు హరి యిట్లనియెను. నామాటసత్యము. ఈబాణుఁడు సహస్రబాహువుల నాట్యము చేయుచున్నవాఁడు. గర్వించి యేరిని లెక్కపెట్టకున్నవాఁడు. ఈసహస్రబాహువులను ఛేదించవలయు. ఇందులకు సందియములేదు. ద్విబాహువులు గల బాణునిచే జీవపుత్రివికాఁగలవు. ఆసురదర్పమునాశ్రయించి కన్నెఱుంగక యున్నవాఁడు. అని యక్లిష్టకర్ముఁడగు హరి

యిట్లు పలుకఁగా నాదేవి యీబాణుఁడు దేవదత్తుఁడే యగుఁ గాక.

ఈరీతి నామెపలుకఁగా కుమారజననిని సంతోషపఱచి బాణునిజూచి హరి దానవా! ఇఁక యుద్ధముచేయుము. కోట వీదేవికలదు. సీ! పౌరుష మిఁదికాల్పనే. అశక్తులపద్ధతి యిది యగును. అనిపలికి నిమీలితాక్షుఁడై సుదర్శనమును బ్రయోగించెను. లోకంబు లాకులములయ్యెను. ఆచక్రము సహస్ర రశ్మికిరణములమించి వెలుఁగుచు బాణాసురునితేజము నపహరించి బాహుసహస్రమును ఖండించెను. రెండుబాహువులు మిగులునట్లుచేసి మరల హరికరము నలంకరించెను. బాణుఁడు రక్తసిక్తాంగుఁడై మహానాదముగావించెను. ఆనాదమునకు నాగ్రహించి మరలఁ జక్రమును బ్రయోగింపఁబూనఁగా మహాదేవుఁడు నివారించి శ్రీకృష్ణా! నిన్నుఁబురుషోత్తమునిగ నెఱుంగుదు. మధుకైటభులసంహరించిన యాదినారాయణుఁడవు నీవేకదా. కావున నీచక్రము నుపసంహరింపుము. బాణాసురున కభయమిచ్చితిని. నావాక్యము వ్యర్థకారాదు. కాన దీని నుపశమింపుము. అన హరి మహాదేవా! బాణుఁడు జీవించుగాక. చక్రమును మరలించితిని. నీవు దేవాధీశులకును మాన్యుఁడవు. నీకునమస్కరించుచున్నవాఁడ. ఇఁక మరలిపోయెద. వచ్చిన కార్యమైనది. ఇఁకఁజేయఁదగిన పనిలేదు. నాకనుజ్ఞనిమ్ము. అని పలికి మహాదేవునకుఁ దృష్టియొనరించి శ్రీకృష్ణమూర్తి యనిరుద్ధుఁ డున్నతావున కరిగెను.

శ్రీహరి పోవుచుండ నందికేశ్వరుఁడు బాణాసురా! మహాత్ముని బ్రసన్నునిజేయఁ బొమ్ము. ముందుగా నరుగుము.

ద్విబాహువగు బాణుఁ డట్లే యని పోయెను. నంది మరల బాణుంజీరి శ్రీకంఠుని మ్రోల నృత్యము చేయుము. జీవితార్థివగు దేనట్లు చేయుమనఁగా రక్తసిక్తాంగుఁడై మహాదేవునిముందు నాట్యముచేసెను. దీనుఁడై నాట్యముచేయు బాణునిజూచి మహాదేవుఁడు కరుణాసంభరితాంతఃకరణుఁడు కావున దానవాధీశా! వరమడుగుము. మనస్సులో దేనిని గాంక్షింతువు? నాకు విశేషించి ప్రియుఁడవైతివి. అనుటయు నాయాసుర వరుఁడు మహాత్మా! అజరుఁడవై యమరుఁడవై యుండ వరమనుగ్రహింపుము. ఇది మొదటివరము. అనఁగా శంకరుఁడు బాణాసురా! దేవతలతో సమానుఁడవై యుండఁగలవు. నీకుమృత్యువు లేదు. రెండవవరమునడుగుము. రక్తసిక్తాంగుండనై మిగులఁ బీడితుఁడనై, వ్రణపీడితుఁడనై నేనెట్టు లున్నవాఁడనో యట్లే యున్న భక్తుఁడు నృత్యముచేసినఁ బుత్రజన్మము కావలయు. ఇది యొక వరము. అని యడుగుటయు హరుఁ డానందపరవశుండై నిరాహారులై క్షమావంతులై సత్యార్జవసమన్వితులై యుండు మద్భక్తు లెవరు నృత్యము నాయెదుట జేయుదురో వారి కట్టి ఫలముగలుగును. బాణాసురా! మూఁడవ వర మడుగుము. చక్రతాడనసంభూతమైన యీశ్రమము తీవ్రముగానున్నది. మూఁడవవరముచే నీబాధ శాంతించుఁగాక. ఆశ్లే యగుఁగాక. నీకు శుభముగలుగుఁగాక. కష్టమింక నీకుఁ గలుగదు. నీగాత్ర మక్షతంబగును. యథాపూర్వసుఖము నొందుము. అని హరుఁ డనుగ్రహించి నాల్గవవర మడుగు మిచ్చెదననియె. విముఖుఁడనని తలంపకుము. ప్రమథగణములలో నేను బ్రథముఁడగున ట్లనుగ్రహింపుము.

మహాకాలనామమున జాలకాలము విఖ్యాతి నొందఁగలను. అనియుడుగ నట్లేయగుఁగాక యని శంకరుఁడాజ్ఞాపించి దానవా! నాయనుగ్రహమున నిరుజతనీకుంగల్గును. ఐదవవరము నీయ నిచ్ఛయించితిని. అనఁగా నాకలవడిన యిప్పటివై రూప్యము గలుగకుండుఁగాక. నాదేహము ద్విబాహువైనను విరూపము గనుండ రాదు. అనన ట్లేయగుఁగాక. భక్తులకొసంగరాని వరమేది యు నాకుంగలుగదు. అని పలికి తనమ్రోలనున్న బాణునితో నీవడిగినవరములనిచ్చితి సుఖంబుండు మని పలికి తనపరివార ముతో నందే యదృశ్యతం గాంచెను.

## ఉషానిరుద్ధులందోడ్కొని హరి ద్వారవతికరుగుట.

*బాణుండీగతి భగవంతునివలనవరములను సంపాదించు కొని మహాకాలత్వము నొందెను. అంత వాసుదేవుండు నారదమునింగాంచి మునివర్యా! నాగపాశబద్ధుఁడై యనిరుద్ధుఁ డెందున్నవాఁడు? నామనస్సు స్నేహాక్లిన్నమైనది. కావుననే యడుగుచున్నాఁడను. తన్నిమిత్తమేకదా వచ్చితిని. ఆనా ర్తంబెలుపుము. అనిరుద్ధుఁ డిపుడు నష్టశత్రువు. కాన నాతనిం గాంచఁగోరెదను. నీకాప్రదేశము తెలిసియేయుండును గదా. అని భగవంతుఁడు సర్వజ్ఞుఁడయ్యు లోకాచారపరిపాలనార్థము పలుకఁగా దేవముని మహాత్మా! కన్యాపురమునందు నాగపాశ బద్ధుఁడై యున్నవాఁడని చెప్పునంతలోఁ జిత్రలేఖయు నరు దెంచెను. వచ్చి శ్రీహరింగని మహాత్మా! ఇదియే బాణాసురేం

* ఈ కథ హరివంశాంతర్గత విష్ణుపర్వమున నూటయిరువదేడవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

ద్రుని దివ్యసౌధము ప్రవేశింపుడు. అనఁగానే శ్రీకృష్ణ బలదేవ ప్రద్యుమ్న సుపర్ణ నారదులు ప్రవేశించిరి. గరుత్మద్దర్శనమాత్రమున నాగపాశములు విడిపోయెను. అవి శరరూపము లుగాఁ బరివేష్టించియున్న యానాగపాశములు తమంతన వీడిపోయెను. శరములుగాఁ గ్రిందఁబడియెను. శ్రీహరికరస్పర్శదర్శనములఁ బ్రీతచిత్తుఁడై యనిరుద్ధుఁడు ప్రాంజలియై యిట్లు పలికెను. మహాత్మా! దేవాధీశులు నిన్ను మార్కొనఁజాలరన నిఁక నీబాణాసురుఁ డెంతటివాఁడు. నీయనుగ్రహమున బ్రదికితిని. అనిపలికి బలదేవునకు నమస్కరించి శ్రీహరికి నమస్కరించి గరుత్మంతునకుఁ బ్రదక్షిణనమస్కారము లొనరించి పితృచరణులకు వలగొని మ్రొక్కెను. ఉషాకన్యకయు నంతఃపురమునుండి యరుదెంచి వరుసగా బలదేవాదులకు మ్రొక్కి లజ్జావనతవదనయై నిలువంబడెను. అంత శతక్రతుప్రేరితుఁడై నారదముని యుషాసహితముగా నందఱకు నమస్కరింపుమా యని యనిరుద్ధునకుఁ జెప్పఁగా నతఁ డట్లే మర్యాదనడపెను. నారదుఁడు హరితో విఖ్యాతముగా వివాహము నడపుము. నేఁజూడఁగోరెదను. అనఁగా నెల్లరునవ్వి తమయుత్సాహమును దెలిపిరి. శ్రీహరియు నారదవచనము ననుసరించి వివాహము నడపుఁడనియెను.

అంతలోఁ గుంభాండుఁడు వివాహసంభారములను గొని యరుదెంచి కృష్ణపరమాత్మనుదర్శించి యిట్లుపలికెను. మహాపురుషా! శ్రీహరీ! అభయప్రదుఁడవు. శరణాగతుఁడను. కరుణింపుము. ఇదెదోసిలొగ్గితిని. అనఁగా హరినారదవాక్యముచొప్పున నీకభయమొసంగితి. నీవు కడుబుద్ధిమంతుఁడవు. మంత్రి

శ్రేష్ఠుఁడవు. పుణ్యాత్ముఁడవు. సబంధుమిత్రముగా సుఖ ముండుము. నీకు రాజ్యమొసంగితిని. రాజవై చిరకాలము సుఖింపుము. అనిపలికి కుంభాండునకు రాజ్యమిచ్చి వివాహ ముషానిరుద్ధులకుఁ జేసెను. భగవంతుఁడగు జాతవేదసుఁడు స్వయముగా నరుదెంచి హోమద్రవ్యములఁబరిగ్రహించెను. అచ్చరలు పాటలుపాడిరి. వివాహము సవిధిగా సక్రమముగా నడచెను. శ్రీహరి వివాహానంతరము శంకరుఁబ్రార్థించి యాను మతింగొని ద్వారకా నగరాభిముఖుఁ డయ్యెను. అత్తఱిఁ గుంభాండుఁడు దోసిలొగ్గి ప్రయాణముసాగింప నెల్లరు ద్వార కకుఁ బయనమైరి. గరుడారూఢుఁడై హరియుఁ దక్కినవా రలనెక్కించెను. కుంభాండుఁడు హరితో మహాపురుషా! బాణాసురునిగోవు లసంఖ్యాకములు వరుణునికడనున్నవి. వాని క్షీరములమృతకల్పములు. వానింద్రావిన నరుఁడు దుర్జయుం డగు ననియె. మంచిదని యంగీకరించి పయనము సాగించుచు బశ్చిమదిక్కునకుం బోయి యందు బాణుని ధేనువులంగాంచిరి. అవి సముద్రతీరభూముల మేయుచుండెను. నానావర్ణవిరాజి తములై యుండెను. కుంభాండుఁడు చెప్పినగుఱుతులం బట్టి వానినెఱింగి గరుడునితో నాగోవులకడ కరుగుము. సత్యభా మయు బాణాసురుని ధేనువులం గోరెను. కావున వానింగొని పోవలయు. ధర్మలోపముకాదని తోఁచెనేని కొనిరానను మతిం పుము. అనిసత్యభామతాఁజెప్పెను. అనవుఁడు గరుడుఁడు పక్ష వాతమున సాగరజలమును శోషింపఁజేసి వరుణలోకమున కరి గెను. వరుణునిగోవులన్నియు విభ్రాంతములయ్యెను. ఆ ధేనువు లరక్షించు సేనలు నానాప్రహరణములంగూడి యుద్ధసన్నద్ధు

లైరి. గరుడునకు నా సైనికులకు ఘోరాహవము చెల్లెను. వాసుదేవుఁడు వారలఁ జెల్లాచెదరుగఁ బాఱఁదోలెను. వా రెల్లఁ బాఱిపోయి వరుణాలయముంజొచ్చి మొఱపెట్టఁగా గ్రొత్తసైనికు లఱువదివేలసంఖ్యచేఁ బరిగణింపఁదగినవారువచ్చి మార్కొని నానాయుధములఁ బ్రయోగించి మహాహావము సల్పిరి. ప్రద్యుమ్నానిరుద్ధగరుత్మంతులు చెలరేఁగి వధించిరి. సైన్యనాశనము నాలకించి మహాకోపమున వరుణుఁడు వాసు దేవునిమార్కొన నరుదెంచెను. మునులులోనగు వారాతనిం బొగడసాగిరి. పాండురచ్ఛత్రము వరుణునిపై మెఱయుచుం డెను. పుత్త్రపౌత్త్రులాతని వెంట ననికి నడచిరి. హరుఁడు నొప్పిం చినచందమున వరుణుఁడు హరిని దీవ్రబాణంబులనొప్పించెను. హరియుఁ బాంచజన్యముంబూరించి బాణములఁ బ్రయోగించి దిక్కుల విదిక్కుల నావరించెను. వానిని సరకుసేయకనవ్వుచు వరుణుఁడుపోరాడెను. హరియు ఘోరతర వైష్ణవాస్త్రమును ధరియించి యెదుటనున్న వరుణునితో సలిలాధీశా! యీయస్త్ర ము వైష్ణవాహ్వయము. మహాఘోరము శత్రునాశనమునొన రించునది. నినుంబొలియింపఁ జాపమునఁగూర్చుచున్నవాఁడను. ఇంచుకనిలువుము. స్థిరుఁడవుకమ్ము. అనుటయు నాతండు వారు ణాస్త్రమును వైష్ణవాస్త్రమునడంపఁ బ్రయోగించెను. దాన ననేక బాణములుప్పతిల్లెను. ఆయస్త్రము మండుచుండఁగా జల ములందుద్భవిల్లి మండుచుండఁగా వైష్ణవాస్త్రము ప్రదీప్తమై వానినడంచెను. ఆవిధమెఱింగి వరుణుఁడు శ్రీకృష్ణుంజూచి మ హాత్మా! యవ్యక్తమై వ్యక్తలక్షణమై తనరు నీప్రకృతిం దలం పుము. తమోగుణంబునఁ జొరపడుచున్నాఁడవు. సత్వస్థుఁడవు

కమ్ము. యోగీశ్వరా! మహాత్మా! పంచభూతాశ్రయములగు దోషముల నహంకారమును వదలుము. వైష్ణవీమూర్తులలో నందు మొదటిమూర్తి నాస్వరూపము. జ్యేష్ఠభావముచేతనైన మన్నింపఁదగుదును. అట్టి నన్నేల కాల్పఁబూనెదవు? అగ్నిపై నగ్ని విక్రమింపదు కదా. క్రోధముపసంహరింపుము. నీతోఁబోరాడఁ గలనా. జగత్ప్రభువవుకదా. వికృతాత్మికయగు ప్రకృతి మున్ను నీచే సృజింపఁబడియెఁ గదా. పూర్వోధర్మము నాశ్రయించి యాప్రకృతి వెలయును. ఆగ్నేయ వైష్ణవ సౌమ్యములు తజ్జనితములు. నీచేతనే యీప్రపంచములు సృజింపఁబడినవి. అట్టి నీవు నాపైనలుగనేల? నన్ను రక్షింపుము. రక్షింపఁ దగినవాఁడను. మహాపురుషా! నీకు నమస్కారము. లోకాదికర్తవు. నీచేతనే యీబ్రహ్మాండము విపులముగా నొనర్పఁబడినది. బాలుఁ డాటవస్తువులతో నాడుకొనునట్లు విహరించుచున్నవాఁడవు. అధర్మనిరతులను వంచింతువు. ఈవవువు తమోఽభిభూతమగు నపుడు రజస్సుచేత సంస్పృష్టమగునపుడును మోహము ప్రవర్తిల్లును. ఏల మోహపరవశుఁడవై మమ్మెల్లఁ బొలియింపఁ బూనెదవు? అని యిట్లు వరుణుఁడు వినుతింపఁగా లోకపరాయణుఁడగు శ్రీకృష్ణుఁడు భావజ్ఞుఁడు గావునఁ బ్రీతచిత్తుఁడయ్యెను. నవ్వుచు నిట్లుపలికెను. వరుణదేవా! శాంత్యర్థమీగోవులనొసంగుము. అన విని వరుణుఁడు మహానుభావా! బాణాసురునితో నొకసమయము చేసికొంటిని. దానిని విఫలమగునట్లు చేయనగునా. నీవే సమయభేదమొనరించినఁ జారిత్రము దూష్యమగును. సజ్జనులును దానికి హర్షింపరు. ఈశ్వరుఁడు ధర్మభాక్కు. సమయము నతిక్రమించి ప్రవర్తించువాఁ

డు పాపములను బొందును. నాయెడం బ్రసన్నుఁడవు కమ్ము. ధర్మ లోపముగలుగకుండఁజేయుము. ప్రతిజ్ఞాభంగకర్త వరుణుఁడను పేరు నాకుఁ గలుగనీయకుము. జీవించియుండి గోవులనీఁజాలను. నన్నుం బొలియించి గోవులంగొనిపొమ్ము. ఇదియే నా శపథము. బాణాసురుఁ డీసమయము నాచేఁ జేయించి గోవుల నొసంగెను. ఇది సత్యము. ఇందసత్యముగాని మోసముగాని యించుకంతయు లేదు. నే ననుగ్రాహ్యుఁడనేని గాపాడుము. గోవులేవలయునేని నన్నుఁ జంపి కొనిపొమ్ము.

ఇట్లు వరుణుఁడు విన్నవింపఁగా శ్రీహరి యాసమయమభేద్యమగుట చక్కఁగా నాలోచించి నవ్వి గోవులయందాశ వదలి వరుణా! బాణాసురునితోటి సమయమిట్లు చేసికొంటివి గాన వదలితిని. నీవు న్యాయసమ్మతములై ధర్మసంయుతములగు మాటలు పల్కినపుడు పాపము నీకుంగల్గునట్లు నేనేల చేయఁ బూనుదును? ఇఁక వెళ్లుము. సత్యప్రతిజ్ఞుఁడవైతివి. నీప్రియముగోరియే బాణాసురుని గోవులవదలుచున్నాఁడను. ఇందులకు సంశయములేదు. అని పరమేశ్వరుఁడు సంభాషింపఁగాఁ బరమామోదమున వరుణుఁడు దివ్యార్ఘ్యమును గొని వచ్చి శ్రీకృష్ణుని బూజించెను. ఆయర్ఘ్యమును బరిగ్రహించి యతనికభయమొసంగి తద్బలముల సమ్మానించి ద్వారకానగరమునకు బ్రయాణమయ్యెను. దేవతలందఱు హరి ననుసరించిరి. నారదమహర్షియు బాణాసురుని జయించుటకు సంతృప్తినొంది ద్వారకకు శ్రీకృష్ణుని వెంటఁ బ్రయాణముసాగించెను. నగర ప్రవేశమునకు ముందే పాంచజన్యరవమునఁ దమరాకను బౌరులకుం దెల్పెను. దేవతలయాగమనమును బాంచజన్య

జయఘోషము నెఱింగి పౌరులందఱు పరమానందభరితులైరి. లాజలుచల్లి తమయానందమును హరికెఱింగించిరి. బ్రాహ్మణు లాశీర్వచనములఁ బరమేశ్వరు నుపాసించిరి. పౌరులెల్ల బాణ జయమును బొగడుచు శ్రీకృష్ణునెదుర్కొని యుచితమర్యా దల గారవించి గృహప్రవేశము చేయించిరి. విమానముల యందుండి దేవతలు చూచుచుండిరి. ప్రద్యుమ్నాదులందఱు తమతమగృహములను బ్రవేశించిరి. ఉషాకాంతామణిఁగూడి యనిరుద్ధుఁడు గృహప్రవేశముఁ చేయఁగా నంతఃపురవాసిను లానందసాగరమున నోలలాడిరి. ఇంద్రాదులు హరిని వినుతిం చిరి. ఎవ్వరెవ్వరి నివాసములకు వారెల్ల నరిగిరి. భగవంతుఁ డిట్లు తనయవతారమును సార్థకముగా నొనరించి పరమేశ్వ రుండని యెల్లరుఁ దన్నుఁగొలువ ద్వారకానగరమున సుఖ ముండెను.

మహాశయులారా! ఉషాకల్యాణకథ నాలకించితిరి. పురాణభేదములవలనఁ గలిగినకథాభేదము నెఱింగితిరి. ఈకథ నుగూర్చి వ్రాయఁదగు విశేషములు పెక్కులుగలవు. ఒక్కొ క్కదానిని జర్చించి వ్రాసినఁ గథకంటె నెక్కువగ్రంథమగును. కాన నాఁపనికింబూనక ముఖ్యతమవిషయములం దాఁకి యించు కవ్రాసెదను. మానననయితిగాదు. పెంచివ్రాయ స్థలము చాలదు. ఊరకుండ మనస్సొప్పదు. కావున సంగ్రహముగ వ్రాసిన యీనాయాశయము నించుక పరిశీలింపుఁడు పరిశీలించున పుడీ వాదమును ఖండింపవలయునన్న బుద్ధిని మాత్రముఁ సమా శ్రయింపకుఁడు. ఈకథ విష్ణుభాగవతమున నున్నయట్లితరపురా ణములయందు లేదు. హరివంశముప్రధానముగా జేసికొని

యితరపురాణములంగలిపికొనుచు వ్రాసితీనని యెఱుంగవలయు. భేద మించుకయున్నను గథాసార మొక్కటియే. దానినెఱుంగుట'యే ముఖ్యము.

బాణాసురుఁడు బలిపుత్త్రుఁడు. తపస్సొనరించి శంకరు మెప్పించి వరములనొందెను. కాని వరలాభమున గర్వించెను. తపస్సు సత్త్వగుణప్రధానమయ్యె నేని జ్ఞానము నొసంగును. కృతకృత్యునిం జేయును. అది రాజసమైన నహంకారమును వృద్ధి చేసి యైశ్వర్యాదుల నొసంగి యంతతో విరమించును. అది తామసమైనచో నజ్ఞానము వృద్ధియై స్వల్పవాంఛల నొసంగును. ఈవిషయమే గీతాశాస్త్రమునందు

శ్లో. సత్త్వం రజస్తమఇతి గుణాః ప్రకృతిసంభవాః,
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్. ౫
తత్రసత్త్వం నిర్మలత్వా త్ప్రకాశకమనామయం,
సుఖసంగేనబధ్నాతి జ్ఞానసంగేనచానఘ. ౬
రజోరాగాత్మకంవిద్ధి తృష్ణాసంగసముద్భవం,
తన్నిబధ్నాతికౌంతేయ కర్మసంగేన దేహినమ్. ౭
తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్,
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత. ౮
సత్త్వంసుఖే సంజయతి రజః కర్మణి భారత,
జ్ఞానమావృత్యతుతమః ప్రమాదే సంజయత్యుత. ౯
రజస్తమశ్చాభిభూయ సత్త్వంభవతి భారత,
రజస్సత్త్వంతమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా. ౧౦
సర్వద్వారేషు దేహేఽస్మిన్ ప్రకాశఉపజాయతే,
జ్ఞానం యదాతదావిద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత. ౧౧

లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమస్స్పృహా,
రజస్యేతానిజాయంతే వివృద్ధే భరతర్షభ. ౧౨
అప్రకాశో ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవచ,
తమస్యేతానిజాయంతే వివృద్ధే కురునందన. ౧౩
యదాసత్త్వే ప్రవృద్ధేతు ప్రళయంయాతి దేహభృత్,
తదోత్తమవిదాం లోకానమలాన్ ప్రతిపద్యతే. ౧౪
రజసి ప్రళయంగత్వా కర్మసంగేషు జాయతే,
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే. ౧౫
కర్మణస్సుకృతస్యాహుస్సాత్త్వికం నిర్మలంఫలమ్,
రజసస్తు ఫలందుఃఖ మజ్ఞానం తమసఃఫలమ్. ౧౬
సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ,
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవచ. ౧౭
ఊర్ధ్వంగచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛంతి తామసాః. ౧౮

౧౪. అధ్యాయము.

అను నీశ్లోకములచేతఁ జెప్పఁబడినది. రజోగుణమునకు ఫలమనుభవించెను. కావున భగవదారాధనము చేయునపుడు సత్త్వగుణము నాశ్రయింపవలయును. అదిలేకున్న నాతపఫలము జ్ఞానముగాఁ బరిణమింపదు. రజస్సుచే నహంకారము కలిగెను. కావున శంకరునే నాకు యుద్ధముచేయు కుతూహలము గలదు కాన నది యెపుడు కలుగునని కోరెను. శంకరుఁడావిధ మెఱింగి భవిష్యత్ఫలము నాలోచించి తగిన సమాధానము చెప్పెను. కాని భక్తుని మృతునిగాకుండఁ గాపాడెను. ఇదియే భగవత్కారుణకు ఫలము. గర్వమడంగినఁగాని భగ

వత్సంపూర్ణకరుణ కలుగదని యెఱుంగవలయును. అదిబాణుని చరిత్రమునుండి తేలును. కావున భక్తులందఱును సత్త్వగుణప్రధానముగా భగవదారాధనము చేయవలయును.

ఉషాకన్యక వనవిహారము చేయుచుబోయి గౌరీశంకరులను గాంచి యట్లే తానుండఁగోరెను. భగవతి యావాంఛ నెఱింగి తగినభర్తను బొందుదువుగాక యని యానతిచ్చెను. గౌరీప్రసాదమున సుఖమే కలుగక దుఃఖ మేలకలుగవలయు నను ప్రశ్నముదావచ్చును. భర్తను దగిన వానిని బ్రసాదించుమా యని కోరక గౌరీశంకరులవలెఁ దా నెపుడుందునా యని కోరరాదు. తల్లిదండ్రులప్రీతిని గోరరాదు. ఆలోపము గలదు. కావుననే పార్వత్యనుగ్రహము కల్గినను ఇందుక దుఃఖము ననుభవించెను. కాఁబట్టి తల్లిదండ్రులవలె నుండఁ గోరరాదని యిద్దియే తెలుపుచున్నది.

పూర్వము యోగాభ్యాసము స్త్రీపురుషులకు నుండెను. ఈవిషయము చిత్రలేఖచరిత్రమువలన స్పష్టమయ్యెడిని. పరిచారికకింతటి యోగశక్తికలదా యని కొందరాక్షేపింతురు. కాని వారికి యోగాభ్యాసమహిమము తెలియదా యని యనుమానింప నవకాశము గలదు. ఈ యోగసూత్రములం దిలకించిన శంక తొలఁగును.

సూ. కాయరూపసంయమాత్తద్గ్రాహ్యశక్తిస్తంభేచక్షుఃప్ర
కాశాసంప్రయోగేఽంతర్ధానమ్. ౨౧
మైత్ర్యాదిషుబలాని. ౨౩
బలేషు హస్తిబలాదీని. ౨౪

బంధకారణ శైథిల్యాత్ప్రచారసంవేదనాచ్చ చిత్తస్య
పరశరీరావేశః. ౩౮

కాయాకాశయోః సంబంధ సంయమాల్లఘు తూలస
మాపత్తేశ్చాకాశగమనమ్. ४౨

పాతంజలయోగసూత్రము - విభూతిపాదము.

సర్వసిద్ధులు యోగమునభ్యసించినఁగలుగు. అంతర్ధానాదులు సులభములేగాని విశేషసిద్ధులలోఁజేరవు. వియద్గమనము పరకాయప్రవేశము లోనగు నవి చిత్రరేఖకుం దెలియును. తిరస్కరణీప్రభావమున నదృశ్యయై యనిరుద్ధుని దూలలేశము వలెఁ గొనితెచ్చెను. హనుమంతుఁడు మహాభక్తశిఖామణి యోగవిద్వర్యుఁడు కావుననే ద్రోణాచలమును, దృణమువలె మోసికొనివచ్చెను. నారదాదిమహర్షులు ముల్లోకముల గ్రుమ్మరుచుండుట యోగప్రభావమునఁ గాక మఱేమిటి? కావున యోగవిద్యామహాత్మ్యమపారము. కావుననె

తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున.

౬-అ. ४౬-శ్లో.

అని గీతాశాస్త్రమునందు భగవంతుఁడు పరమభక్తుఁడగు నర్జుననకు నుపదేశించెను. యోగిగాక తత్త్వవేత్తననుకొను వాఁడు వంచకుఁడనంబడు. కనుకఁ జిత్రరేఖ యోగశాస్త్ర విద్వరిష్ఠయగును. కావుననే యంతఃపురమున నున్న యనిరుద్ధుని దెచ్చి యుషాకన్యయెదుటఁ బెట్టఁజాలెను.

ఉషాకన్యక కలఁగాంచియుండొక సుందరాంగుగాంచినట్లును, తత్సంగతి మెలంగినట్లును దెలిసికొని లేచి తనసత్ప్రి

వర్తనము దుష్టమాయెనని విలపించెను. చెలికత్తియ లామె నూఅడించుచు

శ్లో. నచ స్వప్నకృతో దోషో మర్త్యలోకేఽస్తిసుందరి.
అని హితము తెల్పిరి. మానవలోకముననుండు వారికి మనో వాక్కాయముల నొనరించిన పాపమే ఫలమునిచ్చునుగాని స్వప్నదోషము ఫలమునీయదనిరి.

శ్లో. మనసాచైవ వాచాచ కర్మణాచ విశేషతః,
దుష్టాయాత్రిభిరేతైస్తు పాపా సా ప్రోచ్యతే బుధైః.
అని యభియుక్తోక్తుల నుదాహరించిరి. దీని నించుక విచారింతము. మానవలోకవాసు లల్పాయుష్కులు. అల్పవీర్యులు. అల్పసంకల్పులు. స్వప్నదోషములు కూడ వీరిని బాధించునని శాసించినచో నింక(బుణ్యాత్ముండుండుట యే యరుదగును. కావున వీరికిఁ దగినవిధమును శాసింపవలయునని యాలోచించి పరమకారుణికులగు మౌనులు యుగధర్మములను నిర్ణయించి యాకాలమునకుఁ దగిన పుణ్యకార్యములను శాసించిరి. పాప కార్యము లివి యనియు నిర్ణయించిరి. ఇట్టివి యితరయుగము లయందు దోషములైనను గలియుగమున దోషములు కావ నియుఁ దీర్మానించిరి. అందు స్వప్నదోషములు ఫలమునీయ వనునదియు నొక్కటియని పై ప్రమాణవాక్యము తెల్పుచున్నది. స్వప్నదోషమునను దనవ్రతమునకు భంగమయ్యెనని యుపాకస్య పరితపించెనుగదా. అప్పటిస్త్రీరత్నముల నియమ మెంత పరిశుద్ధమైనదో దీనినుండి గ్రహింపవచ్చును. పరపురుషస్పర్శము స్వప్నమునందును గాఁగూడదని వారిభావము. ఇప్పుడది యెట్లున్నదో తెల్లముకదా. ద్వాపరధర్మములు కలి

యుగాదియందే యిట్లుమార్పు నొందెనని తెల్లముకదా. ముందెట్లు మార్పునొందునో చూడవలసియున్నది.

శ్లో. తాసాం పునో నజానంతి సంతో వేదాశ్చ వైదికాః.
అను ప్రమాణమునుబట్టి స్త్రీలమన స్సిట్టిదని మహాత్ములుగాని వేదములుగాని వేదపాఠనిరతులుగాని యెఱుంగఁజాలరఁట. ఇఁక సామాన్య మానవులకెఱుంగఁ దరంబా. కావుననే కాఁబోలు. "స్త్రీణాంచ చిత్తం పురుషస్య భాగ్యం దేవో నజానాతి కుతో మనుష్యః." అను ప్రాచీనోక్తి కల్గినది. ఔరా! ఎంతటిజ్ఞానము ప్రాచీనులకుం గల్గినది? ఎంతటి దివ్యదృష్టి వారికి నుండెను? ఇప్పటివారికిని సామాన్యదృష్టిం బరికింపఁగలరనుట సంశయమే. కలియుగమహర్షులు కొందఱుగలరు. వారిమాట వదల వలసినదే.

ఇఁక బలిచక్రవర్తి బాణాసురునిరక్షించుకొఱకు శోణిత నగరమునకరుదెంచి శ్రీకృష్ణపరమాత్మను స్తుతించినట్లు బ్రహ్మవైవర్తమునఁ గనబడియెడు. ఆస్తుతిని జక్కఁగాఁ బరిశీలించిన బ్రహ్మ విష్ణు శివులొక్కటనువనియు మూఁడుగా మాఱిరనియు స్పష్టమగును. ఇట్లు కనఁబడుచుండఁగా నీముప్పురిలో నొకరి కంటె నొకరెక్కువయని వాదులాడుట నీచముకాదా. బలి స్తుతించిన శ్రీహరి బాణునిగాపాడెద నని వరమిచ్చెను. ఆ వర మునే సార్థకము చేసెను. కారాగారమున నున్న యనిరుద్ధుఁడు దేవిని స్తుతించెను. ఆర్యాస్తుతియని దానిపేరు. అదియుఁ ద్రిమూర్తులయైక్యమునే తెలుపును. కాని తారతమ్యమును దెలుపదు. కాఁబట్టి దేవతాధీశ్వరులగు ముప్పురియందు భేద ముగల దని భావింపరాదు.

గోపకులందరును దేవతలే కాని మానవులు కారనియు భూభారహరణార్థము భగవంతునకు సాయపడుటకుగా మానవలోకమున కరుదెంచిరనియు

శ్లో. దేవతార్థం వయంచాపి మానుషత్వ ముపాగతాః,

అను హరివంశ గతాక్రూర వాక్యము తెల్పుచున్నది. గోపకులు గొల్లలనియు గోపికలు పుంశ్చలులనియు వారితో భగవంతుడు వ్యభిచరించెననియు భావించు వారాభావమును వదలవలయునని పై వాక్యము హెచ్చరించుచున్నది. మఱియు నీఘట్టమున జ్వరస్తుతికన్పట్టెడు. దానింగూర్చి నాలుగుమాటలు వ్రాయవలసియున్నది. శివజ్వరము బలదేవాదులను దూలించెను. సకలసైన్యముల దాఱుమాఱుచేసెను. తుదకు శ్రీహరితోం బోరాడెను. హరియు మూర్ఛిల్లెను. అనఁగా దీనిభావమేమి? అని మనమాలోచింపవలయును. రోగముకూడ దేవతాస్వరూపమే. రోగమనఁగాఁ గర్మమే. కర్మముకూడ భగవత్స్వరూపమే. ఆరోగము మానవరూపమెత్తినచో నెవ్వనినైనను భావించును. శ్రీహరికూడ మానవదేహము నెత్తినవాఁడు. తదుచిత కర్మఫలములననుభవింపక తప్పదు. కావుననే జ్వరము హరిలోఁ బ్రవేశించెను. దానిబాధలఁ గొలఁదినిమేషము లనుభవింపవలసిన వాఁడయ్యెను. ఎట్టివాఁడుకాని కాయక్లేశముల ననుభవింపక తప్పించుకొనఁజాలఁడని యీకథ మనకు బోధించుచున్నది. జ్వరస్తుతిగా నొనరించిన రోగశాంతియగునని చెప్పఁబడిన మాటయుం దెంతయో యర్థముగలదు. ఆ యర్థమును దెల్పుటకే

శ్లో. తచ్ఛాంతిరౌషధై ర్దానై ర్జప హోమ సురార్చనైః.

అన్నప్రమాణము చెప్పఁబడినది. రోగశాంతి కౌషధ సేవమాత్రమే చాలదు. తాత్కాలిక లాభముఁగల్గినను జిరకాల మాలాభము నిలువదు. రోగస్తుతి చేయువలయును. రోగమును స్తుతించుట యెట్లు? దానికి రూపముకలదా యను ప్రశ్నమురావచ్చును. శివజ్వరమునకు రూపముగలదని చెప్పఁబడినదికదా. అది నిశ్చయమా యని యడుగువారును గలరు. జ్వరమునకు నధిదేవతగలదు. కొన్నిపాపములు చేసిన వారి నాజ్వరాధిదేవతజ్వరరూపమున నాపాపఫలము నొసంగునని యెఱుంగవలయును. ఆజ్వరాధిదేవత నుపాసించినఁగాని జ్వరము శాంతింపదు. ఏయౌషధమొసఁగినను అది నివృత్తికాదు. కానిచో భక్తిలేనివారు మందులు పుచ్చుకొని యసాధ్యరోగము గాన నివర్తింపదని నిరాశచేసికొని యపమృత్యువుపాలగుదురు. జ్వరమున కధిదైవతము గలదని నమ్మి తత్సేవచేసిన నిరోగులగుదురు. దేవతాసేవయనఁగా జపరూపమున నాదేవత నారాధించుటయే యని యర్థము. జపముచేసి దానిసంఖ్య ననుసరించి హోమము చేయవలయును. ఈరెండుకార్యములు చేయుచు మృత్యుంజయుని జక్కఁని భక్తి నారాధింపవలయును. ఇట్టులు చేసినఁగాని రోగములు శాంతినొందవు. ఆమార్గమును మానిన వారెక్కుడుగ నున్నకాలముల యందల్పాయుస్సుజనులకుఁ గల్గుచుండు నని యెఱుంగ దగు.

ఈకాలమున దేవతా విశ్వాసము లేనికతమున నాయుస్సు నశించుచున్నది. దేవతామహిమములు నశించినవనియు నౌషధులసామర్థ్యము తగ్గినదనియు గొంద అందురు. అది మిగులఁబొరపాటు. దేవతలయందు విశ్వాసమిడి యుపాసించు

వాగులేరు. ఓషధులసత్త్వమెఱింగి విధిప్రకారము వానిం బూజించి తెచ్చువారు లేరు. గాని వానియందు సామర్థ్యము తగ్గిపోలేదు. విధిమంతముగాని కార్యముఫలింపదనుట సత్యము. అందును దైవికము మఱింతఫలింపదు. కలికాలమున నట్టివిశ్వాసము మానవులకుఁ గలుగమి నెన్నియో చెట్టలు పుట్టుచున్నవి. కావున రోగాదులకు శాంతి కేవలౌషధమే గాక దేవతారాధనము కూడ వలయునని తెలిసికొనవలయును.

మార్కండేయముని హరిహరులను స్తుతించిన విషయమును గూర్చి నాలుగు మాటలు వ్రాసెదను. ఆస్తుతిని బారాయణముచేయుటమాత్రమేచాలదు. దానిసారము నెఱుంగవలయును. భేదభావము నది పాఱఁదోలును. అగ్నియందగ్ని ప్రవేశించిన నగ్నియే యగును. జలమున జలము ప్రవేశించిన జలమేయగును. అట్లే భగవత్కళ రుద్రరూపమున బ్రవేశించిన రుద్రుఁడయియనఁదగును. హరిరూపమునందు బ్రవేశించిన హరియనఁదగు. సూర్యకాంతి మలినజలమున బ్రవేశించిన మలినముగఁ గన్పడు. నిర్మలజలములఁ బ్రవేశించిన నిర్మలముగాఁ గన్పడు. వస్తువొక్కటియే యైనను స్థలభేదము ననుసరించి మార్పునొందినట్లగపడును. కావున నీహరిహరుల కేవిషయమునఁ జూచినను భేదము గానరాకున్నది. ఈవిషయమునందు

శ్లో. త్వయా యదభయం దత్తం తద్దత్త మఖిలం మయా,
మత్తో విభిన్నమాత్మానం ద్రష్టుమర్హాసి శంకర. ౭౭.
యోఽహం సత్వం జగచ్చేదం నదేవాసుర మానుషం,
మత్తో నాన్యదశేషం యత్తత్వం జ్ఞాతుమిహార్హాసి. ౭౮

అవిద్యా మోహితాత్మానః పురుషా భిన్నదర్శినః
వదంతి భేదం పశ్యంతి చావయోరంతరం హరే. ౪౯

అని విష్ణుపురాణమునఁ బంచమాంశమున ముప్పదిమూఁడవయధ్యాయమునఁ జెప్పఁబడినశ్లోకములం బరిశీలించిన హరిహరులకు భేదమును జెప్పువారవిద్యామోహితాత్ములని తేలును. విష్ణుపురాణము కూడ నిట్లే చెప్పినపుడు వైష్ణవు లిద్దానిన ప్రమాణ మందురా? ఈపురాణమును బ్రమాణమందురా? తెలిసికొనఁ జాలకున్నాఁడను. ఏపురాణమును బరిశీలించినను హరిహరుల కభేదము గన్పడియెడిని.

శివాయ విష్ణురూపాయ విష్ణవే శివరూపిణే,
యథాంతరం న పశ్యామి తేన తౌ దిశతశ్శివమ్.
యో విష్ణుస్సతు రుద్రో వై యోరుద్రస్స పితామహః,
ఏకా మూర్తిస్త్రయో దేవా రుద్రవిష్ణుపితామహాః.

అని హరివంశము.

ఇట్లే ప్రమాణములఁ జూపఁ బూనిన గొప్పగ్రంథమగును. దిఙ్మాత్రమే యుందుఁ గనఁబఱచితిని.

బాణాసురుని జంపక హరి విడిపించెను గదా. ఈవిషయము నుండి యొకనీతిని నేర్చుకొనఁదగును. భగవంతునకు శత్రువులును మిత్రులును లేరు. పక్షపాత మనునది లేదు. దుష్టుల శిక్షించునెపమున వారికుపకారము చేయును. శిష్టులఁ బాలించునెపమున వారికి నుపకారము చేయును. దుష్టులయందుఁ గ్రోధము కలదని మనము భావింపరాదు. శిష్టులయందు దయ గలదనియుఁ దలంపరాదు. ఎవ రెవరి నెట్లెట్లు రక్షింపవల

యునో వారివారి నాయారీతులం గాపాడును. కలిగించు ఫల మొక్కటియే. దేహమున వ్రణముకలిగినపుడు దానింగోయక యాతనువ్రున కుపకారము చేయ వలనుపడదు. దానిం గోసినవై చినంతమాత్రమున నా దేహమునందు భగవంతునకుఁ గ్రోధము కలదని మనము తలంపరాదు. మహర్షికి ముక్తినొసఁగి కాపాడును. ఆమునియందు దనుకంప మెండని మనమూహింపరాదు. వ్రణముగోయక యుపకారము చేయ వలనుపడని తఱి నాకార్యము క్రూరముగాఁ గానఁబడినను జేయును. దాన నా దేహి హాయిచెందును. కావున దురాత్ములకుఁ గష్టములఁ గల్పించి వారి రణరంగమునఁ జెంది పాపములఁ బోఁగొట్టి ముక్తి నొసంగును. వా రొనరించుకర్మముల కొమూర మనుకూలము. బాణాసురుఁ డెంతదురాత్ముఁడైనను గొంతకాలమింకను భూమి నుండవలసినకర్మము నొనరించినవాఁడు గావున నాతనికంతటి దౌష్ట్యమును గల్పించినది బాహుసహస్రబలమే కావున దాని నడంచి హరభక్తుఁడు కావున విడిచెను. దాన నా బాణునకు భగవంతునకు నశక్యమగు కార్యము లేదను జ్ఞానము కుదిరెను. దానిచేఁ గావరము నశించెను. అట్లు జ్ఞానము కుదురఁజేయుట యే పరమాత్మకార్యము. ఆపని నెఱవేఱఁగనే తనప్రయత్న మునుమానెను. కావున నెవ్వరుగాని భగవంతున కాగ్రహము కల్గించు పాపకార్యములు చేయరాదనియు నట్లుచేసినవారికి దుష్ఫలము కలుగక పోదనియు మనమెఱుంగవలయు. ఈయూహ మదినిల్పినచో నెవ్వాఁడు గాని దుష్కార్యముల నొనరింపఁడు. గర్వహీనుఁడగును. గర్వమునశించిన నాచోటున జ్ఞానముచేరును. దాన భక్తి కుదిరి భగవత్కరుణకుఁ బాత్రుసిగా

నొనరించును. పాఠకమహాశయులారా! బాణాసురునిచరిత్రము నుండి యిట్టివిషయములు నేర్చుకొనుటయే యీచరిత్రము పఠించుటకు ఫలము. లేకున్నఁ గాలక్షేపమే ఫలమగును. కథను పెక్కుసారులు పఠింపవలయును. పఠించినపిదప నిందేమిసారమని తర్కింపవలయు. తోఁపకున్నఁ బెద్దలనడుగవలయు. వారు తెల్పినసారము మరలమరల స్మరించుచు మనసున నాటునట్లు చేసి కొనవలయును. అదియే లాభము. దానికిమించినలాభము వేఱొకటి లేదు. ఆలాభము ననుభవింపవలయును. అనుభవము నకుఁ బనికిరాని లాభమున ఫలమేమి? అనఁగాఁ దనయాచరణమునఁ గలలోపములఁ దొలఁగించుకొనఁ బ్రయత్నింప వలయును. ఇంతట నీవిషయమును వదలి తరువాతి భగవచ్చరిత్రమును వ్రాయఁబూనెదను.

## ద్వారకానగరమున నుషావివాహోత్సవము.

*శ్రీహరి ద్వారకానగరమును బ్రవేశించినపిదప నాహుకుఁడు హరిం గాంచి మహాహర్షమున నయనారవిందములు వికసింప మహాపురుషా! వృత్తాంతమంతయు నిట్లుసాగినది కదా. మహత్తరకష్టములనుండి గట్టెక్కిన మన యనిరుద్ధుని వివాహమహోత్సవము ద్వారకానగరమున సాగవలయును. ఉషాకన్యయు ననురూపప్రియునిం గూడి హాయిగానున్నది. కుంభాండదుహిత యుషచెలికత్తియలందు మేటి ఆమెయు నీమహోత్సవమునకు రాఁదగును. రుక్మిణి యామె

---

* ఈకథ హరివంశాంతర్గత విష్ణుపర్వమున నూటయిరువదెనిమిదవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగునది.

ను లాలించుచున్నది. కావున నాకన్నియను సాంబునకుఁ బత్నిగాఁగూర్పందగు. మిగిలిన కన్నియలను గుమారులు తగినట్లు వివాహవిధిని బత్నులు చేయందగు. అనిరుద్ధునిగృహమున నాటలు పాటలు సాగుచున్నవి. పౌరకాంతలెల్ల నానందాంబుధి నోలలాడుచున్నవారు.

అనుటయు నట్లేకానిమ్మని హరియంగీకరించెను. మయూరరథమున నుషను గూరుచుండఁబెట్టి చెలికత్తియలం గూడ రథమెక్కించి రుక్మిణీదేవి యనిరుద్ధునిసౌధమునకుఁ బంపెను. గృహప్రవేశమహోత్సవవిధిగా నాతంత్రము సాగింపఁబడియెను. దేవకియు రుక్మిణియు రోహిణియు ననిరుద్ధునింగాంచి యిట్టికష్టములకుం జిక్కి చిక్కులంబడియెనని వగపెల్లున నేడ్చిరి. కాని యట్టిమహోత్సవకాలమున దుఃఖించుట మంచిదిగాదని దానిమ్రింగి యుషాకన్యకను దీవించి గృహప్రవేశము చేయించిరి. ఉషయు సంపూర్ణమనోరథయు సంతోషార్ణవనిమగ్నచిత్తయు నై యుండెను. చిత్రరేఖయు నప్సరోరూపమును దాల్చి యుషాకన్యనుగారవించి తగినహితములను పదేశించి సురపురమునకు మహాసంతోషమున నరిగెను. చిత్రరేఖ తనలోకమునకేగిన పిదప నుషాకన్యను మాయావతీగృహమునకుం బంపిరి. ఆమె ప్రద్యుమ్నపత్ని. కానఁ గోడలు రాఁగా మహానందమున గారవించి మహోత్సవముల నడపెను. వరుసగా శ్రీహరిపత్నులెల్లఁదమతమ సౌధముల కాయుషాసుందరిం బిలుచుకొని పోయి యాచారప్రకారము గారవించిరి భగవంతుఁడును బుత్త్రపౌత్త్రులు సంతోషము ననుభవించుచుండఁగా లోకసామాన్యములగు నాచారములం

బాటించుచుఁ దన యమేయశక్తిని దాఁచి యందఱవలె మెలంగుచుఁ దనయవతారఫలమును గనఁబఱుపఁ బ్రయత్నించుచుండెను. సృష్టికర్తలలో బ్రహ్మాయు, సత్కార్యములలో ధర్మము, నియమములలోఁ దపస్సును, నాగశ్రేణిలో ననంతుఁడును, రుద్రులలో శంకరుండును దానయై స్థావరజంగమాత్మక ప్రపంచమంతయుఁ దానయై ద్వారకానగరమున నొకమనుష్యుని చందమున వెలయుచుండెను.

ఈ బాణయుద్ధకథ పఠనార్హము శ్రవణార్హము నగు. ఇదిపఠించినవారికి వంశాభివృద్ధిని గల్పించును. ఎవ్వరీ భగవన్మాహాత్మ్యమును మదినిల్పుకొందురో వారి నధర్మము బాధింపఁజాలదు. కావున దీని నెల్లరు జక్కఁగాఁ బఠింపందగు. దీనింబఠించి భగవంతుని ధ్యానింపఁదగు. ధ్యానమునఁ గాని మనస్సు నిశ్చలముగాదు. పాఠకమహాశయులారా! ఈచిట్టిగాథయందు నొకవిశేషముగలదు. భగవంతుఁడు లోకాచారములం బాటించుటయే యిందలి విశేషము. ఏదేహమునుదాల్చునో దానికి నుచితములగు నాచారములఁ బ్రవర్తింపఁజేయును. అట్లే మానవులందు దపస్సంపన్నులు కూడఁ బామరులకు మార్గము చూపుటకై తము రాచరింప నవసరము లేకయున్నను సామాన్యాచారములను గూడఁ బాటింతురు. తమ రవ్వానిని వదలినచోఁ బామరులు గూడ వానిని బాటింపరనియే వారిభావము.

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః.

అన్న భగవద్గీతావాక్య మెల్ల రెఱింగినదియే కదా! కాఁబట్టి ప్రాచీన సదాచారములను బాటింపవలయును. ప్రాచీన మార్గములం దేదియు వృథా కల్పింపఁబడియుండదు. బహుషి

ధకర్మము లాచరించి బహువిధాభిప్రాయములు గలవారలకు ననువగు రీతుల నాచారములను గల్పించి పెద్దలు తమప్రతిభావిశేషమును వెల్లడించిరి. వాని ననాదరబుద్ధిం దృణీకరింపక పెద్దలు తమ రాచరించినఁ బామరులు నాచరింతురు. దానఁ బామరులకు మేలు కలుగును. పెద్దల కంతకంటెఁ గావలసిన దేమున్నది. మార్గదర్శకు లగుటయే కదా! కాఁబట్టి పూర్వాచారములను వీటఁబుచ్చక పామరుల హితముఁబొంటె నెల్ల రాచరింపఁ దగు.

## శ్రీకృష్ణమూర్తి తపస్సు చేయుట.

*ఇఁక మీఁదటివృత్తాంతమున నేదిముందు. ఏది వెనుక సాగినదని విచారించు టనవసరము. భగవంతుఁడు శ్రీహరి తాఁ జేయవలసినకార్యములు కొన్నింటి నొనరించెను. భారత యుద్ధమున మృతినొందవలసినవారిప్రస్తావమునకుఁ బోలేదు. భారతయుద్ధము పొసఁగుటకు రాజసూయయాగమును ధర్మరాజుచేఁ జేయించెను. అదియే యాయుద్ధమున కంకురారోపణము. జరాసంధాది దుర్జయుల మృతినొందఁ జేసెను. ఇఁక నితరులమూలమునఁ జేయింపఁ దగుకార్యములు గలవని యూహించుచు ద్వారకానగరమున నున్నవాఁడు. ఇంతిమాత్రము మదినుంచుకొని కథనుబఠించిన నేశంకలు గలుగక యుండును. భగవంతుఁ డేకార్య మెపుడుచేసెనను వితర్కము ఫలవంతము కాదు. ఆకథ సాగిన తిథివారనక్షత్రాదులు ఫలము

---

* ఈవిషయము కూర్మపురాణమునందలి యిరువదిమూఁడవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగునది.

నీఁజాలవు కాని యెట్లు లేకార్యమును శ్రీహరి సాగించెను? దానినుండి మనము తెలిసికొనఁ దగువిషయ మేమి? అను విషయములను దర్కించిన లాభము గలదు. అందే తరణో పాయముకూడ దొరకును. అదిమాని పనిలేనిమంగలివలె నేకార్యము ముందుగా నొనరించెను? ఏది తరువాత? అని గుంజులాడఁ జొచ్చిన ఫలము శూన్యమే. కావున నోపిక మీఱ నీగాథలం బఠింపవలయును. ఇఁకఁ గథ నాలకింపుఁడు.

రుక్మిణీదేవి కుమారులం గాంచెను. వారెల్ల వీర్యౌ దార్యముల వాసికెక్కినవారు. తక్కినభార్యలలోఁ గొందఱు సంతతిం గాంచిరి. వీరియందెల్లఁ జారుదేష్ణ,సుదేష్ణ,చారువేష, కశోదర,చారుశ్రవసులును, జారుయశుండును, శంఖ, ప్రద్యు మ్న నామధేయు లెనమండ్రుగురు ప్రధానులు. వీరెల్ల రుక్మిణీ పుత్రులనియు నొక్కకొందఱు పలుకుదురు. వీరిం గాంచి యొకానొకదినమున జాంబవతి భగవంతుఁడు తనతోన సరసా లాపము లాడుచుండఁగా శుచిస్మితయై యిట్లు సంభాషించెను. ప్రాణేశ్వరా! పుండరీకాక్షా! నాకొక్కకుమారుఁడు గలుగున ట్లనుగ్రహింపుము. ఆసుతుఁడు విశిష్టుఁడు గుణవత్తముఁడు పరమ ధర్మిష్ఠుఁడునుగా నుండవలయును. ఇదియ నా వాంఛి తము. దీని నీడేర్పుమా యని ప్రార్థించెను. జాంబవతి పలుకు లాలించి తా జగన్నాథుఁడైనను దపస్స్వరూపుఁడైనను. దప స్సొనరించి జాంబవతి వాంఛితమును దీర్ప నూహించెను. జాంబ వతీ! నీవాంఛితము ఫలించును. ఊఱడిల్లుము. అట్టికుమా రుఁడు నీకుం గల్గును. అని పలికి యామె మనశ్చింతను బాపి తాను స్వేచ్ఛగా నవతరించి కృతకృత్యుఁడై వెలసియున్నను

దన్నుఁ దానే స్మరించుచు సర్వాదియగు నీశ్వరభావమును గూడి ఘోరతపం బొనరించెను. ఆతపము నిరంతరాయముగా సాగవలయు ననుభావమునఁ బ్రయాణమై చిరకాలము యోగీంద్రులందఱు తపంబొనరించుటం జేసి పరమపావనమై పవిత్ర నానావిధమృగగణసంకులమై యుపమన్యు వనుమహా ముని తపస్సొనరించి సిద్ధినందుట నుపమన్యునాశ్రమం బను ప్రఖ్యాతిని వహించి సుప్రసిద్ధ తపోవనంబని యెల్లరుఁ గొని యాడుచుండ నలరునాశ్రమంబునకుం బోయెను.

ఇట్లు శ్రీహరి యుపమన్యునాశ్రమంబున నియతిఁ బుత్త్రార్థియై తపస్సుచేయ నారంభించెను. ద్వారకనుండి గరుడారూఢుఁడై పర్వతరాజమనం బ్రసిద్ధి వహించిన హిమాలయ ప్రాంతమున నున్న యాయాశ్రమమున నివాసముం గల్పించుకొని యుండెను. శంఖచక్రగదాపద్మపాణియు, శ్రీవత్సలాంఛనుఁడు నగు నా శ్రీమహావిష్ణువు మునివేషమూని నియతి నారంభించెను. ఆయాశ్రమము నానాద్రుమలతాసంకీర్ణము. బహువిధవిశేషపరిమళమిళితకుసుమవిసరభాసురము. బహువిధ మునీంద్రాశ్రమసంయుతము. కావున నందుండి తపస్సొనరించిన మంచిదని తలంచి నియతిమై నిష్ఠకుం బూనెను. అందు వేదఘోషములు శ్రోత్రరసాయనములై వినఁబడుచుండెను. సింహశరభదంతావళప్రభృతిమృగవిశేషము లందుఁ దిరుగుచు గ్రూరసత్త్వములను పేరు వ్యర్థమగునట్లు తిరుగుచుండెను. జలము నిర్మలమై స్వాదుతమమై నిరోగమై యుండెను. సరోవరములు సాధుకుసుమవిసరభాసురములై యుండెను. దాని నాల్గు ప్రక్కలు నారామములచేఁ గ్రిక్కిరిసి యుండెను. దేవతాయ

తనము లందందు వెలయుచుండెను. ఋషులు, ఋషిపుత్రులును మహామునీంద్రులు, వేదాధ్యయనసంపన్ను లగు నగ్న్యుపాసకులును ధ్యాననిరతు లగుయోగులును, గ్రిక్కిరిసి యందుండిరి. యోగులెల్లరు నాసాగ్రన్యస్తనేత్రులై యుండిరి. సర్వమును సమదృష్టిం జూచుజ్ఞాను లందఁదు నుండిరి. బ్రహ్మాదులయి మంత్రములజపించు నైష్ఠికు లాయాశ్రమమునఁ గనఁబడుచుండిరి. పావనపాథః ప్రవాహముల నిండియుండునదు లద్దాని చుట్టు నుండెను.

కొందఱందుఁ బరమేశ్వరుఁ డగుశంకరు నారాధించుచుండిరి. సత్యసంకల్పములుగలిగి ప్రయత్నులై శోకరహితులై యేయుపద్రవములును లేక వారా పరమశివు నారాధించుచుండిరి. మఱియు వారు భస్మసంలిప్తగాత్రులై రుద్రజప్యపరాయణులై జటాధారులై నిర్మలాంతఃకరణులై యుండిరి. కొందఱు శిఖలు వ్రేలాడ జపించుచుండిరి. ఇంకను గొందఱు తమరు జపించుమంత్రమును న్యాసఖండోక్తప్రకారము సకలావయవములందును భావించుచుండిరి. అట్టి పరమపావనతమాశ్రమమునందు గంగాతరంగిణి భగవతి కావున నెల్లరఁ బరిశుద్ధాత్ములనుగాఁ జేయుచు సకల పాపతూలముల నీఱుగావించుచుఁ బ్రవహించుచుండెను. శ్రీహరి యాగంగానదిని, అందుండి తపస్సొనరించు మహాపురుషులను గాంచి గతకల్మషులై వారు భగవత్పూజచేయుట కెంతయు నానందించుచు, వారిని నమస్కారములచేతను స్తుతులచేతను బూజించెను. వారెల్ల సకలజగత్కారణుఁడై శంఖచక్రగదాధరుఁడై వేంచేసిన శ్రీహరిం గాంచి భక్తిభారమున నమస్కరించిరి. యోగీంద్రగురుపని

భావించిరి. వైదికమంత్రముల వినుతించిరి. హృదయపీఠముల నాసనాతనమూర్తిని ధ్యానించిరి. ఆదిదేవుఁడగు శ్రీమహావిష్ణు వీమహానీయుఁడే యని తమలోఁ దమరు భాషించుచుండిరి. శ్రీమన్నారాయణమూర్తి వచ్చెను. పరమపూరుషుఁ డరుదెంచెను. భక్తజనకల్పద్రుమ మిప్పుడిచ్చుటకి వేంచేసె ననుకొనిరి. త్రిమూర్తిస్వరూపుఁ డగుభగవంతుఁ డీతఁడే యని తలంచిరి. విదేహుఁడైనను మూర్తిధరుఁడై మునీంద్రులఁ జూడ నరుదెంచెను. ధాతయు,విధాతయు, సర్వగతుఁడు, ననాదియు, నక్షరుండును, మంత్రరూపుఁడును, మహాదేవుఁడును, మహేశ్వరుఁడును మన పుణ్యవశమున నరుగుదెంచెనని చెప్పుకొనుచుండఁగా శ్రీహరి వారివాక్కుల నాలకించెను. వారితాత్పర్యముల నెఱింగెను. వా రున్న చోటి కరిగెను.

అందొకచో నుపమన్యు వనుమహాముని కూరుచుండి యుండెను. అమ్మహామునిం జూచుకోరికలు తన్నుఁ ద్వరపెట్టఁగాఁ దీర్థములయందు నాచమనముచేసి దేవర్షిపితృతర్పణము లొనరించి యాయాయితీర్థములయందు మహర్షులు స్థాపించిన లింగములఁ బూజించి యాలింగముల యత్యద్భుతతేజస్సును దర్శించి వలగొని యుపమన్యుమునిని దర్శింప నరుదెంచు మాధవునిఁగాంచి మహర్షు లాతిథేయసత్కారముల నలరించిరి. శంఖచక్రగదాద్యాయుధములఁ దాల్చి చూడశక్యముగాని యాకృతివిశేషమున నలరు భగవంతునిం దర్శించి నిశ్చలదృష్టుల నామహర్షులు నిల్చిరి. ఆరురుక్షువులగు మహాత్ముల మానసములా జనార్దను దర్శించినంతన మోహితము లయ్యెను. భగవంతుని దర్శింప నెంతయు నాదృతిని గాంచి తత్సమీపమునకుం బరు

గె త్తినవి. వారి నాదరించి గంగాతరంగిణి మునిఁగి యుచిత క్రియ లాచరించి మనోహరపావనకుసుమములం గైకొని శ్రీహరి యామునివరు నాశ్రమమును బ్రవేశించెను. భస్మోద్ధూళితవిగ్రహుఁడై జటాచీరధారియై శాంతనిధియై యున్న యా మునీశ్వరుని యోగీశ్వరుని గాంచినంతనే శిరస్సువంచి నమస్కరించెను. తత్త్వవేత్త యగు నామహర్షి శ్రీహరిని భక్తియుక్తి నారాధించెను. యోగిప్రవరుఁ డగునాహరికి నుచితమగు నాసనము నుంచెను. పరమపదము నెఱిఁగినవాఁ డయ్యు నాముని యిట్లు ప్రశ్నించెను.

అవ్యక్తసంస్థాన మనంబరఁగి సర్వత్ర వ్యాపించి శిష్యభావమున నిపుడలరు నీవు నోమహాత్మా!స్వాగతము. నిదె సమర్పించుచున్నాఁడను. భవదాగమనమున మాతపస్సులు ఫలించినవి. విశ్వాత్మకుండ వగునీవు నాయాశ్రమమున కరుదెంచితివి. నిన్ను మునులుగాని, యోగులుగాని యెఱుంగఁ జాలరు. అట్టి నీవిట రాఁ గారణమేమి? శ్రీహరియు నాముని యిట్లు ప్రశ్నింపఁగా నాలకించి నమస్కరించి మహాయోగి గావున నిట్లు ప్రశ్నించెను. మహాత్మా! ఉపమన్యూ! భగవంతా! కృత్తివాసుని దర్శింపఁగోరి యరుదెంచితిని. భగవద్దర్శనోత్సుకుఁడనై నీయాశ్రమమున కరుదెంచితిని. యోగవిద్వర్యుఁడైన యాపరశివుఁ డెట్లు గనఁబడును? ఉమాపతిని త్వరగా దర్శింప నాకెట్లనువుపడునో యాపద్ధతి నుపదేశింపుము. త్వరగా నన్నుం జూడుమని యాశంకరుఁ డాజ్ఞాపించెను. ఉగ్రతపస్సు చేసినఁగాని నాదర్శనము కాదని శంకరాజ్ఞ. కావున నావిధి నెఱింగింపుము. అన నతఁ డిట్లనియె. దేవదేవుఁ

డయిన మహాదేవుని బ్రహ్మవాదు లగుమునులు ధ్యానింతురు. ఉపాసింతురు. జపపరాయణు లగువా రారాధింతురు. ఈస్థలమున నే వృషభధ్వజుఁడు సపత్నీకుఁడై విహరించుచుండునని విందుము. యోగులుఁ భూతము లాతనిం బరివేష్టించి యుండును గదా. మున్ను వసిష్ఠమహాముని యీయాశ్రమముననే దారుణతపం బొనరించి మాహేశ్వరయోగము నొందెను. కృష్ణద్వైపాయనుఁ డనంబరఁగు వ్యాసమునిప్రభుఁడు పరమేశ్వరు దర్శించి యీయోగముననే పడయఁ జాలెను. సురభి భక్తి నీయాశ్రమమునందే చిరకాలము తపంబొనరించి కపర్ది యనుగ్రహమున మనోహరాకారు లగునాత్మజులఁ బడసెను. ఈ యాశ్రమమునందే దేవతలు కాలభీతులౌటఁ దపంబొనరించి మహేశ్వరుని దర్శించి నిర్భయులై నిర్వృతి నొందిరి. తపస్వివర్యుఁ డగుసావర్ణి యీ యాశ్రమపదమునందే శివునారాధించి గ్రంథకర్తృత్వమును ఈశ్వరయోగమును బడసెను. మఱియు శుభప్రదమగు సంహిత నొనరించి యందుఁ బురాణగాథలం బొందుపఱచి శిష్యులకొసంగి యీ సావర్ణి మునిపతి కృతకృత్యుఁ డయ్యెను. కాపేయుఁడగు శాంతపాయి మునింగూడి తపం బొనరించి మహాదేవునివలన వివిధజ్ఞానముల నెఱింగి పౌరాణీగాథం దెలిసికొని ద్వాదశసహస్రశ్లోకములను, మఱియు సప్తసహస్రశ్లోకములను నొనరించి యీసంహిత నిందే ప్రకటించెను గాదే. శాంతపాయన భాషితంబగు వాయువీయోత్తరపురాణమును శిష్యులకు నిందే నేర్పెనుగదా. యాజ్ఞవల్క్యమహాయోగి యీ యాశ్రమముననే తపంబొనరించి శంకరు దర్శించి తన్నియోగమున యోగశాస్త్రము ననుత్తమ

పద్ధతి నొనరించెను. భృగుమహర్షియు నిచ్చోటనే నియతింబూని యోగవిశారదుఁడు గావున శుక్రుఁ డనుకొమరు నీశ్వరాను గ్రహమునఁ బడసెను. కావున నోమహాత్మా! యీ యుత్తమాశ్రమమునందే దపంబొనరించి విశ్వేశ్వరుండయి యుగ్రుఁడయి భీముఁడు నగుమహేశ్వరుని సందర్శింపఁ దగును. అని యీయుపమన్యుముని తెలిపి పాశుపత యోగవ్రతమను నాంతముగా నుపదేశించెను.

## శ్రీకృష్ణునకు శివుఁడు ప్రత్యక్షమగుట.

అక్లిష్టకర్మ్ముఁడగు నాశ్రీహరి యమ్మునివతంసునివలనఁ బరమశివయోగవ్రతము నెఱింగి యాయాశ్రమమునందే నివసించి మహాదేవు నుపాసింప నారంభించెను. సర్వాంగముల భస్మమునలంది జటలం దాల్చి వల్కలములఁ గట్టి తదేకాగ్రచిత్తమున శంకరుని జపించెను. ఇంచుకంతయు నియమముమానక జపించుచుండఁగాఁ బహుతిథులు గడచెను. అంత సోమార్ధశేఖరుఁ డగుపార్వతీజాని యాతపస్సున కలరి పార్వతిం గూడివచ్చి యంబరతలమున నిలిచి శ్రీకృష్ణునిం గాంచెను. అత్తఱి శ్రీహరికిరీటియు, జటాధారియు, సాక్షమాలావిలసత్కరకమలుఁడును నయియుండెను. వెంటనే పరశివుఁడు హరి మ్రోల నిలిచెను. శ్రీహరియుఁ దనమ్రోల నిలిచిన పినాకపాణిని గాంచెను. దేవాదిదేవుఁడై, యణువులలో నణువును, ననంతశక్తిసంపన్నుఁడు, శార్దూలచర్మాంబరసంవృతాంగుఁడును, బరశ్వధాసక్తబాహుఁడు, నేత్రత్రయవిరాజితుఁడు, * నృసింహ

* పరశ్వధాసక్తకరం త్రినేత్రం నృసింహచర్మావృతసర్వగాత్రమ్. అని మూ.

చర్మావృతసర్వగాత్రుఁడు, మహత్తరప్రణవమును వెడలించు వాఁడును, సహస్రసూర్యప్రతిముఁడు నగు శ్రీకంఠుని గనుం గొనియెను. మఱియుఁ బురాణపురుషుఁడై సనాతనుఁడై యోగిధ్యేయుఁడై శాసింప సమర్థుఁడై, సకలప్రాణిప్రభువై పరదేవీ సహితుఁడై యున్నశంకరుం గనుంగొని పరమానందభరితుఁ డయ్యెను. ఏశంకరుని ప్రభావమును దేవతలుగాని, పరమేష్ఠి గాని, యింద్రుఁడుగాని, యగ్నివరుణమృత్యువులుగాని తెలిసి కొనఁ జాలరో యట్టిరుద్రుని శ్రీకృష్ణమూర్తి దర్శించి పుల కాంచితగాత్రుఁ డయ్యెను. పిదప శంకరు వామపార్శ్వము నందు స్వాభిన్నమూర్తి ననంతరూపుని శంఖచక్రాసిప్రముఖా యుధహస్తుని శివస్తుతిపరాయణుని గనుంగొని యచ్చెరువొం దెను. దక్షిణభాగమునందుఁ గృతాంజలియై హంసాధిరూఢుఁ డై యలరు పరమేష్ఠిని గాంచెను. ఆబ్రహ్మ శంకరుమహిమ మును గొనియాడు చుండెను. గణేశ్వరులెల్ల భానుసహస్రభా సమానులై నందీశ్వరప్రముఖులై యమితప్రభావులై శంకరు సేవించుచుండఁగా వారి వారలం గనుంగొనియెను. త్రిలోక నాయకుఁ డగు త్రినయనునిచెంతఁ గుమారస్వామియు, మరీ చియునత్రియుఁ బులహపులస్త్య చేతసులును, రక్షకణ్వులును, బరాశరవ్యాసవసిష్ఠులును,స్వాయంభువమనువునుండిరి. వారి నెల్ల శ్రీకృష్ణుఁడు కనుంగొనియెను.చేతులొగ్గి శ్రీహరియు దార బుద్ధియై వేదమంత్రముల వినుతించెను. దేవీసహితుఁ డగుశం

శరునకు నమస్కరించి స్వాత్మయందాత్మను ధ్యానించి యిట్లు వినుతించెను.* పరశివా! నీవు శాశ్వతుఁడవు. సర్వబ్రహ్మాండ కారణభూతుఁడవు. బ్రహ్మాదుల కధిపతివి. సత్పురుషులు సత్వ

---

*శ్రీకృష్ణకృత శంకరస్తుతిః.

నమోఽస్తుతే శాశ్వత సర్వయోనే బ్రహ్మాధిపం త్వాం మునయో వదంతి, త్వామేవ సత్త్వంచ రజస్తమశ్చ త్వామేవ సర్వం ప్రవదంతి సంతః. ౧. త్వం బ్రహ్మా హరిరథ విశ్వయోని రగ్నిస్సంహర్తా దినకరమండలాధివాసః, ప్రాణస్త్వం హుతవహవాసవాదిభేదస్త్వామేకం శరణ ముపైమి దేవమీశమ్, సాంఖ్యాస్త్వా మగుణ మథాహు రేకరూపం యోగాస్త్వాం సతతముపాసతే హృదిస్థమ్. ౨. దేవాస్త్వామభివదతీహ రుద్రమగ్నిం త్వామేకం శరణముపైమి దేవమీశం, త్వత్పాదే కుసుమమథాపి పత్రమేకం దత్త్వాసౌ భవతి విముక్తవిశ్వబంధః, సర్వాఘం ప్రణుదతి సిద్ధయోగజుష్టం స్మృత్వా తే పదయుగళం భవత్ప్రసాదాత్. ౩. యస్యాశేషవిభాగహీన మమలం హృద్యంతరావస్థితం తత్త్వం జ్యోతి రనంతమేకమమలం సత్యం పరం సర్వగమ్. ౪. స్థానం ప్రాహురనాదిమధ్యనిధనం యస్మాదిదం జాయతే నిత్యం త్వామనుయామి సత్యవిభవం విశ్వేశ్వరం తం శివమ్. ౫. ఓంనమో నీలకంఠాయ త్రినేత్రాయచ రంహసే, మహాదేవాయ తే నిత్యమీశానాయ నమోనమః. ౬. నమఃపినాకినే తుభ్యం నమోదండాయ ముండినే, నమస్తే వజ్రహస్తాయ దిగ్వస్త్రాయ కపర్దినే. ౭. నమో భైరవనాథాయ హరాయచ నిషంగిణే, నాగయజ్ఞోపవీతాయ నమస్తే వహ్ని తేజసే. ౮. నమోఽస్తు తే గిరీశాయ స్వాహాకారాయ తే నమః, నమో ముక్తాట్టహాసాయ భీమాయచ నమోనమః. ౯. నమస్తే కామనాశాయ నమః కాలప్రమాథినే, నమో భైరవరూపాయ కాలరూపాయ దంష్ట్రిణే. ౧౦. నమోఽస్తుతే త్ర్యంబకాయ నమస్తే కృత్తివాససే, నమోంబికాధిపతయే పశూనాం పతయే నమః. ౧౧. నమస్తేవ్యో

రజస్తమోగుణములు నీవే యని పేర్కొందురు. హరిహరవి
రించి స్వరూపుఁడవు నీవే. సాంఖ్యులు నిన్నగుణుఁ డందురు.
యోగులెల్ల నీవే పరమగతివని యుపాసింతురు. హృదయాం
తర్వర్తివని భావించి ధ్యానింతురు. దేవతలు రుద్రుఁ డందురు.
అగ్నిస్వరూపుఁడవనియు నందురు. అట్టి నిన్ను సమస్తజగదా
ధారుని సేవించెదను. అనాదిమధ్యనిధనుఁడవగు నిన్ను స్థాణుఁ
డందురు. సత్యస్వరూపుఁడవు. నిర్వికల్పుఁడవు. సకల వేదవే
దాంతగోచరుఁడవు. అట్టి నిన్నే భజించెదను. యజ్ఞము,
యాజకుఁడు, నీస్వరూపములే యగు. నీవుకాని దీలోకముల
నేదియు లేదు. అని మఱియు ననేకవిధముల నాపరశంకరుం
గొనియాడి నావాంఛలు ఫలించునట్లు చేయుమా యని
యభ్యర్థించెను.

---

మరూపాయ వ్యోమాధిపతయేనమః, నరనారీశరీరాయ సాంఖ్యయోగప్రవ
ర్తినే. ౧౨. నమోదైవతనాథాయ నమోదైవతలింగినే, కుమారగురవే తు
భ్యం దేవదేవాయ తేనమః. ౧౩. నమోయజ్ఞాధిపతయే నమస్తే బ్రహ్మ
చారిణే, మృగవ్యాధాధిపతయే బ్రహ్మాధిపతయేనమః. ౧౪. నమోభవాయ
విశ్వాయ మోహనాయ నమోనమః, యోగినే యోగగమ్యాయయో
గమాయాయతేనమః. ౧౫. నమస్తే ప్రాణపాలాయ మంత్రనాదప్రియా
యచ, కపాలినే నమస్తుభ్యం జ్యోతిషాం పతయే నమః. ౧౬. నమో
నమోనమస్తుభ్యం భూయోభూయో నమోనమః, మహ్యం సర్వాత్మనా
కామాన్ ప్రయచ్ఛ పరమేశ్వర. ౧౭.

ఇతి శ్రీకృష్ణకృత శివస్తుతి స్సమాప్తా.

## శివుఁడు శ్రీహరికి వరము లొసంగుట.

ఇట్లు ప్రార్థించుచుఁ బాదారవిందములపై వ్రాలి లేవక యున్న శ్రీకృష్ణునిం గని శీతలకరతలంబున బట్టుకొని లేవ నెత్తి మధురవాక్కుల నిట్లు పలికెను. విభూ ! పుండరీకాక్షా ! ఏవాంఛ చేఁ దపం బొనరించితివి. నీవే సర్వకామముల నెల్ల భక్తులకుం బ్రసాదించువాఁడవు కదా. నాయొక్క పరమ మూర్తివి. నారాయణాహ్వయధారివి కదా. నీకు లభింపని వాంఛ యొండెద్దియేని కలదా. పురుషోత్తమా ! నిన్ను సాక్షా న్నారాయణమూర్తినిగాఁ బరమేశ్వరునిగాఁ దలంపుము. మహాదేవుఁడవు నీవే? అని శంకరుఁడు పలుకఁగా వృషభధ్వజునిపలుకుల కానందించి శ్రీకృష్ణుఁ డిట్లు పలికెను. హిమాల యపుత్రికం గూర్చియు నిట్లు ప్రార్థించెను. నావాంఛ యేదియో నీవే యెఱుంగుదువు. ఐన నేనును విన్నవించెదను. నీకు భక్తుఁడై నాతోసమానుఁ డగుకుమారు ననుగ్రహింపుము. అను నా శ్రీహరిప్రార్థనము నాలకించి శివుఁ డట్లే కలుగుఁగాక యని ప్రసన్నమనస్కుఁడై పలికె గౌరిని గనుంగొనుచు శ్రీహరి నాలింగనము చేసికొనియెను. శంకరార్ధ శరీరిణియగు నాజగన్మాతయు శ్రీహరితో నిట్లు పలికెను. వత్సా! నిశ్చలభక్తి నీవీశ్వరునందును నాయందు నునుచుట నే నెఱుంగుదును. నీవు పురుషోత్తముఁడవు గాని మానవమాత్రుఁడవు కావు. దేవతలు ప్రార్థింప దేవకీతనయుఁడవైతివి. జ్ఞానదృష్టి బలంబున నీ వా స్తవస్థితి నెఱుంగుము. నీకును నాకును భేదము లేదు. ఐక్యమునే మానులు గనుఁగొందురు. నావలనఁ గొన్ని వరములం బడయుము. సర్వజ్ఞత్వము, ఐశ్వర్యము, పారమేశ్వ

రజ్ఞానము, ఈశ్వరునియందు నిశ్చలభక్తియు నీకు లభించుఁ గాక. అని పలుకఁగా శ్రీకృష్ణమూర్తి శిరస్సువంచి యావరములను గ్రహించెను. శంకరుఁడు నాత్మహస్తంబున శ్రీహరి మేనును స్పృశించి మహర్షులు వినుతించుచుండఁ బార్వతిం గూడి కైలాసమున కరిగెను. హరియు శివుని వెంటఁ బోయెను.

మహాశయులారా! జాంబవతియను నొకభార్య శ్రీకృష్ణునితో నేకాంతమునఁ బ్రాణనాయకా! సకలవిధములఁ బొగడఁదగుగుణములు గల కుమారు ననుగ్రహింపుమని ప్రార్థించుటయు, నామెవాంఛను దీర్పఁబూని హరి హిమాలయమున కరిగి యుపమన్యునాశ్రమమునఁ దదుక్తపారమేశ్వరయోగమూని తపస్సొనరించుటయు హరుఁడు ప్రత్యక్షుఁడై వరములిడుటయు ననుఁ నీకథ యచ్చెరువును గూర్పకపోవదు. కాని యిందద్భుతమగువిషయము లేకపోలేదు. దానినే మన మెఱుంగవలయును. ఆ సారమేదియో యీక్రింది గీతావాక్యముల వలనఁ దేలఁగలదు.—

శ్లో. "న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి. ౨౨
యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౨౩
ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చేదహం,
సంకరస్య చ కర్తాస్యాముపహన్యామిమాః ప్రజాః. ౨౪
సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాం స్తథాఽసక్త శ్చికీర్షు ర్లోకసంగ్రహమ్."
3-వ అధ్యాయము.

దీనిసారమును విస్తరించి యింకను వ్రాయనేల? తాను దపస్సానరించినచో నెల్లవారును ఫలాపేక్షులనైనను భగవదారాధనము చేయుదురనియుఁ దా నుపమన్యునంతికమున విధి నెఱింగిన నెల్లరును గురువు మానిన నేదియు ఫలింపదన్న నమ్మకముచేత సద్గురువు నాశ్రయింతురనియుఁ దాను మున్యాశ్రమమున కరిగినచో సత్కార్యానుష్ఠానమునకు యోగ్యస్థలము దొరకిన శీఘ్రంబ తపస్సు ఫలించునన్నవిశ్వాసమున నెల్లరు నీచజనాక్రాంతస్థలములను మాని సజ్జనాక్రాంతస్థలములకు మానవులరిగి సత్కార్యానుష్ఠానము సాగింతురని యీ మొదలగు బోధములను లోకులకుఁ దెలుపఁబూని తపస్సు చేసెననుటయే కథాయందున్న సారము. మఱియుఁ బార్వతిని దనకు వరమనుగ్రహింపుమని కోరెను. ఆజగన్మాతయు,

"నావయోర్విద్యతే భేదమైక్యం పశ్యంతి సూరయః."

అని పలికెను. అనఁగా శక్తియుఁ ద్రిమూర్తులు నొక్క తత్త్వమునుండియే యుదయించిరని స్పష్టము గదా! ఇట్టి సారమును దెలుపునీకథ చక్కఁగాఁ బఠింపఁదగినది. అంతరార్థము నెఱింగి దాని మది నిలుపుకొనఁ దగినది. ఇఁకఁ దరువాతి భగవత్కథను వ్రాసెద.

## శ్రీకృష్ణమూర్తి కైలాసమున కరుగుట.

*శ్రీకృష్ణుఁడు మేరుభూధరమునుగని యందు శిఖరావతంసమగు కైలాసమును గాంచి దాని కనకమయత్వమున

* ఈకథయుఁ గూర్మపురాణమున నిరువదినాల్గవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

కచ్చెరువందుచు నందు శంకరుం గూడియుండెను. శంకరు వెంటనున్న శ్రీకృష్ణుని గైలాసవాసులెల్లరుం గాంచి దేవదేవుం డగు నచ్యుతునిగా నెఱింగి పూజించిరి. చతుర్భుజుండై కాల మేఘసమప్రభుండై కిరీటమునుదాల్చి కోదండపాణియై శ్రీవ త్సాంకితవక్షస్స్థలుం డై యాజానుదీర్ఘబాహు వై పీతవస్త్ర మును ధరించి, వైజయంతి యనువనమాలికను ధరించి, లక్ష్మీ యుతుండై ప్రాయముగలిగి యతిశయకోమలాంగ మలరారం జూడంజూడ నేత్రానంద మొనంగూర్చుచున్న యా శ్రీశ్యామ సుందరమూర్తిం గాంచి పరమానంద మందిరి. ఒకానొక ప్పుడు శ్రీహరి యాగిరికందరముల విహరించుచుండెను. గంధ ర్వాంగనలు, నాగకన్యకలు, సిద్ధయక్షగంధర్వులు విహరించు చున్న యా త్రిభువనమోహనాకారుని దర్శించి యచ్చెరువం దుచు నయనారవిందములు వికసిల్లంగా శ్రీహరి శిరమునం బూలవానం గురియించిరి. గంధర్వకన్యకలు లోనగు కాంత లెల్ల నా మోహనాకారుని గాంచి సంభ్రమించి స్రస్తవస్త్ర విభూషణ లైరి. అందుం గొందఱు గానము చేసిరి. వివిధగీత ముల నాతనిం బాడిరి. ఆమహనీయునాకారవిశేషమునకుం జొక్కిరి. కొందఱా పరమేశ్వరుని మ్రోల విలాసమున నృత్య ము చేసిరి. మఱికొందఱా పురుషోత్తముని దర్శించి యట్లే నిలిచిరి. ఇంకనుం గొందఱు తమతమయంగములందుం గలభూ షణవర్యములం దీసి వానిచే శ్రీహరియాకృతి నలంకరించిరి. లోకభూషణుని మనయలంకారములం గై చేసితిమి కదా! యని యానందించిరి. మఱియును గొందఱు శ్రీకృష్ణుని దేహము నుండి భూషణములం దీసికొని వానిచేం దమ్మలంకరించుకొ

నిరి. కొందఱు కామినీమణు లరుదెంచి వాంఛచే నొడలు తె లియక తన్ముఖాంభోజమును ముద్దిడుకొనిరి. హరిణలోచనలు కావునఁ గన్నులఁ దృప్తిగా నాతనియాకారమును దర్శించిరి. ఒక్కకాంత హరిని దనకరకమలమునఁ బెనల్చి తనయింటికిం దీసికొనిపోయెను. ఆయువతి తన్మాయామోహిత యయ్యెను. *ఇట్లు తనను బ్రేమించు పురంధ్రీమణులకు బహువిధరూప ములం దాల్చి వాంఛితములం బూరించెను. ఇవ్విధమున నాశం కరునావాసమున శ్రీకృష్ణపరమేశ్వరుఁడు చాలకాలము విహ రించుచుండెను. స్వమాయచే నెల్లర నానందపరవశులనుగాఁ జేయుచునుండెను.

## గరుడుఁడు ద్వారకను బాధించురక్కసులం దునుముట.

శ్రీహరి యిట్లు కైలాసమున నుండఁగాఁ జిరకాలము గడచెను. ద్వారకావాసులు తద్విరహమున బడలి వగఁజెందిరి. గరుత్మంతుఁడు తనను శ్రీహరి వదలిపోవుటచే నామహాత్ముని వెదకుచు హిమాలయమున నుండెను. అందు హరిజాడ నుపమన్యువను మునినడిగి ద్వారక కరుదెంచెను. హరియు గరుడుఁడు ద్వారకయందు లేరని యెఱింగి భయంకరు లగుదా నవులు పెక్కండ్రు ద్వారకను ముట్టడింప నరుదెంచిరి. అత్త ఱిణమున నే గరుత్మంతుఁ డుపమన్యునాశ్రమమునుండి ద్వార కకు వచ్చెను. కావున వారిని మార్కొని తనబలం బేపారఁగా సంగరాంగణమునఁ బోలియించి ద్వారకను గాపాడెను. నార

* 'తాసాం తు భగవాన్ కృష్ణః కామాంత్స కమలాననః, బహూ న్వికృత్వా రూపాణి పూరయామాస లీలయా' అని మూలము.

దమహాముని కైలాసమున నున్నశ్రీహరిం గని ద్వారక కరుదెంచెను. మునిరాక నెఱింగి పౌరులెల్ల నరుదెంచి మా శ్రీకృష్ణుండెందున్నవాఁడని ప్రశ్నించిరి. మునియు సుమాకాంతుని గూడి శ్రీహరి కైలాసమున సుఖమున్నవాఁడని యెఱింగించి నే నచ్చటనుండియే వచ్చుచున్నాఁడ ననియుఁ దెలిపెను. ఆమాట లాలించి యందఱు సంతసిల్లిరి. సుపర్ణుఁ డాక్షణమ కదలి యంబరమార్గమునఁ గైలాసమున కరిగెను. రత్నమండితమగు నాశిఖరభాగమున స్వేచ్ఛగానున్న పరమాత్మను దర్శించి తత్సమీపమున నున్నశంకరుని గాంచి వారినిసేవించునారీమణులం గని యాహరిహరులకు సాష్టాంగనమస్కారము లొనరించి పార్వతిని సందర్శించి ప్రణమిల్లి వారియాశిషముల నంది హరికి ద్వారకానగరవృత్తాంతమును దెలిపెను.

### శ్రీహరి కైలాసమునుండి ద్వారకకు వచ్చుట.

భగవంతుఁడు ద్వారకానగరవాసుల యార్తినాలించి శంకరుననుమతిం గొని గరుడు నధిరోహించి కాంతామణులు తన్ను వినుతించుచుండఁగాఁ దన్ను వెనుకొను గంధర్వాదుల నూఱడించి నిలువ నియోగించి తత్పత్నుల ననునయించి వారి నిలిపి వియద్గమనంబున ద్వారకానగరమున కరుదెంచెను. శ్రీహరివిరహమున మేరుపర్వతవాసులెల్లఁ గుందిరి. హరి వచ్చు టెఱింగి నగరము నలంకరించి పౌరులు తమయానందమును దెల్పిరి. గోపికలు మధురగేయములఁ బాడిరి. ప్రాసాదాగ్రముల నిలుచుండి యానందబాష్పములఁ గురియించుచుం బూలవానఁ గురియఁ జేసిరి. హరి యంతసౌధమును బ్రవేశించి తన్ను సేవింప నరుదెంచుదారల గారవించి కుశలప్రశ్నాదిక

ములఁ బ్రొద్దుపుచ్చుచుఁ బౌరులు రాఁగా వారి నాదరించుచు నుండెను. జాంబవతియు నరుదెంచిన నామెవాంఛితము సమకూరె నన్నభావము నెఱింగించు సరసోక్తులాడుచు నామె నానందవార్ధి నోలలాడించెను.

## మార్కండేయాదు లరుదెంచుట.

కొంతకాల మిట్లు సాగఁగా దేవర్షులు మార్కండేయాదిమహర్షులు నరుదెంచి శ్రీహరి దర్శించిరి. వారినెల్ల నుచితరీతి గారవించెను. మార్కండేయుని స్వాసనమునఁ గూరుచుండఁ జేసెను. కుశలప్రశ్నాదిసంభాషణముల వారినెల్ల నలరించెను. వారెల్లఁ దమతమ యభిమతములం దెల్పి తదనుజ్ఞఁ బడసి సెలవంది వెడలిరి. మార్కండేయముని యాందే యుండెను. ఒక్కనాఁడు మధ్యాహ్నమున శ్రీకృష్ణుఁడు స్నానముచేసి శుక్లాంబరములం దాల్చి కృతాంజలి యై దివాకరు నుపాసించుచుండెను. భాస్కరుమండలమును గాంచుచు జపించుచుండెను. భానుని దర్పణవిధిని దృప్తిపఱచెను. దేవర్షిపితృగణముల నారాధించి మార్కండేయాదులను భోజనమున నలరించి బ్రాహ్మణులఁ బూజించి లింగస్థుఁడగుమహాదేవుని బూజించెను. ఆవల భోజనాదివిధుల నడపెను. మార్కండేయునిం గూడి వివిధకథలఁ బ్రొద్దుపుచ్చుచుఁ బుత్త్రాదులు చెంతనుండి వినుచుండ నానందించెను.

మార్కండేయమునియు శ్రీహరికృతశివలింగపూజాదికముఁను గాంచి సంతోషమున హరి నిట్లు ప్రశ్నించెను. మహాత్మా! నీవు కర్మములచే నర్చింపఁ దగినవాఁడవు. యోగులచే ధ్యానింపఁ దగుదువు. ఇట్టి నీవెవరి నింతసేపారాధించితివో

యెఱుంగఁజాలక యున్నాఁడను. నీవే ముక్తిప్రదాతవు. సమస్త బ్రహ్మాండములు నీవే. భూభారమును హరింప వృష్ణికులమున నవతరించితివి. కావున నాకుంగల యీసంశయమును దొలఁగింపుమని ప్రశ్నించుటయు శ్రీహరి యావాక్యములకలరి యిట్లు బదులుచెప్పెను. అత్తఱి శ్రీహరిముఖారవిందమున నవ్వు నాట్యమాడుచుండెను. మార్కండేయా! నీమాటలయందించు కయు నసత్యము లేదు. ఐనను దేవదేవుఁడై సనాతనుఁ డగునీ శానుం బూజించుచున్నాఁడను. బ్రహ్మము నీ! నేఁ జేయఁదగినది కాని కోరఁదగినదికాని, యించుకంతయు లేదు. పరశివు తత్త్వ మెఱుంగుదుఁ గాన నామహాత్మునిఁ బూజింతును. మాయామోహితు లగుజను లాపరశివుమహిమము నెఱుంగరు. కావున నేను స్వాత్మమూల మగునాదేవుని నితరులకుఁ దెలుపుచుఁ బూజించుచున్నాఁడను. లింగార్చనమునకంటెఁ బుణ్యకార్యము లోకమున లేదని యెఱుఁగుము. కాఁబట్టి లోకహితముం గోరి శివుని బూజించెదను. వేదవేత్తలు నేనే తల్లింగమూర్తినని పలుకుదురు. కావున నే యభేదబుద్ధిచే నతని నర్చింతును. ఆమహాదేవమూర్తులలో నామూర్తి పరమపావని యనంబడు. సంశయములేదు. ఇట్లే సంసారభీరువు లగుమానవుల కామహాదేవుఁడు ధ్యానింపందగినవాఁ డగు. పూజ్యుఁ డగు వంద్యుఁడు నగు. లింగరూపి మహేశ్వరుఁడని యెఱుఁగ నగు. అని తెలిపిన నచ్చెరువంది మార్కండేయుఁ డిట్లని యెను. పరమపురుషా ! నీవు పూజించులింగ మెయ్యది ? అం దావహించు దైవ మెయ్యది? ఈవిషయ మతి గహనము గావున నాకుం దెలుపు మనుటయు హరి

యిట్లు చెప్పెను. ఆనందమవ్యయము జ్యోతియు నగునవ్య క్తము లింగమని చెప్పంబడును. వేదములు మహేశ్వరుని లింగియని తెలిపెడిని. పూర్వము స్థావరజంగమాత్మకప్రపంచము నష్టమై యేకార్ణవము కాఁగా బ్రహ్మకు నాకు నెదుట శివుఁడు ప్రబోధార్థ మావిర్భవించెను. అదిమొదలుకొని నేనును బ్రహ్మయు సదా యాలింగమూర్తిని బూజించుచున్నారము. ఆపూజ లోకక్షేమమునకగుననియే మామనమ్మకము. అన విని ముని యిట్లు ప్రశ్నించెను. ఈశ్వరలింగము మీ యెదుట నెట్లు సాక్షాత్కరించెను? దానివలన మీ రేమి యెఱింగితిరి? తెలిపి నన్నుఁ గృతకృత్యుని జేయుమా యనిన హరి యిట్లు చెప్పఁదొడంగెను.

## శివలింగమహిమమును హరి మార్కండేయున కెఱింగించుట.

ఆప్రళయము మహాఘోరము తమోమయమునై యుండెను. సాగరాంతర్భాగమున శంఖచక్రగదలం దాల్చి సహస్రశిరస్కుఁడను, సహస్రనేత్రుఁడను, సహస్రపాదుండనునై విశ్వాత్ముఁడనై శయనించి యుంటిని. అట్టితఱిణమున దూరమున నొక తేజోరాశి పొడకట్టెను. సూర్యకోటిసమానమై మహాత్తరమై శ్రీనిధానమై యుండెను. తదంతరమున నాల్గుమోములుగలిగి మహాయోగస్వరూపుఁడై కాంచనప్రభలు గల పురుషుఁ డొక్కరుఁడు తోఁచెను. కృష్ణాజినముధరించి, ఋగ్యజుస్సామస్తుతుఁడై నిమేషమాత్రమున నాచెంత కాపురుషుఁ డరుదెంచెను. బ్రహ్మయు నామహాపురుషునిం గాంచి నీ వెవఁడవు? ఏల యిచ్చటికరుదెంచి నిల్చితివి? నాకుం దెల్పుము. నేను లోకకర్తను, స్వయంభువుఁడను, పితామహుఁడని నాకుం

చేరు. అని బ్రహ్మ పలుకఁగా విని నే నా మహాపురుషునితో నేను లోకకర్తను. సంహర్తను. రక్షకుఁడను. అని నేనుబలుక బ్రహ్మకు నాకును వాక్కలహము సంభవించెను. ఆవివాద మా మహాత్మునిమాయచేఁ గల్గినదియే. అత్తఱి మాయిద్దఱకు బోధించుటకొఱకే పరమశివలింగ మావిర్భవించెను. కాలానలశతసంకాశమై జ్వాలామాలాసమాకులమై క్షయవృద్ధివినిర్ముక్తమై యాదిమధ్యాంతరహితమై యాలింగము పొడకట్టెను. బ్రహ్మనుగాంచి నేను పితామహా! నీవు క్రిందిభాగమున కరుగుము. ఈలింగమూలము నెఱుంగుము. నేను పైకరిగి శిరోభాగము నరసెద. అని సమయము మేమిరువురము చేసికొని ప్రయాణము సాగించితిమి. నూఱువత్సరములు పయనముసల్పియు దానియంతము నెఱుంగఁజాలక పోతిమి. అంతభీతిల్లి యింక నీవే శరణము మాకని ధ్యానముచేయుచుంటిమి. ఓంకారము నుచ్చైస్స్వరమున నుచ్చరించుచుంటిమి. దోసిలొగ్గి శంభుదైవమును వినుతించుచుంటిమి. శివుఁడవు. శాంతమూర్తివి. బ్రహ్మవు. లింగమూర్తివి. ఆదిమధ్యాంతరహితుఁడవు అను నీమొదలగు వేదవాక్కుల వినుతించుచుంటిమి.

ఆమహాపురుషుఁడు లింగమునుండి సౌమ్యమూర్తినిధరించి వక్త్రకోటిసహస్రముల నంబరమును మ్రింగువానివలెఁ గనంబడుచు సహస్రహస్తచరణుఁడై సోమసూర్యాగ్నినేత్రుఁడై పినాకపాణియై వ్యాళయజ్ఞోపవీత మలరార మేఘదుందుభినిస్వనమొప్పఁగా మమ్ముంగాంచి యిట్లు పలికెను. దేవసత్తములారా! మీయెడం బ్రీతుఁడనైతిని. నన్నుంగాంచి భయంపడకుఁడు. మున్ను నాతనువునుండి మీయిద్దఱు పుట్టితిరి.

ఈబ్రహ్మ నా దక్షిణభాగమునుండి సృష్టికర్తయై పుట్టెను. వామ పార్శ్వమునుండి విష్ణువు జగములఁ బాలింపఁ బుట్టెను. కావున మీమోడం గరుణించితిని. వరముల నడుగుఁడు. మీయిష్ట మును దీర్చెదను. అనిపలికి నన్నును బ్రహ్మను గౌఁగిలించుకొని యానందమందెను. అత్తఱి మే మిరువురము నమస్కరించి యిట్లు పలికితిమి. మహాదేవా! మాయందుఁ బ్రీతి మీకుం గలదేని వరమీయఁ గోరికగలదేని నీయందు మాకు నిశ్చల భక్తికుదర ననుగ్రహింపుము. అని యడుగఁగా నన్నుం గాంచి ప్రసన్నుఁడై హరుం డిట్లనియె. విష్ణూ! ప్రళయస్థితి సర్గములకుఁ గర్తవు నీవు. పరమేశ్వరుఁడవు. కావున నో విష్ణూ! ఈ చరా చరప్రపంచమును బాలింపుము. నేను మూఁడుమూర్తులుగా మార్పునొందితిని. బ్రహ్మవిష్ణుశివనామములామూర్తులకుంజెల్లు. సృష్టిపాలనసంహారము లామూర్తులకుం గ్రమముగాఁ గృత్యం బులగు. నేను నిర్గుణుఁడను. నిరంజనుఁడను. నీయజ్ఞానమును వద లుము. లోకములంబాలింపుము. ఈబ్రహ్మను గాపాడుము. ఈతఁ డునీకుఁ గుమారుఁడు కాఁగలఁడు. నేను గల్పాంతమునందు రుద్ర రూపమును ధరింతును. శూలపాణినై నీకుం బుత్రుఁడ నయ్యె దను. అని పలికి బ్రహ్మ ననుగ్రహమునం గాంచి నన్ను నాద రించి యందే యదృశ్యత నొందెను. అదిమొదలు లోకముల యందు శివలింగార్చనము సుప్రసిద్ధ మయ్యెను. లింగమున మహాజ్యోతిస్స్వరూపుఁ డావహించుటం జేసి పరమమయ్యెను. మార్కండేయా! ఆసంభాషణమునే నీకుం దెల్పితిని. యోగ జ్ఞులు దీని నెఱింగి సంతసింతురు. ఇదియే పరమజ్ఞానము. మహా సూక్ష్మము. జ్ఞానచక్షుస్సు లగువారు దీని నెఱుంగ వాంఛిం

తురు. ఇప్పుడు నేనామహాత్మునకు నమస్కారము లర్పింతును. అని పలికి శ్రీకృష్ణమూర్తి శంకరు ననేకభంగులం బ్రస్తుతించి నిమీలితనయనుం డయ్యెను. మార్కండేయమునియుం దదుక్త విషయము నాలకించి భక్తియుక్తుండై మహాదేవునకు నమస్కరించెను. కృష్ణప్రోక్తమగు నీవిషయము నెవం డాలకించునో వానికి సర్వపాపములు నశించును. సకలవాంఛ లొనం గూడును.

భక్తజనులారా! ఈకథను జదువునపుం డనేకసంశయములు మీకుం గలుగవచ్చును. కాని మనస్సునం దొక విషయము నిల్పుకొనుండు. దాన నిశంకలు నశించును. శివుండు హరిని, హరి శివుని బరస్పర మారాధింతురు. ఈయిరువు రొకతత్త్వమునుండి యుదయించినవారలే. ఈమూర్తిద్వయ మొక్కయాత్మగలదియె భేదములేదు. ఒకరు వేఱొక్కరూపమును బొగడుచుందురు. లోకులకుం దరణోపాయమును జెల్పుటకే యని యెఱుంగుండు. దీనిసారమేమనంగా; నీయిరువురిలో నెవ్వరి నాశ్రయించినను దుల్యఫలమే. ఒకరిని ద్వేషించివేఱొకరిని భూషించినచో నిష్ఫలమేగాని సత్ఫలము గలుగదు. ఈ విషయమును బలునారులు లోకులకు బోధించుటకే యిన్ని పురాణేతిహాసములు కల్గినవి. బహువిధకర్మముల నొనరించిన జీవులకు బహువిధములుగా దేవతాభేదములు కల్పింపంబడినవి. పూజావిధు లేర్పఱుపంబడినవి. స్తుతులు విధింపంబడినవి. ఇట్టు లయ్యును మానవు లీదేవతాదూషణపాపమును జేయక మానరేరు. ఆమహాకార్యము నొనరించుచునే యున్నారు. ఎవ్వరిద్దానిని మానుదురో సకలదేవతాస్వరూపుండని తమయిష్ట

దైవమును నమ్ముదురో వారే భగవత్కృపకుఁ బాత్రులగు దురు. ఇదియే గ్రహింపఁదగినది. ఇఁకఁ దరువాతికథ నాల కింపుఁడు.

## భృగ్వాదిమునులకు హరి తత్త్వోపదేశము చేయుట.

*మార్కండేయమహర్షి కిట్లు భగవత్తత్త్వమును దెలిపి సంతుష్టాంతరంగునిగా నొనరించెను. జాంబవతి తన్నుఁగోరినపుత్త్ర నను గ్రహించెను. జాంబవతియు శివప్రసాదమునందిన భర్తతన కనుగ్రహించిన వరమునం బుత్త్రునిం గాంచెను. ఆకుమారుఁడే సాంబుఁ డనంబడును. ప్రద్యుమ్ననకు ననిరుద్ధుఁడు పుత్త్రుఁడు. సాంబానిరుద్ధులిరువురు మహాపరాక్రమశాలురు. శ్రీకృష్ణుని రూపాంతరములా యనునట్లుండువారు. ఇట్లు కుమారులం గాంచు తనపత్ను లానందసాగరమున నోలలాడుచుండఁగా దుష్టరాక్షసులు క్రూరభూపాలురు పొలిసి యధర్మము తగ్గగా నింక నేఁ జేయఁదగు మహాకార్య మేదియని యూహింపసాగెను. అత్తఱి భృగువులోనగు మహామునులరుదెంచి శ్రీకృష్ణుని దర్శించిరి. ద్వారకానగరమున వేంచేసియున్న పరమేశ్వరుంగాంచి కృతార్థుల మైతిమని తలంచిరి. మహర్షులు రాఁగా శ్రీహరి వారి నెదుర్కొని నమస్కారాదిక్రియల బహూకరించెను. ఆసనములయందుపవిష్టులను గావించెను. బలభద్రుఁడును సమీపమునందుండి వారిని సత్కరించెను. హరియు వారు కూరుచున్నపిదప నింకఁజేయందగు కార్యవిశేషములు లేవు.

*ఈకథయుఁ గూర్మపురాణమున నిరువదైదవ యధ్యాయమునుండి గ్రహింపఁ బడినది.

కావున స్వస్థానమున కరిగెదను. మీరెల్ల రనుగ్రహింపుఁ డని ప్రార్థించెను. కలియుగము రా నున్నది. అది మహాఘోర రూపము కలది. జనులంద అందుఁ బాపకార్యములే యొనరింపఁ బూనుదురు. కావున మీరెల్ల ధర్మసంస్థాపనమును జేయుఁడని వారి కుపదేశింపుఁడు. వారు దేనిచేఁ బాతకనివృత్తిం గాంతురో యట్టివిధ ముపదేశింపుఁడు. అని కవికృతకల్మషాపనోద నపటుతర వాక్కులనుఁ దెల్ప వారానందించుచుండిరి. మఱియు హరి యిట్లు పలికెను. కలియుగమున నేజను లొకసారియైన నన్ను స్మరింతురో వారిపాపములన్నియు నడంగును. ఎవ్వారాకష్టకాలమున నన్ను భక్తియుక్తిం బూజింతురో వేదదృష్టమార్గము నవలంబింతురో వారిపాపము లెల్ల నడంగును. ఏ బ్రాహ్మణులు మహర్షులగు దేవంశములం బుట్టుదురో వారికెల్ల నారాయణుఁడ నగు నాయందు భక్తి కుదురుఁగాక. నారాయణ పరాయణులగు వారు నిరుపమాన పరాత్పరనామ విలసత్పదమందు నుందురు. *ఎవ్వరు విష్ణుభక్తులైనను మహేశ్వరుని ద్వేషింతురో వారికి ముక్తిపదము లభింపదు. ధ్యానము హోమము తపస్సు దివ్యజ్ఞానము యజ్ఞాది విధులన్నియు శివుని నిందించువారలకు శివుని ద్వేషించువారలకు నశించునే గాని ఫలము నీయఁజాలవు. ఎవ్వరు నన్ను నేకాంతభావమూని యాశ్ర

* 'పరాత్పరతరం యాంతి నారాయణపరాయణాః, న తే తత్ర గమిష్యంతి యే ద్విషంతి మహేశ్వరమ్. ధ్యానం హోమ స్తపో దివ్యం జ్ఞానం యజ్ఞాదికో విధిః, తేషాం వినశ్యతి క్షిప్రం యే ద్విషంతి పినాకినం. యో మాం సమాశ్రయేన్నిత్య మేకాంతం భావమాశ్రితః, వినింద్య దేవమీశానం స యాతి నరకాయుతమ్' అని మూలము.

యుంతురో వారు శివుని ద్వేషింతురేని నరకము నొందుదురు. కావున శంకరు నిందించుట మానవలయును. కర్మమునను, వాక్కునను, మనస్సునను భక్తులు శివద్వేష మూనరాదు. దక్షాధ్వరకాలమందు దధీచిమునియు నిట్లే శపించెను. అని పలికిన శ్రీకృష్ణుని యుపదేశము నాలకించి భృగ్వాదిమహర్షు లందఱు పరమానందమున నీయానతిచొప్పునఁ గలికాలమున భక్తులం గావం బ్రయత్నింతుమని సెలవంది తమతమ నివాసముల కరిగిరి.

మహాశయులారా! ఈచిన్నికథయందుఁ బూర్వోక్త నీతిసారమిమిడి యున్నది. మఱియు విశేషించి విష్ణుభక్తులకుం గల్గు నుత్తమగతులు శివుని దూషించుటచే నశించునని స్పష్టముగాఁ జెప్పఁబడినది. కలియుగమున విశేషించి దేవతానింద మహాపాతకమ్మని స్పష్టఁ జెప్పఁబడినది. ఇంతకంటె నెఱుఁగఁదగిన విశేషమేమి కావలయును? కలికాలము మహాకష్టదాయకమని యు, నందు భగవన్నామసంకీర్తనపరాయణులే యుండరనియు, నెందో యున్నను వారు శివదూషణము చేయువారైన నాఫలము కూడఁ గలుగదనియుఁ బలుమాఱులు చెప్పఁబడినది. ఇదియే గ్రహింపఁదగిన విషయము. ఇంకఁ దీనింబెంచి వ్రాయఁబూనక ప్రస్తుతాంశమును వ్రాసెదను.

## నృగమహారాజోపాఖ్యానము.

* మునీంద్రులకుఁ దత్త్వముపదేశించి వారిం బంపి

---

* ఈకథ శ్రీభాగవతమున దశమస్కంధమున నఱువదినాల్గవ యధ్యాయమునుండి గ్రహింపఁబడెనదని యెఱుంగునది.

శ్రీకృష్ణుఁడు సాంబాదికుమారులం గూడి ద్వారకానగరమున హాయిగా నుండెను. కాని యెవ్వరెవ్వరు తనచే విముక్తులు కాఁదగుదురో వారి నెప్పుడు విముక్తులనుగాఁ జేయవలయునో యని యోజించుచుండెను. తదనుకూలములగు నుపాయముల నరయుచు నుండెను. ఒక్కనాఁడు సాంబప్రద్యుమ్నానిరుద్ధ చారుభాను గదాదులగు హరిపుత్త్రులు విహారార్థ ముద్యాన మునకుంబోయిరి. స్వేచ్ఛగా నందందు విహరించిరి. ఇష్టాలా పములం బ్రొద్దు పుచ్చిరి. వివిధవిధాహారముల సంతృప్తులైరి. చాలముహూర్తము లీరీతిఁ గడపి మరల బాలత్వమున విహారా సక్తి తగ్గమి నందందుఁ దిరుగసాగిరి. దాన డప్పి జనించెను. ఒకబావి కనఁబడఁగా నందు జలముండుననియుఁ ద్రాగవలయు ననియు నచ్చటికిం బోయిరి. తొంగిచూచిరి. కాని యాబావి యందు జలము లేదు. రిత్తబావిగా నుండెను. ఆబావి యడు గుభాగమున నద్భుతముగ నొకసత్త్వము కనంబడియెను. అది సామాన్యాకృతి కలదిగా నుండక పర్వతాకారముగా వారికిం గనంబడియెను. అది తొండజాతిలోనిది. కృకలాసమని యాజా తికిం బేరు. ఊసరవెల్లియని దానిని సామాన్యజనులు పిలుతురు. 'తొండ ముదిరినూసరవెల్లి' యగునన్న సామెత యాకాలము నుండి యీనాఁడుంగూడ వాడుకలోనున్నది. ఆయూసరవెల్లిం గాంచి యా శ్రీహరిపుత్త్రులు విస్మితాంతఃకరణులైరి. అది యాబావినుండి పైకిరాఁజాలక యందే పడియున్నదనియు నాహారాదులు దానికిందగినవన్ని యందు దొరకవనియు నిఁకఁ గొలఁదిదినము లిక్లేయున్న నది మృతినొందుననియు వారూ హించిరి. కరుణ వారిమదులం బొదలెను. కావున దాని నుద్ధ

రింపఁ బ్రయత్నించిరి. మెల్లగాఁ జర్మనిర్మితపాశములు, తంతు నిర్మిత పాశములు దానికిం దగిలించిరి. పైనుండి యది పడి యుండుననియుఁ బైకి మరలఁ దీసిన నెందేని చని యాహారము సంపాదించుకొని జీవించుననియు, నిట్లుచేయుట మహాపుణ్యకా ర్యమనియు వారిభావము. కావున నార్తత్రాణపరాయణత్వ మున వారెన్నియో యుపాయము లొనరించి దానిని లాగఁ జొచ్చిరి. కాని మానవప్రయత్నమున నాపని సాధ్యమగునది కాదని యెఱుఁగునంతటిజ్ఞానము వారికి లేకుండెను. చేతనైనం తటిప్రయత్నము నొనరించిరి. వారిప్రయత్న మించుకంతయు ఫలింపదయ్యెను. తుదకిది మనచేతఁ గానిపని యని మాత్ర మెఱుంగఁగల్గిరి. బుద్ధిశాలురుగావునఁ దమచేతఁ గానిపని విష యమున శ్రద్ధయేటికని విరమింపక యింటికింబోయి శ్రీకృష్ణ మూర్తికిం జెప్పిరి. ఆ తెల్పుట యత్యుత్సాహమును గనఁబఱ చెను. దానికే భగవంతుఁడు సంతోషించెను. లోకమున నెవ్వరు గాని సత్కార్యమును జేయఁబూని యది సాధింపరానిదై నచో విడువక దాని నితరులకుం జెప్పి వారిచేఁ జేయించుట భగవత్తుష్టికరకార్యములలోఁ బ్రధానము. ఎల్లవిషయములఁ దమకే విఖ్యాతిరావలయు ననియు, నితరుల కట్టియవకాశ మును గల్పింపఁగూడదనియుఁ దలంపరాదు. అది యోర్పు లేమికి నుదాహరణము. అట్టివారు వృద్ధికి రాఁజాలరు.

శ్రీహరి విశ్వభావనుఁడు. సర్వజ్ఞత్వ మామహాత్ముని స్వభావధర్మము. కావున వారు విన్నవించిన తోడనే హరి ముక్తుఁడగుటకు సంసిద్ధుఁడుగా నున్న ప్రాణివిషయ మెఱింగి సమయమునకు వేచియున్నవాఁడు. కావున వారందులకు

సాయఁబడిరని సంతోషించి యాచోటికిం బోయెను. బావిలో నున్న పెనుభూతమువంటి యాయూసరవెల్లిని గాంచి విలాసమునఁ జేయుకార్యమువలె వామకరమునఁ బట్టుకొని వెడలించెను. ఉత్తమశ్లోకుఁడగు శ్రీహరి కరసరసిజసంస్పర్శమున నప్పుడే యాకృకలాసరూపమును వదలి పుటముపెట్టిన బంగారువంటి తనుచ్ఛాయ యలరారఁగా నత్యద్భుతాలంకారములు శోభిల్లఁగా మనోహర పావన పుష్పహారములు సొంపు నింపుచుండఁగా నొకమహీశ్వరుఁడయ్యెను. సాంబాది కుమారులు విభ్రాంతులైరి. శ్రీహరి కది యచ్చెరువుగఁ దోఁప కుండుట సహజముకదా. ఐనను దద్వృత్తాంతము నామూలము మెఱింగిన వాఁడయ్యు నాపుణ్యపూరుష దానము లోకుల కెల్లఁ దెలుపుటకై తనసర్వజ్ఞత్వమును మఱుగుపఱచి ముకుందుఁ డల్లన నిట్లని ప్రశ్నించెను.

మహాత్మా! మీరెవరు? మిమ్ము మనోహరాకారము గల దేవోత్తములనుగా భావించుచున్నారము. ఇది నిశ్చయము. ఎట్టికర్మముచే నిట్టిరూపము మీకలవడెనో యెఱుంగఁ గోరుచున్నారము. మీ రిట్టిదేహము నొందుటకుఁ దగిన వారు కారు. మీకథ నెఱుంగఁగోరుచున్న మావాంఛితములఁ దీర్పవలయును. వేఱుగఁ దలంపక మాసంశయమును దీర్పుఁడని మనోహరవాక్కులం బ్రశ్నించి యాభూపాలు చిత్తము సంతోషాయత్తముగ నొనరించెను. శ్రీహరి యిట్లు తన్నుంగూర్చి ప్రశ్నింపఁగా నారాజు పరమానందభరితుఁడై రవి సహస్రవర్చస్సుగల కిరీటము హరిపాదాంభోరుహములు సోఁకఁ బ్రణమిల్లి మహానుభావా! శ్రీకృష్ణా! కరుణాసింధూ!

నాపూర్వవృత్తాంతము మీ రెఱుంగనిది కాదు. ఐన విన్న
వించెదను. నృగుఁ డనుపేరుగల వాఁడను. భూపాలుఁడను.
ఇక్ష్వాకుభూజాని తనయుండను దానముల ప్రస్తావమున నాపేరు
నీకర్ణవివరములసోఁకియుండదేని వచించెద. మహాత్మా! సర్వభూ
తాత్మసాక్షివగు నీ వెఱుంగనిది యేదియే నుండునా! ఐన నీ
యానతి శిరసావహించి నాయీతనువు వృత్తాంతమును విన్న
వించెద. కాలము నన్ను మోసపుచ్చెనని తొలుదొలుతఁ దెలి
యఁజాల నైతిని. చేసినదానమును జెప్పఁగూడదని యెఱిం
గియు మీయాజ్ఞ యాయెనన్న కారణమునఁ జెప్ప సాహ
సించెదను. భూతలమున నెన్ని సికతాశకలము లుండునో,
అంబరమున నెన్ని నక్షత్రము లుండునో వర్షధార లెన్ని
యని లెక్కింప నగునో యన్ని గోదానముల నొనరించితిని.
పాలిచ్చుచుఁ బ్రాయముగలిగి మంచిస్వభావము రూపగుణ
ములు గలవయి హేమశృంగములు గలిగి న్యాయార్జితములై
రౌప్యఖురములఁ గనుపట్టుచు వత్సలంగూడి దుకూలమాల్యా
భరణముల నలరారుచు నుండు కపిలగోవుల నే దానమిచ్చి
తిని. అలంకరింపఁబడి గుణశీలములుగలిగి బీదతనమునఁ గుం
దుచుఁ గుటుంబులై సత్యవ్రతమున నలరుచుఁ దపస్సు వేద
పఠనము జ్ఞానము దాతృత్వము వయస్సు గల సద్బ్రాహ్మణు
లకే కపిలగోవుల నొసంగితిని. గోభూహిరణ్యములను, గృహ
ములను గజహయములను, గన్యకలను, దిలరూప్యములను,
శయ్యలను, రథములను, వస్త్రరత్నపరిచ్ఛదములను దానమిచ్చి
తిని. యజ్ఞములనుజేసితి. ఇష్టాపూర్తకర్మముల నాచరించితిని.

ఒకానొకప్పుడు, నేదానమిచ్చిన బ్రాహ్మణుని గోవు తప్పించుకొని యెట్లో నాగోధనమునఁ గలిసెను. దాని నెఱుంగక మఱొక సద్బ్రాహ్మణున కిచ్చితిని. దాని నాతఁడు కొని పోవుచుండఁగాఁ దొలుత నావలనఁ బ్రతిగ్రహించిన బ్రాహ్మణుఁ డీగోవునాయదని నిర్బంధించెను. పిదప దానముగొన్న బ్రాహ్మణుఁ డీది రాజుచేనీఁబడినది. కాన నాదనెను. నాది నాది యను వాగ్వాదము ప్రబలెను. వారిరువురు నరుదెంచి స్వార్థపరులు గావున నన్నడిగిరి. రెండవఁద్విజుఁడు దానమిచ్చితివి కదా యనియె. మొదటిభూసురుఁడు నాకుదానమిచ్చి యపహరించితివి కదా యనియెను. నాకు భ్రాంతిగలిగెను. ధర్మమున గలకష్టమెఱింగిన నేను వారినిర్వురను బ్రార్థించితిని. ఆర్యా! లక్షగోవుల నిట్టివాని నిచ్చెద. వానిని గ్రహించి దీనినీయునకిమ్మా యని యిద్దఱను వేఁడితిని. ఎఱుఁగక నాదే యను ప్రమాదమున దానమిచ్చితిని. నా యీ యపరాధమును క్షమింపఁ దగునని ప్రార్థించితిని. ఈకింకరునితప్పును మన్నించి యిట్టి వానిం బెక్కంటిని గైకొమ్మా యని దోసిలొగ్గితిని. దానమిచ్చి మరలదానిని గ్రహించినందున నమంగళకరమగు నరకముగల్గును. అందుఁబడకయుండ నన్నుఁ గాపాడుమా యని యభ్యర్థించితిని దినినీయునని దానింబట్టుకొని యొక్కవిప్రుఁడు పోవసాగెను. ఇదిగాక మఱియు నిట్టిగోవుల నెన్నింటినిచ్చిననునాకేల యని యొకఁడు పోవఁజొచ్చెను.

మృతికాలమున యమదూతలరుదెంచి నన్నుం దీసికొని పోయి యమునెదుట నిల్పిరి. ధర్మరాజు నన్నుం జూచి తొలుత నీవు పాపమునను భవింతువా శుభమునను భవింతువా రాజా! నీ

దానమునకంతము లోకమునఁగానరాదు. కావున నల్పపాపఫల మునే తొలుత ననుభవింపుమని యాజ్ఞాపించెను. అంతలో నాతను వీకృకలాసముగాఁ గనఁబడియెను. కమలాక్షా! జ్ఞాన ముగలిగి దాతనై నీదాసుఁడనగు నాకిప్పటికిని బూర్వజ్ఞానము చక్కఁగా నుదయింపదయ్యెను. నీసందర్శనమునఁ బ్రాక్తన స్మృతి చక్కఁగాఁ గలిగినది. యోగీంద్రులకుఁ గానరాని నీవు నాకంటఁబడితివి. అపవర్గమిఁకఁ గరతలామలకము. మహాను భావా! కరుణావారాశీ! సకలలోకనాయకా! పరమపూరుషా! దేవలోకమున కరుగ ననుగ్రహింపుము. ఎందుండిన నాచిత్తము నీపాదారవిందముల నిల్చియుండును. సర్వభావములు గల నీకు నమస్కారము. బ్రహ్మమవై యనంతశక్తివిరాజితుండవగు నీకు వందనములు. వాసుదేవా! శ్రీకృష్ణా! యోగీశ్వరా! నీకు నతులు. అనివినుతించి తనశిరస్సు హరిపాదములు సోఁకునట్లుగా నమ స్కరించి హరియనుమతినొంది మానవులందఱును జూచు చుండఁగా దివ్యవిమానము నెక్కెను.

అత్తఱిఁ గృష్ణుఁడు తనపరిజనులనుగాంచి వారికి నుపదే శింపం దలంచి యిట్లుపలికెను. ఈఘట్టమున మూలమును వ్రాసి దానియర్థమును మనోహరముగా విస్తరించి తనమహోన్నత భక్తిని నెఱిపిన పోతనగారి పద్యమును వ్రాసెదను,

శ్లో. దుర్జరం బత బ్రహ్మస్వం భుక్తమగ్నేర్మనాగపి,
తేజీయసోఽపి కిముత రాజ్ఞామీశ్వరమానినామ్. 32

నాహం హాలాహాలం మన్యే విషం యస్య ప్రతిక్రియా,
బ్రహ్మస్వం హి విషం ప్రోక్తం నాస్యప్రతి విధిర్భువి. 33

హినస్తి విషమత్తారం వహ్నిరద్భిః ప్రశామ్యతి,
కులం సమూలం దహతి బ్రహ్మస్వారణిపావకః. 34
బ్రహ్మస్వం దురనుజ్ఞాతం భుక్తం హంతి త్రిపూరుషం,
ప్రసహ్యాతు బలాద్భుక్తం దశపూర్వాన్ దశావరాన్. 35
అను నీ మొదలగు శ్లోకములు గలవు. ఇందుఁ గొన్నింటికి మహాకవి పోతన—

సీ. నరనాథకుల కాననము దహించుటకును
నవనీసురుల విత్త మగ్నికీల
జననాయకుల నిజైశ్వర్యాబ్ధినింకింప
బ్రాహ్మణక్షేత్రంబు బాడబంబు
పార్థివోత్తముల సంపచ్ఛైలములఁ గూల్ప
భూసురధనము దంభోళిధార
జగతీవరులకీర్తి చంద్రికమాప వి
ప్రోత్తము ధనము సూర్యోదయంబు

తే. విప్రతతి సొమ్ము కంటెను విషము మేలు
గరళమునకును బ్రతికృతి కలదు గాని
దానిమాన్పంగ భువి నౌషధములు లేవు
గాన బ్రహ్మస్వములు గొంట గాదుపతికి.

క. ఎఱుఁగమినైనను భూసుర
వరుల ధనంబపహరింప వలవదుపతికిన్
మఱపున ననలము ముట్టిన
దరికొని వెసఁగాల్పకున్నె తనువెరియంగన్.

మఱియు శ్రీహరి యిట్లుపలికెను. రాజులు రాజ్యరమతోడ నాత్మపాతమును గోరుదురేని, లేక నిరయమునఁ బడఁ

గోరుదురేని వారు బ్రాహ్మణద్రవ్యమును గొనందగును. తమ ద్రవ్య మపహరింపఁ బడినదని దుఃఖించుబ్రాహ్మణుని కన్నుల నుండి యెన్నిబిందువులు క్రిందఁబడునో రాజులుగాని రాజేంద్రులుగాని యన్నివత్సరములు కుంభీపాకమను నరకమునఁబడి బ్రాహ్మణద్రవ్యమపహరించి యిట్టిదుర్గతికిం బ్రాప్తిమని దుఃఖింతురు. ఎవఁడు తానిచ్చినదిగాని, పరులిచ్చినదిగాని బ్రాహ్మణులవృత్తిని హరించునో వాఁ డఱువదివేలవత్సరములు మలమునఁ బురుగై యుండును. కావున నోపరిజనులారా! అపరాధము చేసియున్న బ్రాహ్మణునిద్రవ్యమునైన నపహరింపకుఁడు. కోపమున నాద్విజుఁడు హింసించినను శపించినను నమస్కరింపుఁడు. నే నెట్లు బ్రాహ్మణులకు నమస్కరించుచున్నాఁడనో మీరు నట్లే నమస్కరింపుఁడు. అట్లుచేయ రేని వారిని దండించెదను. విప్రద్రవ్యమునపహరించిన నరకముతప్పదు. నృగమహారాజంతవాఁ డేమాయె? అని యందఱకు నుపదేశించి యంతఃపురమున కరిగెను. నృగమహారాజు సురలోకమునకుం బోయెను.

మహామతులారా! నృగమహారాజుచరిత్రము నాలకించితిరి. భగవంతునియనుగ్రహమున నెట్లు కృతకృత్యుఁడయ్యెనో యెఱింగితిరి. దీనిసారమేమి యని యాలోచించినఁగాని లాభములేదు. గోదానములు నృగమహారాజు చేసినన్ని లోకమున నింకెవ్వరును జేయలేదని స్పష్టమగును. కాని యంత దానఫలమునకు నించుకకళంకము గలిగి యాదాతను దుర్గతికిం దెచ్చెను. దానము చేయుటమాత్రమే చాలదు. అందేలోపము లేక యుండఁ జేయవలయును. శ్రద్ధయనునదియే పరమ

పావన పదార్థము. దానికి సమానమగునది వేఱొక్కటిలేదు. శ్రద్ధలేక యెంతటిఘనకార్యముచేసినను దానిఫలము సంపూర్ణముగాఁ గలుగదు. ఎంతటివాఁడైనను దాఁజేయుకార్యము శ్రద్ధవహించి చేయకపోయినచో నది యించుకదుష్ఫలము నిచ్చునని యీకథయే మనకు బోధించుచున్నది. దోషములను బుణ్యకార్యము లెన్నియైన మాన్పఁజాలవనియు నిదియే హెచ్చరించుచున్నది.పుణ్యపాపఫలములను బ్రారబ్ధకర్మానుసార మనుభవింపక తప్పదని నృగచరిత్రము స్పష్టముచేయుచున్నది. సద్బ్రాహ్మణుల యాగ్రహము ఫలమునీయక మానదనియు, దానినొందకుండఁ గాచుకొనుట మేలనియు, భగవంతుఁడా శ్రితులకెల్ల బోధించెను. ఇట్టినీతుల నీగాథ యనువదించుచున్నది. కావున నెంతటివాఁడైనను దాఁజేయు పుణ్యకార్యమున శ్రద్ధవహించి ప్రతిఫలమును గోరక చేయవలయును. లేనిచో లోపమురాకమానదు. ఇఁకఁ దరువాతి భగవచ్చరిత్రము నాలకింపుఁడు.

## పౌండ్రకవాసుదేవాదుల హరి వధించుట.

*పరమాత్మ ద్వారకానగరమున గుప్త మహిముఁడై యుండెను. బలరాముఁడు నందవ్రజమునకు బంధుదర్శనార్థ మరిగెను. అందలివారెల్లరు నామహాత్మురాక కలరి వివిధోపచారముల నలరించిరి. ఇట హరియు ద్వారకయందుండియే ధర్మాభివృద్ధిఁగోరి తద్భంగకర్తల నడంచు నుపాయమాలో

* ఈవిషయము శ్రీమద్భాగవత దశమస్కంధమున నఱువదియాఱవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని తెలియందగు.

చించు చుండెను. ఒక్క నాఁడు శ్రీహరి యాస్థానమున నుచితాసనమున నాసీనుఁడై పుత్రామాత్యపరివృతుఁడై యుండఁగాఁ గరూశాధిపతియగు పౌండ్రకవాసుదేవుఁడు తానే వాసుదేవుఁడనియు జగతినింకొకఁడు తనపేరుగలవాఁ డుండరాదనియు నజ్ఞానమున నూహించి ద్వారకయందు వాసుదేవుఁ డున్నవాఁ డని విని యోర్వఁజాలక దూతనుబంపెను. అవివేకులు తనను వాసుదేవుఁడవు. జగత్పతివి. భగవంతుఁడవు. మానవలోకమును గాపాడ నవతరించితివి. అని పొగడుచుండఁగా నిజమే యని యజ్ఞానమున నమ్మియుండెను. అచ్యుతునిగాఁ దనను భావించుకొనియెను. కావున నే తనపేరుగలవాఁ డింకొక్కఁ డుండరాదను గర్వమున దూతను బంపెను. కాని యచ్యుతుఁడు శ్రీకృష్ణమూర్తియని యెఱుఁగజాలక పోయెను. ద్వారకయందు బాలకులెల్లఁ దనను వాసుదేవుఁడని వినుతింపఁగా నుప్పొంగుచున్నాఁడుగాన నాతనికిబుద్ధిచెప్పవలయునని యే దూతను బంపెను. ఆదూతయుఁ బ్రభునానతిమెయి ద్వారకానగరమున కరుగుదెంచి సభాభవమున నాసీనుఁడయి యున్న భగవంతుని, జగద్విభునిఁ, గమలపత్రాక్షుని, శ్రీకృష్ణుని గాంచి రాజసందేశము నెఱింగింపఁబూని యిట్లు పలికెను.

"కృష్ణా! వాసుదేవుఁడనై భూతలమున నవతరించితిని. ఈపేర నుండఁదగిన వాఁడను నేనొక్కఁడనే. రెండవాఁడుండ రాదు. భూతజాలమును గాపాడఁబూనితిని. నీవు మిథ్యానామమును వాసుదేవుఁడను దానిని ధరించితివి. కాన దానిని వదలుము. భీతిలేక నాచిహ్నముల నెవ్వానిని ధరించితివో అవివేక

మున ధరించితినని యిప్పుడైన నెఱింగి వానినెల్లం ద్యజించి నన్ను శరణువేడుము. వేడనిష్టపడవేని నాతో యుద్ధమొనరింప సంసిద్ధుండ వగుము." అని రాజశాసనము నాదూత తెలిపి యూరకయుండెను. అల్పబుద్ధియగు నారాజు పంపినసందేశము నాలకించి శ్రీకృష్ణమూర్తియు నుగ్రసేనాదులగు సభ్యులు సభాంగణముననే ఫక్కున నవ్విరి. భగవంతుండు పరిహాసకథాలోలుండై దూతంగాంచి యీమాటలు మీరాజున కెఱింగింపుము. "నీవేతులువపలుకులను బలికితివో యందుం బేర్కొనంబడినచిహ్నముల వదలెదను. అజ్ఞానుండా! కంకగృధ్రబలములు నిన్నావరించి నీమోమును గప్పియుండంగా నాచేం జంపంబడిశయనింపంగలవు. శునకములు నీకు శరణములగు." ఈమాటలు బదులుగా గొనిపోయి రాజుమ్రోల నెఱింగింపు మని దూతను సాగనంపెను ఆతండు వేగంబపోయి తనఱేనికి వాని నన్నింటిని దెలిపెను.

శ్రీహరియు నరదము నెక్కి కాశీనగరమున మిత్రగృహమునం బౌండ్రకవాసుదేవుం డవుడుండు టెఱింగి యచ్చటికిం బోయెను. పౌండ్రకుండును శ్రీకృష్ణాగమనము నెఱింగి మహారథుండు గావున రెండక్షౌహిణుల సేనలంగూడి నగరమునుండి వెడలెను. ఆతనికి మిత్రుండగుట కాశీరాజు సాయపడుటకు సమ్మతించి వెనుకనే సంగరమునకరిగెను. ఆతం డొక్కయక్షౌహిణీసేనం గూడి యరిగెను. నగరమును వెడలి వచ్చిన మూండక్షౌహిణుల బలములను గాంచిపౌండ్రకునీక్షించెను. ఆతండు శంఖచక్రములను ఖడ్గగదాశార్ఙ్గములను ధరించి శ్రీవత్సాంకితుండై కౌస్తుభమణివనమాలను ధరించి పీతకౌశేయవస్త్ర

ముసు గట్టి గరుడధ్వజము గ్రాలఁగా నమూల్యమాల్యాభరణముల శోభిల్లుచు విలసన్మకరకుండలుఁడై యుండెను. ఇట్లు కృత్రిమరీతిం దగు నాత్మవేషమునఁ దనవలెనుండఁగా రంగస్థలమున నొప్పు నటునివలె నున్నవాఁడని ఫక్కున నవ్వి యూరకుండెను. అంతట శత్రుసేనలు ప్రాసతోమరాద్యాయుధముల శ్రీహరిం బ్రహరించిరి. శ్రీహరియుఁ బౌండ్రక కాశిరాజుల చతురంగ బలములను జక్రమున నితరాయుధములను బ్రళయకాలమున నగ్ని లోకములంగాల్చునట్లు దహించెను. ఆసంగర మతి భయంకరముగా సాగెను.

అంతటఁ బౌండ్రకునిసమీపించి శ్రీహరి యోరిపౌండ్రకా! నీవు దూతమూలమున నాకేవార్తం జెప్పితివో ఆమాటలప్రకారమే నాయస్త్రముల నీపైన వదలెదను. నీవసత్యవాసుదేవనామమును ధరించితివి గాన దాని వదలునట్లు చేసెదను. నీశరణు చొచ్చెదను. యుద్ధముసేయనొల్లను. అని పలుకుచు నవ్వుచు నిశాతబాణపరంపరల నొప్పించి విరథుని గావించి యింద్రుఁడు వజ్రాయుధమునఁ బర్వతమును భేదించునట్లు చక్రాయుధమున నాతని శిరస్సును ఖండించెను. కాశీపతియు హరిమార్గణాని మిత్రుఁడేగిన చోటికేపోయెను. హరి ప్రయోగించిన మూఁడుబాణములచేఁ గాశీరాజు శిరస్సు తెగి కాశీనగరమునఁ బడియెను. ఇట్లు మత్సరియగు పౌండ్రకుని దన్మిత్రుఁడగు కాశీపతిని బొలియించి మరలి ద్వారకానగరమును బ్రవేశించెను. కాశీనగరవాసులీతల మెవ్వరిదని తొలుత ననుమానించి తుదకుఁ దమఱేనిదే యని నిశ్చయించి విలపించిరి. తత్పుత్త్రులుఁ పెల్లుగ నేడ్చిరి. ఆతనికుమారుఁడగు.

సుదక్షిణుఁడు తండ్రికిం జేయందగు కృత్యముల నొనరించి పితృహంతయగు హరిం జంపి పితౄణమును దీర్పఁబూని శంకరు నారాధించెను నియమమునఁ దపస్సొనరించెను. శంకరుఁ డాతని తపస్సునకుం బ్రీతుఁడై వర మడుగు మనియెను. ఆతఁడు తనతండ్రిని బొలియించినవానిం జంపవలయునని కోరెను. శంకరుఁడు నాతని వాంఛితమునువిని రాజకుమారా! నీవు ఋత్విజులఁగూడి యగ్నినుపాసింపుము. అభిచారవిధి నను సరింపుము. దాన నందుండి మూర్తి యుదయించును క్రూరతరమగు నీవాంఛితమును సాధించునని పలికి యంతర్హితుఁ డయ్యెను.

శివుఁ డీరీతిం బలుకఁగా విని యారాజకుమారుఁ డట్లే యగ్నినుపాసించెను. అంత నాయగ్నికుండమునుండి యతి భయంకరమూర్తి యొకఁ డుద్భవించెను. దానికిఁ దప్తతామ్ర శిఖాశ్మశ్రువులుండెను. అంగారోద్గారి లోచనములు నెలసెను. దంష్ట్రలుగ్రభంగి వెలుఁగొందెను కఠోరాట్టహాసము స్వాభావముగ నలవడియెను. నాలుక యల్లలనాడుచుండెను. రక్తధారల నాఘ్రాణింప బూనినట్లే యానాలుక చూచువారలకుం దోఁచెను. తాళప్రమాణములగు పాదములతాఁకున భూమి యల్లల్లనాడుచుండఁగా నావ్యక్తి భూతసముదాయములు వెంటరాఁగా ద్వారకానగరము నొక్కసారిగాఁ గాల్పఁ బ్రయాణమయ్యెను. నిమేషమాత్రమున ద్వారకను జేరఁగల్గెను. అభిచారికదహనుఁడు వచ్చుచుంట నెఱింగి ద్వారకానివాసులు వనదాహములు మృగములు భీతిల్లునట్లు దురపిల్లిరి. సభాంగణమున నక్షములచేఁ గ్రీడించు భగవంతుని గానంబోయి

భయాతురులు గావున శ్రీహరీ! కాపాడుము. కాపాడుము. నగరమును గాల్చుచున్న వహ్ని మమ్మంతము నొందింపకయుండ రక్షింపుము. అని మొఱ్ఱపెట్టిరి.

వారిమాటలాలకించి వారల పాధ్వసము నెఱింగి సకల లోక శరణ్యుఁడగు నా కరుణాసింధువు నవ్వి పౌరులారా! భయంపడకుఁడు. అని యభయమిచ్చి మది నాలోచించి మాహేశ్వరియగు కృత్యగా దాని నెఱింగి దాని ధ్వంసము చేయనూహించి పార్శ్వమున సన్నిహితమగు సుదర్శనమున కాజ్ఞ యిచ్చెను. కోటిసూర్యు లుదయించినట్లు ప్రళయకాలాగ్ని యుద్దీపించినట్లు సుదర్శనముడరి తన తేజస్సులచే నభోదిగ్వివరములనాచ్ఛాదించి యాయాభిచారికాగ్నిని బాధింపఁబోచ్చెను. ఆయాభిచారికాగ్ని సుదర్శన ప్రభావమునఁ దనశక్తి నిరర్థకము కాఁగా మరలి కాశీనగరమున కరుదెంచి ఋత్విక్సహితుఁడగు సుదక్షిణుని నొక్కొత్తునదహించెను సుదర్శనము దానివెంట నరిగి వారాణసీనగరమును గాల్చి శాంతవైరమై మరలవచ్చి హరిపార్శ్వమున నుండెను. ఈపరి మేశ్వరు దివ్యగాధ నెవ్వరేఁ బఠించిన వినినఁ బాపములు నశించును.

మహాత్ములారా! ఈయుపాఖ్యానము నాలకించితిరి. ఇందేమి విశేషమని యించుక యాలోచింపుఁడు. ముఖ్యముగాఁ దెలిసికొనఁ దగినవిషయ మొక్కండు కలదు. అదే దన; నాకంటె నధికుఁడుగాని సమానుఁడుగాని లోకమున నుండఁ గాడను దుర్భావముగలవా రెంతవారుగాని నశింతురనియుఁ దనశక్తియుఁ బరశక్తియుఁ దెలిసికొనక యితరుల నాశనము గోరినవారు తుదముట్ట నశింతురనియుఁ గావున

నీ రెండు కార్యములు బుద్ధిమంతులచే వదలఁబడవలయుననియు మనము గ్రహింపవలయును. శివుఁడు సుదక్షిణునకు వర మిచ్చెఁగదా. హరిశక్తి తెలిసికొనఁజాలక పోయెనా. ఆవరమేల వ్యర్థమయ్యెను? అను ప్రశ్న మీకథయందుఁ గలదు. ఈ ప్రశ్నము వేయుటయే మొదటిపొరపాటు. ఏలన, శంకరుని మహిమము శ్రీహరికిని; హరిమహిమము హరునకే తెలియును గాని యితరులకుం దెలియదు. తెలిసియు నట్టివరమేల యిచ్చె ననఁగా సుదక్షిణుఁడు నతనితోడ సమానఫల మనుభవింపఁ దగు ఋత్విజులు కొందఱు దుర్మరణమునొందవలసినవారని యెఱుంగును. కావున సదాశివుఁ డవ్వారికర్మములకుఁ దగు ఫలమును గల్గించునుపాయము నాదేశించెనని యెఱింగిన నిట్టి ప్రశ్నముల కేరావకాశముండదు. ఇప్పట్టున నొక్కవిష యము వ్రాయక తప్పదు. కొందఱు దేవతోపాసనమొనరించి యాదేవతవిధిప్రకారము తమ కభిముఖముగ నున్నదనియుఁ దత్కరుణకుఁ బాత్రులమైతిమనియుఁ దలంచి తత్సహాయమున దమశత్రువులఁ బొలియింప మారణప్రయోగము చేయుదురు. ఆదేవతయు నొకానొకప్పుడు వారిశత్రువులఁ బొలియించు టయుఁ గలదు. కాని సామాన్యముగాఁ గర్తను బొలియిం చును. ఏలయన; దేవతారాధనమునకు ఫలము శాంతము భూతదయ లోనగు నవియలవడుటయే కాని క్రూరత్వాదు లలవడుట కాదు. అట్టులుండ నాభిచారికవిధి ననుసరించి యుపాస్యదేవత నిర్బంధించిన విధికి లోఁబడి యాపని చేయ వలసియుండును గదా. శత్రువు సత్కర్మానుష్ఠానపరాయణుఁడైన నట్టివాని హింసించుట కా దేవతకు సమ్మతము కాదు. కావున

చిట్ట్రియ కార్యము చేయఁబూనినందులకు నాతనినే పొలియిం చును. కావున నాభిచారిక క్రియలు సదా అపాయమును గల్పించునుగాని మేలుచేకూర్ప నెంచవని యీకథనుండి మన మెఱుంగవలయును. దేవతల నారాధించి వారియనుగ్రహ మునకుఁ బాత్రుఁడై తిరుణోపాయమును జూచుకొనవలయుఁ గాని స్వనాశనప్రయత్నము చేయరాదు. ఈనీతి నీకథ యందుఁ గల సుదక్షిణుని చరిత్రము హెచ్చరించుచున్నది. ఇఁకఁ దర్వాతికథ నవధరింపుఁడు.

## బలరాముఁడు ద్వివిదుఁడనువానరునిం జంపుట.

*శ్రీకృష్ణుఁడు పౌండ్రకవాసుదేవుని బొలియించి ద్వా రకయందు నివసించెను. ఇఁకఁజేయఁదగు కార్యమేమని యా లోచించెను. బలరామునిమూలమున ద్వివిదుఁడను వానరుని జంపించుట కర్తవ్యమని తలంచెను. ఆవానరుఁడుండిన ముందుఁ దనపని కించుక భంగము వాటిల్లుననియు నాతఁ డీలోకమున నుండఁ గల కాలము సమీపించెననియు నెఱింగెను. ఆవాన రుఁడు నరకాసురునకుఁ బరమమిత్రుఁడు. సుగ్రీవునకు త్రేతా యుగమున మంత్రిగా నుండెను. మైందునకు సోదరుఁడు. తన మిత్రుఁడగు నరకాసురుని హరి పొలియించిన కతమున వాని కాగ్రహముకలిగెను. ఏవిధముననైనఁ బగతీర్చుకొనవలయు నన్నసంకల్పము వానిమదిఁ గల్గెను. కావునఁ జెలరేఁగి రాష్ట్ర విప్లవము చేయనారంభించెను. పురగ్రామాదులంజొచ్చి యగ్ని

* ఈకథ శ్రీభాగవతము దశమస్కంధమున నఱువదియేనవ య ధ్యాయమునుండి గ్రహింపఁబడిన దని యెఱుంగునది.

రగిలించి వాని గాల్చెను. దేవాలయములఁ బడఁగొట్టుచు దటాకములఁ ద్రెంచుచు నదుల నడ్డగించుచు సస్యములఁ జీకాకుపఱచుచు నిట్లు నానాప్రకారముల జనుల కాయాసమును గల్గించెను. ఒక్కొక్కప్పుడు పర్వతశృంగములను బెకలించి తెచ్చి వైచి దేశమును పాడుచేయ సాగెను. తనమిత్రుని జంపిన వారి నివసించిన యానర్తదేశముల మఱింత పాడుచేయఁ బూనెను. మఱొకప్పుడు సముద్రమధ్యమున మునిఁగి చేతులచే నాజలము నెగఁజిమ్మి తీరమందలిగ్రామముల ధ్వంసముచేయును. మహర్షులయాశ్రమములఁ బాడుచేయును. మంచిమంచి వనస్పతులఁ బెకలించును. వైతానికాగ్నులయందు మూత్రపురీషములను వైచి మలినములుగా నొనరించును. పురుషులను స్త్రీలను పట్టుకొనిపోయి పర్వతగుహాలయందు సానువులయంతరమున నునిచి వారిపై శృంగములఁ బడవైచును. తుమ్మెద పురుగులఁ జంపినట్లు వారి నుక్కడించి యానందించును.

ఈరీతిగా దేశములఁబీడించుచు గులకాంతలను దూషితలనుగా నొనరించుచుండఁగా నొక్కనాఁడు రైవతపర్వతమునుండి కర్ణసుఖకరంబగు నొకగీతము వినఁబడఁగా నచటికరిగెను. అందు బలరాముఁడు కమలమాలాలంకృతగ్రీవుఁడై యుండఁ గాంచెను. అతనిచుట్టు కామినీమణులుండిరి. చల్లనిగేయములఁ బాడుచుండిరి. వారుణీపానమున విహ్వాలలోచనుఁడై బలరాముఁడుండెను. మదమెత్తిన గజరాజమువలెఁ గనుపట్టెను. దుష్టుఁడగు ద్వివిదవానరుఁడొక్కవనస్పతి శాఖనెక్కి దానినూఁచుచుఁ గిలకిలాశబ్దమొనరించెను. తనను రామునకుఁ గనఁబడఁజేసెను. ఆకోఁతి దార్ష్ట్యమును దిలకించి స్వజాతి

చాపల్యమునఁ గాంతలు హాస్యప్రియులుగాన నవ్విరి. వారెల్ల బలదేవునిభార్యలు. వానరుఁడును భ్రూవిక్షేపములఁ బరిహసించెను. తనవెనుకటి భాగమును వారలకుఁ గనఁబఱచెను. రాముఁడీ చేష్టలం గాంచెను. ఆగ్రహించి యొకపాషాణమున లక్షించి యావానరుం గొట్టెను. ఆవ్రేటును దప్పించుకొని యాకపి మదిరాకలశమును గైకొని యటునిటుతిరిగి విలాస చేష్టలఁ గనఁబఱచి బలరామునకు మఱింతయాగ్రహము గల్గఁ జేసెను. వృక్షమునెక్కి యాకలశమును నేలపైఁ బడవైచి వస్త్రముల నందుకొని చించెను. బలరాము నల్పునిగాఁ దలంచెను. అందఱి వారల బాధింపఁబూనెను. ఆకోఁతి యవినయ మెఱింగి మహోత్తరకోపమున ముసలమును హాలమును దీసికొని బలదేవుఁడు సన్నద్ధుఁడయ్యెను. ద్వివిదుఁడును మదోద్ధతుఁడుగాన సాలవృక్షమును బెకలించి చేతఁబట్టుకొని వడివడి నసరి బలరాముని మూర్ధము పగుల దానమోదెను. సంకర్షణమూర్తి యాదెబ్బనుభరించి యించుకంతయుఁ గదలక యోర్చుకొని సునందమనుపేరుగల ముసలమున నాతని నొప్పించెను. ముసలఘాతమునఁ దలపగులఁగా రక్తసిక్తాంగుఁడై గైరికధాతు విరాజమానమహీధరమువలెఁ గనఁబడియెను. అంత నావానరుఁ డూరకుండక యొకపెద్దవృక్షమును బెకలించి తెచ్చి మరల బలదేవునితల పగులవైచెను. దానిని నడుమ నూఱుశకలములగు నట్లు బాణముల వైచెను. మరల వాఁ డొకభూరిభూరుహమును బెకలించి తెచ్చి వైవగా దానినిగూడఁ దన్నుఁ దగులకుండఁ బడఁ గొట్టెను. ఇట్లు పెక్కుసారులు వృక్షముల వైచుచు నావనమునంతయు వృక్షశూన్యముగా నొనరించెను. అంతట

మానుకొనక శిలావృష్టిని బలుని ముంచెను. ముసలాయుధుఁడా పాషాణవృష్టిని కనఁబడకయుండఁ జేసికొనియెను. అత్తఱి నా వానరుఁడు కాలము సన్నిహితముకాఁగాఁ దనబాహువుల ముష్టిగా నొనరించి బలరాముని వక్షము నొప్పించెను. బలరాముఁ డంతట నాగ్రహము పురికొలుపఁగా ముసల లాంగలములఁ బాఱవైచి జత్రుభాగముల బాహువులచే నలిపెను. వాఁడు భూమింబడి విలవిలఁ దన్నుకొనుచుఁ బ్రాణముల వదలెను. దేవతలు జయజయనాదము లొనరించిరి. లోకకంటకుఁడై తన్నవమానించిన ద్వివిదు నీగతి మృతినొందించి ద్వారకానగరమున కరిగెను.

—— పదాఱువేలభార్యలయిండ్లనున్నహరిని నారదుఁడు చూచుట. ——

*నరకాసురునిచే నిర్బంధింపఁబడిన కన్యకల విడిపించి శ్రీహరి వారెల్లఁ దన్ను వివాహమాడఁ గోరఁగా నాకాంతాజనమెల్ల రమాంశసంజనితమౌట నెఱింగి వారిం బెండ్లియాడెను. శ్రీహరియొక్కఁడయ్యుఁ బెక్కుమంద్రసు వివాహమాడెనన్నవార్త విని నారదముని శ్రీకృష్ణుని జూడఁగోరెను. శ్రీపతియుఁ దానొక్కరుఁడుగఁ గనఁబడినను ఒక్కొక్కభార్యయింటఁ దానుండి పదాఱువేలరూపముల వారివారి యిష్టములఁ దీర్చుచుండెను. అదియే విచిత్రము. ఎట్లిందఱను బెండ్లియాడెనో కనుఁగొందుఁగాక యని యూహించి మహోత్సాహమున ద్వారకకరుదెంచెను. ఆనగరమును మున్నెన్నిసారులో

* ఈకథ శ్రీభాగవతమునందలి దశమస్కంధమున నఱువదితొమ్మిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

చూచెను గాని యాపర్యాయము క్రొత్తదిగఁ గనుపట్టెను. దానిసౌందర్యమున కచ్చెరువందెను. శ్రీహరిభార్యల హర్మ్యములన్నియు నొక్కరీతిగా శృంగారింపఁబడియుండెను. దాసీజనమొక్కరీతిగనే యుండెను. మునియు హరిమందిరమున కరిగెను. హరియు రత్నమయపర్యంకమునుండి తటాలున దిగి మునిపతి చరణములు తనశిరముసోఁక మ్రొక్కి మహాత్మా! దేవమునీంద్రా! నాయందేమేని గుణముండిన నది తనుపాదారవింద వందనఫలమేగాని వేఱుగాదని వినయమున నంజలిపట్టి పలికెను. ఆతిథేయసత్కారముల ముని నలరించి నిలువంబడి స్వామీ! నేనొనరింపఁదగు పనియేమని ప్రశ్నించెను. ఆవినయమున కద్భుతమంది మునిపతి లోకనాయకా! సాధువులయందు మైత్రి దుర్జనులఁ జెండుశక్తి నీయందమరియున్నవి. శ్రీకృష్ణా! నీపాదారవిందములను దర్శించితి. ఇవియే జనుల దరింపఁ జేయునవి. బ్రహ్మాదులివ్వానినే మనముల ధ్యానింతురు. వీనిమహిమమును వేదములు తదంగములు తెలుపఁజాలకున్నవి. సంసారకూపపతితుల నుద్ధరించు నీపాదద్వంద్వమును స్మరించుచు ధ్యానించుచుఁ జరించెదను. నన్ననుగ్రహింపుము. నీపాదస్మృతి సర్వదా కలుగ ననుగ్రహింపుము. అని పలికి యావాసుదేవుని సెలవంది యాయిల్లు వదలి వేఱొకమందిరమున కరిగి యందెవ్వరున్నవారో చూడఁదగునని యోజించెను.

ఆమందిరమున వేఱొకకృష్ణపత్ని యుండెను. అందు యోగీశ్వరేశ్వరుం డగుహరి యుండునా ఉండఁడా యని పరీక్షింపఁగోరియే పోయెను. ఆయింటియందును హరి తనప్రియురాలితో నక్షక్రీడ చేయుచుండెను. ఉద్ధవుఁడు నందుండెను.

ముని రాక నెఱింగి హరి యుద్ధవునిం గూడి లేచి యెదురుసని కొనివచ్చి కూర్చుండఁబెట్టి పూజించి కుశలంబడిగెను. ఎందుండి రాకయని ప్రశ్నించెను. పరిపూర్ణు లగు మీకు నపూర్ణలమగు మావంటివారిచేఁ జేయఁదగిన దేమేని కలదా యని పలకెను. అయినను 'నాకేదేనాజ్ఞాపించి యీజన్మమును సార్థకముగాఁ నొనరింపుమా' యని ప్రార్థించెను. మునియు నేమియు బదులిడక వేఱొకయింటి కరిగెను. ఆయింటను శ్రీహరి పాడ కట్టెను. ముని యరుగునప్పటికిఁ గుమారులను లాలించుచుండెను. వేఱొకయింటికరిగెను. ఆయింట స్నానముచేయుప్రయత్నమున శ్రీహరియుండఁగాఁ గాంచెను. వేఱొకయింట హోమము చేయుచుండెను.

ఈఘట్టమున మహాకవి పోతనగారిపద్యరత్నములను దిలకింపుఁడు.

సీ. "ఒకచోట నుచితసంధ్యోపాసనాసక్తు
నొకచోటఁ బౌరాణికోక్తికలితు
నొకచోటఁ బంచయజ్ఞోచితకర్ముని
నొకచోట నమృతోపయోగలోలు
నొకచోట మజ్జనోద్యోగానుషక్తుని
నొకచోట దివ్యభూషోజ్జ్వలాంగు
నొకచోటఁ ధేనుదానోత్కలితాత్ముని
నొకచోట నిజసుతప్రకరయుక్తు
తే. నొక్కచోటను సంగీతయుక్తచిత్తు
నొక్కచోటను జలకేళియుతవిహారు

నొక్కచోటను సన్మంచకోపయుక్తు
నొక్కచోటను బలభద్రయుక్తచరితు.

మఱియు,

సీ. సకలార్థసంవేది యొకయింటిలోపలఁ
జెలితోడ ముచ్చటల్ చెప్పుచుండు
విపులయశోనిధి వేఱొక్కయింటిలో
సరసిజాననఁగూడి సరసమాడుఁ
బుండరీకదళాక్షుఁ డొండొకయింటిలోఁ
దరుణికి హారవల్లరులు గ్రుచ్చుఁ
గరుణాపయోనిధి మఱియొకయింటిలోఁ
జెలిఁగూడి విడియము చేయుచుండు

తే. వికచకమలనయనుఁ డొకయింట నవ్వుచుఁ
బ్రవిమలాత్ముఁ డొకటఁ బాడుచుండుఁ
యోగిజనవిధేయుఁ డొకయింట సుఖగోష్ఠి
సలుపు ననఘుఁడొకటఁ జెలఁగుచుండు."

వేఱొకయింటిలో నేకాంతముగాఁ గూరుచుండి ప్రకృత్యతీతమగు నాత్మతత్త్వమును ధ్యానించుచుండెను. మఱొక కాంతామణీమందిరమున గురుశుశ్రూష చేయుచు వారియుపదేశము నాలకించుచుండెను. ఇట్లు నానారూపకార్యంబుల నందఱిహర్మ్యంబులఁ దానేకకాలమందు ననేకరూపంబుల నలరారు లక్ష్మీకాంతామణిం గూడియుండెను. ఆ యద్భుతచర్యలం గాంచి నారదముని విస్మితుండయ్యెను. అక్కాలమునందే మృగయారతుండై యటవికింజని సింహవ్యాఘ్రాదులం బొలియించుచు నుండుటం గాంచెను. అవ్యక్తమహిముఁడై ప్రకృతి

బద్ధుఁడై యంతఃపురమున సంచరించుచుఁ దన్నుఁ బ్రేమించునంగ నామణులవాంఛితములగు కార్యములయం దాసక్తుఁడై యు న్నట్లు నటించుచు నున్నపరాత్పరుని యోగీశ్వరేశ్వరుని బ్రకృ త్యతీతుని సర్వబ్రహ్మాండనాయకునిం గన్నులారఁ గాంచి నారద ముని కృతకృత్యుఁడై యిట్లు పలికెను.

శ్లో. "విదామ యోగమాయాం తే దుర్దర్శామపి యోగినామ్,
యోగేశ్వరాత్మన్ నిర్భాతాం భవత్పాదనిషేవయా. ౩౦
అనుజానీహి మాం కృష్ణ లోకాం స్తే యశసాప్లుతాన్,
పర్యటామి తవోద్గాయన్ లీలా భువనపావనీః." ౩౧

అనుమూలమునకు మహాభక్తుఁడు కవిబ్రహ్మయు నగు పోతన,

క. "నీమాయ తెలియువారై
తామరసాసనసురేంద్రశర్వాదులు నై నన్
ధీమంతులు నీభక్తి సు
ధామాధుర్యమునఁ బొదలుదురు ధన్యులు దక్కన్.

క. అని హర్షించుచు నీకనేఁ
బనివినియెద నిఖిలలోకపావనమును స
జ్జనహితము నైననీకీ
ర్తన మఖిలజగంబులందుఁ బదగనెఱిఁగింతున్."

ఇట్లు నారదముని మహాహర్షమునఁ బ్రార్థింపఁగా విని శ్రీహరి మునింగని,

శ్లో. "బ్రహ్మన్ ధర్మస్య వక్తాహం కర్తా తదనుమోదితా,
తచ్ఛిక్షయన్ లోకమిమమాస్థితః పుత్ర మాఖిదః."

"తత్తస్మాత్ లోకం శిక్షయన్నిమం ధర్మమాస్థితః. న తు

తత్త్వతః. అతః హే పుత్ర మాఖిదః. మోహం సంప్రాప్నుహి."
అని వ్యాఖ్య.

పుత్రా! ధర్మమార్గమిదియని తెలుపువాఁడను నేనే! ఆచరించువాఁడను నేనే ఆచరించువారిని గాంచి యనుమోదము నందువాఁడను నేనే. కావున నీలోకమును శిక్షించుచు నీధర్మమునవలంబించుచున్నాఁడను. నీవు భ్రాంతి నొందకుము. ఈ శ్లోకమునకు మహాకవి యేల్లాకో పద్యము వ్రాయక వదలెను.

క. "అని తద్వచనసుధాసే
చనమున ముదితాత్ముఁడగుచు సంయమి చిత్తం
బునఁ దన్మూర్తిం దగ నిడు
కొని చనియెను హరినుతైకకౌతుకుఁడగుచున్."

అనునీపద్యమును మాత్రమే వ్రాసెను. వారిభావమిట్టిదని యెఱుంగ నావంటిపామరునకుం దరంబు గాదు.

ఈరీతిగా లోకానుగ్రహార్థము సకలధర్మముల నాచరించుచు గృహస్థువు లగువా రిట్లుండవలయు ననుధర్మమును బోధించుచుఁబదాఱువేలభార్యలయిండ్లయం దేకకాలమునందు నివసించియున్న శ్రీహరినిగాంచి నారదుఁడు పరమానందమందెను. అనంతవీర్యుఁడగు శ్రీకృష్ణుని యోగమాయామహిమమును దెలిసికొనియెను. పలుమాఱులు భగవంతుని ధ్యానించెను. పెక్కుసారులు బహిర్దృష్టింగాక యాంతరదృష్టిని సర్వగృహములయందుండు శ్రీపరాత్పరుని దిలకించెను. సంజాతవిస్మయుండై అర్థమును ధర్మమును గామమును ఎట్లెట్లు పయోగింపఁదగునో వానిం దెలుపుచు వానియందాసక్తి గలిగినట్లు నటించుచు నుండుహరిని స్మరించుచుఁ బోయెను. శ్రీకృష్ణమూ

త్రియు మనుష్యాచారమార్గముల నవలంబించుచు సంసారము నందిబద్ధుఁడైనచందంబుననుండి పదాఱువేలభార్యలగృహముల యందుండి యాయాయి పురంధ్రీమణుల కటాక్షములకుఁ బాత్రుఁడై విలాసగతులఁగాంచుచు వినోదముగ మాటలాడుచు వారి నానందింపఁజేయుచుఁ దానొక్కొక్కరికిని లోఁబడియుండినట్లే మెలంగుచునుండెను. ప్రపంచసృష్టిస్థితి విలయహేతుభూతుఁడగుపరమేశ్వరుఁడు తానే యనన్యవిషయములగుకర్మముల నాచరించుచుండెను. ఏనరుఁడు వానిని సంకీర్తనచేయునో అను మోదించునో ముక్తిప్రదాతయగుభగవంతునియందు దృఢభక్తిగలవాఁడగును. ఇప్పట్టున మూలమును బరికింపుడు.

శ్లో. "ఏవం మనుష్యపదవీ మనువర్తమానో
నారాయణోఽఖిలభవాయ గృహీతశక్తిః,
రేమేఽఙ్గ షోడశసహస్రవరాఙ్గనానాం
సవ్రీడసౌహృదనిరీక్షణహాసజుష్టః. 44
యానీహ విశ్వవిలయోద్భవవృత్తిహేతుః
కర్మాణ్యనన్యవిషయాణి హరిశ్చకార
యస్త్వాని గాయతి శృణోత్యనుమోదతే వా
భక్తిర్భవేద్భగవతి హ్యపవర్గమార్గే." 45

"అఖిలస్య భవాయ ఉద్భవాయ గృహీతాశ్శక్తయో నానామూర్తయో యేన సః, సవ్రీడం తత్సౌహృదం చ తేన నిరీక్షణం హాసశ్చ తాభ్యాం జుష్టః. అనన్యవిషయాణి అసాధారణాని అపవర్గమార్గే మోక్షప్రదే" అని వ్యాఖ్య.

తననుండి సకలచరాచరప్రపంచములు పుట్టుటకై నానామూర్తులు గ్రహించినవాఁడనియు మానవులాచరించునాచా

రముల నవలంబించినవాఁడనియుఁ బదాఱువేల పత్నుల యొక్క లజ్జాసహితములగు నిరీక్షణములు సంతోషోక్తులు అన్నీ నీ రెంటిచేఁ గూడినవాఁడనియు భావము. ఇట్టినారాయణమూర్తి వారియిండ్లయందు విహరించెను అనిసారము. దీనికిఁ బద్యము నిట్లు పోతనమహాకవి వ్రాసెను.

చ. అని హరి యిట్లు షోడశసహస్రవధూమణులన్ బ్రియంబునన్
మనసిజకేళిఁ దేల్చినయమానుషలీల సమగ్రభక్తితో
వినినఁ బఠించినన్ గలుగు విష్ణుపదాంబుజ భక్తియున్ మహా
ధనపశుపుత్రమిత్రవనితాముఖసౌఖ్యములున్ నరేశ్వరా.

ప్రధానభాగము వదలిపెట్టఁబడియెను. మనసిజకేళిఁ దేల్చిన యనుపదము నిరర్థకమగుటయ కాక యపార్థము నిచ్చుచున్నది. పైశ్లోకమునఁ గల సుహార్థమిం చించుకంతయు లేదు. రెండవశ్లోకము ప్రస్తావనయే లేదు.

మహాశయులారా! ఈదివ్యగాథను గుఱించి యించుక వ్రాయు టవసరమే. భగవచ్ఛక్తిని నారదమహర్షి యెఱుంగని వాఁడు కాఁడు. అయిన నాయాయికాలములయందు నెట్టివారినైన మహామాయ మోహింపఁజేయును. కాఁబట్టి యిట్లు కాంతలం బెక్కండ్రను వివాహమాడినహరి భగవంతుఁడా కాఁడాయను ననుమానము గల్గెను. కాని యా యనుమానమే నిశ్చయమనునమ్మకము లేదు. కావున ద్వారకకుంబోయి పరికింతమని యూహించెను. దీనింబట్టి యించుకయాలోచించిన నెట్టివారిమనస్సుకూడ చంచలత మానకుండు స్వభావముగలదిగ నుండునని యొడకట్టెడిని. సాధువులు పరికించి దానిని నియమింపఁజాలుదురు. పామరుల కట్టిశక్తి యుండదు. అంతియే పండితు

లకుఁ బామరులకుం గలభేదము. ద్వారకానగరమున కరుదెంచి శ్రీహరిని దర్శించెను. నారదమునిసంశయమును భగవంతుఁ డెఱింగెను. సంశయమును దీర్పకుండరాదని తలంచెను. ముని వచ్చిభగవంతునిదర్శించెను. హరి యథాపూర్వకముగా నాతిథేయముల నొనరించెను. వినయము రూపమును దాల్చినట్లు మాటలాడెను. తమపాదారవిందసేవయె నాయందున్న గుణమున కాధారమని యొత్తి చెప్పెను. నారదుఁడు వేఱొకయింటికిం బోయెను. అయింట శ్రీహరి గారవించి భాషించెను. ఇంకొక్కయింటి కేగెను. అందిట్లే మర్యాదసాగెను. పదాఱువేల భార్యల గేహములయం దీరీతి శ్రీహరి కానఁబడియె. ఒక్కొక్కయింటియందును హరి వేఱువేఱుకార్యములు చేయుచుండెను. నారదుఁడు వేఱొకయింటికిం బోవఁగనే హరియు నీయింటినుండి యాయింటికి గోడ దుమికి పోయియుండరాదా యని యొక్కరు ప్రశ్నించిరి. నారదుఁడాయింటికింబోవుననిహరి కెవ్వరు ప్రశ్నలు చెప్పిరని ప్రశ్నరూపముననే సమాధానము పలుకఁదగును. అంతియకాక గోడదుమికి ప్రక్కయింటికి హరి పోవుచుండఁగా నాభార్యచూచి కాళ్లుపట్టి క్రిందికి లాగకుండునా యనియు సమాధానము చెప్పవచ్చును. గోడదుమికియేల పోయియుండరాదను ప్రశ్నమసంగతము. ఏలయన శ్రీహరి తన భార్యలకొఱకుఁ జాలుగాఁ బదాఱువేలయిండ్లు కట్టించి యుండవలయునుగదా. అట్టికాలమున నంతకుముందున్న యిండ్లవారిని సాగనంపియైన నుండవలయు. లేదా నగరబహిర్భాగమందు హర్మ్యములు కట్టించి యైన నుండవలయును. ఇది కడుంగడుఁ జిత్రము. ఒక్కదినముననే యెల్లరను బెండ్లాడ లేదు. రుక్మిణీ

దేవి లోనగువారిని గాలాంతరములఁ బెండ్లియాడెను. కావున నీకల్పనయంతయు నసంగతప్రసంగమునకు దృష్టాంతమగును.

ఏకకాలమునఁ బదారువేల యంతఃపురములలో శ్రీహరి యాయాకాంతామణికి నిష్టములగు కార్యముల నొనరించుచు నాదేవిని దృష్టిపడుచుండెను. ఆవిధమంతయుఁ గాంచి ముని విస్మితుఁ డయ్యెను. కాని యీకార్య మాకరాత్పరున కత్యల్పకార్యమని నాభావము. సకలబ్రహ్మాండములయందుఁ బ్రాణికోటు లెన్నికలవో యన్నింటిహృదయముల నధివసించి యున్న భగవంతుఁడు పదారువేల గృహములయం దొక్కపర్యాయము కనఁబడెననుట విచిత్రముకాదా' యనుటయే యసంగతము. దీనిచే శ్రీకృష్ణుఁడు జారుఁడని చెప్పుటయు నవివేకము. వారికంటె నవివేకులు లేరనుట సాహసముకాదు. అనఁగా లక్ష్మ్యంశసంభూతలైన పదారువేలకాంతలను బత్తదుచితగృహస్థకర్తవ్యకార్యముల నానందపరవశలనుగాఁజేయుచు గృహస్థులగువార లిట్లు ప్రవర్తింపవలయునని బోధించెను. తాఁ జేయుకార్యములు లోకుల కుదాహరణభూతములు కావలయునని భగవంతునిభావము కదా.

శ్లో. "తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర,
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః. 19
కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః,
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి. 20
యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే. 21
న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన,

నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి." 22
గీతా. కర్మయోగము. 3 అధ్యా.

శ్లో. "అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః,
అహమాదిశ్చ మధ్యంచ భూతానామంత ఏవచ. 20
నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప,
ఏషతూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా. 40
యద్యద్విభూతిమత్సర్వం శ్రీమదూర్జితమేవవా,
తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోఽంశసంభవమ్. 41
అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున,
విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. 42
విభూతియోగము ౧౦ అధ్యా.
ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."
గీతా ౧౮. అధ్యా.

అనునీవాక్యములచే భగవంతుఁడు తనమార్గము నెల్ల రకు బోధించెను. తానుపదేశించుటయే కాక యితరులమూల మున నుపదేశింపఁజేయుటయ గాక తనప్రవర్తనమునుబట్టి యి తరుల నేర్చుకొనునట్లు చేయుట పరమేశ్వరుని కరుణను వేయి నోళ్లఁ బ్రకటించుచున్నది. దీనింబట్టి మనము నేర్చుకొనఁదగునీతి యేమనఁగా విధిప్రకారము కులశీలవయోరూపముల కనుగు ణముగ నొక్కకన్నియం బెండ్లియాడి యామె మనోభీష్టములఁ దనకుఁ గలకలిమి కొలఁది నలరించి తీర్చుచు నిష్టాలాపనుల లోకతత్త్వమును దెలుపుచు భగవద్భక్తిని గల్గించుచు నామె యుఁ దానును దరింపవలయుననియుఁ గేవల గ్రామ్యసుఖము

లనే నమ్మి చెడక సర్వకర్మముల ఫలాపేక్షమాని చేసి జలములఁ బద్మలతాపత్రముండుకీతి సంసారపాశబద్ధుఁడు గాక యుండవల యుననియు నితరులు తన తత్త్వమెఱింగిన నానందించునట్లు, ఎఱుంగనివారు సంసారమున భ్రమించుచున్న వాఁడనియూహిం చినను దాఁబొరపడక యుండవలయుననియు నిదియే యని యెఱుంగవలయును. పాఠకులారా! ఈయొక్కకథను జదివి ననే శ్రీకృష్ణపరమేశ్వరుమాహాత్మ్య మనంతమనియు మహర్షు లకే నగమ్యమనియుఁ దెలియకపోదు. ఇట్టిసర్వగతుని జారుఁడ నియు నిరంతరస్త్రీలోలుఁడనియు నాక్షేపించుట యెంతయ న్యాయమో యూహింపుఁడు. పాపకార్యములలో నిది ప్రథ మమని తలంపవలయు. ఇఁకఁ దరువాతి భగవచ్చరిత్రము నాల కింపుఁడు.

## కుచేలోపాఖ్యానము.

*బలరాముఁడు తీర్థయాత్ర కరిగెను. శ్రీకృష్ణుఁడు ద్వార కానగరమున నారదాదిమహర్షులు వచ్చుచుం బోవుచుండ ననం తవిభూతిమై నుండెను. అని శుకయోగిపలుకఁగా విని పరీక్షిన్మ హారాజు భక్తినమ్రాత్మకంధరుఁడై మహాత్మా! ముకుందుని మహి మములనేకములు. ఎన్నివినినను సంతృప్తికలుగదు. ఆమహా త్ముఁడు భూభారహరణార్థమవతరించి యొనరించిన యద్భుతచ ర్యల నింకనుం దెల్పినన్ను ధన్యునిగఁ జేయుమాయని ప్రార్థిం చెను. మఱియు మునీంద్రా! ఉత్తమశ్లోకుఁ డగునాపరమేశ్వరు

* ఈకథ శ్రీమద్భాగవత దశమస్కంధమున నెనుబదవ యధ్యాయ మునుండి గ్రహింపఁబడినది.

సత్కథల నాలకించి తృప్తినొందువాఁ డుండునా. కామబాణపరి తాడితుండైనను ముక్తినొందును. అనంతునిగుణములను సంకీర్తించినదే నాలుక, పరమేశ్వరుని భజించునవియే హస్తములు పరమేశ్వరుని జింతించునదియే మనస్సు. మఱియు నామనస్సు స్థావరజంగమములయందు నివసించు నీశ్వరుని సదా చింతించు చుండవలయు. పరంధాముని దివ్యకథల నాలకించునవియే కర్ణములు. శ్రీహరి స్థావరజంగమరూపునిగా భావించి నమస్కరించినదియే శిరస్సు. పరమపూరుషుని వీక్షించునవియే నేత్రములు. ఆభగవంతునియొక్కయుఁ దద్భక్తులయొక్కయుఁ బాదారవిందస్నానోదకములు సేవించునవియేయంగములు. ఈచోట మహాకవి పోతనపద్యరత్నము నుదాహరించెద.

చ. "హరి భజియించుహస్తములు హస్తము లచ్యుతుఁ గోరి
మ్రొక్కు తచ్ఛిరము శిరంబు చక్రధరుఁజేరిన చిత్తము చిత్త
మిందిరా, వరుఁ గనుదృష్టి దృష్టి మురవైరి నుతించినవాణి
వాణియ, శ్రుతకథలానుకర్ణములు కర్ణములై విలసిల్లుఁ బో
భువిన్."

కావున నట్టిభగవంతునిమహిమముఁ దెలియఁజెప్పుమూ యని యడిగిన శుకయోగి యిట్లు తెల్పెను. రాజేంద్రా! చక్కఁగా వినుము. భగవంతుఁడగు శ్రీకృష్ణున కొక్కమిత్రుఁడుకలఁడు. అతని పేరు కుచేలుఁడు. బ్రాహ్మణుఁడు. మఱియు బ్రహ్మవేత్తలలో నుత్తముఁడు. ఇంద్రియార్థముల విషయమున విరక్తుఁడు. మిగుల శాంతాత్ముఁడు. కావుననే జితేంద్రియుఁడు. గృహస్థుడైనను దనంతన లభించినపదార్థములఁ దృప్తినొంది కాలము గడుపుచుండు వాఁడు. ఆమహాత్ముని భార్యయు నాకలిచే డస్సియుండునది

కాని మహాపతివ్రత. పతియాజ్ఞ శిరసావహించి యారీతి నాచరించునది. కృశాంగియనుపేరా మెకు సార్థకమయ్యెను. ఇట్టు లాదంపతులు నిరంతరోపవాసప్రాయవ్రతముల వర్తించువారు. ఇట్లు కొంతకాలము జరగెను.

ఒక్కనాఁడామానవతీతిలకము దారిద్ర్యమున నలఁగి కృశించినతనువున భర్తకు నించుకంతయు సుఖమును గల్పింపఁ జాలను గదా యను పెనుభీతిచేఁ జింతించుచు నే మనునో యని వడంకుచు సమీపమునకేగి మందమందమధురోక్తుల నిట్లనియె. బ్రహ్మమునీంద్రా! మహాభాగా! సాక్షాల్లక్ష్మీపతి సఖుఁడవు. బ్రహ్మజ్ఞానసంపన్నుఁడవు. యదువంశమున నవతరించి యున్న శ్రీకృష్ణమూర్తి శరణ్యుఁడు. సాధువులయం దనుకంప గలనారాయణమూర్తి చెంతకుం బొమ్ము. దారిద్ర్యమున నలఁగుచున్న నీకు సమృద్ధిగా ద్రవ్యమిచ్చును. భోజ వృష్ణ్యంధకేశ్వరుఁ డిపుడు ద్వారకానగరమున నున్నవాఁడు. పాదారవిందముల సంస్మరించువారికిఁ దన్నుఁగూడ నిచ్చును. అట్టిజగద్గురువు తన్నాశ్రయించువారలకు నర్థకామములఁ బ్రసాదించుటొక గొప్పకార్యమా.

ఈఘట్టమున మహాకవి పోతన,

సీ. "లలితపతివ్రతాతిలకంబు వంశాభి
జాత్య తద్భార్య దుస్సహదరిద్ర
పీడచేఁ గడునొచ్చి ♦ పెదవులు దడుపుచు
శిశువు లాఁకటి చిచ్చుచేఁ గృశించి
మలమలమాడుచు ♦ మానసం బెరియంగఁ
బట్టెఁడోరెము మాకుఁ ♦ బెట్టుమనుచుఁ

బత్త్రభాజనధృతోపాణులై తనుఁ జేరి
వేఁడిన వీనులుపసూఁడినట్లు
తే. నైన నొకనాఁడు వగచి నిజాధినాథుఁ
జేరి యిట్లని పలికె నోజీవితేశ
తెట్టుముట్టాడు నిట్టిపేదఱికమిట్లు
నొంప దీని కుపాయ మూహింపవైతి.
చ. వరదుఁడు సాధుభక్తజనవత్సలుఁ డార్తశరణ్యుఁ డంచిరా,
వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడు దాఁ గుశ
స్థలీ, పురమున యాదవప్రకరముల్ భజియింపఁగ నున్న
వాఁడు నీ, వరిగిన నిన్నుఁ జూచి విభుఁడప్పుడ యిచ్చు
నమానసంపదల్.
మ. కలలోనం దను నున్నెఱుంగని మహాకష్టాత్ముఁ డైనట్టి
దుర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాంతంబు లుల్లం
బులోఁ, దలఁపన్ దోడనమెచ్చి యార్తిహరుఁడై తనైన
ననిచ్చున్ సుని, శ్చలభక్తిన్ భజియించువారి కీడఁ దేసంప
ద్విశేషోన్నతుల్."

అనునీపద్యరత్నములు వ్రాసి తన వినిర్మలభక్తిని వెల్ల
డించి కృతార్థుఁ డయ్యెను.

మూ. పతివ్రతా పతిం ప్రాహ మ్లాయతా వదనేన సా,
దారిద్ర్యాత్సీదమానా సా వేపమానాభిగమ్య చ. 8
నను బ్రహ్మన్ భగవతస్సఖా సాక్షాచ్ఛ్రియః పతేః,
బ్రహ్మణ్యశ్చ శరణ్యశ్చ భగవాన్ సాత్వతాం పతిః 9
తముపైహి మహాభాగ సాధూనాం చ పరాయణమ్,
దాస్యతి ద్రవిణం భూరి సీదతే తే కుటుంబినే.' 10

ఆస్తేథునా ద్వారవత్యాం భోజవృష్ణ్యంధకేశ్వరః,
స్మరతః పాదకమలమాత్మానమపి యచ్ఛతి.
కిమ్వర్థకామాన్ భజతో నాత్యభీష్టాన్ జగద్గురుః." 11

అనియుండెడిని. "శిశువు లాఁకటిచే బాధపడుచు భోజ నార్థపాత్రములను జేతనునిచికొని తల్లీ! యాఁకలియగుచున్నది. ఇంతయన్నము పెట్టుమా యని తన్నువేఁడఁగా నామాటలు శూలములై మానసమును దహింపఁ జేయఁగా భర్తచెంతకుం బోయి" యను నీభావము మూలవిరుద్ధమైనను బాతివ్రత్యమును బోధించునదియై మిక్కిలి సొంపుగానున్నది. తక్కుంగలపద్యముల భావము భగవంతునపారకరుణను వెల్లడించుచున్నది. ఈఘట్టమున మూలమున కివి వ్యాఖ్య లనవచ్చును.మఱి మెచ్చ వచ్చును.

కుచేలుఁ డీరీతి భార్య విన్నవింపఁగాఁ దలయూఁచి మఱియు మఱియు నామెమనవిచేయఁగా నామృదుహితవాక్కుల నాదరించి యిదియే పరమలాభము. ఉత్తమశ్లోకదర్శన మగును. అని మది నాలోచించి ద్వారకానగరమున వేంచేసి యున్న శ్రీహరిదర్శనముచేయ నరుగుట కంగీకరించెను.కల్యాణీ! గృహమున నేమే నించుక కానుక గలదా ఉన్న నిమ్ము. అని యడుగుటయు నింట నే పదార్థములేమిం దలఁచి యాశ్రమ సమీపమునఁగల విప్రులను యాచించి నాల్గుపిడికిళుల నడుకులం గొని తెచ్చి యాకుచేలుని ప్రాఁతవస్త్రముచివరన నెట్లో ముడిచి యిదియ గొనిపోయి శ్రీహరికొసంగఁదగు కానికయని తెల్పెను. బ్రాహ్మణప్రవరుఁ డగునాకుచేలుఁడు దానింగొని ద్వారకానగరమున కరిగెను. త్రోవయందు శ్రీహరిదర్శనము

నా కేలాగున నగునా యని చింతించుచు నడచుచుండెను. ఎట్లో శ్రమపడి ద్వారకానగరమున కరిగి నగరరక్షణార్థము నుంచియున్న సైనికస్థానములను మూఁడింటిని దాఁటి పెద్దవీథులను మూఁడింటిని గడచి భగవంతునివలె ధర్మముల నాచరించు నంధకవృష్ణివంశములవారి సౌధములను గాంచుచుఁ బరాత్పరుని పదాఱువేలభార్యలయంతఃపురములను వీక్షించుచు నందొక్కఁడగు రమ్యహర్మ్యమును గని బ్రహ్మానందము నొందినవాఁడువలె మహానందసాగరమున నోలలాడుచు నందుఁ బ్రవేశించెను.

ఈఘట్టమున మహాకవి యీపద్యమును వ్రాయుచు

"ద్వారపాలు, రెక్కడి విప్రుఁడ విందేల వచ్చెదవని
యడ్డపెట్టరే నప్పుడు వారి
కేమైన నుపాదాన మిచ్చి చొచ్చెదనన్న
నూహింప నర్థశూన్యుండ నేను."

అని వ్రాసిరి. ఉపాదానమనఁగాఁ గానుక. వివాహకాలమున నల్లునకొసంగు వరణము ననునర్థములు ప్రసిద్ధములు. ద్వారపాలకు లడ్డగించినచో వారికేమైన గానికనిచ్చి చొరఁదగునని యూహించిన నేను ధనవంతుఁడను గాను. అనఁగా నిట ద్వారపాలకుల కిచ్చుటకుఁ గానికయనఁగా లంచమనియు స్ఫురింప వచ్చును. ఆకాలమున ద్వారకానగరమున శ్రీహరిమందిరమును గాచుద్వారపాలకులకుంగూడ నీయలవాటుకలదన వచ్చునని యూహించువా రుందురు. ఆయపోహకుఁ జోటిచ్చి నట్లయ్యెనే యని చింతించుచున్నాఁడను. మూలమున దీని కాధారమించుకయైనఁ గానరాదు. ఏటి కీవిషయమును జేర్చిరో

యామహాత్ముని భావమేమో నెఱుంగఁజాలను. తనదారిద్ర్యము దలంచుకొనుట కిదియొక యవకాశ మాకుచేలునకుఁ గల్గించినట్లగునని సమాధానముచెప్పినను నిరాశుఁడగు నామహాత్మునకు దారిద్ర్యమున ఖేదముగల్గెనని కల్పించుటయుఁ బాడి గాదు.

ఇట్లు కుచేలుఁడు శ్రీహరిసుందరమందిరమును బ్రవేశింపఁగనే యాప్రాంతచెలికానిని దూరమునుండియే హరి గాంచెను. అత్తఱి నాభగవంతుఁడు ప్రియాపర్యంకమునఁ గూరుచుండి యుండెను. తటాలున నారమ్యపర్యంకమునుండి దిగి వడివడి నెదురుపోయి చెంతఁజేరి రెండుకరముల నాలింగనము చేసికొనియెను. అంతియగాక ప్రియసఖుఁడగు నాబ్రహ్మర్షి దేహసంగతిచేఁగలిగిన సుఖమునకుఁ బ్రీతినొంది పుష్కరేక్షణుఁడు నయనారవిందములనుండి యానందబాష్పబిందువులను విడిచెను. అంత నామునిప్రవరుం బిలుచుకొనిపోయి చెలిమి కలిమి యచ్చుపడఁ దానే యాపర్యంకమున గూరుచుండఁ బెట్టెను. ఆమునిపాదములను గడిగి తనశిరమునఁ జల్లుకొనియెను. తాను లోకపావనుఁ డైనను దన్మునీంద్రపాదప్రక్షాళనోదకములు తనకుఁబవిత్రతం గూర్చునని యాప్రాచీనాచారము నంగీకరించెను. చందనాగరుకుంకుమపంకసంకలితమగు మైపూఁతచే నాముని దేహకష్టమును బాపెను. పరిమళధూపములొసంగెను. మిత్త్రుని గుచేలుని గర్పూరదీపముల నివాళించెను. మధుపర్కాదులొసంగి తాంబూలమొసంగి గోదానముచేసి స్వాగతముం బలికెను.

ఈఘట్టమున మూలమునఁ గల "పుష్కరేక్షణః" అను విశేష్యమునకు మహాకవి పోతన భగవత్స్తుతిపరముగా నొక పద్యమును వ్రాసెను.

"సీ. ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ
గమనీలవాలు భాసురకపోలుఁ
గౌస్తుభాలంకారుఁ గామితమందారు
సుమచిరలావణ్యు సురశరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ
బన్నగశయను నబ్జాతనయను
తే. మకరకుండలసద్భాషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు."

ఇది మహాకవికింగల యంత్యప్రాసాభిమానమును భక్తిపరతంత్రతను సహస్రవిధముల ఘోషించుచున్నది. ఇట్టివి భాగవతమున వేలకువేలు గలవు.

అట్టితఱి భీష్మరాజతనూభవ రుక్మిణీదేవి నాడులు మాత్రమే మిగిలి మిగులఁ గృశించి మలినాంగుఁడై యున్న యాకుచేలుని జామరవ్యజనమున విసరుచు సేవించెను. ఇట్లు రుక్మిణియుఁ బంకజాక్షుఁడును మహాభక్తిప్రీతు లలరార నా మలినాంగుని సేవించుచుండఁగాఁ గన్నులారం గాంచి విస్మితాంతరంగలై తమలోఁ దమ రిట్లుమాటలాడం దొడంగిరి. ఔరా!

మలినాంగుఁడై భిక్షాటనకుశలుఁడై యున్న యీతఁ డెంత తపంబొనరించెనో! ఆగర్భదరిద్రుఁడు వస్త్రరకు రాఁదగఁడు.లోక మున దరిద్రుఁడని నిందింపఁబడుచుండువాఁడు. ఇట్టులయ్యును శ్రీనివాసుఁడై త్రిలోకగురువై యుండు హరి తనపర్యంక మున నున్న లక్ష్మీదేవిని వదలి యన్నను గౌఁగిలించు కొనిన రీతి నీతనిం గౌఁగిలించుకొనఁగా హాయిగా నున్నవాఁడు. బళీ! ఎంతధన్యుఁడు? ఈయన తపస్సువంటి తపస్సు నెవ్వరును జేసి యుండరనుట నిక్కము. అని యిట్లుమాటలాడు కొనుచుం డఁగాఁ గుచేలశ్రీకృష్ణు లొండొరులకరములు పట్టుకొని తమ చిన్ననాఁటి గురుకులవార్తల నిట్లుచెప్పుకొనఁ బూనిరి. ఈచో టఁ దెనుఁగున,

"ఉ. ఏమితపంబు చేసెనొకొ యీధరణీదివిజోత్తముండు తొ
ల్బామున యోగివిస్ఫురదుపాస్యుఁడై తనరారు నీజగ
త్స్వామిరమాధినాథునిజతల్పమునన్ వసియించియున్నవాఁ,
డీమహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్.

చ. తనమృదుతల్పమందు వనితామణియైన రమాలలామపొం
దును నెడఁగాఁదలంపక యదుప్రవరుండెదు రేగి మోదముం
దనుకఁగఁ గౌఁగిలించియుచితక్రియలంబరితుష్టిఁజేయుచున్,
వినయమునన్ భజించె ధరణీసురుఁ డెంతటిభాగ్యవంతుఁడో."

అని భావము విస్తృతినొందింపఁ బడినది.

అందుఁ బోలుత శ్రీహరి బ్రాహ్మణవర్యా! గురుకులమున విద్యాభ్యాసము పూర్తికాఁగా గురుపాదములకడ నుచితదక్షి ణసమర్పించి యింటికింజని ధర్మజ్ఞుఁడవు కావున సమావృత్తకర్మ మార్గమునఁ గులగుణరూపశీలములచే సదృశురాలగుకన్యను

వివాహముచేసికొంటివా లేదా. అని ప్రశ్నించెను. (తాను సర్వజ్ఞుఁడయ్యును లోకాచారమును చాటించి గృహస్థచిహ్నములుండుటం బట్టియుఁ దానికిం దగినభోగచిహ్నములు లేకుండుటం బట్టియు నిట్లుప్రశ్నించెనని యెఱుంగవలయును.) తఱచుగా గృహారామాదులయందు నీచిత్తముకోర్కెపెంపున సంబద్ధము కాదని తలంచెదను. విద్వద్వర్యా! నీమానసము ధనములయందుఁ బ్రీతిగలదిగాదని యెఱింగితిని. వస్త్రాదులగు నలంకారములయందు నీకించుకంతయుఁ బ్రీతిలేదనియు స్పష్టమయ్యెను. జ్ఞానసంపన్నుఁడవగు నీకిది తగినదియే. లోకమునఁ గొందఱు మీవంటిమహాత్ములు కామోపహతచేతసులు కాకపోయినను గర్మముల నాచరింతురు. ఈశ్వరమాయావిరచితములగు విషయవాసనలను వదలి నిష్కాములయ్యును లోకసంగ్రహార్థము నేను సకలమానుషకర్మముల నాచరించునట్టులు కర్మకలాపము నాచరింతురు. అట్టివారిని గాంచి పామరులు తమరు గూడ నిట్టికర్మముల నాచరించిన మేలని యాచరింతురు. కావున నిష్కాములగుపెద్దలు పామరులనుపదేశించు పొంటెఁ గర్మముల నాసక్తిగలవారు వలెఁ గనఁబడుచు నాచరింతురు. ఈఘట్టమున మహాకవి పోతన,

"సీ. బ్రాహ్మణోత్తమ వేదపాఠనలబ్ధవ
క్షిణగల చారువంశంబు వలనఁ
బరిణయంబైనట్టి భార్య సుశీలవ
ర్తనములఁ దగ భవత్సదృశ యగునె
తలఁప గృహక్షేత్ర ధనదార పుత్త్రాదు
లందు నీచిత్తంబు చెందకుంట

తోఁచుచున్నది యేను దుది లోకసంగ్రహా
ర్థంబు కర్మాచరణంబుచేయు
తే. గతిమనంబులఁగామమోహితులు గాక
యర్థిమై యుక్తకర్మంబు లాచరించి
ప్రకృతిసంబంధములు వాసి భవ్యనిష్ఠఁ
దవిలి యుందురు కొందఱుత్తములు భువిని."

అనుపద్యరత్నమును వ్రాసి తనసర్వతోముఖపాండిత్యమును వెల్లడించెను.

బ్రహ్మామునీ! మన మిద్దఱము గురుకులమున వసించిన నాఁటి వృత్తాంతములు మఱువవు కదా. అపుడపుడు స్మరింతువా? ద్విజుఁడు తెలియఁదగిన దానిం దెలిసికొనును. సంసారసాగర పారము నొందును. అని ప్రశ్నించి గురుమహిమనును జెప్పం దలంచి మఱియు నిట్లనియె. ఈసంసారమునందు నెందుఁ బుట్టుకగాంచునో యందుఁ బిత మొదటి వాఁడు గురువనఁ బడును. ఆతఁడు పూజ్యుఁడు. ద్విజాతియగు సత్పురుషుఁడెవ్వని వలన సత్కర్మములనాచరించుమార్గము తెలుంగునో అనఁగా నుపనయనాది సంస్కారములు జరగునో ఆతఁడు రెండవగురు వగు. నేనెట్లు జ్ఞానప్రదుఁడనగు గురువునో యట్టు లాయుప నయనాది సంస్కారముల నొనరించిన యాతఁడు పూజ్యుఁడగు. అనిపలికి జ్ఞానప్రదుఁడగు గురువు నాశ్రయించి యెవరు సంసా రసాగరమును దరింతురో వారే బుద్ధిమంతులని యెఱింగింపం దలంపుఁగొని మఱియు నిట్లు పలికెను. బ్రహ్మవిద్వర్యా! వర్ణా శ్రమధర్మముల ననుసరించి సంచరించువారిలో నెవ్వరర్థికో విదులగుదురో వారు గురురూపమున నుపదేశించు నావాక్కు

లచేతనే సుఖముగా సంసారార్ణవమును దరింతురు. కావున జ్ఞానప్రదుఁ డగుగురువు గురువులందఱిలో నుత్తముఁడును, సేవ్యుఁడు నగునని యెఱుంగవలయుఁ గదా. అట్టిగురువునకంటె నధికుఁడు సేవ్యుఁడు లేఁడని యెఱుంగుటయే మతిమంతుల లక్షణము. కాఁబట్టి యే యట్టిగురువు సేవించుటకంటె నధికమగు ధర్మము లేదని తెలుపంబూని మరల నిట్లుపల్కెను. కుచేలా! నేను బ్రహ్మచారి ధర్మమగు నుపనయనాదికము చేతను గృహస్థధర్మమగు యజ్ఞాచరణాదికము చేతను, వానప్రస్థధర్మమగు తపస్సుచేతను యతిధర్మమగు నుపశమనముచేతను నంతగా తృప్తుఁడనుగాను సర్వభూతాత్మయగు నేను గురుశుశ్రూషచే విశేషించి తృప్తుఁడనగుదును. వేదాధ్యయనాదులు సల్పువారికంటె గురుసేవ చేయువారు నాకత్యంతసంతోషము నిచ్చువారని యెఱుంగం దగును. అని మహాదరమునఁ బ్రశ్నించెను. ఇచ్చోట మహాకవి పోతన యీమహార్థము గల శ్లోక చతుష్టయమునకు నీపద్యములను వ్రాసెను.

"క. భూసురులకెల్ల ముఖ్యుఁడ
నై సకలకులాశ్రమంబులందును నెపుడున్
ధీసుజ్ఞానప్రదుఁడన
దేశికుఁ డన నొప్పుచుండు ధృతి నెల్లెడలన్.

తే. అట్టివర్ణాశ్రమంబులయందు నర్థ
కుశలులగువారు నిఖిలైకగురుఁడనైన
నాదువాక్యంబుచే భవార్ణవము వెలుచ
దాఁటుదురు మత్పదాంబుజధ్యానపరులు."

అదియుంగాక సకలభూతాత్మకుఁడనైనయేను దపోవ్రత

యజ్ఞదాన తపఃప్రమాదులచేత సంతసింపను. గురుజనంబులం బరమభక్తి సేవించువారలం బరిణమింతును అని వ్రాసిరి. సంగ్రహముగాఁ బైశ్లోకముల యర్థమంతయు నిమిడించిరి.

అనియిట్లు కుశలప్రశ్నముచేసి గురుప్రశంస నొనరించి మఱియు నాద్యుతి కనంబడ నిట్లు పలికెను. కుచేలా! ప్రియ మిత్రమా! మనమిరువురము గురుగృహమున నున్న యప్పటి యద్భుతవృత్తాంతముల నావలెనే స్మరింతువా. ఒకానొకదిన మున గురుభార్యచే నియోగింపఁబడి సమిధలకొఱకు మనమి ద్దఱ మడవికింబోయితిమి కదా. అది వర్షాకాలముకాకున్న నకా లమందు నామహారణ్యమున మనముండఁగా మహత్తరవృష్టి పట్టెను గదా! పెనుగాలి వీచుచుండ మెఱపుఁదీఁగలు ఘన మండలమున మెండుగఁ గనంబడ నావర్షము దుస్సహమై భయంకరమై కురియసాగెను. ఇది నీకు మది నిపుడు తోచుచు న్నది కదా. ఆకాలముననే సూర్యుండస్తాద్రిచాటునకుం బోయె ను. భూరితమస్సు లెల్లయెడల వ్యాపించెను. దిక్కులు తెలియ రాకుండెను. జలమునిండుటచే మిట్టపి యని పల్లమిది యనియు దెలియఁ దరముగాక యుండెను.మనమిరువుర మాఘోరారణ్య మున నాయంధకారమున నాగాలివానచే బాధితులమై జలప్ర వాహమున మునుఁగుచుఁ దేలుచు దిక్కిది యని యూత్రో వనే పోవలయుననియుఁ దెలియఁజాలక యొండొరుల హస్త ముల పట్టుకొని యాతురులమై పరిభ్రమించితిమి కదా. మన మడవికిం బోవుటయు సమిధలు తెమ్మని తనపత్నిపంపెననియు నెఱింగి యారాత్రి మనమింటికి రాకుకిం దలంకుచు సూర్యుఁ డుదయింపఁగా గురువగు సాందీపముని మనల వెదకుచు నడ

వికి వచ్చి సకలవిధముల నాతురులమగు మనలం గనుంగొనియెం గదా. అత్తఱి నాసాందీపని శిష్యప్రీతి యుబ్బగాఁ బ్రియపుత్త్ర కులారా! నాకొఱకుఁ జాలఁ గష్టపడితిరి. ప్రాణులకెల్ల దేహమే ప్రీతిపాత్రము. అట్టిదాని సుఖముంగోరక యింతదుఃఖముల పాలైతిరి. పడరాని కష్టములఁ గుడిచితిరి. ఇదియే సచ్ఛిష్యులు గురువుల కొనరించు ప్రత్యుపకృతి. విశుద్ధభావమున సర్వార్థములను దేహమును గురువున కర్పించుటయే సచ్ఛిష్యలక్షణము. ద్విజకుమారకులారా! మీయెడ మిగులఁ దృప్తినొందితిని. మీవాంఛితములు ఫలించుఁగాక. మీరు నావలన నభ్యసించినవేదము లిహపరములయందు సారవంతములయి మీ కుపకరించుఁ గాక అని పలువిధములఁ బలికి మనయార్తిని బాపెను. గదా! దానిని స్మరింతువా కుచేలా! ప్రియమిత్త్రమా! గురువు ననుగ్రహముననే పూరుషుఁడు పూర్ణకాముఁ డగును.

ఈఘట్టమున మహాకవి తెలుఁగున

"చ. కటకట! యిట్లు మాకొఱకుఁగాఁ జను దెంచి మహాటవిక్లేశము
త్కటపరిపీడనొందితిరి. కావున శిష్యులు మాఋణంబు నీఁ
గుట కిదికారణంబు సమకూరెడిఁబో యిటమీఁదమీకు వి
స్ఫుట ధనబంధుదారఁ బహుపుత్త్రవిభూతి జయాయు
రున్నతుల్.

అని వ్రాసెను.

ఇట్లు గురుకులవాసమునఁ దమరొనరించినకార్యముల నుగ్గడించుచు గురుప్రశంసనము చేయుచు నున్నశ్రీహరిం గాంచి యాకుచేలుఁడు వినయమున నోజగద్గురూ! దేవదేవా! నావంటివారిచే నన్ని కార్యములు చేయఁబడినట్లేయగు. సత్యకా

ముఁడవగు నిన్నుంగూడి నివసించిన నంతకంటెఁ గోరఁదగినది కార్యము వేఱొండుండునా! ఎవ్వనికి సకలవేదమయమగునది యాత్మయో సకలభూతోత్పత్తిస్థానము దేహమో అట్టి మహాత్మునకు నీకు శ్రేయస్సులు కోరఁదగిన దేముండును? గురుశుశ్రూషాదిక మంతయు విడంబనమే కాని వేఱొండు కాదు.

* అని కుచేలుఁడు పలుక నతనితో ననేకవిధేష్టాలాపములు సలుపుచు శ్రీహరి సర్వభూతమనోభిజ్ఞుఁడు కావున నవ్వుచు నిట్లు పలికెను. బ్రహ్మణ్యుఁడగు బ్రాహ్మణప్రవరుండగు కుచేలునియం దాదరము వెలయుచుండఁగా మందహాసమొనరించుచు దయాదృష్టి నవలోకించుచుఁ దాను సత్పురుషులకు గతిగావున సువ్యక్తవాక్యముల నెల్లర కామోదము నాశ్చర్యమును గల్గించుచు నిట్లనియె. బ్రాహ్మణోత్తమా! ఇంటినుండివచ్చుచు నాకేమికానికను గొనివచ్చితివి! భక్తుఁడొక యణుమాత్ర పదార్థమును దెచ్చిన నది మహత్తరపదార్థమని నే భావింతు. అభక్తుఁడు కొండయంత పదార్థమును దెచ్చిననది నాకు సంతోషమును గల్గింపఁజాలదు. పత్త్రముగాని పుష్పముగాని ఫలముగాని జలముగాని యెవ్వఁడు భక్తిపూర్వకముగా నాకొసంగునో దానిని భక్తిప్రహ్వమగుట సత్పదార్థమని భావించి ప్రయతాత్ముఁడగుట నాతఁడు మహాపావనుఁడని మదినెంచుచు నాతఁడొసంగినయప్పదార్థమును గ్రహించెదను. అని మహాదరమునఁ బలికిన శ్రీహరి పలుకుల నాలకించి కుచేలుఁడు దాఁదెచ్చిన యడుకుల నీయ సిగ్గుపడి యందుఁ గనంబడు మహా-

* ఇది శ్రీభాగవత దశమస్కంధమున నెనుబదొకటవ యధ్యాయమునుండి సంగ్రహీతము.

పదార్థములకును దాఁదెచ్చిన పృథుకతండులములకుఁ గల వాసిని దలంచి మఱియు సిగ్గుపడి తలవంచి క్రిందుచూచుచు వానినీయఁజాలక యూరకుండెను.

సర్వభూతదర్శియగు నాపరాత్పరుఁడు శ్రీకృష్ణుఁడు కుచేలుని యాగమనకారణమెఱింగి యీతఁడు తొలిజన్మంబున నైశ్వర్యకాముఁడై నన్ను సేవింపఁడు. ఐన నీనామిత్రుఁడు కుచేలుఁడు పతివ్రతయగు తనభార్యకోరికను దీర్పనెంచి యరుదెంచెను కావున నీతనికి మనుష్యులకు దుర్లభములగు సంపదల ననుగ్రహించెదను. అని యెంచి యాద్విజవర్యుని పురాతన వసనాంచలమున నున్నయడుకులను ముడివిప్పి తానే తీసికొని సఖా! యివి యడుకులా వీని నాకొఱకుఁ దెచ్చితివా! ఏల యింతదనుక నీయలేదు. ఇవి నాకత్యంత ప్రీతిదాయకములు. ఈయవి నన్ను నీప్రపంచమును గూడఁ దృప్తిచేయం జాలునవి. అని పలుకుచు ముష్టి నిండ వానిం గైకొని భక్షించి రెండవపర్యాయము పిడికిట వానిం గొనుచుండఁగా నాపరమేశ్వరునిహస్తమును శ్రీరుక్మిణి త్వరపడి పట్టుకొనియెను. ప్రథమముష్టిగతపృథుకతండుల భక్షణముననే యీలోకమునందును బరలోకమునందుననుభవింపఁదగిన సర్వసంపద లలవడును. ఇంక రెండవపర్యాయము కూడ భక్షించి నన్నుంగూడ నీతనియధీనము చేయునేమో యనుసంశయము గలదియై యాముష్టిని బట్టుకొనియెను. ఇట్లు రుక్మిణీదేవి తనకరావిందమున నాథునికరాంబుజమును బట్టుకొని ప్రాణేశా! ఇంతియ చాలును. విశ్వాత్మకా! సర్వ సంపత్సమృద్ధు లొనఁగూడును. ఇహపరముల ననుభవింపఁ దగినవి లభించును. నీకు సంతోషముగల్గించునవి యెట్టిఫలముల నీఁజాలవు? అని

మృదూక్తుల నా ప్రయత్నమును మాన్పించి యిష్టాలాపములఁ బ్రొద్దుపుచ్చెను.

కుచేలుఁ డారాత్రి యాయంతఃపురమున గడిపెను. ఇష్టాన్నములఁ బానీయముల నెంతయుఁ దృప్తినొందెను. స్వస్థచిత్తునిగాఁ దన్నుం దలంచెను. మఱుదినమున భగవంతునిం బ్రార్థించి ప్రయనముచేసెను. హరియు నాతనికి నమస్కరించి కొంతదూరము సాగనంపఁగా భగవంతునియాదరణమును స్మరించుచుఁ దనయింటికిం బోయెను. తనమిత్రుఁడగు శ్రీహరి ధనమీయక పోయినను దాను యాచింపక యతృప్తినొందక ప్రయాణము సాగించెను. త్రోవనడచుచుఁ దాఁగొనిపోయిన కానికను లక్షించుచు మహాత్ముని సందర్శనమయ్యెనను సంతృప్తిఁ గాంచుచు దాన నానందించుచు నోహో! పరమేశ్వరునికరుణయెట్టిది? లక్ష్మీ వక్షమున నలరారుచు దీపించునా పరాత్పరుఁడు నన్నుఁ గౌఁగిలించు కొనియెను. దరిద్రతముఁడనగు నన్ను మహాదరమున నుపలాలించెను. పాపిష్ఠి దరిద్రుఁడనగు నేనెక్కడ! శ్రీనికేతనుఁడగు శ్రీహరి యెక్కడ! బ్రహ్మబంధుఁడని పిలిచి చేరఁదీసికొని కౌఁగిలించుకొనియెఁ గదా! భార్యామణియగు రుక్మిణీదేవి కూరుచుండి యిష్టాలాపములఁ దన్ను సంతుష్టునిగఁ జేయు హంసతూలికాతల్పమున నన్నుఁ గూరుచుండఁ బెట్టెను. సోదరుని కన్న మిన్నగ సంభావించెను. వాలవ్యజనములఁ దాల్చి రుక్మిణీదేవి విసరుచుండ నామార్గశ్రాంతిని బోఁగొట్టెను. పరమశుశ్రూషలొనరించి తుదకు నాపాదసంవాహనము కూడ నొనరించెను. దేవతవలె నన్నర్చించెను. పూరుషులకు స్వర్గాపవర్గసుఖములు కలుగుటకు భూతలమున సకలసంపదలు లభించుటకు సకల

సిద్ధులు కలుగుటకు మూలకారణము భగవత్పాదారవిందార్చనమే కాని వేఱొండుకాదు.

నాకిపుడు ద్రవ్యమీయక పోనంపుట కరుణచేతనే యని తలంతును. ఏలయన నీకుచేలునకు ధనమొసంగిన మదించి నన్నుస్మరింపక చెడునని తలంచియే యొసంగఁడయ్యెను.అంతియ గాని వేఱొండు కారణముకాదు. అది పరమానుగ్రహమేకదా. కరుణాకరుఁడు కావున నామేలుగోరియే ద్రవ్యమీయక పోయెను. అని పలుభంగుల బగవంతుఁడు చూపిన యాదరమును స్మరించుచుఁ దనయదృష్టమునకు వింతనొందుచు నించుక యైన ద్రవ్యమీలేదన్న కొఱంతను మదిఁదోఁపనీయక తన గృహమునకుం బోయెను. ఈఘట్టమున మహాకవి

"ఉ. శ్రీనిధి యిట్లు నన్నుఁ బచరించి ఘనంబుగ విత్తమేమియే
నీని తెఱంగు గానఁబడె నెన్న దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁజేరఁడని కాక త్రిలోకహితుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తుపరిపూర్ణునిగా నసుఁ జేయకుండునే."

అను నీపద్యరత్నమును వ్రాసెను.

ఇట్టులూహించుచు నాకుచేలుఁడు తననివాసమును జేరఁబోఁగా నందున్న ప్రాతగుడిసెలన్నియుఁ గనబడక యాచోట సూర్యాగ్నులవలెఁ దేజరిల్లు మేడలు వెలయుచుండును. యెల్లయెడలఁ గ్రిక్కిరిసినట్లు దివ్యహర్మ్యములు కనఁబడియెను. ఆపురముచుట్టును. విచిత్రములగు నుద్యానములు నందు సురుచిరవిహంగమంబులు మధురధ్వను లలరనుండెను. సరస్సులు ఫుల్లసారస సమాకీర్ణములై యొప్పుచుండెను. నదులు శీతల పావనజలపూర్ణములై ప్రవహించుచుండెను. ఆనూతననగర

మును బురుషులు స్త్రీలును సర్వాభరణాలంకృత గాత్రములం జూపట్టుచుండిరి విశేషించి పురంధ్రీమణులు స్వర్గపురమున నల రారు దేవకాంతలవలె గనంబడుచుండిరి. ఆయద్భుతమునుం బిలకించికుచేలుండు తానిట్లు మనంబునం జింతించెను.ఇదెవ్వరినగరము? ఇం దెవ్వరుందురో నాస్థానమిదియేయనితోంచు గురుతులున్నవి. అదే యిట్లు మాఱిపోయెనో అని యేమియుందోంచమి సంశయాకుల మానసుండై చింతించుచుండునంతలో దేవతలంబోలు పురుషులు, దేవనారీమణులం గేరుపురంధ్రులు గీతవాద్యపురస్సరంబుగా నెదురువచ్చి యర్చించిరి. మహానందము నొంది యామహాత్ముని వినుతించిరి.

కుచేలుని పత్నియుం బతిరాక విని భక్త్యుత్కర్షమున నతిసంభ్రమమున గృహామునుండి మూర్తిభవించిన శ్రీదేవివలె వెలువడి పతివ్రతాతిలకము గావున నాకాంతునిం గాంచి ప్రేమోత్కంఠయై యానందబాష్పములు ధారలుగా జారుచుండం గాం నిమీలితాక్షియై బుద్ధిచే నమస్కరించు మనస్సుచేం గౌంగిలించుకొనియెను. దేవకాంత విమానాధిరూఢయై యరుదెంచినచందమునం గన్నులకు విందుచేయు నాపత్నిం గాంచి సర్వాభరణాలంకృతలగు దాసీజనము నడుమనొప్పుచుండుట కరువందుచు విస్మితుండగుచుం బ్రీతుండై యామెంగూడి నిజమందిరమును బ్రవేశించెను. ఆమందిరము మణిస్తంభశోభోపేతమై మహేంద్రభవనమువలె నుండెను.పయఃఫేనమువలె నగపడుచు మక్షపరిచ్ఛదములై కన్నులపండువుచేయు శయ్యలు గజదంత విరచితము లనేకములందుం గానంబడియెను.చామరవ్యజనములు చూపట్టెను. హేమమయములగు నాసనములు కోమలములగు

నుపస్తరణములు ముక్తాదామ విరాజమాన వితానములు నేత్ర గోచరములయ్యెను. స్వచ్ఛములగు స్ఫటికకుడ్యములయందు మహామరకతమణులు చెక్కఁబడియుండెను. రత్నదీపములు నానారత్నాభరణాలంకృతకాంతాతిలకములు కనంబడిరి. వాని నన్నింటిని గాంచి కాంతామణులం బరికించి సర్వసంపత్సమృద్ధి గలిగెఁ గదా యని యుహించి నిర్వికారచిత్తుఁడై యిట్టి సమృద్ధిగల్గుటకు హేతువేమని తర్కించెను. అదృష్టహీనుఁడనయిదరిద్రుఁడనగు నాకీసంపత్సమృద్ధి కలిగినది. ఇట్టి మహావిభూతిం దిలకించి మానవుఁడు యదూత్తముఁడగు శ్రీకృష్ణుని సేవింపఁడనుట నిక్కము. సఖుఁడగు శ్రీకృష్ణమూర్తి యాచకుండనగు నాకు నించుకయుఁ దెలుపకయే పర్జన్యునివలె బహుతరసంపదల నొసంగెను. నన్నుం గాంచినంతనె యాచకుఁడనని యెఱింగెను గాఁబోలును. మఱియుఁ, దాను లక్ష్మీపతి గావున సకలభోగముల ననుభవించువారు కావున సముద్రమును నిండింపఁ జాలి యతివదాన్యుఁడగు పర్జన్యుఁడల్పమని తానుభావించి వర్షించిన నవి బహుతరముయినట్లు నా కల్పభాగ్యమనియే యనుగ్రహించెను.అదిబహుతరమయ్యెను. నాతోఁ జెప్పకుండుట కుం గల కారణ మిా యల్పభాగ్యమిచ్చితినని యేల తెలుపవలయు నని యూహించెనను నదియే యుండును: భగవంతుఁడు తానొసంగునది యత్యల్పమని తలంచును. తన యందుఁ బ్రీతిగలవాఁడొసంగు నది యత్యల్పమైనను మహత్తరమని తలంచును. కాఁబట్టియే మహాత్ముఁడగు నా శ్రీహరి నేఁ గొనిపోయిన పృథుకతండులములను మహాప్రీతియుతుఁడై పిడికిలినిండునట్లు కైకొని భుజించెను. ఔరా! ఆకరుణా

సాగరుని స్వభావ మెంతసరళతమమైనది! ఇప్పటికిం దెలిసికొంటిని ప్రేమము హితాశంసనరూపమగు సఖ్యము, ఉపకారిత్వ లక్షణయగు మైత్రియు సేవకత్వరూపమగు దాస్యము నను నివి శ్రీకృష్ణసంబంధినగు నాకుఁ బ్రతిజన్మమునందును గలుగుం గాక. ఐశ్వర్యముమాత్రము వలను. అది బంధుకారణమగును. మహానుభావుఁడై సద్గుణాకరుఁడగు నాపరమపురుషుని సంబంధ ముగల భక్తులతోటి నిరంతరసంబంధము నాకులభించుఁ గాక. పరాత్పరుండగు శ్రీకృష్ణమూర్తి ద్రవ్యాది సంపదలను రాజ్యై శ్వర్యమును కళత్రపుత్త్రాది విభూతులను భక్తులకు నొసంగఁ డు. దృఢతమభక్తినే ప్రసాదించును. అవివేకి నగునాకు దృఢ భక్తిలేని కారణముననే కాఁబోలు నిష్టభాగ్యము కలిగినది. ధనికులకు మదోద్భవమగు నజ్ఞానము గలుగుట భగవంతుఁడు తాఁజూచుచుండుటం బట్టియే ద్రవ్యమొసంగక భక్తి నొసం గును. భగవంతుని దెంత చమత్కారము.

ఈరీతిగా నాకుచేలుఁ డాలోచించి మనమునఁ జక్కని సిద్ధాంతమును జేసికొని జనార్దనునియందు మనస్సు నిలిపి భాగ్యలంపటుఁడుగాక మెల్లమెల్లగా నాసుఖములను ద్యజింప నభ్యసించుచు భార్యంగూడి సుఖముల ననుభవించెను. దేవాది దేవుఁడై యజ్ఞపతియై సకలబ్రహ్మాండనాయకుఁడగు శ్రీకృష్ణు నకు బ్రాహ్మణులు దైవతములు. కావున భూసురులకంటె దైవ ము వేఱొకఁడు లేఁడు.

మూ. "తస్య వై దేవదేవస్య హరేర్యజ్ఞపతేః ప్రభోః,
బ్రాహ్మణాః ప్రభవో దైవం న తేభ్యో విద్యతే పరమ్."

అనునీమూలమునకు మహాకవి పోతన

ఆ. "దేవదేవుఁ డఖిల భావజ్ఞుఁ డాశ్రిత
వరదుఁ డైనహరికి ధరణిసురులు
దైవతములుగాన ధారణీదివిజుల
కంటె దైవ మొకఁడు గలఁడె భువిని."

అని వ్రాసిరి.

ఇట్లు లాకుచేలుఁడు సకలభోగముల ననుభవించుచుండియు నేసుఖమునందు నిచ్ఛలేనివాఁడై స్వభృత్యాదులం గాంచి వారిసంగతినుండియు లేనియట్లు వర్తించుచు నెవ్వరిచేతను జయింపఁదరముగాని పదమునొందఁ గోరి శ్రీకృష్ణపాదాబ్జధ్యానపరాయణుఁడై నిరంతరసమాధినొంది దానిచే సంసారతాపబంధనములం ద్రెంచుకొని పరమభక్తుఁడై భగవద్దాస్యము నొందెను. అదియే సద్గతియనిసాధువులమతము గావున నామహాత్మునకది యే తనంతన లభించెను. ఇట్లు బ్రహ్మణ్యదేవుఁడగుకుచేలునివృత్తాంతము నాలకించిన వినిన వినిపించినను గర్మబంధవిముక్తుఁడై భగవంతునియందు భక్తిగలిగి తద్దాస్యము నొందును.

మహాశయులారా! కుచేలునిచరిత్రమును జదివితిరి. ఇది యాబాలగోపాలవిదితము గాని క్రొత్తది కాదు. దీనిం గూర్చి కొలఁదిపంక్తులు వ్రాయవలసియున్నది. కుచేలుఁడు తొలిజన్మమున భగవద్ధ్యానతత్పరుఁడై యారాధించెను. కాని ద్రవ్యార్థియై విష్ణువు నారాధింపలేదు. కర్మఫలముల ననుభవింపవలసినవాఁడు కావున నాజన్మమున నాతని తపస్సు ఫలింపదయ్యెను. భగవద్దాస్యమంత శీఘ్రకాలమున ఫలించునా. మఱుజన్మమున దారిద్ర్యపీడితుఁ డయ్యెను. అట్టితఱి నాతఁ డించుకయు ఖేద

మండక తనధ్యానమునకుఁ గొఱంతకల్గనీయక శ్రద్ధగా దాని నవలంబించెను. తనసత్కర్మపరిపాకమునఁ బత్నియు ననుప్రతయే దొరకెను. కావున నామహాత్ముని తపస్సునిర్విఘ్నముగా సాగెను. దారిద్ర్యము బాధించి బాధించి విసుగు నొందెను. దుష్కర్మ లేశఫలము పూర్తియయ్యెను. పక్షణమున నా పాపఫలము పూర్తినొందునో అంతకు నించుకముందు నామ హానీయునిపత్నిని పత్కర్మము పురికొలిపెను. సకలకష్టముల ననుభవించుచు నెంతకాలమో యోర్చుకొని యున్నయా పతివ్రతాతిలక మానాఁడు భర్తను బ్రార్థింపవలయు నన్న యూహ గలదయ్యెను. ఆవేళ్ళ భాగవతమ్మోక్తిదో భాగవతముం జూడుడు.

శ్లో. పతివ్రతా పతిం ప్రాహ మ్లాయతా వదనేన సా,
దారిద్ర్యాత్సీదమానా సా వేపమానాభిగమ్యచ" అని.

"మ్లాయతా శుష్యతా తథా సీదమానా. భర్తృభోగ సంపాదనాశక్త్యైవ సీదంతీ వేపమానా భయేన కంపమానా" అని వ్యాఖ్య.

మోమెండిపోవుచుండఁగా బీదతనమున నేను బ్రాణనాథునకు సుఖమును గల్గింపఁ జాలనైతిఁ గదా యనిచింతించుచు, నీదు ర్వార్తను బలుకవలసివచ్చెఁ గదా యనుభయమున నొడలు వడఁకుచు మెల్లన నిట్టూపలికెనని యున్నది.

దీనిచే నాపతివ్రత యెన్నికష్టములకు నైన నోర్చుకొను నది యని యర్థమగును. అట్టి మహాసాధ్వి యానాఁడు పతిచెం తకుం బోయి సాధువులకుఁ బరమగతియగు నా శ్రీకృష్ణమూర్తిని శరణువేడుమని విన్నవించెను. ఏల? దుష్కర్మఫలము

పూ ర్తియగుతరుణము సమీపించుచుండఁగా సత్కర్మము తనపని తాఁజేయఁబూని యామెను బురికొలిపెను. ఆమె యానూతన ప్రయత్నమునకు లోనై యెట్లో పెనిమిటితో విన్నవించెను. దీనింబట్టి చక్కఁగా నాలోచింపఁగా నెట్టివారికిఁ గాని కర్మఫలము లనుభవింపక తప్పవనియు దురూహయు, సదూహయు వాని ప్రోత్సాహముననే జరుగునని మనుష్యుఁడు ఎట్టికార్యమునకైనఁ గర్తకాఁడని స్పష్టమయ్యెడిని. కాఁబట్టి రే యొకనిని దనకపకారియని గాని, యుపకారి యని గాని దూషించుటయు భూషించుటయు నను నీలోకాచారములు కర్మసిద్ధాంత మెఱుంగమిఁ గల్గినవి కాని వేఱుకాదని మన మెఱుంగ వలయును. దారిద్ర్యమున నీసడింపక భర్తను సేవించునదియే పతివ్రత యనఁబడుననియు నెఱుంగందగు. అట్టి వారిపేరులే శాశ్వతముగా జగతి నిలుచును. కారణము సచ్ఛీలమేగాని యైశ్వర్యాది వికారములు గావు.

కుచేలుఁడు భగవద్దర్శనమున రెండుఫలములు గలుగుననియు ముఖ్యముగా దర్శనలాభమే ముక్తిప్రదమనియు భావించియే పయనమయ్యెను. భగవద్దర్శనమున కరుగునపుడు శక్త్యనురూపమగు నుపాయనము తీసుకొనిపోవుట శాస్త్రవిహితాచారము గావున దాని నడపుటకేమైనఁ గలదా యని పత్నినడుగ నామె యింటనేమియు లేదనినచోఁ బతి మదికేమైన జింతకలుగకమానదనియు నట్టివిచారమును దాఁగల్గింపఁ గూడదనియు నాలోచించి సమీపముననున్న విప్రులయిండ్ల కరిగి యాచించి నాలుగుపిడికిళ్ల పృథుకతండులములు కొనివచ్చి కుచేలముకొంగున ముడిచి పంపెను. ఔరా! ఎట్టి పతివ్రతాతిల

కము! ఎంతటి పతిభక్తి! ఎంత సదాచారసంపత్తి! అట్టి భార్య దొరకుటయే పూర్వపుణ్యఫలము. లేక ప్రతిదినము కలహించుచు నాజ్ఞానువర్తిని గాక యున్నచో భార్యను త్యజింపవలయునని పెద్ద లాదేశించిరి.

శ్లో. "వివాదశీలాం స్వయమర్థచోరిణీం
పరానుకూలాం పరిహాసభాషిణీం,
అగ్రాశనీమన్యగృహప్రవేశినీం
త్యజంతి భార్యాం దశపుత్త్రమాతరమ్."

అను సభియుక్తోక్తి యంద తెలింగినదియే కదా.

కుచేలుఁడును ద్వారకానగరమును జేరి దానివైభవమును జూచుచుండక భగవద్దర్శనాభిలాషమున శ్రీకృష్ణుని మందిరముం జేరెను. ఆసమయమున సర్వేశ్వరుఁడు రుక్మిణీమందిరమున నుండి శయ్యాగతుండయి దేవితో సరసాలాపములాడుచుండెను. మునియాగమనము నెఱింగెను. ఆమునిమహిమను గొప్పదనియు, నంతటికన్న విశేషించి భార్యకంటె నట్టివారినే ప్రేమింతునన్నమాట లోకులకుఁ దనయందు విశేషప్రీతిగలవాఁడు భర్తయనుభావముగల భార్యలకును స్పష్టముగఁ దెలియుటకై సామాన్యమానవునివలె నుండెను. కుచేలుఁ డింటికి రాఁగానే తటాలునలేచి రుక్మిణీప్రభృతికాంత లచ్చెరువంద నెదురుచని కౌఁగిలించి తగినమర్యాదలతోఁ దోడితెచ్చి స్త్రీరత్నములకంతకు మునుపుగల యహంకారము తొలంగునట్లు హంసతూలికాతల్పమునఁ గూరుచుండఁబెట్టి పాదములొత్తుచుఁ దమచిన్నతనమునాఁటిమాటలాడు చుండెను. ఆవి

థము౦ గా౦చి కా౦తామణు లూహి౦చినవిషయము కథయే తెల్పెనుగదా.

కుచేలుఁడు చూచుట కేవగి౦పు గల్గి౦చునట్లు౦డెను. ప్రాఁతవస్త్రము తద్దారిద్ర్యమును వేనోళ్లఁ గొనియాడుచు౦డెను. అట్టివాని౦గా౦చినపుడు సామాన్యముగా స్త్రీలు విశేషి౦చి య౦తఃపురకా౦తామతల్లికలు మదుల రోయుదురు. వారికాభావము కలుగఁగూడదనియు, వస్త్రభూషణాదులు తుచ్ఛములు మానసికనిర్మలత్వమే యత్యుత్తమ మగునను భావము వారికిం గలుగవలయుననియు, భగవ౦తుఁడు మానవుని మానసమును బరికి౦చుఁగాని బాహ్యవేషమును లెక్కి౦పఁడనియు నెఱుంగవలయు ననియు నీయుపదేశము తాఁ జేయకయే వారికిఁ గావలయుననియు నూహి౦చి పాదసేవయుఁజేసెను. కుచేలుని పాదములు కడిగి యాజలములు శిరస్సునఁ జల్లుకొనియెను. ఇట్టి యుపచారములు భర్త చేయుచు౦డఁ గా౦చిన రుక్మిణీదేవి తా లేచి చామరమున౦దుకొని విసరసాగెను. గోదానాద్యుపచారములు ముగిసినపిదప భగవ౦తుఁ డొనరి౦చిన కుశలప్రశ్న మత్య౦త భావగర్భితమున౦ దగును. రుక్మిణ్యాదులు వినుచు౦డిరి గాన వారికి మఱి లోకమునఁగల కులకా౦తలకు నదియే యుపదేశమగును.

శ్లో॥ "సమావృత్తేన ధర్మజ్ఞ భార్యోఢా సదృశీ న వా."

అనునదియే ప్రథమప్రశ్నము. సమావర్తన మొనరి౦చి సమానకులజనితయై శీలస౦పన్నయగు కన్యను వివాహముచేసి కొ౦టివా లేదా. భగవ౦తున క౦తమాత్రము తెలియదా యని యీవిషయమునఁ బ్రశ్ని౦పరాదు. లోకుల నుపదేశి౦చుటకుఁ

బ్రాచీనాచారమును బాటించుటకు నీప్రశ్న మొనరించెనని యెఱుంగవలయును. ఈవిషయమే స్మృతులయందు నిట్లుచెప్పఁబడినది.

శ్లో. "అవిప్లుతబ్రహ్మచర్యో లక్షణ్యాం స్త్రియముద్వహేత్,
అనన్యపూర్వికాం కాంతామసపిండాం యవీయసీమ్,
అరోగిణీం భ్రాతృమతీమసమానార్షగోత్రజామ్."
యాజ్ఞవల్క్యస్మృతి.

భగవద్వాక్యమనఁగా శ్రుతిస్మృత్యనురూపము కదా. కావుననే గీతాశాస్త్రమునందు "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే" అని యుపదేశించెను.కుచేలుని జూడఁగనే యజ్ఞోపవీతాదిచిహ్నములంబట్టి వివాహమైనట్లు కనుపట్టు శరీరమును బరికించినంతన భోగవిరహితచిహ్నములుగనుపట్టు. కావున నిట్లు ప్రశ్నించెను. ఈప్రశ్నమునుబట్టి యాలోచింపగాఁ దనకు సమానమగు వంశము ఆచారము శీలము లోనగునవి యుండుచోట వివాహము చేసికొనవలయునే కాని నడివీథిలోనో మఱెందో కనఁబడిన స్త్రీని రూపమునకు మోసపోయి పెండ్లియాడుట హానియని యెఱుంగవలయును.ఇఁక నాకుచేలుని నేల పర్యంకమునఁ గూరుచుండఁబెట్టెను. పాలవలె నిర్మలమగు పాన్పు తత్సంగతి మలినమయ్యెనే యని యూహించువారలకుఁ దెలివిగలుగునట్లు భగవంతుఁడు ప్రశ్నించెను. సఖా! యని సంబోధించెను. సాధారణదృష్టిం బరికించినను నీచిత్తము గృహారామద్రవ్యాదులయందువిముఖమై యున్నదని యెఱింగితిననియె. దీనిభావమేమనఁగా గృహాదులు తుచ్ఛములు. క్షణభంగురములు. వానియందాశ నీవంటివారలకుండదు. కేవలాజ్ఞానులకే నేనెఱింగితిని.నీతపోబల

మున నీక్షుద్రవాంఛలు క్షణకాలమున నెఱవేఱును. వానిని నీవుకోరక శాశ్వతమగు సుఖమును గోరితివి. తాను గామాసక్తుఁడనియుఁ దనకులోఁబడెననియుఁ దలంచుభార్యలకు నంద అను నాభావను తొలంగవలయునని మఱొకప్రశ్నము చేసెను. మిత్రమా! నావలెనే లోకులకు నుపదేశించుకొఱకుఁ గొందఱు నీవంటి ప్రాజ్ఞులు కోర్కులచేఁగాక నిష్కాములై కర్మముల నాచరింతురు. అనఁగా నాకీలౌకికకర్మముల నించుకంతయు లాభములేదు. కాని నేనాచరింపక విడిచిన నందఱు మానుదురు. దాన నశింతురు. అని వారు హరియే యాచరించెనే మనమాచరింపవలదా. మేలుగలుగు ననునభిప్రాయమూని యాచరింతురని హరిభావము. నావలెనే నీవుకూడ సంసారమున నున్నను దాని నంటక బురదలోనుండి దానినంటని దేహముగల కుమ్మరపురువువలె నున్నవాఁడవని యీప్రశ్నసారము. ఈయర్థమే గీతాశాస్త్రమునందు

శ్లో. "కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన,
మా కర్మఫలహేతుర్భూర్మాతే సంగోఽస్త్వకర్మణి. ౪౭
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ,
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా సమత్వం యోగఉచ్యతే. ౪౮
దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ,
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః. ౪౯
బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్. ౫౦
కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః,

జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్." ౫౧

౨. అధ్యాయము.

భగవంతుఁ డర్జునున కుపదేశించెను. ఈయుపదేశమే కుచేలునితో హరిచేసిన ప్రశ్నసారమని యెఱుంగవలయును.

తర్వాత హరి గురుప్రశంస మొనరించెను. కొందఱకది యప్రస్తుతముగఁ దోఁచును. కాని పదుపదేశములలో నిది మొదటిది. శ్రీమచ్ఛంకరభగవత్పాదులు. "నాద్వైతం గురుసన్నిధౌ" అని యుపదేశించిరి. అనఁగా గురుభక్తిలేకున్న నేవిద్యయు ఫలింపదని దీనిభావము. ఏమంత్రముగాని యేవిద్యగాని ఫలమునీఁజాలదు. పుస్తకములవ్రాసియున్న మంత్రములం జూచినేర్చుకొని జపించిన లాభము లేదు. అంతియ గాక నష్టము కూడఁగల్గును. బుద్ధిభ్రంశతచే నున్మాదులయినవారి నెందఱినో మన మెఱుంగుదుము. కావున గురుభక్తి ప్రధానము అనున్యాయమును లోకులకుఁ జాటుటకే యాసాందీపనిని బ్రశంసించెను. పిదప గురుగృహమునఁ దమరు విద్యాభ్యాస మొనరించినకాలమునఁ గలిగినకష్టములఁ బ్రశ్నించెను. ఏల యనఁగా,

"గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా,
అథవా విద్యయా విద్యా చతుర్థా నోపలభ్యతే."

అన్ననీతిని లోకులకుం దెలుపుటకేయని యెఱుంగవలయు. గురుశుశ్రూషచేసి నేర్చుకొనువిద్య యత్యుత్తమఫలము నిచ్చునని దానిసారము. తక్కిన రెండుపద్ధతులు స్వల్పఫలము నీఁజాలునవి. కావున సాందీపనియొద్ద శ్రీకృష్ణుఁడు విద్యనభ్యసించెను. ఆవిషయ మితరుల కుపదేశరూపమునఁ దెలి

పెను. లోకమున నెవ్వఁడైనను గురుప్రశంసమును మానిన మేలు రాదని దీనిసారము. ఇంక గురుదూషణము చేయువారలకు రాఁగలదుష్ఫలములను వచింప నక్కఱయే లేదు.

పిదప నితరప్రసంగములెన్నియో చేసి నాకేమేని కానికఁ గొని వచ్చితివా యని ప్రశ్నించెను. ఏలయనఁగాఁ దనవైభవముం గాంచి తాఁ దెచ్చిన పృథుకతండులముల నీయ సిగ్గుపడియెనని యూహించియే ప్రశ్నించి యతఁడేమియు బదులిడకుండుట యూహించి తడవితడవి కొంగున నున్న యాయడుకుల భక్షించెను. దాననే మానవలోకసుఖములు స్వర్గసుఖములు కలిగెను. భగవంతునకుఁ బదార్థవిశేషములు ప్రీతికరనులు కావనియుఁ బ్రీతియుక్తుఁడై భక్తుఁ డెట్టిపదార్థము నిచ్చినను దానినే మహత్తరపదార్థముగా గ్రహించుననియు మన మెఱుంగవలయు.

"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి."

అన్న భగవద్గీతావాక్య మంప తెలిఁగినదియే కదా. ఇంకఁ గుచేలునివిషయము వినుఁడు. ప్రయాణము సాగించుచు శ్రీహరికరుణ కచ్చెరువందెను. ద్రవ్యమీయకుండుట తనకు మహోపకారమే యనుకొనియెను. సంపదంధత భక్తికి దూరముగా నుండఁ జేయునని నమ్మెను. అంతియకాని తనయందుఁ బ్రీతిలేక ధనమియ్యఁడని తలంపలేదు. ఇదియే భక్తుల లక్షణము.

శ్లో. "అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం."

అనుగీతావాక్యము ననుసరించి యెల్లభక్తుల యోగ

క్షేమములఁ బరికించుభారము తనదని ప్రతినచేయు భగవంతుఁడు కుచేలుఁడేలవచ్చెనో యెఱిఁగి యాతని కేయేమి వలయునో వాని నడుగకయే యొసఁగునని నమ్మవలయును. కాని కుచేలుఁడు తనకు ధనమీయలేదని కొఱంత పడియుండిన నట్టి యైశ్వర్యమును భగవంతుఁ డిచ్చియుండఁడు. సర్వజ్ఞుఁడు కనుకనే యాతని చిత్తవృత్తినెఱింగి తొలిజన్మమున నే కోరికతోఁ దనను బూజించెనో యెఱుంగును గావున నాతనికిఁ గావలసిన దేదియో తాఁదెలిసికొనియు భార్యవాంఛను దీర్పనెంచి వచ్చినవాఁ డన్నయూహతో సకలసంపదలఁ బ్రసాదించెను.

కుచేలుఁ డింటికిఁబోవునంతలో జిన్నిపల్లియ గొప్ప నగరముగా మాఱుట సంగతమా యనుప్రశ్నము రావచ్చును. భగవంతునకు సర్వశక్తులు గలవని యంగీకరించిన నీ ప్రశ్నమున కవకాశము లేదు.అది యంగీకరింపకున్న నట్టిమహాత్ములకు బదులు వ్రాయుటయు ననవసరము. సకలబ్రహ్మాండముల నిమేషమాత్రమున రచియించు మహానుభావునకు నొక్కనగరము నిర్మించుట నదియు నిచ్ఛామాత్రమునఁ గలుగు టసంగతమనుటయే యసంగతము.కావున మహాశయులారా! ఈకుచేలోపాఖ్యానమున మన మీవిషయముల నెఱింగి యాభక్తునింబోలి భగవంతు నారాధించుచుఁ గర్మఫలములనుగోరక భగవత్ప్రీతిగా నాయాయి కర్మములను విధివిహితములుగ నాచరించుచు సంసారసాగరమునఁ బడినను దానినంటక యుండ మనస్సు నియమించుకొని తరణోపాయ మారయుచుండ వలయును. కలిగిన సంపదల ననుభవించుచు వానియం దుదాసీనభావమును వహించుచు సత్కర్మాచరణమున కది ప్రతిబంధకమని నిశ్చయించుకొని పుత్త్రదార

ప్రభృతులసంబంధము విముక్తిభంగమని తీర్మానించుకొని తన ధర్మ మెంతవఱకుఁ గలదో దానిని నడపుచుఁ దదేకాగ్రతమాత్రము వహింపక భగవత్సేవాదృతినొంది యుండవలయునను నొక్కసన్మార్గము నీకథ మనకుఁదెల్పుచున్నది. ఇఁక నీవిషయమును వదలి తరువాతి విష్ణు చరిత్రమును వ్రాసెదను.

## శ్రీహరి సకుటుంబముగా గ్రహణస్నానమున కరుగుట.

*ద్వారకానగరమున బలదేవుఁడు శ్రీకృష్ణుఁడు నుండఁగా మహర్షు లరుదెంచుచు దర్శించి కృతకృత్యులై వెళ్లుచుండగాఁ గొంతకాలము గడచెను. నగరవాసుల కేకొఱంతయు లేకయుండెను. ద్వారకానగరమే భూలోకవైకుంఠమయ్యెను. ఇట్లుండ నొక్కతఱి సూర్యగ్రహణము సంభవించెను. అది ప్రళయకాలమునఁ గల్గుగ్రహణమువంటిది. అంత గ్రాసము (సూర్యబింబము నావరించునట్టి చంద్రమండలమునీడ) ఎప్పుడును గలుగలేదు. ఆగ్రహణము కలుగునని జ్యోతిష్కులు తెల్పఁగా ముందేయెఱింగి నగరవాసులెల్ల సకుటుంబముగా నాకాలమునఁ జేయఁదగుసత్కర్మముల నాచరించువాంఛలం గదలి స్యమంతకపంచక క్షేత్రమున కరిగిరి. పూర్వము జమదగ్నికుమారుఁడు పరశురాముఁడు మహీమండలమున రాజులు లేకయుండఁ జేయవలయునన్న యాశయమునఁ దాను శస్త్రధారులలో మేటికావున భూమండలమంతయుఁ గలయందిరిగి పరశువుసాయమున రాజపీపులఁ దునుమాడి వారిరక్తధారల నైదు మడువులు నిర్మించి పితృతర్పణమం దొనరించెను. అదియే స్య

*ఈకథ శ్రీభాగవత దశమస్కంధమున నెనుబదిరెండవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

మంతపంచకక్షేత్రమనం బ్రఖ్యాతి వహించెను. ఆహ్రదములు మహాత్తరములు.* ఆయాత్రయందు రామకృష్ణు లిర్వురను బాల్గొనిరి. సకుటుంబమిత్రబాంధవులై యరిగిరి. తమరు భగవంతులే యైనను గర్మములను లోకనివారలే యైనను సామాన్యమానవుఁడు పాపనివృత్తిం గోరి కర్మముల నాచరించునట్లు గ్రహణకాలమున నుచితవిధుల నాచరించిరి. వారింగాంచి లోకులెల్ల నాచరించుటకు నేర్చుకొనవలయునని యే కదా యిందలి సారము. భారతవర్షమునఁ గల ప్రజలెల్ల నాగొప్పతీర్థయాత్ర కరుదెంచిరి. వృష్ణికులజులందఱు వచ్చిరి. వసుదేవాహుకులు లోనగు వారును జేరిరి. తమతమ పాపములను బోఁగొట్టుకొను కోర్కి నచటికెందఱో చేరిరి. వారికెల్ల రక్షకులుగా గద ప్రద్యుమ్న సాంబ సుచంద్ర శుక సారణులు ననిరుద్ధ కృతవర్మప్రభృతులు నిలిచిరి.హయరథముల నధిష్ఠించి యాదవులెల్ల వచ్చుటికిరాఁగా వారింగూడి శ్రీహరి యందు విజయంచేయఁ జూచు వారలకుం గల్గినయుల్లాస మనుపమానముగనుండెను.

ఆదినమంతయు నుపవసించి సమాహితచిత్తముల స్నానమొనరించి బ్రాహ్మణుల కనేకధేనువస్త్రములను స్వర్ణమాలికలను దానమొసంగిరి. విశేషించి యాదవులు పరశురామహ్రదముల స్నానముచేసి విధి ననుసరించి కర్మము లాచరించి స్వర్ణదానములిచ్చి శ్రీకృష్ణునియందు మాకు భక్తి స్థిరతంగాంచుఁ గాక యని కోరిరి. శ్రీహరియు నట్లే కర్మముల నొనరించి వారిం గూడి ముక్త్యనంతరమున స్నానమొనరించి భుజించి స్నిగ్ధపాద

---

*ఈజే సభగవాన్ రామో యత్రాస్పృష్టోపి కర్మణా, లోకస్యగ్రాహయన్నీశో యథానోఘాపనుత్తయే. అనిమూలము.

పచ్ఛాయల విశ్రమించెను. ఎల్లవారు నందుఁగూడిన మిత్రబం
ధుజనముల సందర్శించిరి.బహుదేశవాసులు గావునఁ దఱచుగా
వారింగాంచుభాగ్యము గల్గెఁగదా యని యానందించిరి. గోపి
కలను గోపకులను వారును విలకించి ప్రమోదస్వాంతు లైరి.
పరస్పరసందర్శసల్లాపసౌఖ్యముల ననుభవించి చిరకాలసందర్శన
మునఁ గల్గిన తమిపెల్లిదమున నితరేతరాలింగనములఁ బరి
హృష్టులై పులకాంచిత సర్వాంగులై మాటలాడఁజాలకుండిరి.
వనితామణులును బరస్పరసంశ్లేషసుఖ మనుభవించిమాటలాడు
చుండిరి. వృద్ధులనుగాంచి బాలు రభివాదనములు సల్పిరి. వా
రాశీర్వాదముల వారిని బహూకరించిరి. స్వాగతప్రశ్నమునను
కుశల ప్రశ్నమునను కృష్ణకథా శ్రవణములను గాలమును హా
యిగాఁ గడపిరి.

కుంతిదేవియు భ్రాతృప్రభృతులను దత్పత్నులను
దత్పుత్రులను గాంచి యానందించి యిట్లుపలికెను. వసుదేవా !
నన్నదృష్టహీనురాలనుగాఁ దలంచెదను. మహాపత్సముద్రమున
మునింగియున్న నావార్తను గూడఁ దలపరైతిరి గదా.
మిత్రులు జ్ఞాతులు లోనగువా రెవ్వరికుశలమును దెలిసికొనఁ
గోరరో వారికి దైవము ప్రతికూలమనియే తలంపవలయును.
అని నిష్ఠురోక్తులం బల్కి యంగలార్చెను. వసుదేవుఁ డామా
టల నాలకించి యూఱడింపఁదలంచి అమ్మా! భగవద్వశంగతుల
మగు మన మెల్ల నొకరినొకరు కర్తలుగా భావించి యిట్లు పలు
కరాదు. లోకమెల్ల నీశ్వరునివశమున నున్నది. ఏకార్యమునై
నఁ జేసినను జేయించినను సర్వేశ్వరుఁడే కాని మనమంత సమ
ర్థులము గాము. ఇంక మాస్థితి నాలకింపుము. పాపాత్ముఁడగు

కంసుఁడు మమ్మెల్ల బాధింపఁగా నలుదెసలకుఁ బోయితిమి. ఇప్పు డిప్పుడే దైవవశమున మరల స్వస్థానమునకుఁ జేరఁగల్గితిమి.అని పెక్కురీతుల సంభాషించి యామె వగపుడిపెను.

వచ్చినరాజులెల్ల శ్రీహరిని దర్శించి యుగ్రసేనాదులం గాంచి పరిహృష్టులైరి. భీష్మద్రోణులు ధృతరాష్ట్రుఁడు గాంధారి యుఁ దత్సుతులును బంచపాండవులును ద్రౌపదియుఁ గుంతియు సంజయుండును విదురుఁడును గుంతిభోజ విరాట ద్రుపద ప్రముఖులు భగవంతుం గాంచిరి. ఆనందసాగరమున మునిఁగి తేలిరి. శ్రీహరియు బలదేవుఁడును వారికెల్ల విధివిధానమున మర్యాద లొనరించిరి. వృష్ణిభోజాదులం గాంచి వారెల్ల మీరు ధన్యులరు. శ్రీకృష్ణభగవంతు ననవరతము దర్శించుచు న్నవారు. మీభాగ్యమే భాగ్యమని పలుసారులు వినుతించిరి. యోగిజనులకు నెఱుంగరాని శ్రీహరిని నిత్యము దర్శించుట కంటె సంతోషమేది కలదని పలికిరి. భగవత్పాదస్నానోదకము తద్వాక్కులు సంసారాంధువునఁ బడినవారి నుద్ధరించును గదా. అట్టిపరమాత్మంగూడి భుజించుచు మాటలాడుచు శయనిం చుచు నుండుట యెట్టియదృష్టమో తెలియ శక్యమాయని నుడివిరి. నందుఁడు సకలపదార్థములను శకటములపై నిడుకొని కొనివచ్చి యందుఁ జేరినబంధువులకెల్ల భోజనమొసంగెను. యాదవులు వృష్ణి భోజాదులు నందునిగాంచి పరమాదరంబున గారవించిరి, వసుదేవుఁ డానందు నాలింగనము జేసికొని కంసు నిబాధలం దలంచి తాఁగన్నకొడుకును నందునిమందిరమున నిడి వచ్చుటయు స్మరించి యెంతో బహూకరించెను. రామకృష్ణులు తండ్రిని గాంచి నమస్కరించి యానందాశ్రువులు కంఠస్వరము

నడ్డుపెట్టగానించుకయుమాటాడఁజాలక పోయిరి.నందుఁడూరా మకృష్ణులఁజేరఁదీసికొనితొడపై నిడుకొని కౌఁగిలించుకొని పర మానందమనుభవించెను. యశోదయు మహాదృష్టవతియైూటఁ దనయులఁజూచినంతన కన్నీరున భూమిని దడిపెను.రోహిణియు దేవకియు వ్రజేశ్వరియగు యశోదను గౌఁగిలించుకొని యామె చూపిన మైత్రిని దలంచుచు బాష్పసంరుద్ధకంఠలై యూరకనిలు వంబడిరి. కొంతవడికిఁ దెలివొంది వ్రజేశ్వరీ! కార్యముచెల్లినను నీమైత్రిని మఱచువారును గలరా. ఇంద్రపదములభించుఁగాక. అదియు నీమైత్రికి సమాన మగునా. నీవు చూపిన మైత్రికిఁ బ్రతిక్రియయుఁ గలదా. ఎవ్వరి కే నొనరింప శక్యమగునా. ఈ శిశువులు తల్లిదండ్రుల నెఱుంగరు. మీదంపతులనే తల్లిదం డ్రులుగా భావించిరి. మీతోడ బాల్యమంతయుఁ గడపిరి. వీరిని బాలించినది మీరేగదా. లేకున్న దిక్కెవ్వరు. ఱెప్పలు నయనములంగాపాడినట్లు మీరు గాచుచుండఁగా భయమన నెట్టిదో యెఱుంగక పెరిగిరికదా. లోకమున సత్పురుషులకు నిజ పరభేదము లేదు కదా. అని యిట్లు సంభావింప నాయశో దయు నుచితరీతి వారిని గౌరవించెను. గోపికలును జాలకాల మునకుఁ గనఁబడిన శ్రీకృష్ణునింగాంచి తద్దర్శనము నిరంతరము గాక యుండ నేత్రములకు ఱెప్పలనడ్డగా నేల విధాత నిర్మిం చెనో యని యాధాతఁ దూరుచు నానయనములచేఁ దదాకార మును హృదయమునఁజేర్చి యాలింగనము చేసికొని తద్భావ మునే పొందిరి. నిరంతరాభ్యస్తయోగులకుం గూడ దురా పమగుఁ గదా యా పరమేశ్వరురూపము. ఈఘట్టమున మూల ముం బరికింపుఁడు

"గోప్యశ్చ కృష్ణముపలభ్య చిరాదభీష్టం
యత్ప్రేక్షణే దృశిషు పక్ష్మకృతం శపంత్యః,
దృగ్భిర్హృదీకృతమలం పరిరభ్య సర్వా
స్తద్భావమాపురపి నిత్యయుజాం దురాపమ్."

అని యుండెడు.

ఇట్లు గోపికలు తన్ను భక్తిభరమున దర్శింపఁగా శ్రీ కృష్ణమూర్తియు వారిని జేరఁబిలిచి ప్రియముగమాటలాడుచుఁ గౌఁగిలింతల వారిమనస్సున కుల్లాసమును గల్గించుచు వారియా ర్తింబాపుచుఁ గుశలమడిగి నవ్వుచు నిట్లు పలికెను. చాలకా లము మీకుంగనఁబడక శత్రువులఁ దునుమాడుచుఁ దదేకాగ్ర మానసులమగు మమ్ము మీయందుఁ బ్రీతిగలవారలను స్మరిం తురా. ఎంతో పోయిరని మఱచితిరా. అకృతజ్ఞులు వీరని మఱు వరు కదా. భూతములను భగవంతుఁ డొకవేళం గూర్చును. ఒక్కవేళ విడిపోవునట్లు చేయును. కర్మసాక్షి గావున నేకాల మునఁ గూడి యుండిన మేలో యేకాలమున దూరముగనుం డిన మేలో యతఁడెఱుంగును. వాయువు మేఘములను, దృణ తూలములను, బరాగములను గూర్చును. విడిపోవఁ జేయును. అట్లే భూతకర్తయగు పరమేశ్వరుఁడును భూతముల నట్లేయొన రించుచు నానందించుచుండును. పురంధ్రులారా! భూతములకు నాయందలి భక్తి పునర్భవమును గల్గింపదు. విధివశమున నా యందు మీకుం గల్గినస్నేహము నాపదము నొందించును. గోపికలారా! నేనే సర్వభూతములకు నాదియునంతంబు నగు దును. బహిరంతరములు నేనే. శరావసైంధవాదులకు నాకా శాదిభూతము లెట్లు కారణములో యట్లే నేనును భూతముల

కెల్లఁగారణభూతుఁడను.తుదకన్నియు నాయందే లీనములగును అట్టి నాతత్త్వమెఱుంగుఁడు. ఈరీతి నధ్యాత్మవిద్యచే నాపర మేశ్వరుఁ డాగోపికలకు జ్ఞానమును గల్పించెను. వారెల్ల నా యుపదేశమునే భావించుచుఁ దన్నిర్మలజ్ఞానము నొందిరి. ఆగోపి కలు తమతమ మందిరములకుం బోయినను యోగీశ్వరులు హృదయములందు సర్వదా తలంచుకొను శ్రీకృష్ణపాదారవిం దములను స్మరించుచుఁ దదుక్తరీతి మెలంగుచు నాభగవత్పా దారవిందమే సంసారకూపపతితుల నుద్ధరింపఁజాలునది యని నిశ్చయించి తద్ధ్యాననిరతి నుండిరి.

భక్తవరులారా! ఈకథయం దనేకవిషయములు గలవు. వానినెఱుంగుటయే తరణోపాయము. సూర్యగ్రహణము మహాపుణ్యకాలమని పెద్దలందురు. చంద్రసూర్యు లమావాస్య యంతమునందు నేకరాశియం దేకాంశమునసుందురు. అనఁగా భూమిపై నున్ననారల చూపున కట్లు కనఁబడుదురు. చంద్రమం డలము భూమికత్యంతసమీపమున నున్నది. సూర్యమండల మెంతయో దూరమున నున్నది. ఈమండలాధిపతులకే చంద్ర సూర్యులని పేరు. వీరికి నడుమనుండు దూరమెన్నియో లక్షల యోజనములు గలదు. కావున భూమిపై నుండి చూచువారి చూపున నేకరాశియందున్నట్లు కనఁబడుదురు. సూర్యగ్రహణ మనఁగా సూర్యమండలమును చంద్రమండలచ్ఛాయ యాచ్ఛా దించును. మనకును సూర్యమండలమునకు నడుమ సరిగా శశాంకమండలముండునని సారము. అదియే గ్రహణము. చం ద్రమండలము జలమయగోళము. సూర్యకిరణము లందుఁ బ్రస రింపకపోయిన నామండలము నల్లగానుండును. రవికాంతు లే

భాగమునఁ బ్రసరించునో యాభాగము ప్రకాశించును. పార్శ్వ మునసుండక అమావాస్యాంతమునఁ జంద్రబింబము రవిక్రింద నుండును గాన మనకుఁ గానఁబడుభాగము నల్లగనుండును. ఎంతకాల మారవిబింబ మగపడకయుండఁ జంద్రుఁడుండునో యంతకాలమే గ్రహణమందురు. చంద్రగతి వేగవంతము సూర్యగతి మందము. కావునఁ జంద్రుఁడు చాలసేపుండఁడు. కాఁబట్టియే సూర్యగ్రహణ మెనిమిదిగడియలకంటె నెక్కుడు కాల ముండదు. సూర్యమండలము చంద్రమండలమున కంటె నెన్నియో లక్షలరెట్లు పెద్దది. అది తేజోమయగోళము. దానిని జంద్రమండలచ్ఛాయ యాచ్ఛాదించును. రవిగ్రహణము బింబాధిక గ్రాసముగలదిగాఁ దఱచుగా రాకుండుటకుం గారణ మిదియే. ఒకానొకప్పు డారవిమండలము భూమికి దూరముగ నున్నట్లగపడును. ఆకారణమున నాతరుణమున నామండలము రమారమి తొమ్మిదంగుళములుగా మనకగపడును. చంద్రమండలము సమీపముననుండి యించుమించుగాఁ బదునొకండంగుళ ములుగాఁ గనంబడును. అట్టితరుణముననే సూర్యగ్రహణము బింబాధిక గ్రాసముగ నగపడును. ఆతరుణమున భూమండలమున నుండువారలకు నక్షత్రము లగపడును. అట్టి యంధకారావృతకాలము రమారమి రెండుగడియ లుండును. ఆతరుణమునఁ జేయుతర్పణాదులు పితృప్రీతికరములగునని స్మృతులు తెల్పుచున్నవి. ఏలయనఁ జంద్రమండలము పితృలోకమనంబడును. అమాంతమున నిక్కముగు చంద్రమండల మగపడును. రవికిరణ ములందు వ్యాపింపవు. చంద్రోపాసనమున కది మంచికాలము. ఆకాలమున నేమాత్రము పితృతృప్తిచేసినను అనంతఫలమిచ్చు

నని యెఱుంగనగు. ఓషధులయందు శక్తియంతయు నట్టికాల ముల వానియందే యుండును. ఆకాలమున నోషధులను విధిపూర్వకముగాఁ దీసినయెడల నవి వీర్యవంతములు గనుక వానికిం జెప్పియున్న ఫలముల నొసంగును. అట్లే మంత్రము నుపాసించిన నవి ఫలములనొసంగునని మహర్షు లతీంద్రియులు గావునఁ జెప్పిరి.

ఆసూర్యోపరాగ మొక్కసారి రాఁగా నాకాలమునఁ గర్మము లొనరింప ద్వారకానగరవాసులెల్లఁ గురుక్షేత్రమున కరిగిరి. ఆగ్రహణమెన్నఁడు వచ్చునదిగాక ప్రళయకాలమునఁ దోచునదిగానుండెనఁట. కావుననే కురుక్షేత్రమున కందఱరిగిరి. పుణ్యకాలములు పుణ్యక్షేత్రములు ఫలవంతము లనుభావము గలవారు లోకమునఁ గొందఱు కలరు. కాలమొక్కవిధముగనె యుండును. చిత్తశుద్ధిగలిగిన నేకాలమైన నొక్కటియే అనుకొను వారు కొలఁదిసంఖ్యగలవారు కలరు. ఎట్టిభావముగలవారాభావానుసారముగాఁ గర్మముల నొనరించినఁగాని తృప్తిగాని ఫలముగాని యుండదు. అట్టివారితత్త్వ మెఱుంగక పుణ్యక్షేత్రము లేలయని యుపదేశింపరాదు. కుదిరినభక్తిని దొలఁగించి నట్లగును. కాఁబట్టియే.

శ్లో. "న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినాం,
జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తస్సమాచరన్."
గీతా 3 అధ్యా.

అని గీతాశాస్త్రమున శ్రీహరి యర్జునునకుం దెల్పెను. సామాన్యదృష్టి నాలోచించిన నొకక్షేత్రమునకుఁ బోయినపుడు

తత్ప్రభావమున బుద్ధినిర్మలముగానుండుననుట నిక్కము. అట్టి తరుణమున నించుక భగవంతుని బ్రార్థించినను ఫలమనంతమనుట యుక్తియుక్తముగనే యున్నది. సర్వకాలములయందు నిర్మలచిత్తులగువారలకు క్షేత్రములతోఁ బనిలేదన నొప్పుకొనవచ్చును గాని సామాన్యులకుఁ బైవిషయమే తగినది. యోగసిద్ధులకే నిర్మలచిత్తములవడును. అట్టివారు లోకమున నొక్కకొందఱే యుందురు. కాఁబట్టి పుణ్యకాలములు పుణ్యక్షేత్రములు రెండును గూడుట ఫలవంతమే యనుట నిక్కము.

శ్రీహరియు బలరాముఁడును యాదవులతో నా క్షేత్రమున కరిగిరి. తమరు చేయఁదగినకార్యములు లేకున్నను లోకుల కుపదేశించు పొంటె స్నానదానాదుల నొనరించిరి. వారిం గాంచి తక్కుంగలవారందఱు మఱింతభక్తితోఁ గ్రియల జరిపిరి. కొందఱు గోవిందునిగాంచి యానందించిరి. అదియే సత్కర్మానుష్ఠానమనియుఁ దలఁచిరి. బంధుజను లొకరినొకరిగాంచి చిరకాలసందర్శనజనితానందము ననుభవించిరి. ఆతరుణమున నందవ్రజమునుండి గోపికలరుదెంచి భగవంతునిగాంచి యోగీశ్వరులకేని యలభ్యమగు తద్రూపమును మది నిల్పుకొనిరి. మనస్సునందే తద్రూపమును గౌఁగిలించుకొనిరి. భగవంతుఁడు వారి నేకాంతముగా ననునయించెను. ఆలింగనము చేసికొనియె. కుశలమడిగెను. ఈఘట్టమునఁ గలమూలనుం గాంచినచో గోపికలు వాస్తవముగా భక్తిపరవశలనియు భగవత్కృపాపాత్రలనియుఁ దేటపడును.

శ్లో. "మయి భక్తిర్హి భూతానామమృతత్వాయ కల్పతే,

దిష్ట్యా యదాసీన్మత్స్నేహో భవతీనాం మదాపనః. ౪౬
అహం హి సర్వభూతానామాదిరంతోంతరం బహిః,
భౌతికానాం యథాఖంవా ర్భూర్వాయుర్జ్యోతిరంగనాః.
అధ్యాత్మవిద్యయాగోప్య ఏవం కృష్ణేన శిక్షితాః,
తదనుస్మరణధ్వస్త జీవకోశాస్త మధ్యగన్." ౪౮

సాధువులారా! ఈశ్లోకములు భాగవతమునఁ గలవు. కాముకుఁ డగుపురుషుఁడు కామాతుర లగుకాంతలు చిరకాలమున కొక్కచోటఁ గూడినప్పు డిట్టులే సంభాషింతురు కాఁబోలు. నేనే భగవంతుఁడను. సృష్టిస్థితిసంహారకర్తను నేనే. నాయందు భక్తి గుదిరిన నది మరల జన్మము గలుగకుండఁ జేయును. అని కాముకుఁడు పల్కును. కాముక లగుకాంతలు భగవంతుఁడనియే యాతుంటరిని నమ్మి దేహతాపములు నశింపఁగా జ్ఞానముగలవార లగుదురు. ఇది యేలోకమునఁగాని యున్న యాచారమేనా. ఈచోటఁ గౌఁగిలింతల కర్థమేమి? ఏకత్వమే యర్థము. అనఁగాఁ దన్మయత్వమని సారాంశము. పునర్జన్మము లేకుండుటయే ఫలము. ఇట్టులుండఁగా శ్రీకృష్ణుఁడు జారుఁడనుటయు, గోపికలు స్వైరిణులనుటయు నవివేకప్రసంగములు కాక మఱేమగును? ఇట్లపార్థములం గల్పించి భగవంతుని దూషించి యిహపరములను రెండింటికిం జెడక గోపికలు భగవద్భక్తిపరవశలనియు, శ్రీపరమేశ్వరుఁడు వారింగృతకృత్యలఁ జేయఁ బూనెననియు నెఱింగి వారివలె శ్రీకృష్ణుని సేవించి తత్కరుణాపాత్రులుకావలయు ననుటకంటె వేఱుగ వ్రాయవలసిన విశేషమేమున్నది? ఇంతట నీవిషయము నుజ్జగించి తరువాతి భగవత్కథను వ్రాసెదను.

## ద్రౌపదికి శ్రీకృష్ణపత్నులు తమవివాహవార్తలం దెల్పుట.

*అంత శ్రీహరి సకలబంధుజనుల కుశలాదులం బ్రశ్నించి ధర్మరాజాదులం గని సగౌరవంబుగా వారి నాశ్వాసించెను. వారెల్లఁ బ్రమోదమగ్నమానసులైరి. అవ్వల శ్రీకృష్ణపత్నులు పాంచాలియు నొక్కచోఁ గూరుచుండి భగవత్కథలఁ బ్రశ్నించుచు నొకరితో నొకరు వానిం జెప్పుకొనుచుండిరి. కాలము మహాసంతోషమున గడచెను. ద్రౌపది యత్తఱి నిట్లు ప్రశ్నించెను. ఓరుక్మిణీప్రభృతి శ్రీకృష్ణపత్నులారా! మిమ్ము శ్రీహరి పెండ్లియాడినచరిత్రము వినవలయును. చెప్పుఁడు. తనమాయచే నేయే యద్భుతకార్యముల నొనరించెనో వినవేడుకయ్యెడు నని ప్రశ్నించిన నామెకుఁ గుతూహలము గలదని యెఱింగి యిట్లు బదులు చెప్పఁబూనిరి. అందు రుక్మిణి తనవివాహవృత్తాంతము నిట్లు చెప్పనారంభించెను. ద్రౌపదీ! మాతండ్రి నన్ను శిశుపాలున కీయఁబూని తదుచితప్రయత్నము చేయుచుండఁగా రాజులందఱు తమతమ వాహినులంగూడి శిశుపాలున కెట్టులైన నన్ను బెండ్లిచేసి పోవలయునన్న కుతూహలమున ధనుర్ధారులై యుండఁగా శ్రీహరి భటశేఖరితపాదరేణువై యుద్ధరంగమున మృగేంద్రసమానవిక్రమమున నన్నుం గొనిపోవుచు నడ్డుపడినవారి నోడించుచుఁ గొనిపోయి విధివిహితముగాఁ బెండ్లియాడెను. అట్టి శ్రీనికేతనునిచరణములు నాకు సదా పూజ్యములగుఁగాక యని పల్కి తనవృత్తాంతమును ముగించెను. అవ్వల సత్యభామ తనవృత్తాంతము నెఱిఁగింపఁ బూని

---

* ఈవిషయము శ్రీమద్భాగవత దశమస్కంధమున నెనుబదినాల్గవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడిన దని యెఱుంగవలయు.

యిట్లు నుడివెను. స్యమంతకరత్నమును గొనియెనన్న యప వాదమును దొలఁగింపఁ బూని సింహమును వధించి ఋక్ష రాజు నోడించి స్యమంతకరత్నమును మాతండ్రికి నిచ్చెను. మాతండ్రి భీతుఁడై యారత్నమును నన్నును శ్రీహరి కొసం గెను. అక్రూరాదులకుం దెలిపి నన్నిచ్చిన దాన శ్రీహరి నన్ను బెండ్లి యాడెను. అని తనవివాహవృత్తాంతమును విశదపఱచి యామె భర్తృభక్తిని దెలుప విని జాంబవతి యిట్లు పలికెను. మాతండ్రి జాంబవంతుఁడు తొలుదొలుతఁ దెలియక శ్రీహ రితో నిరువదియేడుదినములు యుద్ధము చేసి యప్పటికి హరి తనకధిపతియగు సీతాపతియే యని తెలిసికొని యారత్న మును నన్నును హరికి సమర్పించి కృతార్థుఁడయ్యెను. కావున నేను శ్రీకృష్ణసేవచేయుదాసి నైతినని తెలిపి యూరకుండెను. పిదపఁ గాళిందియను కృష్ణపత్ని తనవివాహవృత్తాంతమును దెలుపఁ బూని యిట్లు పలికెను. పాంచాలీ! నేను దన పాదపద్మ స్పర్శనేచ్ఛచేఁ దపస్సుచేయుచుండుట మిత్రుఁడగు నర్జునుని మూలమునఁ దెలిసికొని శ్రీహరి వచ్చి నన్నుఁ బెండ్లియాడెను. కావున నేను శ్రీకృష్ణగృహమార్జని నైతినని తనవార్తం దెలిపి యూరకుండెను. తరువాత భద్రయను హరిభార్య తనవివాహ వార్త నెఱింగించువాంఛ మెయి నిట్లనియెను. మాతండ్రి స్వయంవరవిధి వివాహము నాకుఁ జేయనెంచి యద్దాని నడ పెను. ఏందఱో భూపాలకు లరుదెంచిరి. శునకసంతతి చుట్టు కొన్నట్లు రాజులు నన్నుఁ బుట్టుకొనిరి. శ్రీహరి సింహమువలెఁ బ్రతాపము మెఱయ నరుదెంచి నాభ్రాతలడ్డుపడినను లెక్కింపక వారినశ్రమంబున నోడించి నన్నుంగొని వచ్చి యుచితరీతిఁ

బెండ్లియాడెను. అట్టిపరమేశ్వరునిపాదపద్మముల నభిషేకించు నదృష్టము నాకుంగలుగుఁ గాక యని కోరుచు నిందున్నదాన నని తనభక్తిభావము నెఱింగించి యూరకుండెను. అంత సత్య యనుపేరుగల కౌసల్య తనవృత్తాంతమును దెలుపం బూని యిట్లు పలికెను. మాతండ్రి రాజులపరాక్రమ మెట్టిదో తెలి యంగోరి దుర్దాంతవిక్రమనుగలిగి చూడ భయంకరములగు నేడువృషభముల నిగ్రహించుటయే శుల్కముగాఁ బెట్టెను. రాజులెవ్వరు నావృషభములం గెలువఁజాలక పోయిరి. శ్రీ హరి మృగేంద్రము మేఁకపిల్లల జయించునట్లు లీలామాత్ర మున వానిని గ్రహించి వీర్యశుల్కనగు నన్ను నాసీజనము తోడను జతురంగసైన్యములతోడను దీసికొని మార్గము నడుమ నడ్డగించురాజన్యుల నోడించి కొనితెచ్చెను. అట్టి పర మేశ్వరుదాస్యము నాకు లభించుఁ గాక యని తెల్పి యూర కుండెను. ఆమీఁద మిత్రవిందయను హరిపత్ని ద్రౌపది కిట్లు తనవృత్తాంతమును దెల్పెను. మాతండ్రి నాకు వివాహము చేయఁగోరి చిన్ననాఁటినుండి నామది శ్రీకృష్ణునియందె యను రాగనుగలదని భావించి తనమేనమామకుమారుఁడగు శ్రీకృ ష్ణునిం బిలువఁబంపి బెండ్లియాడుమని ప్రార్థించి నన్ను నొకయ క్షౌహిణిదాసీజనము నొసంగి పంపెను. ఈసంసారసాగరమునఁ బ్రాగ్జన్మకర్మవశమునః బరిభ్రమించునాకు సకలవిధశ్రేయో మూలంబైన శ్రీకృష్ణపాదారవిందసంస్పర్శ మెల్లజన్మంబులయం దును గలుగుంగాక యని పలికెను. తర్వాత లక్ష్మణయను హరిపత్ని ద్రౌపదికిట్లు తనవివాహవార్తలఁ దెల్పెను.

పాంచాలీ! నారదమహాముని కృష్ణమూర్తిపుట్టుకను మహాద్భుతకార్యముల నెఱింగించెను. దానిచే నాకాపురుషోత్తమునిం బెండ్లియాడవలయునని యు శ్రీదేవియే కోరిపెండ్లియాడెను గదా. నేనుగోరుట తప్పుగాదని తలంచియుం గోరితిని. దిక్పాలకులంగూడం గోరక హరినే వాంఛించితిని. నాతండ్రికి నాయందుం బ్రీతిమెండు. గారాబమునం బెంచెను. బృహత్సేనుఁడని మాతండ్రి పేరు. శ్రీకృష్ణుఁ డల్లుఁడగు నని సంతోషించుచుండును. మీతండ్రియర్జునుఁడు తన కల్లుఁడు కావలయునని కోరెను గదా. అట్లే నాతండ్రియుఁ గోరెను. అంత స్వయంవరము సాటించెను. మత్స్యయంత్రమును నిర్మించెను. అదియే శుల్కము. నీపెండ్లినాఁటి మత్స్యయంత్రము వెలుపలఁ గన్పట్టుచుండెను. మాతండ్రి యేర్పఱచినవి లోపలను వెలుపలనుం గూడఁ గానరాక క్రిందనున్న కలశజలములయందే ప్రతిఫలించుచుండెను. ఇది య యా రెండింటికిం గలభేదము. ఆవార్త నాలకించి రాజకుమారవీరులెల్ల నొకపెట్టున వచ్చిరి. దానిం బరికించిరి. మాతండ్రి యొనరించునద్భుతసత్కారములం బడసిరి. కాని దానిఁదెగవ్రేయం బూని యాచోటున నుంచిన కోదండమును దీసికొని యెక్కుపెట్టం గూడ సమర్థులు కాకపోయిరి. కొందఱు రాజకుమారులు మాత్రము వింటికొసదనుక నారినెక్కుపెట్టి దానిని బిదప బిగియునట్లు బంధింపఁ జాలక యది చివ్వునఁ దగులగాఁ జిన్నఁ బోయి మరలి తమ పీఠములయం దలంకరించిరి. అవంతి మాగధ చేదిదేశాధిపతులు దుర్యోధనుఁడు భీముఁడు కర్ణుఁడు విల్లునెక్కుపెట్టిరి. చేతఁ బట్టుకొనఁ జాలిరి. కాని గుఱిని బరికింపఁజాలక మరలిరి. అర్జు

నుండుమాత్రము కలశోదకమునం గలవాని ప్రతిబింబమును దిలకించి ధనుస్సున బాణంబును గూర్చి ప్రయోగించెను. ఆశరము దాని భేదింపం జాలక యవిసి పడియెను. ఈరీతి మర్యాదయే ధనముగాంగల రాజకుమారులెల్ల దర్పభంగముకాంగా మరలిపోయిన నింకవచ్చువారు లేరని యోజించి శ్రీకృష్ణుండు దానరుదెంచి చాపమున బాణముసంధించి యొకసారియే కలశజలములందు దాని ప్రతిబింబమును దిలకించి దృష్టినారసి విలాసముగా దాని భూమిం బడనేసెను. అప్పు డభిజిన్ముహూర్తముండెను. ఆవిచిత్రకార్యమునకు దేవత లచ్చెరువంది పూలవానం గురియించిరి. అత్తఱినే నభ్యంగస్నానమాచరించి దుకూలాంబరములం దాల్చి సర్వాలంకారశోభితనై యుంటిని గావున మణిహారమును గరంబునం గైకొని శ్రీహరికంఠమున నానందాంబుధి నోలలాడుచు వైచితిని. మంగళవాద్యములు మ్రోసెను.

ఆమహోత్సవమును గాంచి యోర్వంజాలక రాజకుమారులు కొందఱు రణముచేయం బూనుట యెఱింగి యత్తఱిణమున దారుకుండు సిద్ధముచేసి తెచ్చినరథమున నన్నుం గూరుచుండబెట్టుకొని యుద్ధముచేయువాంఛల మార్గమున కడ్డముగా నున్న రాజుల మార్కొని దివ్యబాణంబులు ప్రయోగింపం గొందఱు వికలాంగులైరి. మిగిలినవారు సింహకిశోరమును గని పాఱిపోవు శునకముల చందనమునం గాలికి బుద్ధిచెప్పిరి. ద్వారకానగరమును బ్రవేశించెను. మాతండ్రియుం గన్యాదానము చేయ సర్వపదార్థములం గైకొని వచ్చి శ్రీహరికి సమర్పించెను. మేమెల్ల నాత్మారాముండగు హరికి గృ

హాదాసికల మైతిమి. పూర్వజన్మతపఃఫల మిదియే యని తలంచితిమి. అని యిట్లు తనవివాహవృత్తాంతమును లక్షణాదేవి తెలుపఁగా విని పదాఱువేల భార్య లిట్లు పల్కిరి. ద్రుపదాత్మజా! నరకాసురుఁడు రాజన్యులం గెల్చి మమ్మెల్లఁ జెరఁబెట్టెను. ఆపాపాత్ముని గెల్చి యందుఁ బరితపించు మమ్మెల్లఁదనపాదభజనము గోరువారమని యెఱిఁగి మాచెఱఁ దప్పించి మాప్రార్థనమును విని పెండ్లియాడెను. సాధ్వీమణీ! మేమెల్ల సామ్రాజ్యమును గాని స్వారాజ్యమును గాని భోజ్యమును గాని వైరాజ్యమును గాని బ్రహ్మపదమునుగాని సాలోక్యసారూప్యాదులం గాని ముక్తిని గాని గోరము. మఱియేమన శ్రీపరమేశ్వరుఁడగు హరిచరణారవిందపరాగమును గోరుదుము. గోపికలును బృందావన తృణలతలును గోవుల నెల్లవేళ రక్షించుఁ గోపాలకులును నెట్లుగోరుదురో మేమునట్లే కోరుదుము. అనిపలుకుచున్న వారిపలుకులఁ గుంతియు గాంధారియు ద్రౌపదియు సుభద్రయు మఱియు నచ్చటం గూడియున్న రాజభార్యలు గోపికలును విని సర్వేశ్వరుఁడు సర్వసాక్షి సర్వాత్ముఁడు నగుహరిపైన వారికింగలప్రేమమును దలంచి యానందబాష్పములు నయనములనిండి యుండఁగా నద్భుతం బందిరి.

మహాత్ములారా! ఈకథయందొక్క విచిత్రసారము కలదు. గ్రహణస్నానాదులు ముగిసినపిదపఁ దృష్టిమీఱఁ దిని కూరుచుండి యిష్టకథాలాపములఁ బ్రొద్దుపుచ్చుచుండఁగా స్త్రీలంద ఱొక్కచోటం గూడి యుండిరి. ద్రౌపదియందు శ్రీహరిభార్యలనెల్లం గాంచి మీమీ వివాహవృత్తాంతములఁ

జెప్పుఁడని యడిగెను. అష్టభార్యలు తమతమ వివాహవృత్తాంతములఁ జెప్పి హరియందుఁ దమకుఁ గలభక్త్యనురాగములం గూడ వెలిబుచ్చిరి. వారు గాక పదాఱువేలభార్యలు గలరు. వారుగోపికలనుకొందురేమో, కారు. నరకాసురుఁ డెల్లరాజుల జయించి రాజకన్యకలఁ జెఱఁబెట్టెను వారెల్ల శ్రీహరిం దలంచు చుండిరి. వానివధించి వారిచెఱవిడిపించి వారు కాంక్షింపఁ బెండ్లియాడెను. ఆకన్యకలే పదాఱువేలభార్యలను ప్రఖ్యాతిం గాంచినవారు. వారును దమవృత్తాంతమును దెల్పిరి. ఇంతదనుక విశేషమేమియులేదు గాని యీప్రస్తావమున నొక్కసారాంశ ముకలదు.

శ్లో. "వ్రజస్త్రియోయద్వాంఛంతి పుళింద్యస్తృణవీరుధః,
గావశ్చారయతోగోపాః పాదస్పర్శం మహాత్మనః."

గోపికలు వ్యభిచారిణులు. శ్రీకృష్ణుఁడు జారుఁడని వాదించుమహాత్ముల కిది మంచి ప్రాయశ్చిత్తము. గోపికలే శ్రీహరి పాదస్పర్శమును గోరుదురో గోపాలకులే మహాత్ముని పాదస్పర్శముం గోరుదురో అదియే మేమును గోరుదుమనిరి. గోపికలు భగవంతుని పాదారవిందభజనమును గోరువారే కాని హరితోటి గ్రామ్యసుఖమును గోరరనియు వారుకులటలు గారనియు దీనిచే విస్పష్టమగుచున్నది. ఈపట్టునఁ గల శ్లోకములకుఁ బద్యములు వ్రాయక మహాకవి పోతన మెల్లగా వానిని వదలెను. కారణమేమో తెలియరాకున్నది. శృంగారరసము లేదని కాఁబోలును. ఐన నామహాత్ముని మనోభావ మెఱుంగఁదరమా. ఈయొక్క విషయమే యిందుఁగల సారము. భక్తిపరతంత్రులు

గాని కులటలుగారని భాగవతమున స్పష్టముగాఁ గలదని యెఱుంగుటయే మంచిది. ఇంకఁ దదుపాతి కథను వ్రాసెదను.

—శ్రీకృష్ణుని దర్శింప మహర్షు లరుదెంచుట.—

*శ్రీహరియు బలదేవుండు నీలాగున బంధువులంగూడి హాయిగా నుండఁగా శ్రీపరాత్పరుని దర్శింపఁగోరిరి, ద్వైపాయన నారదులు, చ్యవన, దేవ,లాసిత, విశ్వామిత్ర, శతానంద, భరద్వాజ, గౌతములు, రాముఁడు తచ్ఛిష్యులు, వసిష్ఠ గాలవులు, భృగు, పులస్త్య, పులహులు, అత్రి, మార్కండేయ, బృహస్పతులు, ద్విత త్రితైకతులు, బ్రహ్మపుత్రుఁడగు నంగిరసుఁడు, నగస్త్య యాజ్ఞ్యవల్క్య వామదేవులు లోనగు మహర్షులెల్ల నరుదెంచిరి. వారి రాక నెఱింగి యందుఁ గూరుచున్న రాజులందఱును వొలుత లేచిరి, పాండవులు శ్రీకృష్ణబలరాములు లేచి విశ్వవందితులు గావున వారికి నమస్కరించిరి. రామునింగూడి శ్రీహరి వారి నెల్ల యథావిధిఁ బూజించెను. స్వాగతమడిగి యాసనార్ఘ్య మాల్యధూపాను లేపన ప్రముఖసపర్యలొనర్చి ధర్మమునురక్షింప నవతరించినవాఁడు గాన సభ్యులెల్లరు వినుచుండ నిట్లుపలికెను. లోకమున జన్మించినందులకు ఫలము యోగేశ్వరదర్శనము లభించుటయే కదా. అది దేవతులకుఁగూడ దుర్లభము. అట్టి మహాఫలము పుణ్యవశమున మాకు సంపూర్ణముగ లభించినది.

---

*ఈకథ శ్రీభాగవతదశమస్కంధమున నెనుబదినాల్గవ యధ్యాయము నుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగవలయు.

ఓహో! ఏమి మాపుణ్యము! *మృణ్మయాదివిగ్రహములపై దేవతాబుద్ధిగలిగి స్వల్పతపము చేయుమానవులకు మిమ్ముదర్శించుట మీపాదముల స్పృశించుట కుశలంబడుగుట, వినయమున నమస్కరించుట పాదములు తలఁదాకునట్లు వందనమాచరించుట లోనగు మహత్తరపుణ్యకార్యములు లభించునా. మఱియుఁ జక్కఁగా నాలోచించిచూచిన జలమయములు తీర్థములనరాదు. మృత్తుచే, పాషాణములచేఁ జేయఁబడువిగ్రహములు దేవతలుగావు. మఱేమనఁగా నవి చిరకాలమునకు మానవునిఁ బవిత్రునిగాఁ జేయఁగలవు. సాధువులట్లుగాదు. దర్శనమాత్రమున ననుగ్రహాతిశయమునఁ బవిత్రునిగాఁజేయుదురు. అగ్నియు, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు, భూమియు జలమును, ఆకాశము, వాయువు, వాక్కు మనస్సు ననునివి భేదజ్ఞానకారణములు కావున వాని నుపాసించినను భేదమూలం బగు నజ్ఞానమును బోఁగొట్టఁజాలవు. మహాత్ము లట్లుగాక దర్శనమును జేసినంతనే ముహూర్తము సేవించినంత నాయజ్ఞానమును బోఁగొట్టి జ్ఞానమును గల్గించుట యనునది విశ్వవిదితముగాని రహస్యముకాదు. వాతపిత్తశ్లేష్మ ప్రకృతికంబగునవియుఁ జావనుండునదియు నగు దేహముమీఁద నాత్మబుద్ధియుఁ గళత్రములో

---

*కిం స్వల్పత తపసాం నౄణామర్చాయాం దేవచక్షుషామ్, దర్శనస్పర్శన ప్రశ్నప్రహ్వపాదార్చ నాదికమ్. న హ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః, తే పునంత్యురు కాలేన దర్శనాదేవ సాధవః. నాగ్నిర్న సూర్యో న చ చంద్ర తారకా న భూర్జలం ఖం శ్వసనోఽథ వాఙ్మనః, ఉపాసితా భేదకృతో హరంత్యఘం విపశ్చితో ఘ్నంతి ముహూర్తసేవయా. అని మూలము.

నగువారిమీఁద నాత్మబుద్ధియు, మృత్తుచేతను బాషాణముల చేతను జేయంబడు విగ్రహములపై దేవతాబుద్ధియు, జలనుల పైన దీర్థబుద్ధియు నునిచి సర్వము నెఱింగినపెద్దలపై నట్టిబుద్ధి నునుపనివాఁడు పశువులలో గర్ధభంబని పలికిన విని యామును లామహానుభావుఁడగు శౌరిమాటల విని యవి యాపరాత్పరు నకుం దగినవే యని తలంచి యించుక యాలోచించి లోకసం రక్షణార్థము లోకులకు నుపదేశించునిమిత్త మీశ్వరుఁ డిట్లే పలుకునని మనముల జక్కఁగా నాలోచించి స్మితము మోములఁ జెలువారుచుండ లోకములకెల్ల గురువగు నాశ్రీకృష్ణున కిట్లు బదులు పల్కిరి.

పరమేశ్వరా! బ్రహ్మాండకర్తవు. తత్త్వవేత్తలలో నుత్తమోత్తముఁడవు. ఇట్టి నిన్ను నీమాయకు మోసపోయి మేమెల్ల మానుషదేహమున మహిమము గనఁబడకుండ సామాన్యమానవునివలెఁ గనంబడు నిన్నెఱుంగఁ జాలకున్న వారము. నీ విచిత్రప్రవర్తన మిట్టిదని యెఱుంగదరమా. ఘటా దివికారములయందు భూమి నానారూపనామములఁ గాంచి నట్లు నీవుఖూడ నిరీహుండవయ్యును, అద్వితీయుఁడవయ్యు నాత్మేచ్ఛచేత ననేకనామములు ననేకరూపములు కలుగఁగా నీబ్రహ్మాండములనెల్లఁ బుట్టించుచుఁ జక్కఁగాఁ బాలించుచుఁ దగువేళల వానికి లయము గలుగంజేయుచు నందు సంబంధ మును మాత్రము గల్గించుకొనక యుందువు. ఇదియే విచి త్రము. నిరంతరపరిపూర్ణుఁడవైన నీకు నీజన్మనామలు విలాసమాత్రమేకాని వేఱుగాదు. పరమపూరుషుఁడవైన నీవు

*విలాసమాత్రమగు లీలాయోగమున భక్తులను రక్షించు నిమిత్తము దుష్టుల శిక్షించునిమిత్తము వర్ణాశ్రమంబు లేర్పడు నట్లు దేహమును ధరించి సనాతనమగు వేదమార్గమునుం గాపాడుదువు. కార్యము కారణము ననువానికిఁ బరమమై సన్మాత్రమైన బ్రహ్మము తపస్స్వాధ్యాయసంయమంబుల నెందుపలబ్ధ మగునో యావేదంబు నీపరిశుద్ధాంతరంగమే యగు. కావున వేదప్రమాణము గలనీకు నుత్తమమగు నుపలబ్ధిస్థానము వేదములఁ బ్రవర్తింపఁజేయునదియు నగుబ్రాహ్మణకులమును బూజింతువు. దానిచేతనే నీవు బ్రహ్మణ్యవరేణ్యుఁడవై కర్మములఁ జేయుదువు. సకల నిశ్శ్రేయోమూలంబై సాధుగతియు నగునీతోడి సమాగమము పొందిన కారణముననే యోపరాత్పరా! నేఁడు మాపుట్టువులకు విద్యకుఁ దపమునకును, జ్ఞానమునకును సాఫల్యము గల్గినది. ఈరాజు లందఱును, విశేషించి యొక్కచోట నిరంతరసహవాసము చేయు యాదవులును, మాయయను తెరలో దాఁగుకొని యున్న కాలస్వరూపుఁడగు నే యీశ్వరుని దెలియఁజాలక యున్నారో యోగమాయచే నిగూఢమగు మహిమముగల పరమాత్మ యగు నీకు నమస్కారము లర్పింతుము.

మఱియు నిద్దురపోవువాఁడు స్వప్నమునందుఁ దన్ను సింహవ్యాఘ్రాది నామరూపములం గని తద్రహితుఁడైన వానిగా నెఱుంగనియట్లు మానవుఁడు నామమాత్రసారము

* అథాపి కాలే స్వజనాభిగుప్తయే బిభర్షి సత్త్వం ఖలనిగ్రహాయ, స్వలీలయా వేదపథం సనాతనం వర్ణాశ్రమాత్మా పురుషః పరో భవాన్. అని మూలము.

లగునింద్రియార్థములం దాసక్తిగలిగి నీమాయకుఁ జిత్తంబు విభ్రాంతి నొందఁగా వివేకములేక నిన్నుఁ బరమాత్మవని గాన లేఁడు. సకలపాపములఁ బోఁగొట్టుటకుఁ బవిత్రతీర్థాశ్రయం బైన నీపాదారవిందమును పరిపక్వమానసము గలయోగులకు ధ్యేయంబని తలంచి నేఁడు దర్శింపఁ గల్గితిమి. అతిశయభక్తిచేతఁ బెద్దలు లింగశరీరమును బాసి భవద్గతిని బొందిరి. కాఁబట్టి నీపాదభక్తుల మగుమమ్ము ననుగ్రహింపుము. అని ప్రార్థించి శ్రీకృష్ణననుమతిం బడసి యుధిష్ఠిరాదుల నిలిపి వారినూఱడించి తమతమయాశ్రమంబుల కామహర్షులు పోవ నిచ్ఛయించిరి.

ఆమహాను లు భగవదనుజ్ఞ నొంది పోవుచుండఁగా సభాంతరముననున్న వసుదేవుఁడు లేచి వారివెంటఁబోయి నమస్కరించి నిర్బంధపూర్వకముగా వారిపాదములుపట్టుకొని యో మహాత్ములారా! మీరు సర్వదేవతాత్మకులరు. కావున మీకు నమస్కరించుచున్నవాఁడను. నాపైఁ గరుణయునిచి యేకర్మము నెట్లుచేసిన నాకర్మనిరాసమగునో ఆయర్థము తేటపడ నానతీయుండని ప్రార్థించెను. వసుదేవుని ప్రార్థనము నంగీకరించి నారదముని యిట్లు పలికెను. బ్రహ్మర్షులారా! ఈవసుదేవుఁడు శ్రీకృష్ణుని దనకుమారునిగాఁ దలంచి తనకుఁ గల్గఁదగుశ్రేయమును దెల్పుఁడని మనలఁ బ్రశ్నించుట యద్భుతము కాదు. మానవులకు సమీపమునఁ గలపదార్థమునం దనాదరణభావ ముండుట సహజము. అదియే యీవసుదేవునకుఁ గల్గెను. జాహ్నవీతీరమున నివసించువాఁడు పరమపావనమగు నా గంగాజలమును మాని యాత్మశుద్ధికై యితరతీర్థములకుం

బోవును. ఇది లోకమునఁ గలయాచారము. కాలముచేతను, లయోత్పత్తి మొదలగువానిచేతను, దనంతను, ఇతరకారణ ములచేతను, గుణముచేతను ఎవ్వాని యాత్మానుభూతి చెడదో అట్టిక్లేశము కర్మము పరిపాకము ననువానిచే నించుకంతయుఁ జెడని యనుభవముగలిగి, యీశ్వరుఁడై, యద్వితీయుఁడై, ఆత్మకార్యములైన ప్రాణాదులయందు మేఘము హిమమునను వానిచేఁ గప్పఁబడు సూర్యునివలెఁ గప్పఁబడిన శ్రీకృష్ణుని మానవునిగా నితరుండు తలంచును.

అని యిట్లు నారదమహాముని పలికిన నావిషయము సత్యమే యని యందుఁ గలమానులందఱు నేకవాక్యముగా నంగీకరించిరి. వెంటనే వసుదేవునిం బిలిచి యందున్న రాజులును, గృష్ణుఁడును బలరాముఁడును వినుచుండ నిట్లు పలికిరి. వసు దేవా! శ్రద్ధమెయి సర్వయజ్ఞముల కధిపతియగు శ్రీమన్మహా విష్ణువును, యజ్ఞముల నారాధించుట యనుసత్కర్మము నొన రించినఁ గర్మనిరాసం బగును. అని సాధుజనులు నిర్ధారణ మొన ర్చిరి. ఇదియే చిత్తశాంతికి హేతువై ముక్తికి నుపాయంబు నగు. మఱియు నాత్మతుష్టికిం గారణంబైన ముఖ్యధర్మంబు నగు. సుఖముగ నాచరింపఁ దగును. అని యిట్లు పెద్దలు శాస్త్రములం బరిశీలించి నిశ్చయించిరి. తనకుఁ బూర్వజన్మవాసనాబలమున లభించిన పరిశుద్ధద్రవ్యముచేఁ గామమునువదలి పట్టుదలతో యజ్ఞేశ్వరు నారాధించుటయే గృహస్థువగుమానవునకు శ్రేయో మార్గము. యజ్ఞముల నాచరించియు దానములిచ్చియు విత్తైష ణానువదలియు గృహోచితభోగములఁ బరిహరించియు దార పుత్త్రైషణను ద్యజించియుస్వర్గాదిలోకప్రాప్తిగల్గుననుచింతను

బరిహరింపవలయును. ఈ ఋణత్రయమును బరిత్యజించి గ్రామములనుగూడ వదలి పూర్వకాలమందు జ్ఞానధనులు తపోవనంబునకుం బోయిరి. దేవర్షి పితరులఋణములు మూఁడుకూడఁ బుట్టగా ద్విజుఁడు పుట్టును. యజ్ఞములుచేసి దేవతలఋణమును దీర్పవలయు. అధ్యయనమున ఋషులఋణమును దీర్పవలయును. పుత్త్రులంగని పితరులఋణమును దీర్పవలయును. వీనిం దీర్పకమును పే సన్న్యాసము దీసికొనినచో నట్టివాఁడు ఋణత్రయభీతుఁడు కావునఁ బతితుఁ డగును. వసుదేవా! ఇప్పటికి నీవు పితరులయు ఋషులయు ఋణమును దీర్చితివి. ఇఁక యజ్ఞములచేత దేవతల సంతృప్తులఁ గావించి వారిఋణమును దీర్చుకొని ఋణము మూఁడింటిని దీర్చినవాఁడ వౌదువు. కావునఁ దర్వాత సన్న్యాసమును గైకొనుము. విశేషించి నీకుఁ దెలుపనేటికి? పూర్వము శ్రీహరి నతిభక్తితో నారాధించితివి కావున మీకిద్దఱకు నామహావిష్ణువు పుత్త్రుఁడై జన్మించెను. అని యనేకవిధంబుల నామహర్షులు హితబోధ గావించిరి.

ఇట్లు లామహర్షులు బోధింపఁగా విని శ్రీహరితండ్రి వసుదేవుఁడు వారిపాదములు తలసోఁకునట్లు నమస్కరించి వారి యనుగ్రహమునకుఁ దాఁ బాత్రుఁడై తాఁ జేయఁబూనిన యజ్ఞముల కన్నునుల ఋత్విజులనుగా నుండుఁడని ప్రార్థించి వారి యంగీకారమును బడసెను. ఆమహర్షు లాకార్యమున కంగీకరించి కేవలపావనము లగుయజ్ఞముల నాతనిచేఁ జేయింపఁ బూని యాక్షేత్ర మత్యుత్తమము కావున నందే యావసుదేవునకు, నాతఁడు పెండ్లియాడిన పదునెనమండ్రుభార్యలకును దీక్షగావింపఁ బూనిరి. ఆ మహాకార్యమునకు యాదవులెల్లరు

సకలసంభారములను సమకట్టి చక్కఁగా నడుపఁబూనిరి. వసుదేవునిభార్యలు పదునెనమండ్రుగురును స్నానమొనరించి ధౌత వస్త్రములఁ దాల్చియలంకరించుకొని పరిమళచందనలిప్తగాత్రలై మంగళవస్తువులను జేతులం బట్టుకొని తోడనడువఁగా వసుదేవుఁడు పయనముసాగింప నాతనిం గూడి యామునులందఱు మృదంగశంఖపటహాది శుభవాద్యధ్వనులు దిగంతరములఁ జెవుడుప్పడం జేయఁగా నృత్యగీతములు సలుపుచుండఁగా భర్తలం గూడి గాయకయువతులు చక్కఁగాఁ బాటలుపాడఁగా సూత వందిమాగధులు సంస్తుతించుచుండఁగా దీక్షామందిరమును బ్రవేశించి విధిప్రకారము నేత్రములకుఁ గాటుకయుఁ దేహమునకు నవనీతలేపనము చేయించి పదునెనమండ్రుభార్యలం గూడిన యావసుదేవునకు భార్యలగు తారలంగూడిన సోమునకుం బలె నభిషేకంబు చేయించిరి. దుకూలములుకట్ట నాజ్ఞాపించిరి. మంచిభూషణములు పెట్టుకొనుఁ డనిరి. అవ్వేల దీక్ష గావించిరి. సదస్యులును ఋత్విజులును నూతనములగు పట్టువస్త్రముల ధరించిరి. వారిం జూడఁగా నింద్రుఁ డశ్వమేధము చేసిననాటి ఋత్విజులమాట స్మృతికి వచ్చుచుండెను.

సర్వజనుల నియమించునట్టి రామకృష్ణులు పుత్త్రులును భార్యలును దమవలె నలంకృతులు కాఁగా సర్వాభరణాలంకృతులై యుండిరి. వసుదేవుండును బరమబ్రహ్మర్షులార్త్విజ్యంబు నిర్వహింపఁ బూనఁగా నత్యుత్తమవిధానమునం బూనికమీఱఁగా నగ్నిహోత్రజ్యోతిష్టోమదర్శపూర్ణమాసాదులైన ప్రకృతియజ్ఞముల నొనరించెను. సౌర్యసత్త్రాదికంబులైన వికృతి యజ్ఞములను ద్రవ్యమంత్రతంత్రములకు నీశ్వరుండగు యజ్ఞ

పురుషుని భక్తిమెయిఁ బ్రతియాగమునందును ఆరాధించి ఋత్విజులకు శాస్త్రమునఁ జెప్పఁబడినయట్లు చక్కఁగా నలంకరించి దక్షిణలిచ్చి గోభూమికన్యకల నిచ్చి సంతుష్టమతులం గావించెను. అంత నాఋత్విజులు పత్నీసంయాజావభృథంబు విధానంబున నడిపి రామహ్రదంబున యజమానుం గూడి యవభృథస్నానంబు సలిపిరి. వసుదేవుం డట్టు లవభృథస్నానంబు చేసి వందిమాగధాదులకు వస్త్రాలంకారముల నొసంగి యజ్ఞముఁ జూడవచ్చినజనులకు నెల్లరకు మంచియలంకారములు మృష్టాన్నముఁ దృప్తిమీఱఁబెట్టి నానాదేశాగతులగు బాంధవులను వారిభార్యలను దత్పుత్రులను సదస్యులను ఋత్విజులను దేవతలను మానవులను భూతపితృచారణులను వారివారికిం దగినయట్లు మంచి పారితోషికముల నిచ్చి సత్కారములం దన్పిన వారెల్ల శ్రీహరిని దలంచుచుఁ బాడుచుఁ గ్రతువులను మెచ్చుకొనుచుం బోయిరి.

ధృతరాష్ట్రుండు, విదురుఁడు, పాండవులు, కుంతి, భీష్మద్రోణులు లోనగువారును మఱియు మిగిలిన సుహృద్బాంధవులును యాదవులయాదృతికి మెచ్చుకొనుచుఁ గౌఁగిలించుకొనుచు స్నేహము వదలిపోవనొల్లక యెట్లో పోయిరి. ఈ రీతిగా నాకురుక్షేత్రమున మహోత్సవము సాగెను. అంత నారదాదిమహర్షులు యాదవవీరులనెల్ల వీడ్కొని హరియనుమతినొంది తమతమ యిచ్చవచ్చినతావుల కరిగిరి. శ్రీకృష్ణమూర్తియు బలదేవుఁడు నుగ్రసేనాది యాదవవర్యులు నాదరింపఁగా నందుఁ డాచోటఁ గొన్నిదినములుండి బంధువాత్సల్యము నెఱపుచు నుండెను. వసుదేవుఁడు తనవాంఛితము

చక్కఁగా నెఱవేఱుటయు సుహృదులంగూడి యానందించు చుండి యొక్కనాఁడు మహాదరంబున నందగోపాలకుని చేయి పట్టుకొని యిట్లు భాషించెను. అన్నా! భగవంతుఁ డేర్పఱచిన స్నేహపాశము శూరులకుఁగాని యోగులకుఁగాని విడువ రాదని యూహించెదను. కృతజ్ఞులముకాని మామీఁద నుత్త మోత్తము లనందగుమీ రునిచిన యసమానమైత్రి బదులు చేయ శక్యముగానిదైనను శాశ్వతముగా నుండునది. పూర్వము మే మసమర్థులమై మీకు మేలుచేయఁ బూనమైతిమి. ఇత్తఱి నన్నో సంపద్గర్వమునఁ గన్నుఁగానక మీ రొనరించినమేలు మఱతుము. సన్మార్గప్రవర్తకు లగుసాధువులను స్వకీయజనులను బరికింపని రాజ్యసంపదలు శ్రేయస్సుల నాకాంక్షించువారలకుఁ దగవనిపలికి మైత్రి పెంపునఁ జిత్తము వెలవెల పోవుచుండఁగా నాగోపాలుఁడు తనకుఁ జేసినమహోపకారమును దలంచు కొనుచు నానందబాష్పములు నిండిననయనములు కలిగి సగౌర వంబుగా నాతనిం బూజించెను.

నందుఁడును వసుదేవరామకృష్ణులకును బ్రియంబుగాఁ బలుకుచుఁ బ్రతిదినమును బ్రయాణముచేసి వదలఁజాలక నిలుపుచు వారు వలదనుచుండ నాదినము ప్రయాణము మానుచు దినదినము నిట్లుగడుప మూఁడునెలలు గడచెను. ఆ మూఁడునెలలు వారితోడనుండుటయుఁ బ్రతిదినము వారు తన్నాదరింపఁగా ముదమందుటయుఁ జిన్ననాఁడు శ్రీకృష్ణుని గూడియుండిన యానందమును మరల వచ్చెను. ఎట్టకేలకు వసుదేవోగ్రసేనులు రామకృష్ణులు పయనముచేయ సమ్మతించి వస్త్రముల నాభరణముల నీయఁగ నవిగ్రహించి గర్గమహాముని

యుపదేశించిననాఁటినుండి శ్రీకృష్ణపాదారవిందములకడఁ దగిలినచిత్తమును మరిలింప సమర్థుఁడు కాక *తనవలెనె భగవత్పాద భక్తిపరవశ లగుగోపికలం గూడి మధురానగరమునకుం బోయెను. బంధుజనులెల్లఁ గురుక్షేత్రమునుండి మరలి తమ తమనగరముల కరుగఁగా వృష్టికాలము సమీపించెనని యెఱింగి యాదవులు హరింగూడి ద్వారకానగరమున కరిగి యందున్న వారలకెల్ల నా తీర్థయాత్రయందు సాగినవిచిత్రములను వసుదేవుఁడు యజ్ఞములుచేయుటయు బంధువులయాగమనమును దెల్పి తక్కినకథలను దెల్పిరి. వారెల్ల నాసువార్తల నాలకించి పరమానందమందిరి.

మహాశయులారా! ఈకథయందుఁ గలసారము మానవుఁడు బ్రహ్మాయాజ్ఞ ననుసరించి దేవర్షి పితౄణములను దీర్చి కాని సంసారము మానరాదనియు నది లోకాచారమునకు విరుద్ధమనియుఁ గ్రమముగా లోకమునకుఁ గావలసిన శాస్త్ర కల్పితము లగునాచారముల సాగించి లోకులకుఁ దనప్రవృత్తిచే నుపదేశించు చుండవలయుననియుఁ గడపట సంసారమును త్యజింపవలయుననియు సారమని యెఱుంగవలయు. గోపికలు నందునివలెనే భగవద్భక్తినిర్భరస్వాంతలేగాని పుంశ్చలులు కారని యీకథనుండియు నెఱుంగందగును. ఇట్టు లీకథ మనకు సదాచారమును బోధించుచు ముక్తిగాంచుపద్ధతిని బోధించుచున్నది. కావున నీ సారమెఱింగి తద్రీతి నాచరించుటకు జతనముచేయవలయును.

---

* నందోగోప్యశ్చ గోపాశ్చ గోవిందచరణాంబుజే, మనఃక్షిప్తం పునర్హర్తు మనీశా మధురాం యయుః. అని మూలము.

## శ్రీకృష్ణుఁడు వసుదేవునకు జ్ఞానోపదేశము చేయుట.

*ద్వారకానగరమున శ్రీహరి బలదేవుఁడును వసుదేవాదులంగూడి కొంతకాల మూరకయుండిరి. చేయఁదగినకార్యమున కింకను సమయము రాకుండుటయే యని వారియాలోచనము. కొంతకాలము లోకాచారము ననుసరించి పుత్త్రపౌత్త్రులతోఁ గాలము గడుపుచుండిరి. ఒక్కనాఁ డక్కమలాక్షుఁడు బలరామునిం గూడిచని వసుదేవునిపాదముల పయింబడి నమస్కరించెను. వారినిరువురను లేవనెత్తి యాశీర్వదించి మహర్షులు తత్ప్రభావమును దెలుపుమాటలుగా నుపదేశించియున్నదాని నపుడు స్మరించి వానిని సత్యములని నమ్మి యిట్లనియె. శ్రీకృష్ణా! శ్రీకృష్ణా! మహాయోగీశ్వరా! సంకర్షణా! సనాతనా! మీరలిర్వురిజగంబులకుఁ బ్రధానపూరుషులని యే నెఱుంగుదు. అని పలికి శ్రీకృష్ణునిం జేర్కొని యిట్లు పలికెను. అచ్యుతా! ఈజగం బేమహనీయునియందున్నదో, ఎవ్వనిచే నిర్మింపఁబడినదో, ఎవ్వనిసాధనత్వమున వెలసినదో, ఎవ్వాని వలన వృద్ధియగుచున్నదో, ఎవ్వనికొఱకిదికల్పితమో, ఎవ్వనిదై యున్నదో, ఏకర్మముకలదిగా నెట్టిదై యేర్పడినదో అట్టి యీజగమునకుఁ గారణభూతుఁడవై, భోక్తయని భోగ్యమని నియమించి, యలరునీశ్వరుఁడవు నీవే. ఈవిధముగా నానావిధ ప్రపంచముల నిర్మించి యాత్మాభిలాషమున నద్దానిం బ్రవేశించి క్రియాజ్ఞానశక్తులరూపమున దానిని భరించువాఁడవు నీవే. ప్రపంచము నుద్భవిల్లఁజేయు ప్రకృతి లోనగువాని శక్తు

* ఈకథ శ్రీభాగవతదశమస్కంధమున నెనుబదియైదవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని గ్రహింపవలయును.

లన్నియుఁ బరతంత్రతయు నొండొంటి కవి సదృశములు గాకుండుటయుఁ గారణములుగా నాత్మశక్తులే యయ్యెడిని. ప్రకృతిమొదలగువాని వ్యాపారమంతయుఁ జేష్టామాత్రంబు గాని శక్తిగాదు. చంద్రునికాంతియు, నగ్నిహోత్రునితేజస్సు, సూర్యునిప్రభయు నక్షత్రములయు మెఱపుఁదీఁగెలయుఁ బ్రకాశము, పర్వతములస్థిరత్వము, భూమి యాధారత్వము గంధవత్వము, జలములయొక్క తర్పణప్రాణనంబులు, ఆజలంబులురసంబు వాయువు బలాదిగతులు, దిక్కులు వానియవకాశము, లాకాశము తదాశ్రయం బగుస్ఫోటము, నాదము, వర్ణము, ఓంకారము, ఆకృతి పృథక్కరణంబైన వైఖరియు, నింద్రియముల విషయప్రకాశశక్తులు తదధిష్ఠాతృదేవతలు, తదధిష్ఠానశక్తియు, బుద్ధిధర్మములనఁదనరారు వ్యవసాయప్రతిసంధానశక్తులు, భూతకారణంబగు తామసాహంకారము, నింద్రియకారణంబగు రాజసాహంకారము దేవకారణం బనఁదగు సాత్వికాహంకారము మఱియు జీవసంసారకారణంబైన ప్రధానమును, నీవే యని నమ్ముచున్నాఁడను. ఘటము, కటకకుండలాదులుగాఁ గనంబడు వికారద్రవ్యములు నశించినను మృత్తిక బంగారు మొదలగు ప్రకృతి ద్రవ్యము నిత్యమై యుండునట్లు నీభావములన్నియు నశించినను నీవుమాత్రము శాశ్వతుఁడవుగా నుండుదువు.సత్వరజస్తమస్సులను త్రిగుణములు తద్వృత్తులును, పరబ్రహ్మస్వరూపుఁడవగు నీయందు యోగమాయచేఁ గల్పింపఁబడినవి. కాఁబట్టి నీభావములు మిథ్యాభూతములయ్యు వికల్పంబులయి నీలోపలఁ బ్రతీతిమాత్రముగఁదోఁచుచుండును. నీవును వీనిలోఁ గారణత్వమున ననుగతుఁడవై యుందువు. అంతియ

కాని పరమార్థదృష్టి నవలోకింపఁగా నిర్వికల్పుండవగు నీవే శేషింతువు. నిష్ప్రపంచంబైన యిట్టి సూక్ష్మగతి నెఱుంగకయే మూర్ఖులు కర్మములను గుణప్రవాహమున సంస్మరింతురు. యాదృచ్ఛికముగా దుర్లభంబైన కార్యసాధనమగు మానవ జన్మము నెత్తియు నీమాయవలన నాత్మార్థవిషయమున నేమఱి యిన్నియేండ్లు వ్యర్థముగఁ గడపితిని. వీఁడు నేను నాది యనెడు దేహసంబంధ పుత్త్రాదివిషయకస్నేహపాశములచే నీవే యీజగంబు నెల్ల బంధింతువు.

ఈభూమిభారమును దొలఁగింప నవతరించినమీరిరువురు ప్రధానపురుషేశ్వరులుగాని నాసుతులుగారు అని నీవ చెప్పితివి. ఆర్తత్రాణపరాయణా! ఆపన్నులకు సంసారభూరిభయమును దొలఁగించు నీపాదాంభోరుహములను నేనాశ్రయించితిని. ఈదేహముపై నాత్మబుద్ధియు, నీపైఁ బుత్త్రబుద్ధియు, నునుచుకొని యింతకాలము నేఁజేసిన విషయతృష్ణచాలును. చాలును. శ్రీహరీ! చాలుఁజాలు. ఆత్మధర్మరక్షణార్థము ప్రతియుగంబునను మాకుఁ గుమారుఁడవుగా జన్మించినట్లు నీవే ఆనాఁడు పురుటింటిలోఁ దెలియఁ జెప్పితివి కదా. ఆకాశమువలె నిర్లిప్తుఁడవై కార్యార్థము నానాదేహముల ధరించుచుఁ గార్యము ముగిసినవెనుక వానిని వదలుచునుందువు. సర్వస్థలములయందు వ్యాపించి యున్న నీయైశ్వర్యమాయను దెలియ నెవ్వాఁడు సమర్థుఁడగును? అని యిట్లనేకప్రకారములుగా వసుదేవుఁడు పలుకుటయు నాతండ్రిమాటలు విని శ్రీకృష్ణపరబ్రహ్మము వినయవినమ్రుఁడై సుస్మితవక్త్రుఁడై తండ్రింగాంచి మృదువాక్కుల నిట్లు హితమును దెలిపెను.

ప్రియజనకా! పుత్త్రులమగు మమ్మింతపెద్దచేసి తత్త్వార్థ రహస్యముల నుపదేశించిన మీవచనములు సమంజసములు, న్యాయసమ్మతములు నగు. మీరు నేను మాయన్నయు నీద్వారకానివాసులును మఱియుఁ జరాచరాత్మకప్రపంచం బంతయుఁ బరబ్రహ్మమే యని నిశ్చయింప వలయును. పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనుపంచభూతనులు భౌతికపదార్థంబులయం దెట్లుండునో యారీతిగా నద్వితీయుఁడు స్వప్రకాశుఁడు నిత్యుఁడు నిర్గుణుఁడు నిరంజనుఁడు నగునాపరమాత్మ యాత్మచేఁ గల్పింపఁబడిన గుణములచేతఁ దత్కృతములగు తనువులయందు ననేకప్రకారములుగాఁ దోఁచుచుండు మఱియు నావిర్భవించుట, కనఁబడకుండుట, అల్పమగుట గొప్పగాఁదోఁచుట యేకమగుట నానావిధములగుట అను వీనింగాంచును. కావున నదియే తత్త్వమని యెఱుంగుము. అని యిట్లు నానాప్రకారములుగాఁ బరాత్పరుఁడగు శ్రీకృష్ణుఁడు బోధించినఁ జక్కఁగా విని వసుదేవుఁడు *భేదబుద్ధిని వదలి మహానందసాంద్రచేతస్కుఁడై మిన్నక యుండె.

భక్తవరులారా! జనకునకుఁ గుమారుఁడు తత్త్వముపదేశించుట, తండ్రి సుతునిగొనియాడుట యనునీవిషయములు గల యీదివ్యకథం జదివితిరి. పుత్త్రకళత్త్రాది భేదబుద్ధి ప్రపంచము మిథ్య కాదు, స్థిరముగా నుండునదియే యని తోఁచునంతవఱకే యని యెఱుంగవలయును. ప్రపంచము శాశ్వతము కాదని బ్రహ్మమొక్కఁడు శాశ్వతుఁడని తెలిసినతర్వాత భేద

*ఏవం భగవతా రాజన్వసుదేవఉదాహృతమ్, శ్రుత్వా వినష్టనానాధీస్తూష్ణీం ప్రీతమనా అభూత్. అనిమూలము.

బుద్ధియుండదు. ఇట్టులుండఁగా నిఁక దేవతాభేదములఁ బాటించుట యెట్లో తోఁపకున్నది. సర్వము భగవత్స్వరూపమని తెలిసినపుడు పరతత్త్వము జ్ఞేయమని యెఱింగినపు డది యేకమని నిశ్చయమైనపుడు దేవతాభేదవాదము లేటికో తెలియరాకున్నది. ఊరకూరక తిని కూరుచుండఁజాలక యీవాదము పేరిట దుష్కాలక్షేపము చేసినట్లుగాక మఱేమగును? అంతియ కాక యీవాదమూలమునఁ బాపమునార్జించినట్లుగూడ నగును. కావున నిట్టివాదములమూలమునఁ గావలయునని పాపమునార్జించుకొనక భగవంతుఁడొక్కఁడైనను నానావిధకర్మములచే నానారూపభేదముల నావిర్భవించినభక్తులకొఱ కనేకరూపములుగాఁదోఁచునని నిశ్చయించి యారూపమునం దేరూపము నాశ్రయించి నిష్కల్మషభక్తి నారాధించినను గృతార్థుఁ డగునని నమ్మి యట్లు చేయఁ బ్రయత్నింపవలయునే గాని వ్యర్థముగా లేని పోని వాదములకుం బూని భగవంతుని దూషించి యదేమో గొప్పకార్యమని భావించి పరమపురుషార్థమునకు భంగపాటు దెచ్చుకొనక పరమేశ్వరుని యర్చారూపముల నెద్దానియందు భక్తి యెవ్వరికెట్లు కుదురునో దాని నట్టులారాధించి విధివిహితముగా స్మరించి కృతార్థులు కావలయును. ఇంతకంటె దీనింగూర్చి పెంచివ్రాయక తరువాతిదగు భగవద్దివ్యకథావిశేషముల వ్రాయఁబూనెదను. భక్తులందఱు దానిం జదివి సత్కాలక్షేపము చేసితి మనుసంతోషమును గాంతురుగాక.

### దేవకీదేవికి మృతపుత్త్రులం దెచ్చి రామకృష్ణులు కనఁబఱచుట.

మరల యథాపూర్వముగా ద్వారకాపురమున శ్రీహరి సంతోషముగాఁ గాలమును గడపుచుండెను. ఒక్కనాఁడు

సర్వదేవతాత్మకయగు దేవకీదేవి తనకుమారులు రామకృష్ణులు గురువునకు మృతపుత్త్రులం దెచ్చియిచ్చిరని వినెను. మిగుల విస్మయంపడెను. కావుననే కంసుఁడువధించిన తనతొలికొడుకులం దలంచుకొని కన్నీరు మున్నీరుగాఁ బ్రవహింపఁగా రామకృష్ణులం బిలిచి దైన్యము కనంబడుచుండ నిట్లుపలికెను. అప్రమేయాత్మా! రామారామా! యోగీశ్వరేశ్వరా! కృష్ణాకృష్ణా! శాస్త్రీయముల లెక్కపెట్టక తదుక్తులమీఱి వర్తించుచుం బలము కాలము నుడిగిన భూభారభూతులైన రాజులనెల్ల సంహరింపఁ బ్రపంచనిర్మాతలకుఁ బ్రభువులగు నాదిపురుషులు మీరిరువురు నాకడుపున నవతరించితిరని నేనెఱుంగక పోలేదు. ఏమహాపురుషుని యంశాంశాంశభాగమునఁ బ్రపంచముపుట్టుట రక్షించుట హరించుట యనునీకార్యములగునో అట్టినీశరణు సొచ్చితిని. గురువునాజ్ఞచే నంతకు నెంతకాలము ముందో మృతినొందిన యాతనికుమారుని దెచ్చి యాచార్యునకు గురుదక్షిణ యర్పించితివి. అట్లు కంసుఁడు చంపిన నాప్రథమపుత్త్రుల మీఁవలనఁ జూడఁగోరుచున్నదానను. కావున నాయీ యీప్సితముఁ దీర్పవలయును.

అని యిట్లు తల్లి దేవకీదేవి చెప్పుటయు నట్లే తల్లీ! యని యంగీకరించి రామకృష్ణులు తత్కాలముననందే యోగమాయాసహాయమున సుతలంబున కరిగిరి. పోఁగా నందు దైతేయనాయకుండగు బలిచక్రవర్తి లోకప్రభువులు విశేషించి తనదైవములు నగురామకృష్ణు లరుదెంచిరని విని వారిఁగాంచి పరమానందపరిపూర్ణమానసుండై సపరివారముగా లేచి యెదురువచ్చి నమస్కరించి యుత్తమసింహాసనమున గూరుచుండఁ

బెట్టి పాదపద్మములం గడిగి బ్రహ్మాదులకుం గూడఁ బావనతం గల్పించు నాపాదోదకమును దానుఁ దనపరివారజనమును శిర స్సునం జల్లుకొని యుత్తమరత్నాభరణములు దుకూలములు గంధానులేపనములు మాల్యధూపదీపామృతభక్షణాదులం బూజించి కులమును, ధనమును, దనను సమర్పించి ప్రేమా ర్ద్రచిత్తమున భగవంతునిచరణసరసిజములజంటను మాటి మాటికి మనస్సునఁ దలంచి నయనములనుండి యానందబాష్ప జలబిందువులు చక్కఁగా గ్రమ్ముదేరఁగా దేహము పుల కాంకితముకాఁగా డగ్గుత్తికవడ నిట్లు విన్నవించెను. మహా త్తరదేహుఁడైన యనంతునకును, జగద్విధాతయై సాంఖ్యయో గవితానస్వరూపుఁడై పరబ్రహ్మమనియుఁ బరమాత్మయునగు శ్రీ కృష్ణునకు నమస్కారములు. మీదర్శనము దుర్లభము. అయిన ను గొందఱు పుణ్యాత్ములకు సులభంబ యగు. అందువలననే రజస్తమస్స్వభావులమగు మాకది యాదృచ్ఛికంబుగ దొరకెను. శాస్త్రగమ్యుఁడు శుద్ధసత్త్వధాముఁడు నగునీయందు నిరంత రము పగఁబూని మేమును మావంటిదైత్యదానవగంధర్వసిద్ధ విద్యాధరోరగయక్షరాక్షసపిశాచప్రముఖనాయకులును *మీ యొక్క సాలోక్యసారూప్యసామీప్యసాత్మతత్త్వముల గాంచిరి. భావమే కదా సంసారకారణమగు. అతిశయవైరమూని దానఁ గల్గిన భక్తిచేతఁ గొందఱును, కామమునఁ గొందఱును, నీకు సన్నిహితులైనట్లు సత్త్వావిష్టులగు దేవతాప్రభృతులు కారని యెఱిఁగితిని. మహాపురుషా యోగీశ్వరేశ్వరా! యోగేశ్వరులు

*సాలోక్యం చాపి సారూప్యం సామీప్యమథ సాత్మతాం, ప్రాప్తాస్తే పుండరీకాక్ష భావోహిభవకారణమ్. అనిమూలము.

కూడనిది యిట్టిదని నీయోగమాయ నెఱుఁగనేరరు. ఇట్లుండఁగా నిఁకమాబోంట్లనుగూర్చి చెప్పవలసినదేమున్నది? నిష్కాములకుఁ గూడ మృగ్యంబైన భవత్పాదపంకేరుహముల ప్రాపుకంటె నితరమగు గృహరూపమగు నంధకూపమును వెడలి లోకముల కెల్ల శరణంబగు వృక్షమూలమున నివసించి ఫలాదులచే దేహ యాత్ర గడపుచు శాంతిచేత సర్వభూతసౌహృదమున సంచ రించుటకు నన్ననుగ్రహింపుము. సర్వజీవేశ్వరా! మాకుఁ బని చెప్పి మాపాపములఁ బాపుము. నీయాజ్ఞను శిరసావహించి చేయుపురుషునకు విధినిషేధచోదనలు తొలఁగును. అనిన సర్వేశ్వరుఁడగు భగవంతుఁ డిట్లు పలికెను.

భక్తజనశేఖరా! పూర్వము స్వాయంభువమన్వంతరము నందు మరీచికి నూర్ణయను నాతియందు నాఱుగురుతనయులు జనించిరి. వారు పుత్త్రికయగు సరస్వతిని మైథునార్థ మనుసరించు చున్న పరమేష్ఠింగాంచి పరిహసించిరి. ఆపాపమున నసురులై తొలుత హిరణ్యకశిపునకుఁ బుట్టి యట దేవకీగర్భమునఁ బుట్టి కంసునిచేఁ జంపఁబడి యిచ్చటికివచ్చి నీయొద్ద నున్నవారు. మాతల్లి యగు దేవకీదేవి శోకమును దీర్ప వారిందోడ్కొని పోవ వచ్చితిమి. *స్మరుఁడు ఉద్గీథుఁడు పరిష్వంగుఁడు పతం గుఁడు, క్షుద్రభృత్తు, ఘృణి యను నీయాఱుగురు మదను గ్రహమున శాపమువలని సంతాపంబు తొలంగ సద్గతిం గాంచు వారు. అని భగవంతుఁడు పలుకఁగా నాబలిచక్రవర్తియు

*స్మరస్యైవ పూర్వం కీర్తిమానితి నామ అని శ్రీధరాచార్యవ్యాఖ్య.. స్మరుఁడను దేవకితొలికొడుకునకే కీర్తిమంతుఁడని రెండవపేరు గలదు.

నాయాజ్ఞను శిరసావహించి వారలం దెప్పించి రామకృష్ణులకు నప్పగించెను. కృతకృత్యుఁడ నైతి నని పల్కెను.

ఆయాఱుగురు సోదరులం దోడ్కొని రామకృష్ణులు ద్వారకకుఁ జనుదెంచి తల్లి కప్పగించిరి. దేవకియుఁ బుత్త్రస్నేహమున నురమునఁ బాలుద్భవింపఁగా నా కుమారులం గౌఁగిటం జేర్చి తొడపై నిడుకొని శిరస్సుమూర్కొని పాలిచ్చిలోకసృష్టి ప్రవర్తకంబగు విష్ణుమాయచే మోహితయై యానందపరవశ యయ్యెను. శ్రీహరి త్రాగఁగామిగిలిన పాలుద్రావియు భగవంతుని శరీరస్పర్శనంబుఁ బడసియు వా రాత్మదర్శనం బెఱింగి శ్రీకృష్ణునకును దేవకీవసుదేవులకును నమస్కరించి వారిసెలవుగైకొని సకలభూతములు చూచుచుండఁగా నంబరమార్గమునఁ బోయిరి. దేవకీదేవియు మృతులగు తనయాఱుగురు కొడుకులు వచ్చుటయు మరలఁబోవుటయుఁ గాంచి విస్మయంబంది యాయది యంతయు శ్రీకృష్ణుని మాయయే గాని వేఱుగాదని తలంచెను. అనంతవీర్యము గలిగి పరమాత్ముఁడైన శ్రీకృష్ణునియద్భుతచరిత్రము లిట్టి వనేకములు గలవని యెఱింగెను. లోకులపాపములను దొలఁగించుచు భక్తులకుఁ గర్ణసుఖావహంబైన యీమురారి చరిత్రమును విన్నను బఠించినను సకలపాపంబులు తొలంగ భక్తుఁడగు. నరుఁడు భగవంతునిపై మదినిల్పి భయములేని ముక్తిపదమునకుఁ బోవును.

మహాశయులారా! ఈకథ తొలుత విచిత్రముగాఁ దోఁచెడిని. కాని యించుక పరిశీలించిన స్వభావమేగాని యిందచ్చెరువు పడవలసినయంశమే లేదని తోఁచును. మృతులగువారొక్కచోట నుందురా. పూర్వకర్మవశమున నెంతో జన్మింప

వలదా యనునం దొకప్రశ్నము. నిశ్చయమే. కాని యీప్రశ్నిం చువారు చక్కఁగా బరిశీలించినవారు కారనవలయు. ఏల యనఁగా తొలిజన్మమునఁ జేసిన కర్మఫల మీ జన్మమున ననుభ వింపవలయునని కదా వారి యూహ. సత్యమే కాని యీ లోకమున ననుభవింపఁ దగినంతయే యిట ననుభవింపఁ బుట్టుక గాంచును. తొలుదొలుత నితరలోకములయం దుండి యచ్చటి సుఖానుభవమునకుఁ దగిన రూపమును ధరించి యెంతకాల మనుభవింపవలయునో యంతకాలము ననుభవించి యామీఁద నున్న సుఖదుఃఖములలో నేదానినైన ననుభవించుటకు మానవ లోకమునం బుట్టును. ఇది సర్వశ్రుతిస్మృతిపురాణేతిహాససమ్మత మనక తప్పదు. ఈ నియమముప్రకార మా యాఱుగురు ప్రాణులు సుతలమున నుండిరి. మర్త్యలోకమున వా రనుభ వింపఁదగిన పుణ్యపాపరూపఫలములు లేవుకనుకనే కంసునిచే వెంటనే చంపఁబడిరి. భగవదనుగ్రహమునకుఁ బాత్రులుకాఁదల సినకాలము వచ్చువఱకు సుతలమున నుండిరి. వారిసత్కర్మము దేవకీమానసమును బ్రవేశించి యామెను బురికొలిపెను. అంత కు ముందే యామె భగవంతునిసామర్థ్య మెఱిఁగియుండియు నడుగక యుండెను. ఏల? వారికింకను భగవదనుగ్రహమును బొందఁ దగుకాలము రా లేదు. అట్టిమంచికాలము రాఁగానే వారికర్మ మామెను బ్రోత్సహించెను. ఆమె రామకృష్ణులం బిలిచి తనకోరికను దెల్పెను. గురుపుత్త్రునిఁ దెచ్చి యిచ్చితివని వింటి ననియెఁ గదా. ఆతొలినాఁడే విన్నదియా. ఎంతకాలము క్రిందటనో వినియున్న యామె యానాఁడడుగుటకుం గల కారణమేమి? ఆప్రాణుల కింకను సుతలమున నుండఁ దగు

ప్రాప్తమున్నది. ఏక్షణమున లోకాంతరగమనమున కనుకూల మగుకర్మము ప్రాప్తించెనో యాక్షణమున దేవకి తనయుల రామకృష్ణులం బిలిచి తనకోరికను దెలుపుటయు వారు ప్రయాణమై సుతలమున కరుగుటయు ననునీ కార్యములు సాగెను. కావున నిందు విచిత్రవృత్తాంత మించుకంతయు లేదు.

శ్లో. "ప్రాప్య పుణ్యకృతాఀ లోకా నుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. ౪౧
అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. ౪౨
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికమ్,
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునందన. ౪౩
పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే. ౪౪
గీతా. ౬ అధ్యాయము.

అనునీగీతావాక్యములు పై యూహను సిద్ధాంతము చేయుచున్నవి. కాఁబట్టి మృతపుత్త్రులను దెచ్చి తల్లికిం జూపుట మానవమాత్త్రులకు సాధ్యము కాదని యొప్పుకొన్నను, మహర్షులకుం గూడ సులభసాధ్య మగుచుండ నింక భగవంతున కాపని తృణప్రాయమనుట సంశయమా?

ఈకథవలన మఱొక్కవిషయముకూడఁ దెలియ వచ్చెడిని. లోకను లనేకములు. అవి కర్మానుభవస్థానములు. మృతుఁడగుప్రాణి వెంటనే పుట్టుకం గాంచక తనకర్మమునకుఁ దగిన సత్ఫలదుష్ఫలముల ననుభవింప నాయాలోకముల నుండఁ

దగినంత కాల ముండును. ఆఫలానుభవము ముగియఁగనే యటనుండి వేఱొకలోకమునకో మరలఁ బుట్టుటకుగా మానవ లోకమునకో ప్రయాణమగును. కర్మానుభవము తప్పదు. దానికనువగురూప మలవడుటయుఁ దప్పదు. దానికై కర్మమే ప్రాణిని బ్రోత్సహించును. కాఁబట్టి మానవుఁడు పరుల నుద్ధరింపఁ బూనినట్లు నటించుతనకు రాఁగలదుర్గతులఁ దలంపక యూరకుండక సత్కర్మముల నాచరించుచు భగవంతున కా కర్మముల నర్పించుచుఁ దత్పాదసేవయే పరమగతిగా భావించుచు నితరులు తనకపకారోపకారములు చేసిరని యనుమానించి దూషింపక వినుతింపక తనకర్మమే తనకట్టి సద్గతి దుర్గతులను గల్పించు చున్నదని నిశ్చయించి పురోవృద్ధి కనుగుణమగు మార్గమును జూచుకొని తనయనుభవము నితరులకుం దెలుపుచుండవలయునే కాని తాఁజేయనికర్మములను జేసినట్లు గాని లేనియనుభవ మున్నయట్లు గాని నటింపక భక్తులసంగతి మెలంగవలయును. ఇదియే యీకథాసారము. దీనిని జక్కఁగా మది నిల్పి తనతరణోపాయమును జూచుకొనవలయును. ఇంకఁ దర్వ్యాతికథ నాలకింపుఁడు.

## మైథిల శ్రుతదేవులను హరి తృప్తిపఱచుట.

* శుకయోగి పరీక్షిత్తును గనుంగొని రాజా మఱియు భగవద్విచిత్రకథల నాలకింపుము. శ్రీకృష్ణునకు సఖుఁ డొకఁడు కలఁడు. శ్రుతదేవుఁడని యాతనినామధేయము. ఆతఁడు

*ఈకథయు శ్రీభాగవతదశమస్కంధమున నెనుబదియాఱవయధ్యాయమునఁ బదునాల్గవశ్లోకము నారంభించి వ్రాయఁబడినదని యెఱుంగవలయును.

బ్రాహ్మణుఁడు. శాంతుఁడు. విద్వాంసుఁడు. తృష్ణావిరహితుఁడు. శ్రీకృష్ణపాదారవిందైక భక్తి పరవశుఁడు. ఆశ్రుతదేవుఁడు దైవమువలన లభించువస్తువులకు సంతృప్తి నొందుచుండు వాఁడు. యదృచ్ఛాసంపన్నధనము న గృహస్థువు చేయఁదగు కృత్యముల నిర్వర్తించుచు తానించుకంతయు నధికముగఁ గావలయునని కోరక లభించినంతలో మహాతృప్తి నొందుచు దేహయాత్ర గడుపు చుండెను. ఆతఁడు మిథిలానగరమునఁ గాపురముండెను. ఆనగరమును బహుళాశ్వుఁ డనురా జపుడు పాలించుచుండెను. ఆరాజుకూడ నహంభావము లేక శ్రీహరి భక్తుఁడై యుండెను. శ్రుతదేవుఁడు బహుళాశ్వుఁడు నను నీయిర్వురు సదా హరిభక్తిపరాయణులై యుండిరి.

ఆయిర్వురు భక్తులకుఁ బ్రియముచేయుకోర్కి శ్రీహరి కొక్కనాఁ డుదయించెను. భగవదాశయము నెఱింగి దారుకుఁడు తేరాయత్తపఱచి తెచ్చెను. దాని నధిష్ఠించి శ్రీహరి తనవెంట నారదవామదేవులును, అత్రి వ్యాస భార్గవ రామాసితులు ను, అరుణుఁడు, నేనునుం బృహస్పతి యుఁ గణ్వమైత్రేయచ్యవనులు మఱియుఁ గొందఱు మహర్షులు రాఁగా విదేహ దేశమునకుఁ బ్రయాణము సాగించెను. ఆనర్తదేశమును దాఁటి మరుభూభాగము నతిక్రమించి కురుజాంగలజనములను మీాఱి వంగమత్స్యపాంచాలములఁ గాంచుచు నవ్వలంబోయి కుంతిమధుకేకయకోసలార్ణనామకరాజ్యముల నుల్లంఘించి యుందందుఁ దనరాక నెఱింగిన నారీమణు లుదితసూర్యప్రకాశుండగు తనకు భక్తిపూర్వకముగా సమర్పించుకానికలం గర మనురాగమున నంగీకరించుచు, స్మేరవిలోకనముల వారి నాదరించి

యానంద మొందఁజేయుచు, నిరంతర క్షేమమును, దత్త్వజ్ఞానమును వారికిఁ బ్రసాదించుచు, సురలచేతను నరులచేతను గానము చేయఁబడుచు దిగంతవిశ్రాంతంబై, నిర్మలంబు నగు తనకీర్తిగేయము నాలకించుచు రథగమనము మందమగుచు నరుగఁ గొన్నిదినములకు విదేహదేశములం గాంచెను. అందుఁ గలజానపదులు పౌరులు పూజావస్తువులం గైకొని యెదురు వచ్చి తనను మహర్షులను బూజించి ప్రీతిచే వికసించి మోముదమ్ములు చెలువార శిరస్సులపై నంజలులు ఘటించి నమస్కరింపఁగా మెచ్చుకొనుచు నగరప్రవేశ మొనర్చెను.

మైథిలశ్రుతదేవులు తమయందుఁగల ప్రీతిచేఁ బరాత్పరుఁడు విజయంచేసెనని యెఱింగి ప్రత్యుత్థానంబొనర్చి యాజగద్గురునిపాదపద్మములకు సాష్టాంగప్రణామము లాచరించి యాతిథేయసత్కారము లొనరించి చేసిలుల్గొగ్గి యిర్వురును మాయింట నాతిథ్యమంగీకరింపుమా యని ప్రార్థించిరి. వారి మనోవాంఛలను శ్రీహరి యెఱింగి వారి కిద్దఱకుఁ బ్రియము చేయఁగోరి పరస్పరము తెలియకుండ మునులంగూడి యాయిద్దఱ గృహంబులకు నరిగెను. అసాధులకు నతిదూరము ననుండునామహర్షులం గూడి తనయింటికే విజయంచేసెనని స్వాంతంబున మహానంద మంది మిథిలాధిపతి యానందబాష్పలోచనుండై వారినందఱ నత్యుత్తమాసనంబులఁ గూరుచుండ బెట్టి పాదములుకడిగి జగములఁ బవిత్రములుగాఁ జేయు నాసలిలములఁ గుటుంబముం గూడి శిరస్సులం దాల్చి దివ్యచందన మాల్యాంబరాభరణాదులఁ బూజించి షడ్రసోపేతమృష్టాన్నంబు పెట్టి కృతకృత్యుఁడ నైతిఁ గదా యని తలంచెను.

వారును భోజనంబొనరించి విశ్రాంతు లైనపిదప వారింజేరి హరిపాదములు తొడపై నునుచుకొని మెల్లమెల్లన నొత్తుచు మహానందమున నిట్లు విన్నవించెను.

దేవా! సర్వభూతములకునాత్మయు,సాక్షియు, స్వప్రకాశుఁడు నైననీవు తమపాదసరోజములను స్మరించుమాకు దర్శనం బిచ్చి యేకాంతభక్తులకంటె నాకుం బ్రియుండొక్కండును లేఁడు. శ్రీదేవియు బ్రహ్మయు వారికన్నఁ బ్రియులు కారు. అనువచనంబును సత్యంబు గావించితివి. ఇంతమాత్రము తెలిసినవాఁ డెవ్వండుగాని నీపదసరసిజముల వదలునా? ఇంకొకరి నాశ్రయించునా? అంకిచనులు శాంతులు నగు మానులకు నీవాత్మప్రదాతవు. యాదవులవంశమున నవతరించి భవతాపతప్తు లగువారి కాపరితాపముఁ దొలఁగింప లోకకల్మషహారంబైన కీర్తి నిలుపఁగోరి శాంతతపము చేయునారాయణముని వగు నీకు నమస్కారము. నాపై ననుగ్రహ మునిచి కొన్ని వాసరములు మాయింట నివసించి పాదపద్మధూళి నీనిమివంశమునకుఁ బావనతఁ గల్పింపుము. అని యిట్లు నానాప్రకారంబుల నామిథిలాధిపతి బహుళాశ్వుఁడు ప్రార్థింప లోకభావనుఁడు కావున భగవంతుఁడు తన్నగరవాసులకుఁ గళ్యాణములఁ గూర్చుచు నందు నివసించెను. అచ్చట శ్రుతదేవుఁడును మహార్షులంగూడి తనయింటికి వేంచేసినపరమేశ్వరునకు నాతిథేయ సత్కారములు బహుళాశ్వుఁడు చేసినట్లే తనశక్తికిందగినట్లు తృణకుశనిర్మితాసనములం గూరుచుండఁ బ్రార్థించి స్వాగత విధిసాగించి పత్నియుఁ దానును వారికెల్ల నమస్కరించి పాద ప్రక్షాళనకృత్యము నడపి యానీటిని శిరములంజల్లుకొని సర్వ

వాంఛితములు ఫలించెనని తలంచుచు స్వాదుజలములు కస్తూరి మొదలగు సుగంధవస్తువులు తులసి దర్భలు పద్మములు మొదలగు పదార్థములు తనకుం దొరకిన వెల్ల సమర్పించి పూజా విధానము నడపి సాత్త్వికాహారము భుజియింప నివేదించి తనలో నేనెంత ధన్యుఁడను? సంసారాంధకారకూపమునఁ బడియున్న నాకు సర్వతీర్థములను మించు పాదరేణువులుగల శ్రీపరా త్పరునితోడను తద్భక్తులగు ద్విజర్షులతోడను సమాగమంబు గలిగెఁ గదా యని యూహించుచు వారందఱు భుజించి విశ్రమింపఁగా దారపుత్త్రాదులంగూడి తా నచటి కరిగి హరిపాద ములను మెల్లన నొత్తుచుఁ బురుషోత్తమునితో నిట్లుపలికెను.

ఓపరాత్పరా! నిద్రపోవువాఁడు యవిద్య తనమనస్సు నందు మఱియొక లోకమును స్వప్నమున నిర్మించిననందుఁజొచ్చి తాను సంచరించునట్టులీలోకమున నిజమాయాశక్తులం గల్పించి యాత్మసత్తారూపమున నందుఁ బ్రవేశించిన శాశ్వతుఁడవగు నీవు నేఁడు మాపూర్వపుణ్యవశమున సందర్శనభాగ్యముం బ్రసా దించితివి. జగత్పావనములగు నీకథలు వినువారికి వానిం గీర్తిం చువారికి, నినుం బూజించువారికి నభినందించువారికి నితరుల తో నీవిషయమును జర్చించువారికి, హృదయాంతరమున నెప్పు డును బ్రకాశించుచుండుదువు. ఎల్లవారల హృదయముల నుండియుఁ గర్మవిక్షిప్తచిత్తులగువారికి మాత్రము మిగుల దూరమున వర్తింతువు. అహంకారాదివ్యవహితుఁడవయ్యు శ్రవణసంకీర్తనాదిభజనపరు లగువారలకు మిక్కిలిసమీపమున నుందువు. కార్యకారణోపాధి నియామకుఁడవు. మాయోదయ నిరుద్ధులకన్యరీతి దర్శన మిచ్చువాఁడవు. సంసారప్రవర్తకుఁడవు.

అధ్యాత్మవేత్తలకు ముక్తిప్రదుఁడవు. ఇట్టినీకు వందనములు పరమేశ్వరా! మేము నీ కింకరులము. ఇట్టి మమ్ము నాజ్ఞాపింపుము. ఏమి చేయఁదగునో తెల్పుము. మానవులకు నీసందర్శనము కానంతవఱకే క్లేశములు గాని యవ్వలఁ గలుగునను కల్ల. అని యిట్లు భక్తవర్యుఁడగు శ్రుతదేవుఁడు మనవిచేయఁగా విని ప్రణతార్తిహరుండగు నా శ్రీహరి సుస్మితము మోముదమ్మిపై నంకురించి నటనము సల్పఁగా నా శ్రుతదేవునిహస్తంబుం బట్టుకొని యిట్లు పలికెను.

ద్విజప్రవరా! నిన్ననుగ్రహింపఁగోరియే యీమహర్షులు వచ్చిరని తలంపుము. ఈమునివరులు పాదరేణువుచే సకలలోకములను బావనములుగాఁ జేయుచు నాతోడఁ దిరుగుచుందురు. * దేవతలు క్షేత్రములు తీర్థములు దర్శనముచేతను అర్చనముచేతను జాలకాలమునకుఁ బవిత్రతను గూర్పఁగలవు. మహనీయులదర్శనమాత్రంబుననేయవికలుగును. పుట్టుకచేతనే బ్రాహ్మణుఁడు ప్రాణులలో నెల్ల నుత్తముఁడు. ఆ బ్రాహ్మణుఁడే తపము విద్య నాయుపాసనయుం గల్గి యుండిన నిఁకఁ జెప్పవలయునా! బ్రాహ్మణస్వరూపమునకంటె నాల్గుచేతులు గల యీరూపము నాకుఁ బ్రియంబు గాదు. బ్రాహ్మణుఁడు సర్వవేదమయుండగు. నేను సర్వదేవమయుండను. ప్రతిమాదు

---

* దేవాః క్షేత్రాణి తీర్థాని దర్శనస్పర్శనార్చనైః, శనైః పునంతి కాలేన తదప్యర్హత్తమైక్షయా. బ్రాహ్మణో జన్మతః శ్రేయాన్ సర్వేషాం ప్రాణినామిహ, తపసా విద్యయా తుష్ట్యా కిము మత్కలయా యుతః నబ్రాహ్మణాన్మేదయితం రూపమేతచ్చతుర్భుజం, సర్వవేదమయో విప్రస్సర్వదేవమయోప్యహమ్. అని మూలము.

లపై దేవతాదృష్టినిడి దుర్మతు లగుమానవు లిదియెఱుంగక విప్రరూపమున గురుఁడు ఆత్మయునై యున్ననాపై నసూయ పడుదురు. చరాచరాత్మకంబైన యీవిశ్వమును దీనికిఁ గారణ ములగు మహదాదులను మన్మయములని దర్శించుటచేత మద్రూపములని విప్రుఁడు కాంచును. అట్టులౌట నీబ్రహ్మర్షు లను శ్రద్ధతో నిరంతరము పూజింపుము. ఇట్లుచేసినచో నిశ్చ యముగా నేను బూజితుఁడ నగుదును. అంతియగాని మిగుల నైశ్వర్యములఁ బూజించినను దృప్తుండను గాను. అని యానతీయఁగా నామిథిలానగరవాసియగు విప్రుండు కృష్ణుని మునులను ఏకాత్మభావమున నారాధించి పరమపదమును గాం చెను. అట్లు భక్తవత్సలుఁడు గావున శ్రీకృష్ణమూర్తి యాయి ద్దఱకుం బ్రీతి సమకూర్చి వారియిష్టానుసారము వసియించి స్వయం ప్రమాణములగు వేదములకు బ్రహ్మపరత్వ ముపదేశించి ద్వారవతికిం జనియె. అనిపరీక్షిత్తునకు శుకయోగి యుపదేశిం చెను.

భక్తమణులారా! ఈ యితిహాసమున సారము కలదు. అది చక్కఁగా నెఱుంగం దగినదియే గాని కథనుమాత్రము చదివి యూరకున్న లాభము లేదు. ద్వారకానగరమునకుఁ జాల దూరమున మిథిలానగరము కలదు. ఆరాజచంద్రుఁడు శ్రీకృష్ణ భక్తుఁడు. ఆనగరమునఁ గాపురమున్న శ్రుతదేవుఁ డను బ్రాహ్మ ణుఁడును హరిభక్తుఁడు. ఈయిరువురు భక్తిభావమున భగవం తునిదృష్టికి సమానులే. రాజనర్ఘ్యఁ డమూల్యపదార్థములఁ బూజించెను. బ్రాహ్మణుఁడు తనకు లభించిన యల్పమూల్యపదా ర్థముల నారాధించెను. భక్తిసమానము కాఁబట్టి పదార్థములు

భగవద్దృష్టికి సమానము లే కాని యుత్తమమధ్యమాధమ ములు లేవు.

"శ్లో. పత్రం పుష్పంఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః." ౨౬.

అని యే గదా భగవంతుని వాక్యము. మఱియు,

"శ్లో యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్. ౨౭
సమోఽహం సర్వభూతేషు న మేద్వేష్యోఽస్తి న ప్రియః,
యేభజంతి తుమాంభక్త్యా మయి తే తేషు చా ప్యహమ్."
గీతా ౯ అధ్యా.

అని యిట్లు భగవంతుఁ డుపదేశించెను. కావునఁ బదార్థభేద ములు వానియందు నాసక్తియుఁ బామరులకుఁ గాని జ్ఞాను లకుఁ గాదు. భగవంతున కీపదార్థములు తృణప్రాయములు గదా. ఐనను మానవునిమానసము పరిశుద్ధమా కాదా యని యే పరమేశ్వరుఁడు చూచును. ఇతరదృష్టి పామరులకే యుం డును. అందువనే సర్వసముఁ డన్నభావ మానిరంజనునకుం గలదు. ఈనియమమును లోకులకు వెల్లడి చేయుటకే శ్రీహరి సంకల్పించి మహర్షులు కూడ నరుదేర మిథిలానగరమునకుం బ్రయాణ మయ్యెను. ఆభక్తులు పేరంటమునకు రమ్మని పిలువ లేదు. కాని నిరంతరము భగవత్పాదసందర్శనమును గోరుచుం డిరి. వారియాశయమును సర్వజ్ఞుఁ డెఱుంగును. ఏసమయ మునఁ దనను దర్శించుసత్కర్మము వారికి ఫలించునో యాసమ యమునకుఁ దనకుఁ దానే ప్రయాణమై నగరమునకు వచ్చెను. ఒకఁడు మహారాజు. ఇంకొకఁడు నిరుపేద. ఈయిరువుర

యింట్ల కొక్కసారియే మునులం గూడిపోయెను. ఇరువురును యథావిధిఁబూజించిరి.తనయింటఁ గొలఁదిదినము లుండవలయు నని ప్రార్థించిరి. ఇందఱుమునులతో రాజునింటను విప్రుని యింట నుండెను. రెండుస్థలములయందు నాశ్రీహరియే. ఆమును లే యుండిరి. ఇరువురును తనయింటనే యున్నవాఁడు శ్రీహరి యని తలంచిరి. తృప్తిచెందిరి. అట్టితఱి హరియాద్విజుఁడు తనను వినుతింపఁగా బదులుచెప్పినవిషయ మమూల్యము. అందు భక్తులమహిమము తెల్పఁబడినది. దేవతలు క్షేత్రములు తీర్థములు మానవుని బరిశుద్ధాత్మునిగఁ జిరకాల మునకుఁ జేయఁ గలవు. నా భక్తులు దర్శనముననే పరిశుద్ధాత్మునిగాఁ జేయఁ గలరు.అనఁగా భక్తులు భగవంతునియందుఁ బ్రీతి గలవారు. వారిమానసములు పరిశుద్ధములు. ఎట్టిపామరునైనను బరిశుద్ధచిత్తునిగాఁ జేయఁగలవు. కాఁబట్టియే ప్రతిమారూపమున దేవతలనారాధించుటకంటె క్షేత్రముల దర్శించుటకంటెఁ దీర్థస్నానము లాచరించుటకంటె భగవద్భక్తుల నాశ్రయించుటే మేలని దీనిసారము.ఈయుపదేశమే లయనఁగా భగవంతునినమ్మి తద్భక్తులయందు గౌరవములేక పోవునేమో యది యంతమంచిది గాదనియుఁ దన నారాధించినట్లే తనభక్తుల నారాధింపవలయు ననియు, దానిచే సర్వాంతర్యామియని తన నెఱుంగ వచ్చుననియు, ఆభావము దృఢముగా నిలువవలయు ననియు, దానిచేఁ గాని కృతార్థుఁడు కాఁడనియు శ్రీకృష్ణుని భావమని గ్రహింపవలయు. ఈచోట జన్మముచేతనే బ్రాహ్మణుఁడు పరిశుద్ధుఁడనియు, దానికిఁ దోడుగా నాభక్తియుఁ గుదిరిన మఱింత పరిశుద్ధుఁ డగుటకు సంశయమా యనియు

హరి యుపదేశించెను. శ్రీభాగవతమునఁ గలయీవాక్యము ప్రమాణ మైనచోఁ గులములు గుణకర్మములచేతఁ బ్రతిదినము మార్పఁ వలనుపడదని స్పష్టమయ్యెడిని. భగవద్గీతావాక్యమునుబట్టి గుణకర్మముల ననుసరించి కులములు నిర్ణయింప వలయునని ప్రతిపాదించునర్థము నిర్మూలమనియు నది దుర్భావము గలవారిచేఁ గల్పితమనియు నీభాగవతమునఁ గల భగవద్వాక్యము స్పష్టపఱచుచున్నది.

భక్తులను దర్శించుట వారిం బూజించుట నన్ను దర్శించి పూజించినట్లే యని శ్రీహరి తెల్పెను. భక్తుల నెఱుంగుటయే కష్టముగా నుండును. అది యీకాలమున మఱింత కష్టము. భక్తులమని వేషములఁ దాల్చువారు భూతలమున నిండియున్నవారు. వారివేషములు భక్తులను గాదు భగవంతునిం గూడ మించినవి. ఇందు భక్తుఁడెవఁడో కేవలవేషధారియై పొట్టపోసికొనువాఁ డెవఁడో కనుఁగొనుట శక్యము గాని పని. కాని యించుక బుద్ధిని సన్మార్గమునఁ ద్రిప్పి పరిశీలించిన వారలకుంగల భేదము కనఁబడక పోదు. ఎట్టివారిని దర్శించినంతన మానసము భక్తిరసప్రపూర్ణమై సర్వభూతసమత్వము మంచిదని తోఁచునో వారు భక్తులు. వేషభాషాడంబరముల నొరుల వంచించి ధనగ్రహణముచేయువారు భక్తులుగారు. కావున నట్టివారి మాయావాగురలనుం జిక్కక తననుండి యించుకంతయు నుపకారమును గోరక తనకు సన్మార్గ ముపదేశించువారు భక్తులని తెలిసికొని వారిసంగతి మెలంగుట మేలు. ఇదియే భగవద్భక్తి ఫలము. ఇదియే సాధుమార్గము. తరణోపాయ మిదియే. కావునఁ జక్కని భక్తిమార్గమునఁ బ్రవర్తించుమహాత్ముల వెదకి వారిపై త్రి

కలిగి మెలంగుచు భగవద్గుణకీర్తనము కావించుచు సర్వభూత ములం గల యీశ్వరుని దలంచుచుఁ బరహింస యొనర్పఁ దలంపక శాస్త్రముల దూషింపక దేవతలను నిందింపక తానమ్మిన సర్వేశ్వరుఁడే సర్వదేవతాత్మకుఁడని నమ్మి సేవించుటకంటె వేఱొకటి మంచిమార్గము లేదని యీకథయందుఁ గలభగవదుపదేశవాక్యములు తెల్పుచున్నవి. ఇవియే వేదతుల్యములు. దృఢభక్తిమై శ్రీహరి నారాధింపవలయునని నమ్మవలయును. ఇంకఁ దరువాతికథ నాలకింపుఁడు.

## శ్రుతిగీతలు.

* భగవత్కథల నాలకించి పరీక్షిన్మహారాజు శుకయోగీంద్రునితో మరల నిట్లు ప్రశ్నించెను. జ్ఞానధనా! యోగివర్యా! కార్యమునకుఁ గారణమునకు నతీతమై నిర్గుణమై యిట్టిదని నిర్దేశింప నలవిగాక యేకమైయుండు పరబ్రహ్మమునెడల గుణవృత్తులైనశ్రుతు లెట్లు ప్రవర్తిల్లునో వినవలతు. ఆనతీయవే యని ప్రశ్నించెను. ఆప్రశ్నమును విని యోగి చక్కనిప్రశ్నము చేసెనన్నయానందమున సమాధానము నిట్లు చెప్పఁబూనెను. మహారాజా! విషయభోగము, కర్మానుష్ఠానము, ఆయాలోకములభోగము, కైవల్యము ననెడునాల్గును వరుసగా నర్థము

శ్రుతిగీతా.

బ్రహ్మన్ బ్రహ్మణ్యనిర్దేశ్యే నిర్గుణే గుణవృత్తయః, కథం చరంతి శ్రుతయస్సాక్షాత్సదసతఃపరే. ౧. శుకః. బుద్ధీంద్రియమనఃప్రాణాన్ జనానామసృజత్ప్రభుః, మాత్రార్థం చ భవార్థం చ ఆత్మనేఽకల్పనాయ చ. ౨.

* ఈకథ శ్రీమద్భాగవతదశమస్కంధమున నెనుబదియేడవ యధ్యాయమునుండి సంగ్రహింపఁబడినదని యెఱుంగునది.

ధర్మము కామము మోక్షము ననుపురుషార్థములు నాలుగు జీవునకు సిద్ధింప నీశ్వరుఁడు బుద్ధీంద్రియమనఃప్రాణములను నుపాధులను బుట్టించెను. అందు స్వరూపము నుపపాదనము లేకయుండినచో మోక్షార్థసృష్టి యన్వయింప నవకాశము లేదు. శ్రుతులు గుణములచే నభిభూతుఁడు కాక సర్వజ్ఞుఁడై సర్వశక్తులు గలిగి సర్వేశ్వరుఁడై సర్వనియంతయై సర్వోపాస్యుఁడై సర్వకర్మ ఫలప్రదాతయై సకలకల్యాణగుణనిలయుఁడై సచ్చిదానందలక్షణుఁడగు భగవంతునిఁ బ్రతిపాదించుచున్నవి. అంతియగాక శ్రుతులన్నియు రూఢి మొదలగు వానిచే సాక్షాద్వృత్తిచేతఁ బరబ్రహ్మబోధకములు గాకయుండినను బరమేశ్వరోద్దిష్టమగు మోక్షసమన్వయంబున గౌణవృత్తి కల్పనయుఁ జేయందగు. జహదజహత్స్వార్థలక్షణావృత్తినియమంబున విరుద్ధమగునంశమును వదలి యందనుగతమగుచిదర్థమాత్రము గ్రహించి యుపనిషన్మహావాక్యములకు సమన్వయము చేయవలయునే కాని తోఁచినట్లర్థము చెప్పరాదు. ఈరీతిగానే శ్రుతులన్నియు నిర్గుణబ్రహ్మమును బోధించుచున్నవి. ఉపనిషత్తులీప్రకారము పరబ్రహ్మపరములని పెద్దలందఱు సిద్ధాంతముఁజేసిరి. పరమకారుణికుఁడై అవాప్త సకలకాముఁడై పరప్రయోజననిరపేక్షుఁడై తగుబ్రహ్మమునకు

---

సైషాహ్యుపనిషద్బ్రాహ్మీ పూర్వేషాం పూర్వజైర్ధృతా, శ్రద్ధయా ధారయేద్యస్తాం క్షేమం గచ్ఛేదకించనః. ౩. అత్ర తే వర్ణయిష్యామి గాథాం నారాయణాన్వితాం, నారదస్య చ సంవాదమృషేర్నారాయణస్య చ. ౪. ఏకదా నారదో లోకాన్ పర్యటన్ భగవత్ప్రియః, సనాతనమృషిం ద్రష్టుం యయౌ నారాయణాశ్రమమ్. ౫. యో వై భారతవర్షేఽస్మిన్ క్షేమాయ స్వస్తయే నృణామ్, ధర్మజ్ఞానశమోపేత ఆకల్పాదాస్థితస్తపః. ౬. తత్రోప

జగత్సర్గముతోఁ బ్రయోజనమేమని సంశయింతువేమో రాజా! వినుము. మాత్రార్థమనఁగా దేహమునుత్పాదించునిమిత్తము అసత్ప్రాయులగుజీవులకు స్వారాధనోపయుక్తమగుకళేబరాది ప్రదానమున నుజ్జీవింపఁజేయునిమిత్తము జగన్నిర్మాణమునఁ బ్రవృత్తియని యెఱుంగుము. ఇదియే పై వాక్యములసారము. పరిపూర్ణుఁడైనను బరుల నుద్ధరించుకరుణగలుగుట సంగతమే గాని, యసంగతముకాదుకదా. పరీక్షిద్రాజేంద్రా! వితండాకు తర్కవాదములు చేయఁబూనక పై సిద్ధాంతము నాశ్రయించు వాఁడు దేహాద్యుపాధిరహితుఁడై పరమపదమునొందు కావునఁ బెద్దలసిద్ధాంతములు వీటిఁబుచ్చక దానినే శరణమని నమ్మవలయును. పూర్వకాలమున నారాయణమునివర్యుఁడు దేవర్షి యనఁబడు నారదునకు బోధించిన నరనారాయణసంవాదమను నితిహాసము గలదు. అయ్యది యీప్రశ్నమునకు నుదాహరణంబగు. కావున దానిం జెప్పెదను. ఆకర్ణింపుము.

---

విష్టమృషిభిః కలాపగ్రామవాసిభిః, పరీతం ప్రణతోఽపృచ్ఛదిదమేవ కురూద్వహ. ౭. తస్మా అవోచద్భగవా నృషీణాం శృణ్వతామిమమ్, యో బ్రహ్మవాదః పూర్వేషాం జనలోకనివాసినామ్. ౮. శ్రీభగవానువాచ:—స్వాయంభువ బ్రహ్మసత్రం జనలోకేఽభవత్పురా, తత్రస్థానాం మానసానాం మునీనామూర్ధ్వరేతసాం. ౯. శ్వేతద్వీపం గతవతి త్వయి ద్రష్టుం తదీశ్వరం, బ్రహ్మవాదస్సుప్రవృత్తశ్శ్రుతయో యత్ర శేరతే. ౧౦. తత్ర హాయమభూత్ప్రశ్నస్త్వం మాం యమనుపృచ్ఛసి, పరిహారాంశ్చ తాన్ సర్వాన్ వక్ష్యేహం శృణు తేఽనఘ. ౧౧. తుల్యశ్రుతతపశ్శీలాస్తుల్యస్వీయారిమధ్యమాః, అపి చక్రుః ప్రవచనం ఏకం శుశ్రూషవోపరే. ౧౨. సనందనః. స్వసృష్టమిదమాపీయ శయానం సహ శక్తిభిః, తదంతే బోధయాంచక్రుస్తల్లింగై

భగవత్ప్రియుం డగునారదమహాముని లోకములం గాంచువేడుకం దిరుగుచుండువాఁడు కావున నొక్కనాఁడు సనాతనుఁడగు నారాయణమహర్షిని జూడఁగోరి యాముని యాశ్రమంబునకుం బోయెను. ఈభారతవర్షమునం గలనరులకు క్షేమము మోక్షము గలుగవలయునన్నకోర్కెచేత ధర్మజ్ఞానశమసమన్వితుం డై ప్రళయకాలపర్యంతము తపశ్చర్యను జేయఁబూని కలాపగ్రామనివాసులగుమునులు తనచుట్టుం గూరుచుండియుండఁగా బదరికాశ్రమమునం గూరుచుండిన నారాయణమహాముని నారదునకుం గనఁబడియెను. ఆనారాయణముని పతి దర్శించి మహానంద ముప్పొంగం బోయి నమస్కరించి యిపుడు నీవు నన్నడిగినట్లే యామునిని నారదుఁడు ప్రశ్నించెను. ఆపరమమౌనియు నందుం గూరుచుండియున్నమహర్షులందఱు వినుచుండ జనలోకమున నివసించుపెద్దలకు బ్రహ్మకును జరిగిన సంవాదము నీరీతిం జెప్పెను.

---

శ్రుతయః పరమ్. ౧౩. యథాశయానం సమ్రాజం వందిన స్తత్పరాక్రమైః ప్రత్యూషేఽభ్యేత్య సుశ్లోకైర్బోధయంత్యనుజీవినః ౧౪. శ్రుతయః.—జయ జయ జహ్యజామజితదోషగృభీతగుణాం త్వమసియదాత్మనా సమవరుద్ధసమస్తభగః, అగజగదోకసామఖిలశక్త్యవబోధక తే క్వచిదజయాత్మనాచ చరతోఽనుచరే న్నిగమః. ౧౫. బృహదుపలబ్ధమేతదవయం త్యవశేషతయా యత ఉదయా స్తమయౌ వికృతేర్మృదివావికృతాత్, అత ఋషయో దధుస్త్వయి మనోవచనాచరితం కథమ యథా భవంతి భువి దత్తపదాని నృణామ్. ౧౬. ఇతి తవసూరయస్త్ర్యధిప తేఽఖిలలోకమలక్షపణ, కథామృతాబ్ధిమవగాహ్య తపాంసి జహుః, కిముత పునస్స్వధామవిధుతాశయకాలగుణాః పరమ భజంతి యే పదమజస్రసుఖానుభవమ్. ౧౭. దృతయ ఇవ శ్వసంత్యసుభృతో యదు

నారదమునీ! వేదములకు సుఖవిశ్రాంతిస్థానము శ్వేతద్వీపము. దాని కధిపతి యగుపరమేశ్వరు దర్శింప నీ వరిగితివి. మున్నొకప్పారిజనలోకమునందు బ్రహ్మమానసపుత్త్రులై యూర్ధ్వచేతస్కులునగు సనకసనందనాదిమహర్షులకు బ్రహ్మవిచారాత్మకమగు బ్రహ్మసత్త్రము సాగెను. అప్పుడు నీవు న న్నేప్రశ్న మడిగితివో అదియే యాచోటనుం గలిగెను. సమాధానము చెప్పఁబడియెను. వానినెల్ల వచించెద. ఆలకింపుము. సనకాదిబ్రహ్మమానసపుత్త్రులు శీలమునందును బాండిత్యమునందును దపశ్చర్యయందును సమానులు స్వీయుఁడని, పరుఁడని రెండుపక్షములు సమానముగాగలవాఁడని యాలోచించువారుకారు. అయినను సనందునిప్రవచనమునిమిత్తముగ నేర్పఱచుకొని తక్కుంగలవారు వినుచుండిరి. అత్తఱి సనందనముని సనకాదులకుఁ బైప్రశ్నమునకు నుత్తరముచెప్పంబూని యిట్లనియె. చక్రవర్తి నిద్రవోవుచుండఁగా నాతనివలన జీవించుసేవకులు స్తుతిపాఠకులు గావునఁ దెల్లవాఱుజామున సమీపమునకుంబోయి యారాజచంద్రుని కీర్తిని పరాక్రమమును వెల్లడించుచు మేలుకొలుపుదురు. అట్లే పూర్వము స్వకీయశక్తులతో నీబ్రహ్మాండమునెల్ల నుపసంహరించి యోగనిద్రాపరాయణుం డైనయాపరమాత్మను బ్రళయము తుదను బరమేశ్వరుని మొగటినిశ్వాసమునుండి యుదయించినవేదములు భగవత్ప్రాకృచరిత్రప్రతిపాదకములగు వాక్యములచేత నీరీతిగా బోధించును.

---

దితేఽనువిధామహదహామాదయోఽండమసృజన్ యదనుగ్రహాతః, పురుషవిధోఽన్వయో ఽత్ర చరమోఽన్నమయాదిషు యస్సదసదతః పరంత్వథయదేష్వవశేషమృతమ్. ౧౮. ఉదరముపాసతే యఋషివర్త్మసుకూర్పదృశః పః

ఓయజితా! నీసర్వోత్కర్షమును బయలుపఱుపుము. బయలుపఱుపుము. ఆనందాదుల నాచ్ఛాదింపఁగోరి గుణములఁ బరిగ్రహించినచరాచరజీవావిద్యను నిర్మూలింపుము. మహాత్మా! సర్వశక్తులకు నుద్బోధముగావించువాఁడవు నీవే. అట్టి నీ వాత్మస్వరూపముననే మహామాయను లోఁబడఁజేసికొని సకల విధములగునైశ్వర్యములఁ బడసినవాఁడవుకదా. సృష్టి యొనరించి దానిం బాలించి దానికి లయముగల్పించు కార్యంబులందుఁ గొన్నింటియందు నాయాకార్యావసరంబులంబట్టి యోగమాయావశమున నీయిచ్ఛచేతనే విహారము సల్పుదువు. అంతియ కాని నీవు దానికిలోఁబడువాఁడవుకావని శ్రుతులు బోధించును. ఘటములు మొదలగు వికారపదార్థములకుఁ బ్రకృతి ద్రవ్యము మృత్తికకదా. దానియందుఁ బుట్టుట లయించుట ఘటాదులకుం గల్గును. అట్లే వివర్తాధిష్ఠానత్వమునంజేసి వికారము లించుకయైనను లేని పరబ్రహ్మమువలన నీప్రపంచముల కన్నింటికిఁ బుట్టుట లయించుట యనునవి కలుగును. కాఁబట్టి సమస్తము బ్రహ్మావశిష్టముకావున జగత్తని యీశ్వరుఁడని నిరూపింపఁబడు నింద్రాదులెల్ల బ్రహ్మమే కాని వేఱొకటి కాదని బ్రహ్మదర్శనమున నేర్పఱులగుమహామునులు నిర్మలమగుమనస్సునందే సర్వకారణుఁడవు నిరీహుఁడవు నిర్గుణుఁడవునగు నిన్నే ధ్యానింతురు. వాక్కున నిన్నే స్తుతింతురు.

---

సరపద్ధతిం హృదయ మారుణయోదహరమ్, తత ఉదగాదనంతతవధామ శిరః పరమం పునరిహ యత్సమేత్య న పతంతి కృతాంతముఖే. ౧౯. స్వకృత విచిత్రయోనిషు విశన్నివ హేతుతయా తరతమతశ్చకాస్యనలవత్స్వ కృతానుకృతిః, అథ వితథాస్వమూష్వవితథంతమధామసమం విరజధియో౽

భూమిమీఁద సంచరించుమానవులు మృత్తికపయింగాని, పాషాణములమీఁదఁగాని, ఇష్టకాదులయందుఁగాని యెందుఁగాని యడుగుపెట్టినను అది భూమిమీఁదఁబెట్టినదిగాఁ గాకయుండునా. కావునఁ బరమేశ్వరా! నీచే నిర్మింపఁబడువారల నెవ్వనిబోధించినను నిన్నే బోధించినట్లగును. నీవే సర్వకారణత్వమునం బరమార్థంబని నిర్ణయించి వివేకులో త్రిగుణమాయానటీనర్తకా! పరమేశ్వరా! సకలలోకకల్మషహారంబగు నీదివ్యకథాసుధాపాథోనిధిం జొచ్చి దుఃఖములను బాపములను దొలఁగించుకొనిరి. త్వద్రూపజ్ఞానమున నంతఃకరణవృత్తులగు రాగాదులను జయించి కాలధర్మములగు ముసలితనములోనగువాని నిరసించి యఖండానందానుభవంబగు నీతత్త్వమును భజించువారిని బరమేశ్వరా! వచింపఁదరమా. వారే మహానుభావులు. ఈఘట్టమున మహాకవిపోతన,

చ. భరితనిదాఘతప్తుఁ డగుపాంథుఁడు శీతలవారిఁ గ్రుంకి దు
ష్కరమగుతాపముం దొరఁగు కైవడి సంసరణోగ్రతాప
ముల్, వెరవునఁబాయుచుండుదురు నిన్నుభజించు మహా
త్మకుల్ జరా, మరణమనోగుణంబులఁ గ్రమంబునఁ బాయు
ట చెప్పనేటికిన్.

---

న్వయంత్యభిభవపరస్యనపేక్షణమ్. ౨౦. స్వకృతపురేష్వమీష్వబహిరంతరసంవరణం తవ పురుషం వదంత్యఖిలశక్తిధృతోంశకృతం, ఇతి నృగతిం వివిచ్య కవయో నిగమావపనం భవత ఉపాసతేంఘ్రిమభవం భువి విశ్వసితాః. ౨౧. దురధిగమాత్మతత్త్వనిగమాయ తవాత్తతనోశ్చరితమహామృతాబ్ధిపరివర్తపరిశ్రమణాః, న పరిలషంతి కేచిదపవర్గమపీశ్వర తే చరణసరోజహంసకులసంగవిసృష్టగృహాః. ౨౨. త్వదనుపథం కులాయమిదమాత్మసుహృత్ప్రియవచ్చరతి

సీ. అనయంబు దేహి నిత్యానిత్యసద్విల
క్షణమునఁ బంచకోశవ్యవస్థ
నభివృద్ధిఁ బొరయుచు నందులోపలనున్న
ప్రాణాన్నబుద్ధివిజ్ఞానమయము
లనుచతుష్కోశంబు లవ్వలవెలుఁగొందు
నానందమయుఁడవు గాన దేవ
సురుచిరస్వప్రకాశుండవు నీపరి
గ్రహము గల్గుటఁ జేసి కాదె ప్రకృతి
తే. మహదహంకారపంచతన్మాత్రగగన
పవనతేజోంబుభూభూత పంచకాది
కలితతత్త్వముల్ బ్రహ్మాండకార్యకరణ
మందు నెపుడు సమర్థంబు లగుటఁ జూడ.

మానవు లెవ్వారు నీయందు భక్తిగలవారగుదురో వారు జీవన్ముక్తిని గాంతురు. అట్లుగాక యిచ్ఛానుసారము ప్రవర్తించి భక్తి యలవఱచుకొనలేని చర్మనిర్మితములగుతిత్తులవలె వృథాఉచ్ఛ్వాసనిశ్వాసముల విడుచువారలే యగుదురు. తోలుతిత్తులకు నట్టిమానవులకు భేదములేదని యెఱుంగవల

---

తథోన్ముఖే త్వయి హితే ప్రియ ఆత్మని చ, న బత రమంత్యహో అసదు
పాసనయాత్మహనో యదనుశయా భ్రమంత్యురుభయే కుశరీరభృతః. ౨౩.
నిభృతమరున్మనోఽక్షదృఢయోగయుజో హృది యన్మునయ ఉపాసతే
తదరయోపి యయుస్స్మరణాత్, స్త్రియ ఉరగేంద్రయోగభుజదండధియో
వయమపి తే సమాస్సమదృశోఽంఘ్రిసరోజసుధాః. ౨౪. కఇహను వేద
బతావరజన్మలయోఽగ్రసరంయతఉదగాదృషిర్యమనుదేవగణా ఉభయే, తర్హి
నసన్న చాసదుభయం న చ కాలజవః కిమపి న తత్ర శాస్త్రమపకృష్యశయీత

యును. నీవులోనం బ్రవేశించి కరుణింపఁబూని మహదహంకారా దులు పుట్టించిన యీయండమునందు నన్నమయప్రాణమ యాదికోశములతోఁగూడినవాఁడవగుచుఁ దదాకారత్వమునే పొంది యాపంచకోశనిరూపణము తర్వాతఁ జరమంబయ్యుఁ బుచ్ఛంబని ప్రతిపాదితుఁడ వగుదువు. అన్నమయ ప్రాణమ య మనోమయ విజ్ఞానమయానందమయము లనునైదుకోశ ముల నావేశించి తదాకారుఁడవై చేతనముగలవానిగా వానిం జేయువాఁడవు నీవే యని యిటఁగలసారము. స్థూలసూక్ష్మము లగు నన్నమయాది పంచకోశములకు నతిరిక్తంబై వానికి సాక్షియై శేషించునట్టి యబాధ్యైక సత్యబ్రహ్మంబవు నీవేకదా. శర్కరారజస్సుదృష్టులయందుఁగలవారు కూర్పదృశు లనఁబ డుదురు. వారు మహర్షిసంప్రదాయమార్గము ననుసరించు వారలై యుదరాలంబనమగు మణిపూరకచక్రమునం దుండు బ్రహ్మము నుపాసింతురు. అనఁగా మణిపూరకచక్రముననున్న బ్రహ్మమునుగా నిన్నుపాసింతురని సారము. ఎవ్వరు నిన్ను పాసింతురో వారు మరల నిస్సారమై దుఃఖమయమగుసంసార సాగరమునఁ బడి చెడకయుండఁజేయుశక్తిగలిగి జ్యోతిస్స్వరూ పమై నిన్నుఁ బొందఁజాలుటకు స్థానమై సుషుమ్న యను పేరు

యదా. ౨౫. జనిమసతస్సతోమృతిముతాత్మనియేచభిదాం విపణమృతం స్మరంత్యుపదిశంతి త ఆరుపితైః, త్రిగుణమయః పుమానితి భిదా యదబోధ కృతాత్వయి నతతఃపరత్ర సభవేదవబోధరసే. ౨౬. సదివమనస్త్రివృత్త్వ యివిభాత్యసదామనుజాత్సదభిమృశంత్యశేషమిదమాత్మతయాత్మవిదః, న హి వికృతిం త్యజంతి కనకస్య తదాత్మతయాస్వకృతమనుప్రవిష్టమిదమాత్మతయా వపి తమ్. ౨౭. తవ పరియేచరంత్యఖిలసత్త్వనికేతతయా త ఉత పదాక్రమం

గలనాడియందు వెడలి మూర్ధంబువఱకు వ్యాపించునట్టి హృదయంబులోనున్న దహరమున నివసించువానిగా నరుణవంశ్యులు నిన్ను ధ్యానింతురు. అనఁగా "శ్లో. ఉదరాదిషు యఃపుంసాం చింతితో మునివర్త్మభిః, హంతి మృత్యుభయం దేవో హృద్గతం తముపాస్మహే." అను ప్రమాణము ననుసరించి సూక్ష్మమతులగు నరుణవంశసంభూతులు కొందఱు హృద్గతమగు దహరమను పేరుగలస్థానమున నిన్ను నున్నయట్లు భావించి హృదయపుండరీకాంతర్గతమగు నాకాశరూపునిగా నిన్నుపాసింతురని భావము. మఱియు వైశ్వానరవిద్యానిష్ఠులు కొంద ఱుదరస్థజాఠరాగ్నిశరీరకునిగా నిన్నుపాసింతురని సారము.

ఆత్మనిర్మితములగు నుత్తమమధ్యమాధమ నానావిధకార్యదేహములయం దుపాదానకారణత్వమునఁ బూర్వమే యుండిన నప్పుడే ప్రవేశించినట్టులు తోఁచుచు నగ్నిహోత్రము కట్టెలహ్రస్వదీర్ఘత్వాదిధర్మముల నెట్లో యట్లు స్వకృతములగునాకృతుల ననుకరించుచుఁ దారతమ్యమును వెలిఁబుత్తువు. ఆదేహములు మిథ్యాభూతములు. ఐనను వానియందు సత్యవై

త్యవిగణయ్య శిరోనిర్మృతేః, పరివయసే పశూనివ గిరావిబుధానపి తాం స్త్వయికృతసౌహృదాః ఖలు పునంతి న యే విముఖాః. ౨౮. త్వమకరణస్వరాడఖిలకారకశక్తిధరస్తవ బలిముద్వహంతి సమదంత్యజయానిమిషాః, వర్షభుజోఽఖిలక్షితిపతేరివ విశ్వసృజో విదధతి యత్ర యేత్వధికృతాభవతశ్చకితాః. ౨౯. స్థిరచరజాతయస్స్యురజయోత్థనిమిత్తయుజో విహరఉదీక్షయా యదిపరస్య విముక్తతతః, న హి పరమస్య కశ్చిదపరో నపరశ్చ భవేద్వియత ఇవాపదస్య తవ శూన్యతులాం దధతః. ౩౦. అపరిమితాధ్రువాస్తనుభృతో యదిసర్వగతాస్తర్హి న శాస్యతేతి నియమోధ్రువనేతరథా,

నిర్విశేషమై సన్మాత్రమై వెలయునీస్వరూపమును ఐహికాముష్మికకర్మఫలాభిసంధిఁ గోరక పరిశుద్ధచిత్తములు గలిగియుండు సాధువులే యెఱుంగుదురుకాని యితరుల కెఱుంగఁదరంబు గాదు. తమతమకర్మములవలన నార్జితము లగుదేహములయందు భోక్తృరూపమునఁ బురుషుఁడు కార్యకారణరూపములగునావరణములు లేక సర్వశక్తిపరిపూర్ణువు నగు నీయంశమువలె వర్తించునని జీవతత్త్వమును బరిశీలించి యందలిసారము నెఱింగినవిద్వాంసులు సర్వకర్మముల నొనరించి నీ కల్పించుకార్యమున బద్ధాదరులై సంసారతాపముల నడంచునీపాదారవిందమును నమ్మి మర్త్యలోకమున నుపాసింతురు. పరమేశ్వరా! కరుణాసాగరా! మహాప్రభూ! ఎవ్వారికేని దుర్బోధమగు నాత్మతత్త్వమును బోధింప శరీరము నంగీకరించితివి. ఇట్టియర్థారూపుఁడవగు నీదివ్యకథ లనేయమృతసాగరమునందు మునిఁగి

---

అజని చ యన్మతం తదవిముచ్య నియంతృభవేత్సమమనుజానతాం యదమతం మతదుష్టతయా. ౩౧. నఘటితడిద్భవః ప్రకృతిపూరుషయోరజయోరుభయయుజా భవంత్యసుభృతో జలబుద్బుదవత్, త్వయి త ఇమే తతో వివిధనామగుణైః పరమే సరిత ఇవార్ణవే మధుని లిల్యురశేషరసాః. ౩౨. నృషు తవ మాయయా భ్రమమమీష్వవగత్య భృశం త్వయి సుధియోఽభవే దధతి భావమనుప్రభవమ్, కథమనువర్తతాం భవభయం తవ యద్భ్రుకుటిస్సృజతి ముహుస్త్రినేమిరభవచ్ఛరణేషు భయమ్. ౩౩. విజితహృషీకవాయుభిరదాంతమనస్తురగం య ఇహ యతంతి యంతుమతిలోలముపాయఖిదః, వ్యసనశతాన్వితాస్సమపహాయ గురోశ్చరణం వణిజ ఇవావిశంత్యకృతకర్ణధరా జలధౌ. ౩౪. స్వజనసుతాత్మధామధనదారధరాసురథైస్త్వయి సతి కిం నృణాం శ్రయత ఆత్మని సర్వరసే, ఇతి సదజానతాం మిథునతో రతయే

సంసారతాపములను బాసి కొందఱు మీపాదపంకజములను గలహంసలవిధమున నొప్పుమహాభక్తుల సహవాసముచేతఁ దుచ్ఛతమములగుగృహాదులఁ ద్యజించి నీభక్తిగలిగి మోక్షమును గూడఁ గోరరు.

నిన్నే యనుసరించుచు నిన్ను భజించుట కొకసాధనమైన యీశరీరమును ఆత్మసుహృత్ప్రియసమానముగానున్నను హితుఁడు సఖుఁడు నాత్ముఁడు నగునీవు ప్రసన్నుఁడవైయుండినను నీభక్తినివదలి దేహగృహాదులయం దాశచేఁ బూర్వవాసనచే నుపలాలించుచు నాత్మఘాతుకులై నీచములగుశరీరములెత్తుచు సర్వదా భయముతోఁగూడిన సంసారకూపమునంబడి తిరుగుచుందురు. ప్రాణమును, మనస్సును, ఇంద్రియములను స్వాధీనముననుండునట్లు నియమించి దృఢయోగము నలవరించుకొని కాలముంగడుపుమౌనులు తమహృదయములందు నిల్పి యుపాసించు నిన్నే శత్రువులు స్మరించుటచేతను, గామినులు సర్పము భోగము (పడగ) వలెనున్న భుజదర్శనానురాగమునం బడసిరి. మేమెల్లసర్వభూతసమదర్శనమున నీకరుణంబొందె సర్వ

చరతాం సుఖయతి కోఽన్విహ స్వవిహతే స్వనిరస్తభగే. ౩౫. భువి పురు పుణ్యతీర్థసదనాన్యృషయో విమదా స్తఉత భవత్పదాంబుజహృదోఽఘభిదంఘ్రిజలాః, దధతి సకృన్మనస్త్వయి య ఆత్మని నిత్యసుఖేన పునరుపాసతే పురుషసారహరావసథాన్. ౩౬. సత ఇదముత్థితం సదితి చేన్నను తర్కహతం వ్యభిచరతి క్వచ క్వచ మృషా న తథోభయయుక్, వ్యవహృతయే వికల్ప ఇషితోఽంధపరంపరయా భ్రమయతి భారతీ త ఉరువృత్తిభిరుక్థజడాన్. ౩౭. నయదిదమగ్ర ఆసనభవిష్యదతోనిధనాదనుమితమంతరా త్వయి విభాతి మృషైకరసే, అత ఉపమీయతే ద్రవిణజాతి వికల్పపథైః

భూతసమత్వబుద్ధినలవరించుకొనినీ పాదపంకజమకరందరసమును నిరంతరము ద్రావుచున్నాను. మహాత్మా! సృష్టికిం బూర్వమే యున్న నిన్నుఁ దరువాత నుత్పత్తివినాశములుగల యెవ్వాఁ డెఱుంగఁగలఁడు. నీవలననే బ్రహ్మపుట్టెను. తరువాతనాతనినను సరించి యాధ్యాత్మికములు. ఆధిదైవికములునగు దేవగణంబులు పుట్టెను. వానియనంతరముభూతజాలంబుకలిగెను. వీనినన్నింటి నుపసంహరించి యోగనిద్రం దాల్చి నీవుండుతరుణమునందు స్థూలసృష్టికిం జేరిన యాకాశము లోనగునవియు, సూక్ష్మసృష్టికి సంబంధించినమహదాదులు సదసదారబ్ధశరీరము దానికి నిమి త్తభూతంబగు కాలవైషమ్యము, ఇంద్రియములు, ప్రాణా దులు జ్ఞాపకంబగుశాస్త్రంబును లేకుండెను.

అసత్తు జగత్తనుట సిద్ధము. అట్టిదాని కుత్పత్తి గలద నియు, సత్తనఁబడు బ్రహ్మంబె పుట్టుకంగాంచెననియు, సత్తు అయి యిరువదియొకవిధములుగా నుండుదుఃఖమునకు ధ్వంసము

---

ర్విపక్షమనోవిలాసమృతమిత్యవయంత్యబుధాః. ౩౮. సయదజయాత్వజా మనుశయీతగుణాంశ్చ జుషన్ భజతి సరూపతాం తదను మృత్యుమపేత భగః, త్వముత జహాసి తామహిరివ త్వచమాత్తభగో మహసి మహీయసేఽ ష్టగుణితేఽపరిమేయభగః. ౩౯. యది న సముద్ధరంతి యతయో హృది కామజటా దురధిగమోఽసతాం హృదిగతోఽస్మృతకంఠమణిః, అసుతృ పయోగినాముభయతోఽప్యసుఖం భగవన్ననపగతాంతకాదనధిరూఢపదా ద్భవతః. ౪౦. త్వదవగమీ న వేత్తి భవదుత్థశుభాశుభయోర్గుణవిగుణాన్వ యాంస్తర్హి న దేహ భృతాం చ గిరః, అనుయుగమన్వహం సగుణగీతపరం పరయా శ్రవణభృతో యతస్త్వమపవర్గగతిర్మనుజైః. ౪౧. ద్యుపతయ ఏవ తేన యయురంతమనంతతయా త్వమపియదంతరాండనిచయాననుసావ

గలుగుటయే మోక్షమనియు, నాత్మస్వరూపము ఖేదఘటితం బనియును, గర్మములఫలములను గుఱించినవ్యవహార మనఁగా లోకప్రవాదము సత్యమే యనియుఁ బెక్కండ్రు పెక్కులై అంగుల నారోపితభ్రాంతి గలిగినవార లగుచు నందఱకు నుప దేశింతురు. పురుషుఁడు త్రిగుణమయుఁ డను భేదము నీతత్త్వ మెఱుంగనియజ్ఞానమునఁ గల్గుటచేత నాయజ్ఞానమునకు మీఁద నిస్సంగుఁడై జ్ఞానసంపన్నుఁడై యేకరీతిగా నుండునీయందు వారియబోధము చెల్లదు. మనోమాత్రవిలసిత మగునీసత్త్వ రజస్తమోమయప్రపంచ మసత్తయ్యును నీయందధిష్ఠాన సత్తచే సత్తువలెనే తోఁచెడిని. ఈప్రపంచమే కాదు. పరికింపఁగాఁ బురుషుఁడు నట్టివాఁడు. ఆత్మవేత్తలు భోక్తృభోగ్యాత్మకం బగునీవిశ్వము నాత్మరూపమున నాత్మకార్య మగుటచే నుపా దానకారణ మగునాత్మకు నభిన్నమై సత్తని నిశ్చయింతురు. కనకము నపేక్షించువారు దానిమాఱురూపము లగుకటక కుండలాదు లన్నియుఁ గనకము కాదని మానుదురా? కాఁబట్టి యాత్మనిర్మితమై యనుప్రవిష్ట మగు నీప్రపంచమాత్మరూపం బే యగును. సర్వభూతాంతరావాసుఁడవని నిన్నెవ్వ రుపాసిం

---

రణాః, ఖ ఇవ రజాంసి వాంతి వయసా సహ యచ్ఛ్రియస్త్వయి హి ఫలం త్యతన్నిరసనేన భవన్నిధనాః. ౮౨. భగవాన్:—ఇత్యేతచ్ఛ్రిష్టాణః పుత్త్రా ఆశ్రుత్యాత్మానుశాసనమ్, సనందనమథానర్చుస్సిద్ధా జ్ఞాత్వాత్మనోగతిం. ౮౩. ఇత్యశేషసమామ్నాయపురాణోపనిషద్రసః, సముద్ధృతః పూర్వజైస్తైర్వ్యోమ మయానైర్మహాత్మభిః. ౮౪. త్వం చైతచ్ఛ్రిష్టదాయాద శ్రద్ధయాత్మాను శాసనమ్, ధారయంశ్చరగాంకామం కామానాం నిధనం నృణామ్. ౮౫. శుకః:—ఏవం స్వగురుణాదిష్టం గృహీత్వా శ్రద్ధయాత్మవాన్, పూర్ణశ్శ్రి

తురో వారు మృత్యువును లెక్కింపక దానితలపైఁ బాదము పెట్టుదురు. నీయందుఁ బరాఙ్ముఖు లగుమూర్ఖులు విద్యాసాంగతు లైనను వారిని బశువులవలె వేదమయమగు నీవాక్కునఁ గట్టివేయుదువు. మహానుభావా! నీయందు సుహృదయము గలవారలు తమకు నితరులకును బావనత్వము నావహింపఁజేయుదురు.

నీవు స్వతస్సిద్ధమగుజ్ఞానప్రకాశుఁడవు. కాఁబట్టి నీవింద్రియసంబంధము లేనివాఁడవయ్యును సమస్తప్రాణులయింద్రియశక్తులకుఁ బ్రవృత్తిని గలుగఁజేయుదువు. అవిద్యావరణముగల యింద్రాదు లందఱును, బ్రపంచములనిర్మించు బ్రహ్మాదులును నీ వేర్పఱచినస్థానములయందు నిలిచి నీకు భయపడుచుఁ జక్రవర్తికిఁ గప్పమిచ్చురాజులవలె నీయాజ్ఞాపరిపాలనమును కప్పమును సమర్పించి మానవులు తమకు నిచ్చినహవ్యకవ్యాదిరూపమగు బలిని భుజింతురు. పరమపూరుషా! నీవు నిత్యముక్తుఁడవు. మాయాతీతుఁడవు. నిస్సంగుఁడవు ఇట్టి నీవె అమ్మాయతో విహరింపఁ గోరినతఱి నీదృష్టిఁ బుట్టినకర్మముల సంగతిఁ జరాచరశరీరాశ్రయు లైనజీవులు కనఁబడుదురు. పరమకారుణికుఁ డగువాఁడాకాశముతో సమానుఁడు. వానివలె సర్వసముఁ డగువాఁడు శూన్యతుల్యుఁడు. అవాఙ్మానసగోచరుఁడు. అట్టివాఁడవు నీవే. అట్టినీకు స్వీయుఁడని పరుఁడని భేదము గలుగదనుట నిక్కము. శాశ్వతుఁడ వగు నోపర

---

ధరో రాజన్నాహ వీరవ్రతో గురుమ్. ౪౭. నారదః—సమస్తస్మై భగవతే కృష్ణాయామలకీర్తయే, యో ధత్తే సర్వభూతానామభయాయ సతీః కలాః. ౪౭. శుకః—ఇత్యావ్యమృషిమామన్త్ర్య తచ్ఛిష్యాంశ్చామలాత్మనః,

మేశ్వరా! అంతములేనివారు నిత్యులనఁబడువారు, సర్వగతులను ప్రఖ్యాతిం గాంచినవారు జీవులే యగుదురేని వారెల్ల సములే కావున శాసనీయత్వము చెల్లదని నీకును దన్నియామకము ఘటింపకయే యుండునుగాని మఱొకపద్ధతిం గలుగును.

ఉపాధియోగముచేత జీవతత్త్వము దేనివికారప్రాయమో, ఏది సమము, తెలిసితిమని యూహించువారలకు నేడి జ్ఞాతదోషశ్రవణమున నవిజ్ఞాతము నగునో యాయది కారణభావమును వదలక యాత్మవికారమునకు నియామకమగునని తెలియవలయు. పుట్టుకలేనట్టి ప్రకృతినిఁ బురుషునకు సంయుక్తములగు నా రెండింటికిని జీవరూపమున నుత్పత్తియే సంభవింపదు. అంతియగాక పరస్పరాధ్యాసముచేతఁ బ్రకృతినిమిత్తము కాఁగాఁ బూరుషుఁ డుపాదానము కాఁగా జలమును గాలియును గూడిననీటిలో బుగ్గలు గలుగుచందమున సోపాధికజీవజన్మంబు ఘటించును. కాఁబట్టి మధువులో సకలపుష్పరసము లుండునట్లు సుషుప్తియందును బ్రళయమునందును సాగరమునందు నదులవలె ముక్తిదశయందుఁగూడ నిరుపాధికుఁడ వగు నీలోఁ బూర్వోక్తజీవులు బహువిధకార్య కారణోపాధులతోడ లయముగాంతురు. ఈజీవకోటియందుఁ గానఁబడు నిట్టిమాయాభ్రాంతిని దెలిసికొని జ్ఞానవంతులు సంసారనివర్తకుఁడ వగునీపై ననుస్యూతమగుభావము చక్కఁగాఁ జేయుదురు.

---

తతో౽గాదాశ్రమం సాక్షాత్పితుర్ద్వైపాయనస్య మే. ౪౭. సభాజితో భగవతా కృతాసనపరిగ్రహః, తస్మై తద్వర్ణయామాస నారాయణముఖాచ్ఛ్రుతమ్. ౪౮. తచ్ఛైతద్వర్ణితం రాజన్ యన్మాం ప్రశ్నః కృతస్త్వయా

శీతముష్ణమువర్షము ననుమూఁడునేములుగల సంవత్సరాత్మక కాలమును నీబొమముడిరూపము గలది. (అనఁగాఁ గనుబొమలు ముడిపెట్టుటచే నిది గలుగుననుట.) అట్టికాలము లోకమున నెవ్వరు నిన్ను భజింపకుందురో యట్టినీచులకే పుట్టుకచావు అనుమొదలగు వాని భీతిని గల్గించును. అంతియకాని సర్వదా నిన్నే నమ్మి యాశ్రయించి యున్నవారల కాసంసారభయం బెలాగునఁ గల్గఁగలదు? (అనగా నెవ్వరు నిన్నే నమ్మి యుందురో వారికి జన్మమరణములు లేనిముక్తి లభించుననుట.) ప్రాణేంద్రియములను జయించినవారలకు నతిచంచలమయి యేకాగ్రతం బొందింపనలవిగాని మనస్సనేగుఱ్ఱమును నిగ్రహించుటకు గురువర్యునిచరణము తప్ప వేఱొండుమార్గమున నుపాయమును వెదకువారు సముచితమగునుపాయమును దెలియఁజాలక దుఃఖములపాలై బహువిధవిచారములు గలిగి యోడనడపువాఁడు లేకుండినపు డోడలో నున్నవ్యాపారస్థులు సముద్రమునం దెట్లు పడుదురో యట్లే సంసారసముద్రమునందుఁ బడి దానినుండి వెడలునుపాయంబుఁ గానక పరితపింతురు. (అనఁగా సద్గురుచరణము సంసారభీతినుండి యుద్ధరింపఁజేయును. గావున మంచిగురువుకడం జేరి సంసారసాగరతరణోపాయము నెఱుంగవలయుననుట.)

---

యథా బ్రహ్మణ్యనిర్దేశ్యే నిర్గుణేఽపి మనశ్చరేత్. ౫౦. యోఽస్యోత్ప్రే)క్షక ఆదిమధ్యనిధనే యోఽవ్యక్తజీవేశ్వరో యస్సృష్ట్వేదమనుప్రవిశ్య ఋషిణా చక్రే పురశ్శాస్తితాః, యం సంపద్య జహాత్యజామనుశయీ సుప్తః కులాయం యథా, తం కైవల్యనిరస్తయోనిమభయం ధ్యాయేఽజస్రం హరిం. ౫౧.

నిన్ను నమ్మియుండువారి కాత్మరూపుఁడవై యానంద మయుఁడవగు నీవుండఁగా నతినీచములగు కళత్రపుత్ర దేహాగృహార్థబాంధవభూగ్రామ్యసుఖాదులతో నేమిలాభము? అని పురుషార్థలక్షణము తెలియక మిథునాదిమాయాసుఖమును గోరి చరించువా రెవ్వరో యట్టివారలకుఁ బ్రకృతిసంబంధమున నాచ్ఛాదింపఁబడి యసాధారణజ్ఞానైశ్వర్యములు నిరస్తములై యసాధారణముగా వెలయునీస్వరూప ముండఁగా నీలోకమునందు వర్షకామములలో నేదిసుఖమును గల్గింపఁజాలును? అట్టిమహానుభావులు సంసారకారణమగు నహంకారమును మాని నీపాదారవిందద్వంద్వమును దమచిత్తములందుఁ జేర్చి యాత్మపాదోదకము జగత్పావనము కాఁగా ప్రసిద్ధపుణ్యయాత్రలు సత్సాంగత్యము చేయుచు మానవులకు యుక్తాయుక్తవివేకము ధైర్యము, శాంతి (ఓర్పు) మొదలగువాని సారమును సంహరించుగృహముల నిష్టపడరు.

పరమపూరుషా! జన్మమధ్యమునం దొక్కసారియేని ఆత్మయు నిత్యసుఖస్వరూపుఁడవు నగునీయందుఁ దమచిత్తము నిలుపఁ బూనినవారే గృహాదులయందు మమకారమును వదలుదురఁట. అట్టిమహాత్ములను బ్రస్తావింపనేల? సత్తునుండి ప్రభవించిన యీజగత్తును సత్తే యని చెప్పుదుమేని తర్కశాస్త్రము ననుసరించి కార్యకారణములకు భేదము నిర్దేశముననే నిశ్చితమగుటచేత నాయుక్తి నిలువదు. కాఁబట్టి సదాత్మతసిద్ధాంతము చేయ నలవి గాకయుండును. అంటియెగాదు. కార్యకారణములకుం గల్గినభేదము సాధ్యముగాకున్నను వానిభేదప్రతిషేధము సాధింతుమందుమేని కొన్నికార్యకారణములయెడ

నయ్యదియుఁ దప్పిపోవుచున్నది. రజ్జుసర్పజ్ఞానవిషయమునం దుపాదానకారణము గుణముగాఁగలసర్పము మిథ్యయే యగుట స్పష్టమగుచున్నది. కావున నీయుదాహరణము నందుఁ గేవలగుణమొక్కటియే కారణము కాదనియు నవిద్యాసమ్మిళితగుణమే కారణమనియు దానిచేత నట్టిది వస్తువు గాక యుండుటచే నందు మిథ్యాత్వ ముపపన్న మన్నయెడల నిందు నవిద్యాయుక్తమగుసత్త్వొక్కటియే యుపాదాన మగును గాఁబట్టి యట్టియభయయోగికారణము కార్యమునకుసాత్త్వికతం గావింపసమర్థము కాదు. ఆపదార్థమునకుఁ గారణత్వమును వానికార్యముల వర్ధక్రియాకారిత్వము నంధపరంపరాన్యాయమున లోకవ్యవహారార్థము కల్గినభ్రమవలనం గల్గుచుండును. మహానుభావా! పరమేశ్వరా! నీవేదవాక్కే కర్మజడులగువారలకు బహువిధవృత్తులచే భ్రమగల్గించెడిని. సృష్టికంటెఁబూర్వమును బ్రళయమునకనంతరమును లేనియీజగత్తు మధ్యభాగమున మిథ్యాభూతమే యైనను గేవలాఖండస్వరూపుఁడవగు నీయందుఁ బ్రతీతిమాత్రముగాఁ దోఁచుచుండుననుట యథార్థము. కాఁబట్టి మృత్తుమొదలగు వానికార్యములగుఘటాదులెట్లో అట్లే బ్రహ్మకార్యములగునాకాశాదులన్నియు నామమాత్రసారములు. కావున నవ్వానియందు మృత్తుమొదలగు వానివలె బ్రహ్మతేజంబె నిత్యంబు.

నిరర్థకమగుమనోవిలాసమువంటిదైన యీజగత్తు సత్యమని తలంచువారలే యవిద్వాంసులు. మాయచేత నవిద్య గలుగ దానింగాంచి దేహేంద్రియాదులపై నాత్మాధ్యాసము చేసి వానిధర్మంబులంబొంది యానందాద్యావరణమును గని

జీవుఁడు సంసారమునందుఁ జిక్కును. విశ్వేశ్వరా! నీవో యట్లు గాదు. నిరంతరము సంప్రాప్తమగు నఖండైశ్వర్యము గలవాఁడవు. అట్టినీవు పాము కుబుసమును వదలునట్లు మాయను దొలఁగించుకొందువు. నీయైశ్వర్యవిలాసము లనంతములు. అష్టైశ్వర్యములం గూడినపరమైశ్వర్యమునఁ బ్రకాశించుచుందువు. యతీశ్వరులైనను తమహృదయమునఁ దోఁచుచుండు కామవాసనల మొదలంటఁ దొలఁగించుకొనకపోయినయెడల వారికిం గూడఁ గంఠముననున్న రత్నము మఱచిపోయినవాని కారత్నమురీతి హృదయగతుండవయ్యును నీవు తోఁపకయుందువు. మఱియు నాయింద్రియములఁ దృప్తిచేయుటయే మహాకార్యమనుకొనువారలకెల్లఁ దప్పని మృత్యువు వలనను నీపదారవిందముల నుపాసింపని కతమునను నిహపరములయందు దుఃఖమే కలుగునుగాని సుఖమేమాత్రము కలుగదు. షడ్గుణైశ్వర్యవిలాసా పరమాత్మా! భవద్విషయకవిజ్ఞానము గలవాఁడు సకలకర్మములకు ఫలముల నిచ్చు నీమూలమునఁ గలిగిన ప్రాచీనపుణ్యపాపఫలము లగుసుఖదుఃఖములను దేహాభిమానము గలవారలకుఁ గలుగునట్టి విధినిషేధచోదనల ననుసంధింపఁడు. ప్రతియుగమందును నీవుపదేశించుపరమార్థమును సత్సంప్రదాయమున సంపాదించి సంస్తుతించుమానవులవినుతుల నాలకించి నీవు వారికి ముక్తిని బ్రసాదింతువు. మహానుభావా! ఒకదానికంటె నొకటి పదింతలుగా నధికమగు సప్తావరణములంగూడియున్న బ్రహ్మాండసముదాయములు వియన్మార్గమున రజస్సులవలెఁ గాలచక్రమునందుఁ దనలోఁ జరించు నీదైనయంతమును బ్రహ్మాదులును గనుఁగొనఁ

జాలరు. బ్రహ్మాదు లనఁనేల? (వస్తువుగాని నీదగునంతయు ననంతత్వమున నీవే తెలిసికొనఁ జాలవు. సగుణమునకు ననంతగుణములు కలుగుటవలనను. నిర్గుణ మగోచరమగుట నని సారము.)

ఈరీతిగా సగుణపక్షమున ననేకగుణములుండుటయు నిర్గుణవిషయమున నగోచరత్వము కారణములుగాఁగ శ్రుతులన్నియుఁ దద్భిన్ననిషేధవిషయమునందు నవధిభూతుఁడవగునీయందుఁ బర్యవసన్నములై తాత్పర్యవృత్తిచేత నీయందు ఫలించునని బోధించునని నిర్ణయించిన యాత్మానుశాసనము నాకర్ణించి సనకాదిసిద్ధులును లాత్మగతిని జక్కఁగాఁబరిశీలించి దానితత్త్వము నెఱింగి సనందను బూజించిరి. ఇట్లు ప్రాచీనమహామునులు బహుశ్రుతిపురాణముల రహస్యతత్త్వార్థము నుద్ధరించిరని యెఱుంగుము. ఓనారదమునీ! మానవులకుంగలకామవిధ్వంసకంబగు నీయాత్మానుశాసనమును శ్రద్ధతో విని దానిసారమును గ్రహించి యిచ్ఛానుసారము భూలోకమునఁ జరించుచుండుమని తనగురువుపదేశింపఁగా నాయుపదేశము నాలకించి కృతార్థుఁడై యాయుపదేశసారమును బట్టుదలతోఁ దెలిసికొని జితేంద్రియవ్రతనిరతుండై ననారదముని తనకుగురువగు నారదమునివర్యునకుఁ బ్రాంజలియై సర్వభూతాభయమునిమిత్తము సత్త్వమూర్తుల ధరించునట్టి శ్రీకృష్ణునకు నమస్కారములని పలికి శ్రీనారాయణమహర్షిని వారిశిష్యులను వీడుకొని యాచేరువనున్న మా పితృచరణులగు వ్యాసమునీంద్రులయాశ్రమంబున కరుదెంచి సత్కారముల కలరి కూరుచుండి నారాయణముని యేయర్థమును దనకుపదేశించెనో యాయుపదేశమునెల్ల మాతండ్రికడ వివరించెను.

నిర్దేశింపఁదరముగాని బ్రహ్మామునందుఁ మనసెట్లు ప్రవర్తించునని నీవు నన్నడిగినప్రశ్నమునకే యోపరీక్షిద్రాజేంద్రా! బదులుచెప్పితిని. ఏపరమేశ్వరుఁ డీప్రపంచములకు నుత్పత్తిస్థితివిలయములను గలుగఁజేయునో, యేమహానుభావుఁ డట్టులాలోచించి వీనికి జన్మపాలనప్రళయములంగల్గించునో, యేపరమపూరుషుఁడు ప్రకృతిపురుషులకు నీశ్వరుఁడగునో, యేమహాత్ముఁడు జీవునితోఁడ భోగాయతనములగు శరీరములను నిర్మించి పాలించునో, నిద్రించుపురుషుఁడు శరీరమునుదాల్చినట్లు ఏపరమాత్మను బొందిజీవుఁడు కార్యకారణలక్షణావిద్యనుబాయునో, ఏనాఁటికి నశింపనిస్వరూపావలంబనమున మాయను నిరసించుచు భయనివర్తకుండైన యాశ్రీహరిని సర్వదా ధ్యానింపందగు. అని శుకయోగిపలుకఁగా విని పరీక్షిన్నరేంద్రుం డిట్లు ప్రశ్నించెను.

## విష్ణుసేవాప్రాశ_స్త్యము.

* ఓశుకయోగీంద్రా! విషయభోగముల వదలియున్న పరమేశ్వరునిగొల్చి దేవతలు నసురులు మానవులును ధనవంతులగుదురు. అంతియగాని లక్ష్మీనాయకుండగు శ్రీమన్నారాయణమూర్తి నాశ్రయించి సేవించువారలు ధనవంతులుగాకయుండుటకుం గతంబేమి! దాని నెఱుంగఁగోరెదను. విరుద్ధస్వభావులగు ప్రభువుల సేవించువారికి విరుద్ధఫలంబుగలుగునీయర్థమున సందేహము పొడముచున్నయది. దీనిందీర్పుమా యని ప్రశ్నిం

*ఈవిషయము దశమస్కంధమున నెనుబదెనిమిదవయధ్యాయమునుండి సంగ్రహింపఁబడినది.

చెను. ఆప్రశ్నమునువిని యోగీంద్రుండాదరముననిట్లుపలికెను. శంకరుఁడు శక్తియుక్తుఁడై గుణపరివృతుఁడై వైకారికతైజసతామసములనఁబడు త్రివిధాహంకారములంగాంచి త్రిలింగుండనంబడు. ఆయహంకారముచేతఁ బదాఱువికారములుగలుగు. అందును గొంచెమువికారముపాధిగాఁగలమూర్తినాశ్రయించిన నాయుపాధులకు ననురూపములగువిభూతులగతిని భక్తుఁడు ప్రాపించును. హరినిర్గుణుఁడు. ప్రకృతిపురుషుల కతీతుఁడు. సర్వసాక్షిగావున నన్నియుఁజూచుచుండు. ఆదేవునిసేవించువాఁడు నిర్గుణుండుకావలయుఁగదా. పూర్వము నీకుఁబితామహుఁడగు ధర్మరాజు హయమేధమహాక్రతువు నాచరించి యనంతరము భాగవతధర్మములశ్రద్ధచే వినుచు శ్రీకృష్ణునిఁగాంచియీప్రశ్నమునే కావించెను. మానవులకు సకలపురుషార్థముల నిచ్చుటకే యదుకులమున నవతరించిన యాశ్రీకృష్ణమూర్తి యాప్రశ్నమును విని మిగులనానందించి మీతాత కిట్లు బదులుచెప్పెను. ధర్మరాజా! నేనెవ్వనిపైఁ గృపఁజూపుదునో యాతనియైశ్వర్యమునెల్ల నపహరింతును. దానిచే నాభక్తులు దుఃఖాలయమగునాద్రవ్యమును వదలుదురు. ధనాభిలాషమునఁ బ్రయత్నించియుఁ గూడ నిష్ఫలప్రయత్నుఁడై యాతండు నిర్వేదమునొంది నాభక్తులపొందుఁగోరి యదిదొరకఁగా దాని మూలమున నాదయను బొంది సచ్చిన్మాత్రానంతరపరబ్రహ్మమై యారాధింపనలవిగాకయున్న నన్ను సేవింతురు. పామరుఁ డన్యులనుపాసించి శీఘ్రకాలమున సంతోషించునట్టి యాదేవతలవలన రాజ్యభోగాదుల సంపాదించుకొని గర్వించి యావరముల ననుగ్రహించినవారినిమఱచి యవమానించును అనిశ్రీకృష్ణుఁడు ధర్మ

రాజునకుం దెల్పెను. బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులు శాపప్రసాదములకధిపతులేకాని బ్రహ్మయు శివుఁడును వేగమున శాపానుగ్రహముల నొనర్చునట్లులే యచ్యుతుఁ డొనరింపఁడు. పూర్వము వృకాసురుఁడు శివునివలన వరములను బడసి యాశంకరునకుఁ గష్టము గల్గింపఁగా నాకష్టములను హరుఁడనుభవించిన యితిహాసం బీప్రశ్నమునకు నుదాహరణంబగును. దానిని వినిపించెద నాలకింపుమని శుకయోగి యిట్లు పలికెను.

## వృకాసురుఁడు శివున కపకారముచేసి దానిఫల మనుభవించుట.

రాజా! మున్ను శకునియనుదానవునికుమారుఁడు వృకుఁడనుదానవుఁడుండెను. వాఁడొకనాఁడు మార్గమధ్యమున నారద మౌనిం గాంచి బ్రహ్మవిష్ణుశంకరులలో నెవ్వఁడు శీఘ్రసంతోషము కలవాఁడగును. అని ప్రశ్నింపఁగా నారదముని దైతేయప్రవరా! కార్యఫలము త్వరగాఁ గాంచవలయునని కోరుదువేని పార్వతీనాథుని సేవింపుము. ఆశంకరుఁడు స్వల్పసద్గుణమునకే ప్రసాదమునొందును. స్వల్పదోషమునకే యాగ్రహించును. వందిజనులవలెవినుతించినరావణునకు బాణాసురునకు సాటిలేనియైశ్వర్యమొసంగి యాతఁడే పిదప సంకటమునొందెను. అని పలికిన వినియావృకాసురుఁడు కేదారక్షేత్రమునకుం బోయి యగ్నిముఖమొనరించి తనదేహమును గోసి యామాంసమును హోమముచేసి శంకరు నారాధించెను. ఆఱుదినము లీరీతి నారాధించియేడవనాఁడు శివు ననుగ్రహంబును బడయంజాలక వగచుచుఁ దీర్థోదకస్నానంబునఁ దడిసియున్న కేశములుగలతనశిరస్సును దెగఁగోసి హోమముచేయ నుద్యోగింపఁగా గరుణావారాశి యగుమహాదేవుఁడు తత్కాలమున నాయగ్నికుండ

మునుండి వెలువడి వచ్చి వాని రెండుచేతులు పట్టుకొని తలఁ దెగఁగోయవలదని వారించెను.

ఆ రాక్షసుఁడు సదాశివునికరస్పర్శమునఁ బరిపూర్ణ దేహుం డయ్యెను. ఇట్లు కరుణించినశంకరుఁడు దానవవర్యా! అభీష్టంబు వేఁడుము. జలబిందువొసంగినను బ్రీతినొందువాఁడను. నీవు దేహమునే నాకర్పింపఁ బూనితివి. ఇకఁ గరుణింపకుండుదునా. అనిపలుకుటయు నాపాపాత్ముఁడు మహానుభావా! నే నెవ్వాని శిరస్సుపైఁజేయి పెట్టుదునో వాఁడు చచ్చునట్లు వరంబిమ్ము. ఇది యే నాయభీష్టంబన్న విని యాతనికోరికకు మదినించుక ఖిన్నుఁడైనను నాపార్వతీశ్వరుండు సుస్మితాననుఁడై పామునకుఁ బాలుపోసినభంగిని వాని కావరం బొసంగెను. అంతట నాదు రాత్మకుఁడు తద్వరమును బరీక్షింపందలంచి శంకరుమూర్ధమునఁ దనచేయి పెట్టఁబోయెను. శివుఁడు స్వయంకృతాపరాధమున నిట్లయ్యెఁ గదా యని వెఱచి నాల్గుదిక్కులకుం బరుగులిడెను. కాని వాఁడువెంటనంటి రాఁగాఁ బ్రతిక్రియ నేమిచేయుటకుం దోఁపక శాంతులగుసన్న్యాసులకు యోగులకు నావాసమై పునరావృత్తిరహితనివాసమునకుఁ గారణంబయి తమస్సునకతీతమై తగువైకుంఠలోకమున కరిగి శ్రీమన్నారాయణుం గాంచెను.

లక్ష్మీనాథుఁడును వ్యసనమధ్యభాగమున నుండినశంకరుం జూచి వెంటనే మేఖలాజినదండాక్షసూత్రములు ధరించి మాయావామనుం డయ్యెను. ఆక్షణమ దూరమునుండియే యెదురుగావచ్చి పవిత్రపాణియై వినీతవేషముతో శంకరునకు నమస్కరించెను. ఈఘట్టమునందు,

మూ. తం తథా వ్యసనం దృష్ట్వా భగవాన్ వృజినార్దనః,
దూరాత్ప్రత్యుదియాద్భూత్వా వటుకో యోగమాయయా.
మేఖలాజినదండాక్షై స్తేజసాగ్ని రివోజ్జ్వలన్,
అభివాదయామాస చ తం కుశపాణిర్వినీతవత్.

ఈమూలమునకు మహాకవిపోతన,

సీ. తాపింఛరుచితోడఁ దస్తరించెడు మేనుఁ
బసిఁడిముంజియుఁ దగుపట్టుగోఁడుగు
ధవళాంశురుచిజన్నిదంబును డిన్నని
దండంబుఁ జేతఁ గమండలువును
బసుపుగోఁచియుఁ జిన్నిపట్టెవర్ధనమును
రాజితంబైనమృగాజినంబుఁ
దూలాడుసిగయును వ్రేలుమాఱట గోఁచి
వేలిమిబొట్టును వ్రేళ్లదర్భ
తే. దనర సందీప్తహవ్యవాహనసమాన
కాంతిఁ జెలువొంది యద్భుతక్రమ మెలర్పఁ
జతురగతి నప్డు వటుకవేషంబుఁ దాల్చి
వచ్చి యానీచదానవవరుని జేరి.

అని వ్రాసిరి.

ఇట్లు నమస్కరించి యోమహాదేవా! వృకదానవునకు వెఱచి యిట్టికష్టములకుఁ జిక్కితివి. సర్వార్థములను సాధించు దేహము శ్రమపెట్టఁదగదు. ఇంతదూర మేలవచ్చితివి? ఇంచుక విశ్రమించి చెప్పఁదగునేని భవదుద్దేశము చెప్పుము. పూరుషులు ప్రాయికముగాఁ బూరుషులసాయమున సర్వార్థములు

పొందఁ గోరుదురు. కావున నున్నరూపు వచియింపుము. అని భగవంతుఁడు సుధాధారల గురియించుపలుకులఁ బ్రశ్నించిన దనశ్రమము లన్నియుంబోవ శంకరుఁడు తద్వృత్తాంతమెల్లఁ దెలియఁ జెప్పెను. ఆశంకరునుదంతము నాలకించి మాయామానుఁడు వృకదానవుం బిలిచి యార్యా! దక్షప్రజాపతిశాపంబునఁ బిశాచత్వము గాంచిన యీప్రేతపిశాచపతిమాటల మే మెన్నఁడు నమ్మము. నీవు నమ్ముదేని నీశిరముపయిం బెట్టి పరీక్షింపుము. శివవచన మసత్యమైన నీకనిష్టి బొంకు లాడకుండ నయ్యసత్యవాదిని వధింతునని చిత్రవచనముల ననునయించి పల్కిన నావృకాసురుఁడు భగవన్మాయ నెఱుంగఁజాలక మతిభ్రమ మొలయఁగా విస్మితుఁడై తనతలపయిం జేయిపెట్టుకొని తల యాక్షణంబ వజ్రాహతి బ్రద్దలగునట్లు శకలములు గాఁగా వడింబడియెను. అట్లు వృకదానవుండు పంచత్వమునొందిన నాయద్భుతకర్మమునకు దేవతలు మెచ్చి జయజయనినాదములు చేయుచుఁ బూలవానఁ గురియించిరి. పరశంకరుఁడును మహా త్తరకష్టమునుండి ముక్తిం గాంచెను. అత్తఱిం బరమపురుషుఁడు కైలాసనాయకుం గాంచి మహాదేవా! యీపాపిదానవుఁడు తనపాపమునఁ దా నిహతుఁడయ్యెను. పెద్దల కపరాధ మొనరించినవాఁ డెవ్వఁడేని సుఖంపడ నేర్చునా. * విశ్వేశ్వరుఁడవై జగద్గురుఁడవునగు నీకుఁ గీడుచేసినవారికి హాని గలుగునని వేఱుగాఁ జెప్పవలయునా అని ప్రియవచనముల నాశ్వాసించెను. వాఙ్మానసములకు గోచరింపనిశక్తికాధారభూతుఁ డగు శ్రీహరి

* హతః కో ను మహత్స్వేవం జంతుర్వై కృతకిల్బిషః, క్షేమీ స్యాత్కృతవిశ్వేశే యః కృతాగా జగద్గురౌ. అని మూలము.

శంకరునకుఁ గష్టను వాపినయీకథను విన్నను బఠించినను మానవుఁడు సంసారశత్రుబాధనుండి విముక్తుం డగును.

మహాశయులారా! విష్ణుసేవాప్రాశస్త్యమును దాని కుదాహరణ మగువృకాసురునికథయుఁ జదివితిరి. "యస్య దుద్దేశేన ప్రవృత్తస్తత్తదంశ ఏవ ప్రమాణమ్"అనున్యాయము నెల్లరెఱుంగుదురు. విష్ణుసేవ ముక్తిప్రదమనియు దానికంటె నుత్తమదేవతాసేవ లేదనియుఁ దెలుపఁబూనిన శుకయోగి యుదాహృత మగునీగాథను దెల్పెను. దీనినుండి కొన్ని రహస్యముల మన మెఱుంగవలయును. ఇతరదేవతలను భజించుట యైశ్వర్యప్రదము. విష్ణువునాశ్రయించుట ముక్తిఫల ప్రదము. అనునదియే యీకథాసారము. దీనింబట్టి శివునకంటె విష్ణువధికుఁ డనువిషయము తేలునుగదా యని కొంద ఱూహింపవచ్చును. కాని, యట్లుగాక యీకథయే శివకేశవుల కభేదమును దెల్పుచున్నది. అంతియగాక దేవతాసమత్వమును గూడఁ దెల్పుచున్నది. ఎట్లనఁగా నాలకింపుఁడు. ఇతరదేవతల నారాధించినచో నైశ్వర్యము కలుగుననియు దాన గర్వించి వాఁ డైహికసుఖములనే కోరుచుండుననియు ముక్తి కర్హుఁడు కాఁడనియు, నొకవిషయ మిందుఁగలదు. ఎవరు ముక్తికర్హులో వారైహికములను గోరరనియు, విష్ణువు నాశ్రయించి ముక్తులే యగుదురనియు వేఱొక్కవిషయ మిందుఁ గలదు. దీనిచే నైహికసుఖముల ననుభవింపఁగాఁ దొలిపుట్టువునఁ గర్మముల నాచరించినవాఁడు సుఖములనే కోరుననియు, నిష్కామకర్మముల నాచరించినవాఁడు ముక్తినే కోరుననియు, నెవ్వాని వాంఛలుకాని వానికర్మముల ననుసరించి యుండునేకాని వేఱు

కావనియు దీనినుండి సముద్ధరింపఁదగినవిషయము. విష్ణుభక్తుల కన్నమునకుఁ గూడ దొరకదనియు శివభక్తులకు ముక్తియను మాటయే దొరకదనియుఁ గాదు. దీనిచేఁ గర్మము బలవత్తర మని తేలెడిని. అంతియకాని శివకేశవతారతమ్యాను తేలదు. శివునకు నేమియుఁ దోఁపకపోఁగా విష్ణు వుపాయమున వానిం జంపె ననుయుక్తి సమంజసము కానేకాదు. అదియే సమంజస మైనచోఁ గర్మసిద్ధాంతము నశించును. నశించినచోఁ గొంపము నుఁగునదేమి? అని ప్రశ్నించిన,

శ్లో. "నియతం కురు కర్మ త్వం కర్మజ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాపి చ తేన ప్రసిద్ధ్యేదకర్మణః ౮
కర్మబ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్,
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్." ౧౫

అనుగీతావాక్యములు వ్యర్థము లగును. కావున ఫలములు గలుగుట కర్మానుష్ఠానముననే యని స్పష్టమయ్యెడిని. అంతియ గాక సాత్వికకర్మాచరణమున సత్ఫలములు గలుగుననియుఁ దేలు చున్నది.

వృకదానవుఁడు నారదుని ప్రశ్నించినపుడు శీఘ్రఫల ప్రదాత యెవ్వఁడని ప్రశ్నించెను. కొలఁది కర్మముచే నధిక ఫలము లభింప వలయునన్న నేమిచేయ వలయుననియు నా ప్రశ్నసారము. నారదముని త్రికాలజ్ఞుఁడు. భావిఫలముల నాలో చించి యాతని కర్మముల నూహించి శంకరునారాధింపు మని యెను. ఏలయనఁగా నాతనికిఁ గాఁగల దుష్ఫలముల నాలో చించియే చెప్పెను. వాఁడట్టులారాధించెను. హరుఁడు వర మిచ్చెను. దాన నాతనికే యపకారము గల్గెను. హరి దానిని

వారించెను. అనఁగా నీకథవలనఁ గర్మమే యందఱఁ ద్రిప్పుచున్న యదికాని స్వతంత్రు లెవ్వారును గారని స్పష్టము. ఎవ్వాఁడు దురుద్దేశమున దేవతల నారాధించునో వాఁడు తప్పక ముప్పు జెందునని యీ కథయే మనకు బోధించును. విష్ణువే సకల లోక గురువని, ప్రపంచముల కధీశుఁడని శంకరుఁడు నంగీకరించెను. అనఁగా శివకేశవులు పరస్పర మట్లె భావించువారు. వీరిరువు రును స్వతంత్రులుగారు. కావున వీరిలో భేదమును గల్పించుట గాని ముక్తి ప్రదాత యొకఁడని భుక్తి ప్రదాత యింకొక్కఁ డని కల్పించుటయుఁ గూడ నజ్ఞానమే యని స్పష్టమయ్యెడిని. ఎవ్వ రెవ్వ రే యే కర్మముల నాచరించి యే యే దేవతలవలన నెట్టియెట్టి ఫలములఁ బొందవలయునో ఆయాఫలములు తప్పక కల్గునని యీ చరిత్రము మన కెఱిఁగించుచున్నది. అంతియకాని యీ కథను బ్రధానము చేసికొని శివు నాక్షేపింపరాదు. దానఁ బాపమే కాని పుణ్యము కాదని యెఱుంగవలయును. ఇట్టి నీతుల నెఱింగి కథ చదువవలయునే కాని సార మెఱుంగక కథ చదివినఁ గాలక్షేపమే ఫల మగుననియు నెఱుంగుట మంచిది. ఇఁకఁ దరువాతి కథ నాలకింపుఁడు

## భృగుముని త్రిమూర్తులప్రాశస్త్యమును శోధింపఁబోవుట.

* శుకయోగి మఱియుఁ బరీక్షిత్తునకు భగవత్తత్త్వ మును చెప్ప నిట్లనియెను. మహారాజా! పూర్వము సరస్వతీనదీ తీరమున నొక సత్త్రయాగము సాగుచుండెను. జగములకుఁ

* ఈ విషయము దశమస్కంధమున నెనుబదితొమ్మిదవ యధ్యాయ ము నుండియే గ్రహింపఁ బడినది.

గారణభూతులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో నుత్కృష్టుఁ డెవ్వఁడని మహామును లాసత్త్రయాగమునందుఁ దర్కించుకొనిరి. ఆ యర్థము నెఱుంగఁగోరి భృగుమహర్షి ని బంపిరి. ఆ మునియు లోకానుగ్రహార్థము ప్రయాణమై మొదటఁ జతురాననుసభ కరిగెను. ఆ నలువశక్తి నరయఁగోరి వినుతింపక యూరకుండెను. అందులకు విధాత యాగ్రహించెను గాని యా కోపము నీటిచే నగ్నివలెఁ బుత్త్రవాత్సల్యమునఁ శాంతించెను. అవ్వల నాముని ప్రయాణము సాగించి కైలాసమునకుఁ బోయెను. శంకరుఁ డా మునిని భ్రాతృవాత్సల్యమునఁ గౌఁగిలింపఁ బోవఁగా మునియుఁ బరీక్షింప వచ్చినవాఁడు కావున శివునితో నీవు దురాచారరతుఁడవు కాన నన్ను ముట్టకుమని వారించెను. శివుఁ డాగ్రహమునఁ ద్రిశూలమెత్తి మునివర్యుని వధింపఁబూనెను. పార్వతియుఁ బ్రాణనాథునిపాదములపయిం బడి యాగ్రహమును శాంతింపఁజేసెను. భృగుముని యటనుండి పయనమై వైకుంఠమున కరిగెను. అందు శ్రీహరి లక్ష్మీదేవి యూరువులపైఁ దల యునుచుకొని శయనించియుండఁగా గని తచ్ఛక్తి యెట్టిదో చూతమని పాదప్రహారమునఁ దనరాకఁ దెల్పెను. హరియు మహాలక్ష్మింగూడి లేచి శయ్యనుండి దిగి య మ్మునివర్యునకు విధివిహితముగా నమస్కరించి యిట్లు భాషించెను. మహామునీ! నీకు స్వాగతము. ఇదె యర్ఘ్యపీఠము. ఇందుఁ గూరుచుండుఁడు. తమయాగమనము నెఱుంగక యపరాధ మొనర్చితిని. దానిని క్షమింతురుగాక. తీర్థములకుఁ దీర్థత్వమును సమకూర్చు (పవిత్రులను బవిత్రీకరించు) తమ పాదోదకముచేత నన్నుమాత్రమే కాక నా యీలోకమును

నాయందుఁ బ్రీతిగల లోకపాలకులను బవిత్రులనుగా నొన రింపుము ఈదినముననే నేను లక్ష్మీదేవి కేకాంతపాత్రుండనై తిని. నీపాద సంస్పర్శమున నాహృదయము పావనంబయ్యెను. సకలపాపములు నశించెను. కావున నిట్టి నావక్షోభాగముననిఁక మహాలక్ష్మినివసించుఁగాక.అని శ్రీమన్నారాయణమూర్తి పలికెను. ఆగంభీర వాక్కులకు నిర్వృతింగాంచి భక్త్యుద్రేకమున బాష్ప ములు కన్నుల నిండఁగా నాభృగుమహాముని యేమియుంబ లుకక యూరకయుండి మరలి సత్త్రయాగమున కరుదెంచి బ్రహ్మ వాదులగు మహాత్ములకు నాయర్థమెల్లఁ దేటపడునట్లు తెలిపెను. వారాపలుకు లాకర్ణించి సంశయములు వీడఁగా శాంతియు, నభయము, ధర్మజ్ఞానములు, వానిం గూడిన వైరాగ్యము, నైశ్వర్యాష్టకము, మనోమలమును బోఁగొట్టు యశము నను నివి యెవ్వానివలనంగలుగునో, ఎవ్వాఁడు శాంతులు సమచి త్తులు, సాధువు, లకించనులు నగుసన్న్యాసులకుఁ బరమగతియో ఎవ్వానికి సత్త్వము ప్రియతమమూర్తియగునో, ఎవ్వని కుర్వి సురులిష్టదేవత లగుదురో ఏపరమపూరుషుని నేర్పులు నిష్కా ములు నగుశాంతులు సేవింతురో యామహావిష్ణువు మూవు రిలో నుత్తముఁడని నమ్మిరి. గుణసహితమాయను నిర్మించిన సురాసురరాక్షస మూర్తులు మూఁడు; నామహావిష్ణువునకుఁ గలుగును. కాని యందు సత్త్వరూపమే యర్థసాధనము. అని యిట్లు సరస్వతీతీరనివాసు లగుమునులు తమకుఁ గలసంశయ ముల నెడఁబాసి భగవత్పాదారవిందముల నాశ్రయించి పరమ గతింగాంచిరి. సంసారభయనివారణదక్షం బగు నీకథా సుధా

రసము గ్రోలినవారు హరిభక్తు లగుదురు. సంసారతాపములు వారికిం గలుగవు.

మహామతులారా! ఈకథ పూర్వగాథయందు నావ్రాసిన భావమునకు విరుద్ధముగా నున్నదికదా యని మీరూహింతు రేమో. ఎంతమాత్రము కాదని నమ్ముఁడు. పూర్వోక్తానుసారముగా దేవతాభక్తి కుదుఱునని యందఱంగీకరింపఁ దగినవిషయము. విష్ణుభక్తులు కాఁదగువారి కాపరమాత్మయందు దృఢభక్తి కుదురుట సహజముకదా. ఆవిషయమే యీకథ తెల్పుచున్నది. భగవంతుఁ డరూపుఁ డయ్యు నిర్గుణుఁ డయ్యు సర్వగతుఁ డయ్యు భక్తులకొఱ కొక్కరూపము పేరునివాసము గలవాఁడుగాఁ దోఁచును. అర్చారూపమని దానిపేరు. ఏభక్తుఁ డేరూపమునఁ దనను ధ్యానించునో ఆరూపమును ధరించి తోఁచును. ఆభక్తుఁ డారూపమునే నిరంతరము ధ్యానించి వినుతించి తరించును అనఁగా నన్నిరూపములు భగవంతునివె యని స్పష్టము. అన్నిరూపములయందుండుపరమేశ్వరుని సమముగాఁ జూచువాఁడే సమదర్శనుఁ డనంబడును.

శ్లో. "తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః,
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. ౧౭
విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః. ౧౮
ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః,
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః."
౫ అధ్యా.

అనునీగీతావాక్యముల ననుసరించి యూహించిన సమముగా సర్వజంతువులయందుండుపరమాత్మను జూచువాఁడు జ్ఞాని యని స్పష్టమయ్యెడిని. పై వాక్యములననుసరించి యాలోచింపఁగా భగవంతుని కొక్కరూప మనునియమము లేదనియు నెల్లరూపములు తానే యనియు నేప్రాణికి స్వస్వకర్మానుసార మేరూపమున భక్తికుదురునో యారూపమున భగవంతు నారాధించిన నర్చారూపుఁడుగావున నాపరాత్పరుఁడు కృతార్థునిగాఁ జేయుననియుఁ బొడగట్టకమానదు. కావున భగవద్మూర్తులయందుత్తమమధ్యమాధమభేదములు భక్తునిబుద్ధికల్పితములనుట సమంజసము. ప్రస్తుతకథావిషయము నాలోచింపఁగా మునులు భృగ్వాదులు విష్ణుభక్తులు. వారికి వైకుంఠమున నున్న విష్ణురూపమున భక్తి కుదిరినది. ఆరూపమున నా పరాత్పరుఁడు వారికిఁ గాంక్షితముల నొసంగుచుండును. కావున వారి పరీక్షయందు శంకరునికంటె విష్ణుమూర్తి యధికుఁడుగఁ దోఁచుట యొకవింతగాదు. దీనింబట్టి శంకరుఁడల్పుఁడనరాదు. మఱికొందఱు మునులకు శంకరుఁడుత్కృష్టుఁడుగఁ దోఁచును. అప్పుడు విష్ణుమూర్తి శంకరునికంటె నల్పుఁడని చెప్పవలయునా. ఆభక్తులభావమదియని చెప్పవచ్చును. కావునఁ జక్కఁగా బరిశీలించినతఱి నించుకంతయు భేదము కానరాదు. సర్వభూతములయందు సమానముగా భగవంతుని దలంపవలయునని యుండఁగా శివకేశవభేద మెట్లో తోఁచకయున్నది. భేదబుద్ధి నెవ్వరు పరమాత్మను దలంతురో వారు ముక్తిసామ్రాజ్యదూరులని భగవంతుఁడే చెప్పెను. కాఁబట్టి భక్తుఁడే కాలమునందును గృష్ణపరబ్రహ్మను సర్వభూతాంతర్వాసునిగా ధ్యానింపవలయు.

అదియే యఖండభక్తి యని యెఱుంగవలయును. అట్లు లేక ద్వారకాపురవాసునిగా మాత్రము ధ్యానించిన నామహాత్ముని సర్వగతత్వము నంగీకరింపనట్లగును. ఇదియే సారము. పెంచివ్రాయనక్కఱ లేదు. తరువాతికథను వ్రాయఁబూనెదను.

శ్రీహరి ద్రౌపదిఁ గాపాడుట.

రాజసూయయాగమున శిశుపాలుని వధించి ద్వారకానగరమున కరుదెంచి దంతవక్త్రసాల్వాదులఁ బొలియించిన పిదపఁ బాండవులవార్తయెట్టిదని విమర్శింతము. రాజసూయానంతరమునందుఁ గర్మప్రేరితుఁడై దుర్యోధనుఁడు పాండవుల యెడ మఱింత యీర్ష్యఁ బూనెను. మయుఁడు నిర్మించియిచ్చిన సభ యాతనికి మఱింత కోపమును గల్గింపఁజాలెను. ఆసభా విశేషములు వాఁడు చూచునపుడు వానిభ్రాంతినిగాంచి నకుల సహదేవులు ద్రౌపదియుఁ బరిహసించిరి. తా రాజరాజై యిట్టి యవివేకమును గనఁబఱచినపుడు వారు నవ్వినను రోషమొందఁ బనిలేదు. కాని భగవదుద్దేశము మహాసంగ్రామమును గూర్చుటకేకదా. ఆసంకల్పము కర్మములఁ బ్రోత్సహించెను. అవి నకుల సహదేవులను ప్రోత్సాహహేతువుగా నొనరించి దుర్యోధనునకుఁ బట్టరానియాగ్రహమును గల్పించెను. సర్వసాక్షియగు శ్రీకృష్ణుఁ డూరక చూచుచుండెను. తనిచ్ఛాశక్తి పనినిర్వహింపఁబూనెను. దానికి వారివారికర్మములే సాధనములు. వానితో నామహాశక్తి సర్వకార్యములు సాధించి భగవంతునియూహను స్థిరపఱచెను.

ఆవల నాసుయోధనుఁడవమానమున ఖిన్నుఁడై హస్తిపురమున కరిగి మేనమామ యగుశకునితోఁ దన కటఁ గల్గిన

భంగపాటును దెల్పి యంగలార్చెను. మేనయల్లునకుం గల్గిన యవమతిని బోఁగొట్ట నాతఁడు దుష్ప్రయత్నమే సాధనమని ద్యూతక్రీడకు ధర్మరాజును బిలువ మేనల్లునిఁ బ్రోత్సహించెను. వాఁడు తండ్రికిం దెల్ప నాతఁడు తన్మంత్రియగువిదురుఁడును వలదని యెన్నియోభంగుల వారించిరి. కాని వాని నాతని కర్మము విననీయక పట్టుపట్టునట్లు చేసెను. కావున వానికానీతు లురుచించినవి కావు. వాఁడు తండ్రికడఁజేరి తాఁ జచ్చుటయో ధర్మరాజుతో జూదమాడుటయో యీరెండింటిలో నేదియి ష్టమో తీర్మానించుకొమ్మని తండ్రికింజెప్పెను. విధిలేక యొగ్ర డ్డిరా జంగీకరించెను. ఇన్నినీతు లుపదేశించినవిదురుఁడే తుదకు నింద్రప్రస్థపురంబున కరిగి ధర్మరాజును ద్యూతక్రీడకుంబిలిచెను. ఇది యకార్యముకాన నేనురానని సకలధర్మవేత్తయగు యుధి ష్ఠిరుఁడు పలుకక యందుల కంగీకరించెను. అనఁగాఁ గర్మము దుర్యోధనశకునిధర్మరాజులఁ బ్రోత్సహించి సమ్మతింపఁజేయఁజా లెనని యిందుఁ గలసారము. ఎల్లవారును జేరిరి. దివ్యమంపర మున నాద్యూత మారంభమయ్యెను.

ధర్మరాజద్దానికి విముఖుండయ్యుండెను. కానివిధిబలవం తముచేయ నంగీకరించెను. దుర్యోధనుఁడు ధర్మరాజుతో సుహృ ద్ద్యూతంబాడుదము. ప్రొద్దుపోకకిది యొకకారణమగునని మంద లించెను. ధర్మజుండార్యా! వంచనయు జూదము ననునీరెండును క్షత్రియులకు నీతివిక్రమములు గావు. కావున వానిని రెంటిని వర్జింపవలయునని పెద్దలు పలుకుదురు. మఱియు సన్మార్గమును వదలినకుత్సితకితవులతోడ జూదమాడరాదు. దానననర్థము ధర్మ ము నశించును. మఱియు మాయాద్యూతంబున జయంబందు

టయు మహాపాపంబే యని నిందును. ధర్మద్యూతమున జయంబు గొనుట ధర్మయుద్ధమున జయించుటయుఁ బుణ్యంబనియు నపితుండగు దేవలుండు పలికెను. అని యాప్రయత్నము దుర్విషయమని తానెఱింగినట్లు పలికెను. ఆమాటలకుఁ దగినయుత్తరము దుర్యోధనుఁ డీఁగలఁడో లేఁడో యని యాలోచించి శకుని ధర్మరాజా! ద్యూతమనునది యొకకళ. అఱువదినాలుగు కళలయం దదియు నొక్కటి. లోకజ్ఞానము గలిగి బుద్ధిమంతుఁడు రాజనీతికోవిదుఁడు నగువాఁ డిట్లు ద్యూతమును నిందింపఁడు. బలహీను లగుమానవులు బలవంతులగు శత్రువులతోఁ బోరాడుట సంభవించెనేని పెక్కుమాయలు పన్ని కార్యము సాధించుట లోకాచారమే కాని విరుద్ధము కాదు. అదియటుండనిమ్ము. నీవు జూదమాడినచో నోడిపోవుదునని భయపడుదువేని మానుము. నీకీకళయందుఁ నేర్పుగలదే నాడుము. అను శకునిపలుకులకునాగ్రహముగలిగి బలవద్ద్యూతార్థము మీచేఁ బిలువఁబడితిని. ఇపుడు మానవలనుపడదు. ఆడెద. అని దుష్కర్మము తన్నుఁ బురికొలుపుచు మఱెంత త్వరపెట్టఁగా నంగీకరించి ద్యూతరంగంబునఁ గూరుచుండె యాడనారంభించెను. దుర్యోధనుపక్షమున సౌబలుఁడు వివింశతియుఁ జిత్రసేనుఁడు వికర్ణుఁడు గూరుచుండిరి. వారలంగాంచి ధర్మరాజెవ్వరు నాతో జూదమాడుదు రని ప్రశ్నించెను. దుర్యోధనుఁ డామాటకు బదులుచెప్పఁబూని యార్యా! నాకొఱకు నామామ యీశకుని జూదమాడును. ఈతఁ డొడ్డినపందెములనెల్ల నేన యొసంగెద. ఆమాటకు ధర్మరాజు సమ్మతించుట న్యాయముగాదు. ఐనను విధివశంబున నట్లేయని యంగీకరించి

యాట కారంభించెను. ఇరువురు మేలగుపదార్థముల నొడ్డి యాడుచుండిరి. ప్రతిపర్యాయము ధర్మరా జోడుటయు శకునియే గెలుపొందుటయు సాగుచుండెను.

ఆద్యూతము సుహృద్ద్యూత మనియే యెల్లవా రూహించిరి. కాననే భీష్మద్రోణాశ్వత్థామలు ధృతరాష్ట్రుఁడు విదురుఁడు లోనగువారెల్ల వచ్చి యాస్థానములఁ గూరుచుండి చూచుచుండిరి. ఆపాచికలు మాయాకల్పితములు. కావున ధర్మరాజున కోటమిని శకునికి జయమును బ్రతిపర్యాయము సమకూర్చుచుండెను. దాన ధర్మరాజు మదియందు విరోధము పెచ్చుపెఱిగి కలంచుచుండెను. సకలరత్నరాసులు గజాశ్వాదులు ధర్మరాజొడ్డుటయు వెంటనే యోడుటయు జరగుచుండెను. ఆవిధమెఱింగి విదురుఁడు నీతిశాస్త్రకోవిదుఁడు గావున ధృతరాష్ట్రునితో మహారాజా! నీతొలికొమరుఁడు దుర్యోధనుఁడు జన్మించునపుడే దుశ్శకునములు పెక్కులు తోఁచెను. వీనికారణమున నిర్మలతమమగు నీవంశము పాపభూయిష్ఠము కానున్నది. ఒక్కనికతన వంశమునకు హాని కల్గునెడల వానిం బొలియించియో వెడలించియో కులము నుద్ధరించుట ధర్మంబని శుక్రనీతి తెలుపుచున్నది. ఈనియమము నాశ్రయించియే యాదవులు కృష్ణునిమూలమునఁ బాపాత్ముఁ డగుకంసుని బొలియించి వంశమును గాపాడుకొనఁగల్గిరి. కావున నీవును గులమును రక్షించుట ముఖ్యమని తలంచి యింద్రనందనుం బంపి దుర్యోధను నిగ్రహింపఁజేసి నిర్మలఖ్యాతి మెఱయునీకులమును గాపాడుకొనుమని బహువిధముల బోధించెను. ఈదుష్టద్యూతము నివారింపుమని నొక్కి చెప్పెను. కాని భగవం

తునియాశయము ప్రతివారిమానసముల నాట్యముచేయుచు నెవ్వరెవ్వరిచే నేయేయుపకారములు లోకులకుఁ గల్గింపవల యునో వానినెల్లఁ జేయించుచుండెను గావున నామాటల కాధృతరాష్ట్రుఁ డూరకుండెను కాని తానేమియు దాని నాపఁ బూనఁడయ్యెను. విదురుఁ డాయన్యాయమును జూడఁజాలక దుర్యోధనుంగాంచి యువరాజా! న్యాయమార్గమును మాని శకునిని మాయాద్యూతమునఁ బూన్చితివి. పాపమతి నాశ్ర యించితివి. ధర్మమూర్తులగుఁబాండవుల సకలైశ్వర్యముల నపహరించినయెడల లోకమునఁ గలసజ్జనులందఱు నిన్నుఁ జీయనరా. ధృతిమంతులై భుజవిక్రమమున శాత్రవుల నోడిం చినపాండవు లనుసింహములను దేహముతెలియక గర్వించి పరాజితులనుగాఁ జేసితివి. వారి కిట్లపకారముచేయుట మేల గునా. అని లెక్కసేయక నిష్ఠురములాడెను. ఆమాటల కాగ్ర హించి దుర్యోధనుఁడు విదురా! ఎల్లప్పుడు శత్రువులసద్గుణ ములనే కీర్తింతువు. పరులపక్షము నాశ్రయించియే మాటలా డుదువు. మాపక్షమును సర్వదా నిందింతువు. మాసొమ్ము తిను చు మమ్మే యాక్షేపింతువు. తొడపైనభయంకరభుజంగ మున్న నెంతసుఖమో నీవు మాకడనుండ నంతలాభము మాకుఁ గలు గుచున్నయది. లోకమున రాజులు తమశత్రువులసంపదలను సుఖోపాయమున సంగ్రహించుట మేలేకాని కీడుకాదు. అది రాజలక్షణముకాని క్రొత్తమార్గము కాదు. ధర్మరాజు ద్యూత మాడ నసమర్థుఁడే యైనచో నుడుగుటమేలు. పౌరుషమున నాడియోడిన నది నాయపరాధమా. విదురా! నన్నిట్లు నీవె త్తిపొడుపుమాటలు పలికి దూషించుట న్యాయముకాదు.

నీయంతట నీవుండుము మాకు బుద్ధిచెప్పరాకుము. చాలుం జాలు నీహితము.

అనిన విదురుండు కటకటంబడి దుర్యోధనా! లోకమున దుర్మతములనుబోధించువారు మిత్రులుగాఁ బరిగణింపఁబడుదురు. మేలుచేకూర్పఁ బలుకువారు పగవారుగా నగపడుదురు. నీకిప్పుడు నామాటలు పనికిరావు. శకుని లోనగువారిమాటలు రుచించును. చెడఁజెప్పువారిని మిత్రులనిభావించుట మాత్రము మంచికాలమునకుఁగాదని యెఱుంగుము. నీవుమాత్రమే గాక లోకమునవెల్లవారును విశేషించిబుద్ధిమంతులుకూడఁ గాలము దుష్టమగునపుడు ప్రియముగా మాటనాడువారిని మెచ్చుకొందురు. అప్పటి కప్రియముగాఁదోఁచి మీఁద మేలుగల్గించు మాటను వినరు. కావుననే ధీరులగుపూరుషు లట్టిమాటలను జెప్పఁబూనక యూరకుందురు. నీచులు ప్రియముగాఁ బల్కుచు వారినాశ్రయించి యుందురు. నాయోపినంతవట్టు ధృతరాష్ట్రునకుఁ నత్సంతతికి మేలుగలుగఁ బలికితిని. అట్టినన్ను దూషించితివి నీకీకార్యము మాత్రము మేలుకాదు. అని మఱేమియుం బలుకకయుండెను.

జూదము యథాపూర్వముగా సాగుచుండెను. ఎన్నిపందెములు పెట్టిన నవియన్నియు శకునిపక్షమగుచుండెను. దేవబ్రాహ్మణవృత్తులు తప్పఁ దక్కినభూతలము శత్రుగత మయ్యెను. బ్రాహ్మణులు తప్పఁ దక్కినసేవకులెల్లరు శత్రువశగతులైరి. అంతటనైన మానక వృద్ధియగుచున్నయాసున ధర్మరాజు సత్యనిష్ఠులైన సోదరులనొడ్డి యోటుపడెను. సహదేవుఁడు మొదలుగా భీమసేనునివఱకుఁ గలసోదరులు శత్రువులకు లోఁబడ

వలసివచ్చెను. ఇట్లు సర్వము నోడి ధర్మరాజు పందెముపెట్ట వేఱుధనంబులేక యోజించుచుండఁగా శకుని ధర్మరాజుని గాంచి యుధిష్ఠిరా! ద్రవ్యము లేదని యోజించెదవే, ఏల? పాంచాలి నీకు ధనముకాదా. ఆమె నేలయొడ్డ రాదని హెచ్చరించెను. ఆమాటలకు బదులాడఁ జాలక కర్మముపాపఫలముల నొసంగఁ దన్ను మఱింత ప్రోత్సాహము చేయఁగా లోఁబడి యాపతివ్రతా తిలకమును గూడ నొడ్డి యోడెను. ఆమెయు దుర్యోధనునివ శంగతయే యాయెను. ఇట్లు ధర్మరహస్యవేత్తయగునాపాండవాగ్రజుండు సర్వస్వమును దుష్కర్మప్రేరితుఁడై యోడెను.

ఆవిధ మెఱిఁగి భీష్మద్రోణాదిసదస్యులందఱు విధికి వగచి యేమియు ననఁజాలక చింతాక్రాంతులై యుండిరి. విదురుఁడాఘోరకృత్యమును జూడఁజాలక పెడమొగము పెట్టుకొని కన్నులువాయ నేడ్చుచుండెను. సదస్యులెల్లరు తద్ద్యూతవిధాన మెఱింగి యింతకంటె మోసము గలదా యని కన్నీరుమున్నీరుగాఁ బ్రవహింప నేడ్చుచుండిరి, ఇట్టియాయార్తధ్వని గ్రుడ్డిరాజు చెవిఁబడ నాతఁడిది యేమి విపరీతము? ఎవ్వరెవ్వ రేయేపందెముల నొడ్డిరని విదురుని బ్రశ్నించుచుండెను. కర్ణశకునిదుశ్శాసనాదు లానందపరవశులై యుండిరి. దుర్యోధనుఁడు పాండవులందఱును దనదాసులని యెఱింగి పాంచాలి తాఁజెప్పినపనులు చేయదగినదనియు నూహించి యామెను దనసౌధమును దుడువఁగాఁ బనుచువాఁడై విదురుంబిలిచి వేగంబపోయి పాంచాలిని దోడుకొని రమ్మని యాజ్ఞాపించెను. ఆతనిదిక్కు మొగంబై విదురుండు దుర్యోధనా! నీకంటె నీచులు లోకమున నొరులు లేరు. ఇట్టియన్యాయకార్యమునకు

నన్నుంబంపందగునా. దుష్టమతియై యొరులకు ననవరతము పీడలఁ గల్గింపఁజూచుచునుండు దుర్జనునిసంపదలు త్వరగా నశించును. కులపాంసనా! పట్టాభిషేకమహోత్సవార్హ యగు ద్రౌపది నిట్లవమానము చేయుట కామె దిక్కులేనిదని భావించితివా. దుర్మతీ! ఘోరాశీవిషోపమానులగు పాండవుల నెఱిఁగి యెఱిఁగి యేల యవమానించెదవు? వారికేల యాగ్రహముఁగలిగించెదవు. ఒరులధనమును మోసమున నేల యపహరించెదవు? శకునిదురాలోచనము నేల పాటించెదవు? జూదమున నెగ్గు పుట్టక మానదు. దీనఁగలుగులాభము వెదురుపోదకు ఫలము గలుగనదిసమూలముగానశింపఁజేయునట్లు నీకులనాశనమున కిది కారణంబగును. అని పరుషంబుగాఁబలికిన విదురునిపై నాగ్రహించి నిష్ఠురోక్తుల నాతనిం గనలించి ప్రాతికామియనువానిం బిలిచి యీవిదురుఁడు సర్వథా యసంగతముగా మాటలాడు. విశేషించి పాండవపక్షపాతియునగు. కావున, నీవిప్పుడే పోయి యాపాంచాలిం దోడుకొని రమ్మాయని యాజ్ఞచేసెను సూతపుత్త్రుఁడగు ప్రాతికామియు దుర్యోధనునియాజ్ఞ శిరసావహించి పాంచాలింగాంచి వినయము మెఱయ నిట్లు పలికెను. తల్లీ! ధర్మరాజు దుర్యోధనునితో జూదమాడిరాజ్యము, సంపదలను, సోదరులను దుదకు నిన్ను నోడెను. మీ రెల్లరు దుర్యోధనుని వశమున నుండవలయును. నిన్నుఁ దోడుకొనిరమ్మని మారాజు నన్నంపెను. కావున సుయోధనుకడకు రావలయును. అనిప్రాతికామిపలుకులు పిడుగులవలెఁ గర్ణవివరములఁ బగుల్పఁగాఁ బాంచాలి యిట్లు వాక్రుచ్చెను.

ప్రాతికామీ! ఏయుగమునందైనను భర్తను బందెమిడి యోడిన భర్త గలఁడా. ఇది వినఁగాఁ జిత్రముగ నున్నయది. చంద్రవంశభూషణుఁ డగుధర్మరా జిట్లు చేయునా. అన్నా! మఱొక్కమాట యడిగెదను. తొలుతఁ దన్నునొడ్డి యోటువడి పిదప నన్నోటుపడియెనో, లేక నన్నే తొలుత నోటుపడిపిదపఁ దన్నోటు పడియెనో యున్న దున్నట్లు నాకెఱిఁగింపుము. నీకుం దెలిసినఁ జెప్పుము. నీవెఱుంగవేని యాకితవునే యడిగివచ్చి నాకుం దెల్పుమా. ఆవిషయ మెఱిఁగించి నన్నుఁ దోడుకొని పొమ్ము. అనిన నాతఁడు మరలి వచ్చి పాంచాలిప్రశ్నమును ధర్మరాజునకుఁ దెల్పఁగా నంతకుముందే పరాజయదుఃఖమున మనస్సు నిలుకడ లేనివాఁడుగా నున్నవాఁడు కావున వానికి బదులుచెప్పకయుండెను. ఆవిధ మెఱిఁగి దుర్యోధనుఁడు ప్రాతికామీ! ఈవిషయము సందిగ్ధమైనది. అందఱు వినఁగానడిగితివి. పాంచాలి యిందే యీప్రశ్నమునకు బదులెఱుంగవచ్చును. కాన నాలసింపక దోడుకొని రమ్ము. అనుటయు వాఁడప్పుడే పోయి పాంచాలరాజనందనా! నీయడిగినయర్థము సభ్యులేఁ యటఁ జెప్పుదురు. నిన్నుఁ దోడ్కొని రమ్మనిరి.

ద్రౌపది దుర్యోధనునిదుశ్చరితమును, ధర్మరాజు దానికి సమ్మతించుటయు నెఱింగి కలవిలపాటొందుచుఁ జేయునది లేక యాప్రాతికామివెంట నేకవస్త్రయై యధోనీవియై కన్నీరు విరామములేక చెక్కిళ్లపైఁ బ్రవహించుచుండఁగా సభ కరుగుదెంచెను. వచ్చి కురువృద్ధులచెంత నిలువంబడియెను. ఆమెను జూడఁజాలక వారెల్లఁ దలలువంచిరి. పాండునందనులు సిగ్గుపడి శిరస్సులు వంచి యూరకుండిరి. దుర్యోధనుఁడు దుశ్శాస

నుంగని సోదరా! ప్రాతికామిభీమసేనునకు భయంపడును. కావున నీవె ద్రౌపది నిటకుం బిలుచుకొని రమ్మని పనిచెను. ఆమాటలా లకించి భయంపడి పాంచాలి వేగంబ గాంధారిచెంతకుం బోయెను. దుశ్శాసనుఁడు ద్రౌపదివెంటనె పోయి పాంచాలీ యింక నెక్కడి కరుగుదువు? మామేనమామ నిన్ను గెలిచెను. నీవు కురురాజుధనమ వైతివి. నీభర్తలు తమరును దాసులైరి. అని పలుకుచుఁ జెంతకు రాఁగా నాపాంచాలి యయ్యా! రజస్వలనై యేకవస్త్రధారిణి యయి యున్నదానను. నన్ను స్పృశింపకుము. నేను సభకు రాఁదగదు. అందుఁ బెద్దలంద ఉన్నవారు కదా. అని దీనముగాఁ బలుక నాదురాత్ముఁడు నీవేకవస్త్ర వైననేమి. విగతవస్త్ర వైననేమి? నిన్నుఁ దోడుకొనిపోవక మాననను చు బలాత్కరించువాఁడై న్యాయమార్గమును మాని రాజసూయమహాయాగమునఁ బరమపవిత్రమగు నవభృథస్నానమునందు విప్రప్రవరులు వేదమంత్రములు పఠింపఁగా వారిధారలచే మిగులఁ బావనములగు నాపాంచాలిశిరోజములం బట్టుకొని యీడ్చుకొని యంపఱుచూచుచుండఁగాఁ దెచ్చెను· చేయునదిలేక దురాత్ముఁడగుదుశ్శాసనుఁ డీడ్చుకొని రాఁగా శకునికర్ణదుర్యోధనాదిరాజభూయిష్ఠం బగునాసభాభవనమున కరుదెంచి క్రోధలజ్జాపరవశయగుచు నంచలువినుచుండఁగా విధివశమునఁ బరాభూతుఁడైనను ధర్మరాజు ధర్మసంపదచే నొప్పునుగాని డిందుపడఁడు. ధర్మమార్గమును వదలఁడు. ఓకురువృద్ధులారా! మిగులఁ గోపస్వభావుఁడగు నీదుశ్శాసనుఁడు దుర్జనవృత్తి నిటకీడ్చుకొనివచ్చెను. ఇంచుకయు విచారింపక దుర్మదమున నిట్లు చేసెనుగదా. ఇది న్యాయవిరుద్ధమని పలుకక

మీ రెల్ల నూఱకున్నందున వీఁడు నన్నవమానించు చున్నవాఁడు. ధర్మసంపదలఁ దులతూఁగుసీభరతవంశము నేఁ డధర్మ సంపదచే నిండియున్నదని తలంపవలయుఁ గదా యని పలికి యూరకుండెను.

ఇటు ముల్లోకముల జయింపఁజాలు పాండుకుమారులు పతులుగాఁ గలిగియు నేప్రయోజనములేక యనాథవలెఁ జింతించుచు సకలలోకార్తిహరుండగు శ్రీకృష్ణుని మదిందలంచుచుఁ గన్నీరు ప్రవహించుచుండ నేడ్చుచున్న పాంచాలింగని భీమసేనుండు ధర్మరాజును జూచి యుధిష్ఠిరా! సకలసంపదలను సోదరులను బణముగా నిడి యోడుట నీకుందగును. మాకెల్ల నధిపతివి కావున నిట్లుచేయుట కధికారి వగుదువు. అంతియకాని యీకపటద్యూతమునందు ద్రౌపదిని బణముగాఁ బెట్టుట న్యాయమా. ఈపాంచాలి యీకపటద్యూతమునెపమునఁ బరాభూత యయ్యెఁగదా. శకుని మోస మెఱింగియు దుష్టద్యూతమునఁ బ్రవర్తించి యధర్మప్రవర్తకుఁడ వైతివి కావున నిట్టియధర్మకార్య మొనరించినపాపమునకుఁ బ్రాయశ్చిత్తముగా నీబాహువులం గాల్పవలయును. అనియాగ్రహించి పలికిన భీమునకు నర్జునుం డిట్లుపలికెను. పవననందనా! ధర్మరాజు న్యాయముతప్పిన భూలోకమంతయుఁదల్లడిల్లకుండునా. సుహృద్ద్యూతమునకు యుద్ధమునకు నితరులు పిలువఁగా రాజు విముఖుడు గాఁదగదని రాజధర్మము శాసించెడిని. విధివిపరీత మ్మైన తఱిఁ జింతింపరాదు. అని బదులుచెప్పెను. భీమసేనుం డప్పాటల నాలకించి యూరకుండె. పాండవు లిట్లు దుఃఖాక్రాంతులగుచుండఁ గురువృద్ధులేమియుఁ బలుకక యూరకయుండ నా

దుష్టజనవర్తనమును జూడనోడి వికర్ణుం డెల్లవారును విన నిట్లు పలికెను.

సభాస్తారులారా! సముచిత్తవ్యాపారులగుమతిమంతులు ద్రౌపదీప్రశ్నమునకు బదులు చెప్పవలయును. ఊరకయుండుట పాపమగు. దాన మీకు నరకము గల్గును. ఇందుఁ గురువృద్ధుల గుభీష్మాదులు గలరు. ఆచార్యులగు ద్రోణాదులు గలరు. ఎవ్వ రేని మాటాడకయున్నవారు. ధర్మమును విచారించి బదులు చెప్పరు. మీరిప్పటికైనఁ బ్రతివచనమీయనిచో నేనే ధర్మము నిర్ణయించెద. వినుండు. *జూదము, పానము, వేఁటయు, మితి మీఱినభక్షణాసక్తియు ననునివి నాలుగును దుర్వ్యసనంబు లని పెద్దలు పలుకుదురు. వీనియందాసక్తులగువారు పాపులనంబ డుదురు ఇపుడు ధర్మరాజు కపటద్యూతమునకుఁ బిలువంబడి యెను. ద్రౌపది పాండవులకెల్ల సాధారణధనము గదా. ఆమెను బంటెముగా నొడ్డెను. ఇది యన్యాయము. రజస్వలయై యేక వస్త్ర యగునీమె నిటకుందోడితెచ్చుట న్యాయవిరుద్ధమే యగు. అనిపలుక వానికిఁ గర్ణుం డిట్లనియెను. వికర్ణా! నీవు బాలుఁడవు. ఇందున్న పెద్దలెల్ల నెఱుఁగనిధర్మము నీవేమెఱుం గుదువు? పిల్లవాఁ డిట్టిమహాసభలో మాటలాడుట న్యాయస మ్మతముగాదు. ద్రౌపది యధర్మవిజితురాలని పలికితివికదా. ఈస భలో నున్నవారందఱును జూచుచుండఁగనే ధర్మరాజోడెను. ద్రౌపదియు నాతనికి ధనమే యగును. కాకపోయినచోఁ బాండ

---

* చత్వార్యాహుర్నరశ్రేష్ఠా వ్యసనాని మహీక్షితాం, మృగయాః పానమక్షాశ్చ గ్రామ్యే చైవాతిరక్తతా. అని భారతము సభాపర్వము ౬౭. అధ్యా.

వు లేల యంగీకరింతురు. అప్పుడే యాక్షేపింపకుందురా. ఏకవస్త్ర యగుపాంచాలి నీసభకుందోడ్కొనిరాఁ దగదంటివి. †లోకమున వనితకు దైవవిహితుఁ డగుభర్త యొక్కరుఁడే యుండును. ఈపాంచాలి యనేకభర్తృక. కావున బంధకి యనంబడును. కావున నిట్టిబంధకిని వస్త్రహీనం జేసి తెచ్చినను ధర్మవిరుద్ధము కాదు. అని వికర్ణునితీర్పును కర్ణుండు మార్చెను.

అంతట దుర్యోధనుఁడు దుశ్శాసనుని పిలిచి నీవీపాండవులయు ద్రౌపదియొక్కయు వస్త్రముల నపహరింపుమని యాజ్ఞాపించెను. అపాపాత్ముఁడు తమచెంతకు రాకముందే పాండవులు తమపైనున్నవస్త్రములఁ దీసి సభలోఁబెట్టి ధర్మప్రవర్తకు లన్నకీర్తికిం గుఱియైరి. అంత పాంచాలిచెంత కేగి యీకార్యము చేయఁదగదని యించుకంతయు నాలోచింపక సజ్జనగర్హితుఁడు కావున నాదుశ్శాసనుఁడు త్వరపడిద్రౌపదికట్టుకొన్నవస్త్రము సభలో నీడ్చెను. ఇది దుష్కార్యమనుశంకయు నొందఁడయ్యెను. ఆతరుణముననాద్రౌపది తనపతు లూరకుండుటయుఁ గురువృద్ధులు దుఃఖించుచుండుటయేకాని యీకార్యమేలచేసెదవని యైన ననకుండుటయు, ద్రోణాద్యాచార్యులు, దుర్యోధనునిదురంత మాపఁజాలకుండుటయుఁ దలంచి యింక నితరాధారము లేదని నిశ్చయించుకొని భక్తిపరవశమునఁ జిత్తమునిలుకడనొందఁజేసి సకలలోకార్తిహరుఁడు శ్రీకృష్ణుఁడే కాని వేఱొండు లేఁడని తలంచి పరమేశా! యీబన్నము వాపి నన్నుఁ గాపాడుమా యని స్మరించెను.

† ఏకో భర్తా స్త్రియా దేవైర్విహితః కురునందన, ఇయం త్వనేకవశగా బంధకేతి వినిశ్చితా. అని మూలము.

శ్లో. "ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యా చింతితో హరిః,
గోవింద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజనప్రియ. ౪౧
కౌరవైః పరిభూతాం మాం కిం న జానాసి కేశవ,
హే నాథ హే రమానాథ వ్రజనాథార్తినాశన. ౪౨
కౌరవార్ణవమగ్నాం మా ముద్ధరస్వ జనార్దన,
కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన. ౪౩
ప్రపన్నాం పాహి గోవింద కురుమధ్యేఽవసీదతీమ్,
ఇత్యనుస్మృత్య కృష్ణం సా హరిం త్రిభువనేశ్వరమ్. ౪౪
ప్రారుదద్దుఃఖితా రాజన్ ముఖమాచ్ఛాద్య భామినీ,
యాజ్ఞసేన్యా వచశ్శ్రుత్వా కృష్ణో గహ్వరితోఽభవత్.
త్యక్త్వా శయ్యాసనం పద్భ్యాం కృపాళుః కృపయాభ్యగాత్.
కృష్ణం చ విష్ణుం చ హరిం నరం చ
త్రాణాయ విక్రోశతి యాజ్ఞసేనీ,
తతస్తు ధర్మోఽంతరితో మహాత్మా
సమావృణోత్తాం వివిధైస్సువస్త్రైః. ౪౫
ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యాస్తు విశాంపతే,
తద్రూపమపరం వస్త్రం ప్రాదురాసీదనేకశః. ౪౬
నానారాగవిరాగాణి వసనాన్యథ వై ప్రభో,
ప్రాదుర్భవంతి శతశః ధర్మస్య పరిపాలనాత్." ౪౭

మహాభారతము సభాపర్వము ౬౭ అధ్యా.

తనకట్టినపుట్టంబు దాఁకి రజస్వలయనుశంకలేక తన్ను వివస్త్రగాఁ జేయ నుంకించు ఖలుఁజేంగి పాంచాలి గోవిందా! ద్వారకానివాసా! కృష్ణా! గోపీజనప్రియా! కౌరవులు నన్నవమానించుచున్నవారు. తెలియనట్లున్నవాఁడవే. జగన్నాథా! రమానాథా!

వ్రజేశ్వరా! ఆర్తినాశనా! కౌరవసాగరమున మునింగితిని. నన్నుద్ధరింపుము. జనార్దనా! నన్నుద్ధరింపుము! శ్రీకృష్ణా! శ్రీకృష్ణా! మహాయోగీశ్వరా! విశ్వాత్మకా! విశ్వభావనా! ఆపన్నిమగ్నురాలను. సకలకష్టములకుఁ జిక్కి పరితపించున న్నుద్ధరింపుము. అని భగవంతునిస్మరించి ముఖమును వస్త్రముచే నాచ్ఛాదించుకొని బోరున నేడ్చెను.

శ్రీకృష్ణపరమాత్మ శయ్యాతలముననుండి యవమానతాపదోధూయమానమానస యగుపాంచాలిమొఱ్ఱ వినియెను. అప్పుడే శయ్యను రుక్మిణిని వదలెను. ఎవ్వరికేనెఱుఁగరాని రూపమున నాచోటికేతెంచెను. కరుణాస్వరూపుఁడు హరి సభాస్థలమున నావిర్భవించినంతనే యాజ్ఞసేనియార్తి తొలఁగెను. దుశ్శాసనుఁడు పట్టుకొనినచీరె యూడిరాఁగా నంతకంటె మంచిచీర వేఱొకటి కనఁబడెను. అదియొలువఁబడఁగా విచిత్రవర్ణపరిశోభితాంబరము మఱొక్కటి కనఁబడియెను. ఇట్లే చీర లొలువఁబడి వేఱొక్కటి మొలచుచుండఁగా, నొకపర్వతమువలె గనఁబడియెను. సభ్యులెల్ల నద్భుతానందములఁ జూచుచుండిరి. దుశ్శాసనుఁడు చేతులు నొవ్వఁగా సిగ్గుపడి మరలెను. ఎల్లవారును ద్రౌపదిపాతివ్రత్యమును గొనియాడిరి. దుశ్శాసనుదుర్నయమును దూలనాడిరి. భీష్మాదులు చేయునదిలేక యూరకుండిరి.

అంత దుశ్శాసనుఁడు ద్రౌపదిం బరిభవించుటగాంచి క్రోధమునఁ గన్నులెఱ్ఱఁగాఁ బ్రళయకాలాంతకునివలె మండిపడుచుఁ బండ్లుకొఱుకుచు నెల్లవారును వినుచుండఁగా

శ్లో. "ఇదం మే వాక్యమాదధ్వం క్షత్రియా లోకవాసినః,
నోక్తపూర్వం నరైరన్యై ర్నచాన్యో యద్వదిష్యతి.
యద్యేతదేవముక్త్వాహం న కుర్యాం పృథివీశ్వరాః. ౫౩
పితామహానాం పూర్వేషాం నాహం గతిమవాప్నుయామ్,
అస్య పాపస్య దుష్టబుద్ధేర్భారతాపశదస్య చ. ౫౪
నాపిబేయం బలాద్వక్షో భిత్వా చేద్రుధిరం యుధి,
తస్య తే తద్వచశ్శ్రుత్వా రౌద్రం రోమప్రహర్షణం." ౫౫

ఈఘట్టమున వాగనుశాసనుఁ డగునన్నయభట్టారకమహాకవిశిరోమణి

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ చూచుచుండఁగ
మదోద్ధురుఁడై ద్రౌపది నిట్లుచేసినఖలుఁ దుశ్శాసనుఁ
లోకభీకరలీలఁ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘుని
ర్ఝరముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతునుగ్రాకృతిఁ.

అని వ్రాసిరి. ఈఘట్టముననే కవిరాజశ్రీకృష్ణమూర్తిశాస్త్రులుగారు తమభారతమునందు

మ. వినుఁడో క్షత్రియులార మీరిపుడిటం వీక్షించుచుండంగమా
వనితఁ ముట్టి పరాభవించె ఖలుఁ డీపాపాత్మునిం బట్టి నే
ననిలో నెల్లరుఁజూచుచుండ నురముఁ వావా యనంజీల్చి త
జ్జనితానంతకవోష్ణరక్తమును నాస్వాదింతు నుగ్రుండనై.

అని వ్రాసిరి.

ఇట్లు చేయలేకున్నచోఁ బితృపితామహులగతికిందప్పినవాఁడ నగుదునని ప్రతిజ్ఞచేసెను. ఆప్రతిన యమానుషము. కావున దానివినియచ్చెరుపడి దిక్కులుచూడక ఛీఛీయని పలు

కుచు నెల్లవారును సపుత్త్రకుండగుధృతరాష్ట్రు నిందించుచుఁ బాంచాలియడిగిన ప్రశ్నమునకు బదులుచెప్పక యుపేక్షించుట యుందలివృద్ధులగు రాజులకు నాచార్యులకుఁదగునాయని పలుకు చుండిరి. అంతటఁ జేతులెత్తి విదురుం డెల్లవారిని వారించి యిట్లు పలికెను. సభాసదులారా! బుద్ధిమంతులు ద్రౌపదియడిగిన ధర్మసందేహమును విచారింపవలయును. దానిం దీర్పకపోయి నచోఁ బాపము లభించును. ఈవికర్ణుఁడు కడుంజిన్నవాఁడైనను ధర్మశాస్త్రములను బరిశోధించి బృహస్పతివలె ధర్మము తెల్పెను. వీఁడా ధర్మమును జెప్పువాఁడని తూలనాఁడక దీని నంగీకరిం పుఁడు. ధర్మసూక్ష్మ మొక్కఁడు సెప్ప శక్తుఁడుకాఁడు. కావున మీరెల్ల రద్దాని నంగీకరింపఁదగును. ఏలయనఁగా సభకరుదెంచి ధర్మసంశయమును దీర్పుఁడని యడిగినపుడు చెప్పకయుండినయె డల నాసభ్యులు పాపభాక్కులగుదురు. పాపమునం దర్ధము సభ్యులనొందునని విధికలదు. అంతియగాక ధర్మమెఱిఁగియుం డియు లోభముననో పక్షపాతముననో, చాంచల్యముననో వే ఱువిధముగాఁ బలుకునోవాఁ డనృతదోషఫలమునంతయు నను భవించును. అని యనేకోదాహరణములం దెల్పిరని పలుకు టయు సభలోనివారెల్లరు దుర్యోధనుభయంబున నొక్కమా టయేని పలుకకుండిరి.

ద్రౌపది యంతట సకలరాజసమక్షమున దుశ్శాసనుఁ డిట్లు తన్నవమానింప దుఃఖితయగుచు నెల్లరువినఁ బాండవులకు బత్నినై శ్రీకృష్ణునకుం జెలియలినై సభామధ్యమున ని ట్లవ మానింపఁబడితిని. ఇది యన్యాయముకాదా. ఇదియటుండ నిండు. నేనిపుడు దుర్యోధనునకు దాసినగుదునా. కాఁదగనా.

నిర్ణయింపుఁడని మరలఁ బ్రశ్నించెను. భీష్ముఁ డాప్రశ్నమును విని తల్లీ! నీప్రశ్నమునకు నుత్తరమాయుధిష్ఠిరుఁడు చెప్పవలయునే కాని ధర్మసూక్ష్మ మెవ్వరెఱుంగుదురు! అది గహనము. ఇట్టి దుర్వ్యవసాయమునకు ఫలము శీఘ్రకాలమున నీకురుకులపాంసను లనుభవింతురు. అని పలుకుచుండునంతలోఁ గర్ణుఁ డాద్రౌపదిం గాంచి యింతీ! ఏవురుభర్త లుండుటకంటె జూదమున భార్యనోడనివాని నొక్కని బతిఁగా బడయుమా యని యుల్లసమాడెను. దుర్యోధనుఁడు ద్రౌపదింగని నాయూరుభాగము నెక్కుదువుగాక యని సంజ్ఞ చేసెను. ఆకనుసన్న యెఱింగి భీముఁ డాగ్రహమున నొడలు తెలియక యుండి యెల్లవారాలకింపఁగా నిట్లుపలికెను. ఈదురాత్ముఁడు రాజ్యసంపన్మత్తుఁడై తనతొడపైఁ గూరుచుండుమని ద్రౌపదిం గాంచి పలికెను. కావున సంగరరంగమున నాగదాహతిచే వీనియూరువులు పడఁగొట్టెదనని శపథముచేసెను. అంత నిలువక తనయాయుధములున్నదిక్కునకుఁ దృష్టులు ప్రసరింపఁజేయుచుండెను. ఆవిధమెఱింగి భీష్మవిదురద్రోణాచార్యప్రభృతులు భీమసేనా! యిది కోపమున కదనుకాదని ప్రశాంతచిత్తుం జేసిరి. అత్తఱి ననేక దుశ్శకునములు తోఁచెను. ఇఁకఁ గౌరవులకరిష్టములు తప్పవని భీష్మాదు లూహించిరి.

ఆవిధ మెఱింగి గాంధారి విదురుందోడుకొని ధృతరాష్ట్రునికడకుంబోయి పాండవులు కపటద్యూతమున నోడుటయు ద్రౌపదీపరాభవమును దుశ్శకునములుతోఁచుటయుం జెప్పెను. వాని నాలకించి కొడుకుం బిలిచి యిది దున్నయంబని హెచ్చరించి సకలబాంధవులకు హితముచేయుపాంథ ద్రౌప

దిని బిలిపించి శాంతవచనముల నూఱడించి యిట్లుపలికెను. అమ్మా ! నాకోడండ్ర యందందఱియందును నీవు పూజ్యు రాలవు. నీకుఁ బ్రియము చేయఁగోరితిని. నీవేమికోరుదువో యడుగుము. అనిపలికినఁ బాంచాలి వినీతయై మామా ! నాకు హితము చేయఁబూనినచో లోకపూజితుఁడగు ధర్మ రాజు దాస్యవిముక్తుఁడగున ట్లనుగ్రహింపుము. దానిచేఁ బ్రతివింధ్యుఁడు దాసపుత్త్రుండు గాకయుండును. ఇదియే నా యిష్టము. అనిన నీవరమిచ్చితి. మఱొక్కవరమడుగుమనిన రాజా ధర్మరాజుతమ్ములు తమయాయుధములతో దాస్యవిము క్తులుకావలయును. అనిన నీవరమిచ్చితిని. ఇంకను వరమడుగు మని ధృతరాష్ట్రుండు పలుకఁగా ద్రౌపది మహాత్మా! వైశ్యస్త్రీ మంతిని యొక్కవర మడుగఁదగు.) ఉత్తమక్షత్రియాంగన రెండు వరము లడుగఁదగియుండు. శూద్రనారిమూఁడువరములడుగఁ జాలు. విప్రసాధ్వి నూఱువరములడుగఁజను. కావున మూఁడవ వరమడుగుట నాకు న్యాయముకాదు. అనిపలికిన నాసాధ్వీమణి గుణముల కానందించి ధర్మరాజుం బిలిచి వత్సా! యథాపూర్వ ముగా సర్వసంపదలుగొని నీరాజ్యమును బాలించుచు నింద్ర ప్రస్థపురమున సుఖంబుండుము. నీకన్నియు శుభములుగానగు. అనిపలికి నీవు సకలధర్మముల నెఱుంగుదువు. పెద్దలతో సహ వాసముచేసితివి. ఇట్టి నీకు నాకొడు కపకారముచేసెను. కావున వానియవివేకమునకు క్షమింపవలయును. నీవంటిధర్మా త్ములు క్షమాగుణముగలవారలగుట సహజము. నేనుగూడ బుద్ధిమాలి జూద ముపేక్షించితిని. బుద్ధిహీనుఁడనయి వృద్ధుఁడ నగు నన్నును మీతల్లి గాంధారిని దలంచి నాకొడుకు లవి

వేకులు చేసినయపరాధమును మన్నింపవలయును. సర్వశాస్త్ర వేత్తయగు విదురుఁడు మంత్రిగా సర్వధర్మవేత్తవగు నీవు రక్షకుఁడవుగా నిక్కురుకులమునకు మేలగునని హితముగఁజెపి పాండురాజు రాజ్య మర్పించెను.

ద్రౌపదివలన నిట్లు రాజ్యసంప్రాప్తియు దాస్యనివృత్తియుఁ గలుగుట విని భీమసేనుఁడు స్త్రీకారణమున రాజ్యము కలిగెననునపకీర్తి కోర్వఁడయ్యెను. తనపరాక్రమమున రాజ్యము నార్జించెదనని యాగ్రహవ్యగ్రుఁడైయున్న భీమసేనుంగాంచి కరతలంబున వారించి ధర్మరాజు ధృతరాష్ట్రనిశాసనమునఁ దమ్ములు దానును భార్యాసహితముగాఁ గాంచనరథమునెక్కి యింద్రప్రస్థపురంబునకుం బోయెను. దుర్యోధనుఁడు తమ్మునిచే నావృత్తాంతమంతయు విని కర్ణశకుని సైంధవులతో విచారించి తండ్రిపాలికింబోయి యిట్లుపలికెను. తండ్రీ! పగవారి నేవిధముననైన హతముచేయుట వివేకమని పెద్దలు పలుకుదురు. బృహస్పతియు నింద్రున కీనీతినే యుపదేశించెను. ఇఁకఁ బాండవుల కెట్లును మనము హితులము కాఁజాలము. పాములకు నాగ్రహమును గల్గించి గొంతునకుఁ జుట్టుకొన్న యట్లు వారల విడిచిపుచ్చితి. మనకే చేటుతెచ్చుకొంటిమి. అంతియగాక, అర్జునుఁడు గాండీవముపూనఁగా, భీముఁడు గద ధరింపఁగా, నకులసహదేవులు కృపాణచర్మాదులఁదాల్పఁగా వారి నెదిరింప మాకు శక్యముగాదు. కావున ననుద్యూతంబున నోడించి రాజ్యమునుండి వెడలఁగొట్టుటయే కార్యము. అని నొక్కిపలుకఁగా ధృతరాష్ట్రుం డందుల కంగీకరించి యను ద్యూతనిమిత్తము ధర్మరాజుం దోడుకొనివచ్చుటకుఁ బ్రాతి

స్వామి నాజ్ఞాపింపఁగా నాతఁ డరిగి వారలను దోడుకొనివచ్చెను. ఆద్యూతమునఁ బరాజితు లెవ్వరగుదురో వారు పండ్రెండేడు లరణ్యవాసంబును, ఒక్కయేఁ డజ్ఞాతవాసంబును జేయవల యును. అజ్ఞాతవాసనియమభంగమగుచో మరలఁ బండ్రెండేం డ్లరణ్యవాసము మరల నజ్ఞాతవాసము చేయవలయునని నియ మము ననుసరింపవలయుననిరి. ఆమాటలకు ధర్మరాజు జూద మాడి యోటుపడి సోదరులతో ద్రౌపదితో నడవుల కరిగెను.

మహానుభావులారా! ఈకథయందుఁగలవిశేషము లెన్ని యున్నను బ్రధానము పరమేశ్వరుని యార్తత్రాణపరాయణ త్వమే. రెండవది పాతివ్రత్యప్రభావము. ఈ రెండును జక్కఁ గా విమర్శింపఁదగినవి. ద్రౌపది దిక్కులేనిదానివలెఁ బరాభ వింపఁబడియెను. చూచుచున్నభర్తలుగాని బాంధవులుగాని యామెయిడరు తీర్పఁజాలకపోయిరి. బలవంతులగుభర్తలు కల రన్నగర్వ మా ద్రౌపదిమదినుండి తొలఁగెను. ఆపత్సమయము లందు దిక్కు భగవంతుఁ డొకఁడే యన్ననీతి యామెచిత్త మున నాటుకొనియెను. వేనవేలుమహాపురుషులుండినను గొంచె మైనను సాయముచేయువారు లేకపోయిరి. క్షణక్షణమునకుఁ గష్టములు మెండుకొనుచుండెను. దురాత్ములు చెలరేఁగు చుండిరి. తుదకు మహాసభలోఁ దన్నువివస్త్రగాఁ జేయునాపద తటస్థించెనని యామె యెఱింగెను. లోకమర్యాద ననుసరించి యది స్త్రీలకు మహాపదయనుట కే సందేహములులేవు. ఆతరు ణమున నన్నిసాయములు పొల్లులనియే నమ్మి యార్తత్రాణ పరాయణుండగు శ్రీకృష్ణుని ధ్యానించెను. ఒక్కక్షణము

మనస్సు సమాధానముచేసి పరాత్పరుని ధ్యానించెను. అదియే యోగము. యోగగమ్యుఁడు పరాత్పరుఁడు.

"తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః,
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున." ४౬
౬. అధ్యా.

అని గీతాశాస్త్రమున శ్రీహరియే యుపదేశించెనుగదా. కావున సమాహితచిత్తమున నొకముహూర్తకాలమే ద్రౌపది ధ్యానించెను. ఆధ్యానమాపరాత్పరుని శ్రీకృష్ణు నాకర్షింపఁజాలెను కాఁబట్టియే,

"చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్."
అను నర్జునునిప్రశ్నమునకు,

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్,
అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే. ३४
అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనాతు యతతా శక్యోఽవాప్తు ముపాయతః." ३౬

అని సమాధానము చెప్పెను. మరల నర్జునుఁడు,

"అయతిశ్శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః,
అప్రాప్యయోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి. ३౭
కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి. ३౮
ఏతన్మే సంశయం కృష్ణ చ్ఛేత్తు మర్హస్యశేషతః,
త్వదన్యస్సంశయస్యాస్య చ్ఛేత్తా న హ్యుపపద్యతే." ३౯

అని ప్రశ్నింపఁగా,

"పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే,
నహి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాతగచ్ఛతి. ౪౦
ప్రాప్య పుణ్యకృతాఁ లోకానుషిత్వా శాశ్వతీస్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే. ౪౧
అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్,
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్. ౪౨
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం,
యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునందన. ౪౩
పూర్వాభ్యాసేన తత్రైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతిరిచ్యతే. ౪౪
ప్రయత్నాద్యతమానస్తు యోగీసంశుద్ధకిల్బిషః,
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్." ౪౫

అని సమాధానము చెప్పెను. దీని నాలోచింపఁగా మనస్సమాధానము యోగాభ్యాసమునఁగాని కుదురదనియు నయ్యోగము చిరంతనాభ్యాసముచేతను, వైరాగ్యముచేతను సాధ్యమనియు, నట్టియోగమార్గముతప్ప మనోనైర్మల్యమునకు వేఱొక కారణము కానరాదనియు, నూరక వేదాంతవిచారముచేయుదుమని పల్కువారలమాటలు తుచ్ఛములనియు, ననేకజన్మముల యోగాభ్యాసముచేసి మనస్సు నిశ్చలముగఁ జేసినఁగాని ముక్తి లభింపదనియుఁ, గేవలవేదాంతశాస్త్రపఠనము పొట్టకూటికిఁదప్ప వేఱొండుపురుషార్థమున కుపకరింపఁదనియు సారము తేలును. కావుననే పాంచాలరాజకుమారిక యట్టి

యిక్కట్టున నేకాగ్రచిత్తయై శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించెను. ఆయేకాగ్రతయే భగవంతునిసాన్నిధ్యమును గల్పించెను. దాన నామె వాంఛితము ఫలించెను. కాఁబట్టి యే మానవుఁడుగాని మనస్సు నిశ్చలతఁగాంచునట్లు ప్రయత్నముచేయవలయును. ఆపన్నార్తిహరుఁడగు శ్రీపరమేశ్వరుఁడు నిర్మలమనస్సుగలవారలఁ గాపాడ నిరంతరము తలంచుచుండును.

ఈపట్టున నొక్కకథ స్మృతిగోచర మగుచున్నయది. అది పెద్దలవలన విన్నయదిగాని నాకల్పించిన యదికాదని పాఠకులు తలంపవలయు. మఱియు నాకథ యుక్తియుక్తముగా నున్నయది. ద్రౌపది పరాశక్తి. అనఁగా శ్రీవిష్ణు యోగమాయ. భగవంతుఁడు భూభార మడంపఁబూని యోగమాయాదేవిని భూలోకమున నవతరింపుమా యని యాజ్ఞాపించెను. రామావతారమున సీతయే యోగమాయ. ఆమె మూలముననే రాక్షససంహారము సాగెను. ఈకృష్ణావతారమునద్రౌపదిమూలముననే భూభారహరణప్రయత్నముసాగెను. పరాశక్తి యయోనిజయై యవతరించును. ద్రౌపది యజ్ఞకుండ సంభూతకదా. ఆమెమూలముననే దుష్టసంహారము కావలయును.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే. ౧౪
గీతా ౭ అధ్యా.

అన్నగీతావాక్యము పైభావమును దృఢపరచుచున్నయది.

ఆద్రౌపది యొకతఱి భీమునివంతుగా నొక్కవత్సరము గడపఁదగునియమముననుండఁగాఁ దనయందే యామె యను

రాగముగలదని భీముఁడు భావించుచుండెను. వ్యాసమహర్షి యొక్కనాఁ డరుదెంచి పాండవులకుశల మరసి వెడలునపుడు భీమునిం గొంతదూరము పిలుచుకొనిపోయి భీమసేనా! నీ కొక్కరహస్యము తెల్పెద. దానిని వెలిఁబుచ్చవుకదా యని తెల్పి శపథముచేయించుకొని యిట్లు తెల్పెను. ద్రౌపది యాదిశక్తి. భూభారహరణార్థము శ్రీకృష్ణానుమతి నవతరించెను. అయోనిసంభూతురాలు. కావున నామెను సర్వదా పత్నిగా భావింపకుము. ధీరుఁడవుగాన రాత్రియం దొక్కనాఁ డామె స్థితిని బరికింపుము. ఏనాఁడు పరీక్షింపఁబూనుదువో యానాఁడు నన్ను స్మరింపుము. నీకు వియద్గమనము గల్గును. ఆపరీక్షనుండి గ్రహించినవిషయమును వెలిఁబుచ్చితివేని నాశనమూలమగును. అని తెల్పి పోయెను. భీముఁ డాదినము మొదలుకొని కొలఁది దినములామెయందు యథాపూర్వానురాగమునే కనఁబఱచుచునుండెను. అమవస యరుదెంచెను. ఆనాఁడు సాయంకాలమునుండి ద్రౌపదిమోమున నించుకమార్పు కనఁబడియెను. భీముఁ డద్దానిం బాటించినట్లు నటింపక యథాపూర్వముగనే ప్రీతిని గనఁబఱచుచుండి శయనించెను. అమావాస్య గనుక నాఁడు వేఱు వేఱుశయ్యలపై వారు నిదురించిరి. పరుండుతఱి భీమసేనుఁడు భక్తిభావమున వ్యాసులను స్మరించెను. వ్యాసానుగ్రహమాతనికిం గల్గెను. అర్ధరాత్ర మయ్యెను. భీముఁడు చక్కఁగా నిదురించుచున్న ట్లుండెను. ద్రౌపది తనశయ్యనుండి లేచెను. గృహాంగణము దాఁటెను. ఆమెరూపము మహాఘోరముగనుండెను. వ్యాసవరప్రభావమున భీముఁ డంబరగమనమున నామె వెనుకనే పోవుచుండెను. ముహూర్తమాత్రమున

నాదేవి వింధ్యారణ్యముల కేగెను. అందు రెండుకొండల నడుమ దుర్గమారణ్యభాగమున భిల్లులెల్ల నొకమహోత్సవము చేయుచుండిరి. ఆయుత్సవముకొఱ కొకమండపము నిర్మించి యందొకగొప్పయాసనము నమర్చియుండిరి ఆకాశవీథినుండి దిగి ద్రౌపది యాసింహాసనమునం గూరుచుండెను. భీముఁడభ్రవీథినుండియే వ్యాసవరప్రభావజనితదివ్యదృష్టిని దిలకించుచుండెను.

ఆభిల్లు లామెరాకం గాంచి యేవేవో పాటలుఁపాడుచునామెను బూజించిరి. తమకులదైవము ప్రత్యక్షమయ్యెనని పరమానందమందిరి. ఆయుత్సవమున దేవతయావిర్భవింపనిచో నాబాలవృద్ధముగ వారు శస్త్రనిహతులఁ బ్రాణములఁబాయుదురు. అని వారికులమున నియమము కలదఁట. వారా దేవిని బూజించి తమ రంతకుమున్నే సేకరించియుంచిన వనజంతువులం బెక్కింటిని బలియిచ్చిరి. ఆబలిని బరిగ్రహించుచు రక్తపానముచేయుచు మాంసమును మెసవుచు నాదేవి భయంకరాకారమున నెవ్వారికేని దేఱిచూడరాకయుండెను. వేలకువేలుగా జంతువులు బలియీయఁబడుచుండెను. రక్తము మాంసము దేవి కొసఁగఁబడుచుండెను. కొందఱు మంత్రములఁ బఠించుచుండిరి. కొందఱు ఖడ్గములెత్తిజంతువులనఱకుచుండిరి. స్త్రీలుపురుషులు దేవినిగూర్చినపాటలు పాడుచుండిరి ఆ యుత్సవము మహాభయంకరముగా నుండెను. భీమసేనుఁడు వ్యాసానుగ్రహపాత్రుఁడు కాకయుండినచో దేవీదర్శనమున జచ్చియే యుండుచు. ఒక్కయామ మెంతో భక్తిమెయి వారు గడపిరి. భీమసేనా! ఇంకమరలుము. యథాపూర్వముగా శయనించియుం

డును. దివ్యదృష్టిచే నంతయునీకుఁ గనఁబడు నను శబ్దము చెవు లఁ బడియెను. భీముఁడు వచ్చి శయనించి గుఱువెట్టుచుండెను. ద్రౌపది మరల గృహాంగణమును జేరునంతలో నాదూపము మాఱి ద్విభుజములతో శాంతమూర్తిచేకొని శయ్యాతలమున నుండెను.

భీమసేనుఁ డంతటలేచి వ్యాసోక్తస్తోత్రరాజమున వినుతించి ప్రార్థించెను. పరదేవీ! మాసోదరుల బ్రదికింప వరమిమ్మని వేడెను. ఆమె వ్యాసమహర్షియుపదేశమని యెఱింగి యట్లే కానిమ్మని వరమిచ్చెను. ఈరహస్యము సోదరులకుం దెల్పుదు వేని నీశిరము శతథాభిన్నమగుననియె. భీముఁ డట్లే యని శపథ మొనర్చెను. వెంటనే ద్రౌపది తనప్రభావమున నాతనికిఁ బూర్వజ్ఞానమే యుండునట్లాచ్ఛాదించెను. వ్యాసవరము తనంతన విరమించెను. కావున ద్రౌపదినే కౌరవు లవమానించిరి. ఆమె కవమానము కాకయుండ శ్రీహరి కాపాడెను. ఆదేవి స్మరించి నంతనే భగవంతుఁడు తోఁచుట విచిత్రమే కాదు. భగవదిచ్ఛ యేకదా శక్తియని పరదేవియనియు నెఱుంగందగియుండు. కాఁబట్టియే యాద్రౌపదిమూలమున నిందఱు మృతులు కావల సినవారైరి. ఈకథ యేపురాణమున నున్నదో నేఁబరిశీలింపలేదు గాని పెద్దలు చెప్పఁగా వినియున్నవాఁడను. ద్రౌపది లక్ష్మి యనియు శ్రీమహాభారతమునందుఁ గలదు

"ఇన్ద్రైవ తే పాండవా వీర్యవంత
శ్శక్రస్యాంశః పాండవ స్సవ్యసాచీ,
ఏవ మే తే పాండవా స్సంబభూవు
ర్యే తే రాజన్ పూర్వమింద్రా బభూవుః. ౩౫

లక్ష్మీశ్చైషాం పూర్వమేవోపదిష్టా
భార్యా యైషా ద్రౌపదీ దివ్యరూపా,
కథం హి స్త్రీ కర్మణో౽ంతే మహీతలా
త్సముత్తిష్ఠే దన్యతో దైవయోగాత్. 36

యస్యా రూపం సోమసూర్యప్రకాశం
గంధశ్చాస్యాః క్రోశమాత్రాత్ప్రవాతి,
ఇదం చాన్యత్ప్రీతిపూర్వం నరేంద్ర
వదాని తే దివ్య మత్యద్భుతం చ." 37

(ఆదిపర్వము, ౧౯౭ అధ్యాయము)

ఈభారతవాక్యములుకూడ ద్రౌపదీమాహాత్మ్యమును చెల్పుచున్నవి. ద్రౌపదీమూలముననే మహాసంగ్రామము కురుపాండవులకుం జెల్లెనని స్పష్టముకదా. ఆర్యులారా! ఈకథయందు శ్రీహరికింగల యార్తత్రాణపరాయణబిరుదము సార్థకమయ్యెను. దీనులంగావ దిక్కులేదన్న వాదము దుర్వాదము. భగవంతుఁడు సర్వకాలసర్వావస్థలయందును దనభక్తులను గావ సంసిద్ధుఁడై యుండును. అట్టివానిని స్మరింపకుండుట దుష్టకర్మవశమునఁగాక మఱేమనవచ్చును? ఎందఱెనో యాశ్రయించి కడునిడుమలఁబడుటకంటె సర్వకార్యనిర్వాహకుఁడై సర్వజ్ఞుఁడై సర్వకర్తయై యాదిమధ్యాంతరహితుఁడై యలరారు పరాత్పరు నాశ్రయించుట న్యాయము సులభతమమునగు. ఆకార్యమునఁ బ్రమత్తులగుటకంటె దుష్టగ్రహాచారము వేఱేది యుండును. కావున సులభసాధ్యుఁడగుపరాత్పరుపాదములఁ దలంచుటయే శ్రేయస్కరము. ఇంకఁ దర్వాతికథ నాలకింపుఁడు.

—శ్రీకృష్ణరాయబారము.—

*పాండవు లడవులఁ గడుఁగష్టముల ననుభవించి యను భవించి శ్రీకృష్ణానుగ్రహమున నాకష్టములనుండి గట్టెక్కిరి. అజ్ఞాతవాసకాలమున విరాటునిపురమున నేకష్టములు కలిగి నను దప్పించుకొనఁగల్గిరి. ఆకాలముగడచెను. నియమముం దీర్చుకొని న్యాయపక్షమునకు సాయపడఁబూనిన రాజులంగూ ర్చుకొని యుపప్లావ్యమునఁ జేరిరి. వారిం జూడఁగోరినవారెల్ల నచ్చటికివచ్చి యారసిపోవుచుండిరి. యుద్ధము కాఁగలదనియు నందులకుఁ బాండవులకుఁ దోడునీడగా నుండఁదగుననియు నూహించి రాజులు కొందఱు తమతమసేనతోవచ్చి చేరిరి. భగవంతుఁ డూహించిన ట్లెల్లవిధముల సంగరప్రయత్నము కాసాగెను. ఎవ్వరెవ్వరు మృతినొందఁదగినవారో వారెల్లఁ గౌరవపక్షముననో పాండవపక్షముననో చేరుచుండిరి. ఎవ్వరె వ్వరిమూలమున నేయేకార్యములు కావలయునని శ్రీహరి సంకల్పించునో వా రాయాకార్యముల నొనర్పఁ గుతూహలు లగుచుందురు. జంత్రములపోలికనాడుచుందురు. కాని యాకా ర్యనిర్వాహకులము మేమే యని భావించుచుందురు. అయహం కార ముండినఁగాని యుత్సాహముకలుగదు. కర్మమే కార్య ముల నిర్వహించు ననుభావ ముండుట నిరుత్సాహలక్షణము కదా. కావుననే భగవంతుఁ డెల్లరకు నహంకర్తృత్వమును గల్గఁజేసెను అదిలేకున్నఁ బ్రపంచవ్యవహారము సాగదుకదా.

---

* ఈకథ శ్రీమహాభారతమున నుద్యోగపర్వమున డెబ్బదిరెండవ యధ్యాయము మొదలుకొని కొన్నియధ్యాయములనుండి సంగ్రహించి వ్రాయఁబడినదని యెఱుంగందగు.

శ్రీకృష్ణమూర్తి పాండవులకుశల మరయఁగోరి లోకాచారము ననుసరించి బలదేవాదులంగూడి యభిమన్యునివివాహామునకువచ్చి యచ్చటనుండి పాండవులను వదలకయుండెను. తనయవతారఫలమున రెండవకార్య మిదియేకదా యని యూహించెను. లోకమునఁ గర్మసిద్ధాంతమును దృఢపఱుపఁబూనెను. ఎవ్వరెవ్వరి కర్మముల వారే హతులగుటయో విజితులగుటయో జయముంగాంచుటయో సాగుచుండఁ దక్కినవారు కారణభూతులుగ నుందురుగాని కార్యమును సాధింపఁజాల రన్న కర్మసిద్ధాంతము నుదాహరణపూర్వకముగాఁ జెప్పఁబూనెనని గ్రహింపవలయును. ఉపప్లావ్యమునఁ బాండవు లున్న వార్త నాలకించి ధృతరాష్ట్రుఁడు సంజయుని బంపి వారి నూఱడించెను. పాండవులు సంజయరాయబారమున స్వాభిప్రాయములం దెలిపిరి. వానినన్నింటిని వ్యాసశిష్యుఁడగు నాసంజయుఁడు ధృతరాష్ట్రునకు విన్నవించెను.

ఆవలఁ బాండవులు శ్రీకృష్ణుని ధృతరాష్ట్రునికడకుం బంపి కడపటిప్రయత్నముకూడఁ జేయనెంచిరి. దండోపాయముచేయుట సామదానభేదములు సాధ్యములు కానిచోఁ గదా యని యూహించిరి. కడపటివఱకు ధర్మమార్గమునే యాశ్రయింపఁ బూనిరి. ఈకార్యమును సాధింప శ్రీకృష్ణుఁడు తప్ప వేఱొకరు సమర్థులు కారనియు నూహించిరి. కావున శ్రీహరినే పంప నిశ్చయించిరి.

ధర్మరాజు సోదరులు తక్కుంగలసామంతరాజులసమ్మతమెఱింగి వారిని దోడుకొని శ్రీహరిమందిరమున కరిగి యాతని

సేవించుచుండి మహాత్మా! యెల్లవారు వినునట్లుగా మహాను
భావా! జగద్గురూ! సకలకష్టములఁ దొలఁగించి

క. ఆపద గడవంబెట్టఁగ
నోపి శుభంబైనదాని నొడఁగూర్పఁగ మా
కీపుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా!

తిక్కనకవిబ్రహ్మ.

సర్వసంపదలఁ జేకూర్ప మాతండ్రి పాండురాజు మృతినొం
దుచు శ్రీకృష్ణుఁడే కలఁడు. ఆమహాత్ము నాశ్రయింపుఁ డనిపలికి
తనువును వదలెను. కావున మాకు సకలవిధములను రక్షకుఁడ
వునీవే. ఇట్టినిన్ను నొకకార్యమునకుం బనుపనెంచి వచ్చినాఁ
డను. మాయందుఁ గలవాత్సల్యముపెంపున మాకోరికను
దీర్పవలయును. యుద్ధము చేయుటకు మనస్సొడఁబడదు.
రాజ్యము వదలుటకు నంగీకరింపదు. బంధుకుటుంబరక్షణము
రాజ్యహీనులమగుమాకు దుర్భరము. కావున న్యాయమార్గ
మున మాకు రాఁదగినతండ్రిభాగమడుగ నింకొక్కసారి ప్రయ
త్నింపఁ నెంచితిమి. ఆకార్యమునకు నిన్నే పంపనెంచితిమి. దిక్కు
నీవే కావున నీకార్యమునకైనఁ బంప సాహసించుచున్నారము.
కుటిలస్వభావులు క్రూరకార్యనిరతులు నగుకౌరవులకడకు
నిన్నుంబంపుట పాడిగాదు. ఐనను వేఱుశరణము లేదుగాన
నిన్నే పంపఁదలంచి యావార్తఁ దెలుపవచ్చితిమి. కావుననో
మహాత్మా! ఈకార్యమెట్టిదైనను మాయందుఁ గలకరుణచే
నరిగి సమకూర్పవలయునని స్వాభిప్రాయమును స్పష్టపఱచెను.

ధర్మనందనుఁ డిట్లువిన్నవింపఁగా శ్రీహరి తాసర్వజ్ఞుఁ డగు లోకాచారము ననుసరించి తానడుగుట కంగీకరించుచు సంధికుదురదనియు, దండోపాయమే సాధ్యమనియు, రాజనీతి నాశ్రయించి రాయబారము పంపుట న్యాయమే యనియు, ధర్మ మార్గముననుసరించుట శ్రేయస్కరమనియుఁ దెలిపి పాండవుల యభిప్రాయముగాఁ దానచటఁ జెప్పఁదగినమాట లెవ్వియో వేఱువేఱుగా నడిగి వారియాశయముల నెఱింగి యందుఁ బాండుపుత్త్రద్వితీయుఁడు శాంతమూనినజాడ నెఱింగియాతనింబ్రోత్స హించి యుద్ధసన్నద్ధుం జేసి సాత్యకింగూడి ప్రయాణమయ్యెను. నారదాదిమహర్షు లాపరమేశ్వరుని దర్శించి తదభిప్రాయ మెఱింగి పనివినిరి. ద్రౌపది పలికినమాటలు ములుకులవలె హరిమదికిం గన్పట్టెను. ఆములుకులే ధార్తరాష్ట్రులకుఁ బ్రాణాపాయకర ములని మదికిం దోఁచెను. హస్తినగరమున శ్రీహరిరాకకై సాధువు లానందపరవశు లైరి. విదురునిమూలమున నెఱింగి ధృతరాష్ట్రుఁ డుచితరీతి నెల్లరు ప్రవర్తింపవలయునని కొడుకును హెచ్చరించెను నగరమలంకరించి పదార్థముల నేకరించి హరికి విందుచేయ నెంచెను. దుర్యోధనుఁడు బంధుమర్యాదఁ బాటించి మహోత్సాహమున నాతిథ్య మొసఁగఁ బూనెను. భగవంతునకు భక్తియే ప్రధానమనియు నితరపదార్థము లప్రధానములనియు, నాకృష్ణునారాధించుట యనఁగాఁ దదిచ్ఛానుసారము మెలఁగుట యనియు విదురుఁడు నొక్కిచెప్పెను. ఆమాట లాదుర్యోధనాదులకు సంతృప్తిని గొలుపఁజాలకపోయెను.

శ్రీహరి దారుకసారథియై సాత్యకింగూడి కరినగరమున కరుదేర నెల్ల రామహాపురుషు నెదుర్కొనిరి. రాజమందిరమున నుచితాసనాసీనుంగావించిరి. కుశలప్రశ్నములు సాగినపిదప శ్రీహరి యెల్లవారు వినుచుండఁగా నిష్టకథాలాపములఁ గొంత తడవు జరపెను. *విదురాదులు వినుచుండ దుర్యోధనుఁడు విందారగింపవలయుననియు దత్ప్రియత్నమునఁ దానెంత యాదృతింగాంచినదియుం దెలుపఁగా శ్రీహరియు నందులకంగీకరింపక యుట్లనియెను. ప్రీతిపూర్వకముగాఁబిలిచి పెట్టినయన్నము లెస్స భుజింపఁదగినది. అది లేనిది భోజ్యముకాదు. కార్యార్థమొండె ఆపదచేనొండె విధిలేక పెట్టిన యన్నము సకలామూల్యపదార్థయుక్తమైనను సాధువులు దానింగుడువనొల్లరు. దుర్యోధనా! మాయందు నీవు హితముగలవాఁడవు కావు. నీయింట భుజింపఁదగినంతయాపదయు మాకు లేదు. మఱియొకమాట వినుము. పగవారియింట నమృతమువంటిపదార్థము భుజించిన నది యను

---

* త్వదర్థముపనీతాని నాగ్రహీస్త్వం జనార్దన, ఉభయోశ్చాదదస్సాహ్యముభయోశ్చహితే రతః. ౧౪. సంబంధీ దయితశ్చాసి ధృతరాష్ట్రస్య మాధవ, త్వం హి గోవింద ధర్మార్థౌ వేత్థ తత్త్వేన సర్వశః. ౧౫. తత్ర కారణమిచ్ఛామి శ్రోతుం చక్రగదాధర. వైశంపాయనః. స ఏవముక్తో గోవిందః ప్రత్యువాచ మహామనాః. ౧౬. ఉద్యన్మేఘస్వనః కాలే ప్రగృహ్య విపులం భుజం, అనర్థకృతమగ్రస్తమనిరస్తమసంకులమ్. ౧౭. రాజీవనేత్రో రాజానం హేతుమద్వాక్యముత్తమమ్, కృతార్థా భుంజతే దూతాః పూజాంగృహ్ణంతి చైవహి. ౧౮. కృతార్థం మాం సహామాత్యం సమర్చిష్యసి భారత, ఏవముక్తః ప్రత్యువాచ ధార్తరాష్ట్రో జనార్దనమ్. ౧౯. అని ఉద్యో. ౯౦ అధ్యాయము.

మానముగనుండును. పగవారికి భోజనముపెట్టరాదు. తాను బగవారియింట భుజింపనురాదని పెద్దలందురు. ఇంతియగాదు. నీవు పాండవులపై ద్వేషమూనియుందువు. ఆపాండవులు నాకుం బ్రాణతుల్యులు. కావున నీవు నాకుంబగవాఁడవే యగుదువు. కావున మీరు సిద్ధముచేయించినపదార్థము లమూల్యములే యైనను దుష్టములు. కావున నవి పరిగ్రహింపఁదగవు. విదురునియన్నము పరమపావనము. విదురునింట భుజింతునని పెక్కుభంగులం దెలిపి విదురునిగృహమున కరిగి భక్తియుఁ బ్రీతియుఁ గలయాతనియాతిథ్యముం గొని యందు సుఖనిద్ర చేసి విదురునాశయ మెఱింగి యతనికి నుచితరీతి బదులుచెప్పి ధృతరాష్ట్రునికడ కరిగెను.

హరిరాక కెదురుచూచుచు ధృతరాష్ట్రుఁడు విదురాదులం గూడియుండెను. హరియు సాత్యకియుఁ దగినపరివారముతో నాతనియింటఁ బ్రవేశించిరి. ఇష్టకథాలాపములఁ గొంత ప్రొద్దు పుచ్చి తనకార్యము చెప్పందలంచి యిట్లు పలికెను. రాజేంద్రా! నీవెఱుంగనిధర్మములు గలవా. నారాక తెలిసిగిది యని యెఱింగించుట నాకు విధి. నాకార్యము భారతాన్వయమునకు హితమైనది. కావున నాలకింపుము. క్షీరోదకన్యాయముగాఁ బాండవులు కౌరవులు కలిసియుండుట న్యాయము. అట్లు నీవు చేయవలయును. మీవంశము ప్రఖ్యాతమైనది. మర్యాద గలవంశము. దీనింగాపాడుభార మిపుడు నీశిరమున నున్నయది. నీవును పాండురాజు నెట్లుంటిరో యాన్యాయము నిపుడు తప్పనేల? ఈవంశమును బ్రతిష్ఠగలదానినిగాఁ జేయుటకు నీవే హేతుభూతుఁడవు. కీడుగాని మేలుగాని తుదకు

నాలోచించిన నీకే కల్గునుగాని మఱియొకరికిఁ గల్గవు. కావున లోకులెల్ల మంచిదిది యనిపొగడునట్లు కార్యము నడపుము. మోమోటమి మాని యొక్కమాట చెప్పెదను దుర్యోధనాదులు దుష్టాత్ములసహవాసమున నవినీతులై ధర్మమార్గమును మాని చేయఁదగురీతిం జేయక కులమర్యాద యిదియని పాటింపక భయంకరకార్యమును జేయఁబూని బంధువులకెల్ల నహితముగాఁ బ్రవర్తించుచున్నవారు. పెద్దలు విన్న నేమందురో యని యించుకంతయు సంశయింపరు. కావున నీవూరకుండుట న్యాయముకాదు. పాండవులు నీకొడుకులు కలిసివర్తించినచో లోకమున మిగుల విఖ్యాతి కల్గును. అట్లుగాక సంగర మొనరింపఁబూనిన లోకమునకు భారతవంశమునకు మహాపద కలుగును. ఇట్టియిక్కట్టుకాలమున నీవూరకుండుట న్యాయము కాదు. దాన మేలుచేకూరదు. భీమార్జునులను సంగరరంగమందు మీఱఁ జాలువా రీలోకమున నెందఱు కలరో లెక్కింపుము. భీష్మద్రోణులకు సరివచ్చువారు కలరాయనియు లెక్కింపుము. వీరందఱు కలిసి నీయాజ్ఞలో మెలఁగుచుండఁగా నెంతటి విఖ్యాతి కల్గునో యనియుఁ జక్కఁగా నూహింపుము. వీరందఱు నైకమత్యము గలిగియుండిన నీలోకమునఁ గలరాజులందఱు నీపాదపీఠమును గొల్చుచుందురు. సంగరమే పొసఁగిన నెందెవ్వరికిఁ గష్టముగలిగినను నీమనస్సునకే యది చెందును. అని పెక్కుభంగుల న్యాయమునుసోదాహరణముగాఁ దెలిపి పాండవులమాట లన్నియునుగ్గడించిసభాసదులనెల్ల నానందపరవశులఁ జేసెను. పాండురాజు భాగమగునర్ధరాజ్యము పాండుసూనుల కొసంగి పొత్తు గల్పింపుమని హితముపదేశించెను. మహర్షులు

దుర్యోధనునకు నెన్నియో రాజనీతులు బోధించిరి. రాఁగల యాపదలిట్టివిగానుండుననియు హెచ్చరించిరి. కాని వారిమాటలు దుష్టాత్ముఁ డగు రాజునకు రుచింపవయ్యెను. భీష్ముఁడు న్యాయశాస్త్రానుసారము దుర్యోధనునకు నీతి నుపదేశించెను. కాని యదియు నిరర్థకమే యయ్యెను. అంత శ్రీహరి సుయోధనునితో నాతఁడు మున్ను చేసినదుర్నయములెల్లం దెలిపిన విని దుశ్శాసనుఁడు దుర్యోధనుం బ్రోత్సహింప నాచోటు వాసి బదులు పలుకకయే పోయెను. సభ్యులందఱు నిఁక సంగరము తప్పదనియుఁ గౌరవులకుఁ జేటుమూడుననియు నిశ్చయించిరి.

ఆవార్త యాలించి ధృతరాష్ట్రుండు వెఱచి గాంధారిం బిలిచి నీకొడుకునకు బుద్ధి చెప్పుమని పంపెను. ఆమెయు విదురుం బంచి కొడుకుం బిలిపించిన నాతండు కోపంబునఁ గన్నులెఱ్ఱవాఱఁగా రాఁగా నాతనిరాక నెఱింగి న్యాయము వీనికి రుచింపదని తలంచి నీతినుపదేశించుచుఁ బాండునందను లొనరించిన యద్భుతకార్యములనువారిపరాక్రమాదులం దెలిపి వత్సా! నామాట వినుమని బ్రతిమాలియు నాగ్రహించియు ఫలంబుగాంచదయ్యెను. దుర్యోధనుఁ డామాటలనాదరంబున వినక యాచోటు వదలిపోయెను. కర్ణశకునిప్రభృతులం గూడి దురాలోచనము చేయంబూనెను. హరియు భీష్మాదులు నొక్కటియై తన్ను బంధింతురనునూహను దెలిపెను. కృష్ణుఁడు పూర్వము తాను గంసునివధించినవిధముఁ దెలిపెను. కావున మనమెల్ల నీతనిం బట్టుకొని బంధించిన మనకు మేలగును. ఈకృష్ణునింబట్టి బంధించినఁ బాండవులు నావశ మగుదురు

ఒక్కవేళ యుద్ధమునకు వచ్చినను గోఱలులేనిపాములవలె నుందురు. అని స్వాభిమతమును దుర్యోధనుఁడు తెలుపఁగా దుశ్శాసనుఁడు శకుని కర్ణులు లోనగువార లందులకు సమ్మతించిరి. కంసమర్దనుని బంధింప నిశ్చితమయ్యెను.

కౌరవులు శ్రీకృష్ణుని బట్టి కట్టివేయ నిశ్చయించుట.

ఇట్లు దుష్టచతుష్టయము పరివారముంగూడి యందందు నిలువక మాటలాడుచుఁ బోవుచు వచ్చుచునుండుటయుఁ గను లసంజ్ఞలు మొదలగువానిచేఁ బరస్పరభావములం దెల్పుకొను చుండుటయుఁ గాంచి సాత్యకి శ్రీహరిపై నేదో ద్రోహచింత గలిగియున్నవారని తలంచెను! వెంటనే కనుసన్న తనయూహ కృతవర్మకుం దెలిపి పరిజనముతో వాకిటనుండ నియమించెను. తానిట నెల్లకార్యములకుఁ జాలుదు ననియు నాతనికిం దెలిపెను. ఇట్లుకృతవర్మ నచ్చటికిం బంచి శ్రీహరిచెంత కరిగి రహస్యముగ నాదుష్టులవర్తనమును దెలిపెను. శ్రీకృష్ణానుమతినొంది ధృతరాష్ట్ర బాహ్లీకశాంతనవులతో నిట్లు పలికెను. దుష్టాత్ములగుదుర్యోధనాదులు దురూహంగొని శ్రీహరిపై రాఁదలంచు చున్నవారు. దైత్యాంతకునిపై రాఁ దమకు శక్యమగునా? ఈప్రయత్న మగ్నిహోత్రుని గొంగునఁ గట్టుకొన్నట్లగును. ఈదుర్మంత్రములు తమనాశనమున కుపకరించును. అని పలుకుటయు విదురుం డమ్మాటల కదరిపడి ధృతరాష్ట్రునితో రాజా! నీకొడుకులు మహానుభావుని బరమపురుషుని శ్రీహరిని మానవ మాత్రునిగా భావించి బంధింపఁదలంచిరి. ఇప్పనికిందొడరుట యగ్నిమంటలపై శలభములు దుమికినట్లే కదా అని తెలిపెను.

అంత గోవిందుఁడందుఁగూర్చున్న వారెల్ల నాలకింప నిట్లు నుడివెను. రాజా! నాపై రోషమూని నీతనయు లిట్టిప్రయత్నము చేయుట మేలే. నాకును బరమానందమే. నాకించుక యనుమతి యిమ్ము. నిర్దోషముగాఁ జేతనైనయట్లు దురాత్ములఁ జక్కఁబెట్టెద. ఇఁకేఁ బ్రయాణము సాగించెదను.

శ్రీకృష్ణునినుడులకు నడలి ధృతరాష్ట్రుఁడు దుశ్శాసనాదులందోడుకొని రమ్మనివిదురునంపెను. అతఁడరిగిరాజాజ్ఞం దెల్పి దుర్యోధనాదులఁ దోడుకొనివచ్చెను. వారితో ధృతరాష్ట్రుఁడు దురాత్మా! మీశక్తియెట్టిదో తెలియక సకలలోకాధినాథుని శ్రీకృష్ణుని గీడునకులోఁబఱుపఁ జూచెదరు. మీకితనిం బట్టుకొన శక్తిగలదా? వర్షోదకము భూరిమహీధరమును గదల్పఁగలదా? మీకు వినాశనకాలము సమీపించినది. నేనేమిచేయుదును? అనియూరకుండ విదురుండు సుయోధనా! దేవతలు, దేవతోత్తములు, తుదకు బ్రహ్మాదులు, మహర్షులు పట్టరానిభగవంతుని బట్టుకొనఁజూచెదవా? తులువా! ఇదిచేటుకాలముగాఁ దలంపుము. ఈకార్యమున మీరెల్లముహూర్తమున భస్మప్రాయులగుదురు. అని మఱియు ననేకప్రకారముల నాతనికి భగవంతునిమహత్త్వమును దెలిపెను. ఇట్టియకార్యములవలనఁ గురువంశమునకే సంతతాపవాదము గల్గునని హెచ్చరించెను. ఆతనిపలుకులు ధృతరాష్ట్రునిహెచ్చరికయు వారికించుక యంతరాయమును గల్పింపఁజాలెను. వారియుద్యమము నొక్కమాటతో నిలుపందలంచి పుండరీకాక్షుఁడు భీష్మాదికురువృద్ధులు వినుచుండఁగా దుర్యోధనుం గాంచి శ్రీకృష్ణమూర్తి

దుర్యోధనా ! * నే నొక్కరుండనని తలంచి పట్టుకొనం బూనితివి కాఁబోలు. దుర్మదంబున నాశక్తి నెఱుంగక పట్టుకొన నెంచితివేమో. ఇంత యవివేకి వగుదువే? యని

### శ్రీకృష్ణుఁడు విశ్వరూపమును జూపుట.

దరహాసము జేసెను. ఆవాసుదేవు దేహ మంతలో నొకయద్భుతరూపనుగా మాఱెను. ఆరూపమునం దీబ్రహ్మాండమంతయు నిమిడియుండెను ఒక్కొక్కయవయవమందును బ్రహ్మాదిపిపీలికలవఱకుఁ గలభూతము లుండెను. పాండవులు కౌరవులును నానాయుధములం దాల్చి యుద్ధమునకు సన్నద్ధులుగ నున్నయట్లగపడియెను. ఇంతయేల? సర్వలోకము లాతనియప్పటితనువున

* ఏకోహ మితి యన్మోహాన్మన్యసే మాం సుయోధన, పరిభూయ సుదుర్బుద్ధే గ్రహీతుం మాం చికీర్షసి. ౨. ఇహైవ పాండవాస్సర్వే తథైవాంధకవృష్ణయః, ఇహాదిత్యాశ్చ రుద్రాశ్చ వసవశ్చ సహర్షిభిః. 3. ఏవముక్త్వా జహాసోచ్చైః కేశవః పరవీరహా, తస్య సంస్మయతశ్శౌరేర్విద్యుద్రూపా మహాత్మనః. ౪. అంగుష్ఠమాత్రాస్త్రిదశా ముముచుః పావకార్చిషః, అస్య బ్రహ్మా లలాటస్థో రుద్రో వక్షసి చాభవత్. ౫. లోకపాలా భుజే ష్వాసన్నగ్నిరాస్యాదజాయత, ఆదిత్యాశ్చైవ సాధ్యాశ్చ వసవోఽథాశ్వినావపి. ౬. మరుతశ్చ సహేంద్రేణ విశ్వేదేవా స్తథైవచ, బభూవుశ్చైవ రూపాణి యక్షగంధర్వరక్షసామ్. ౭. ప్రాదురాస్తాం తథా దోర్భ్యాం సంకర్షణధనంజయౌ, దక్షిణేథార్జునో ధన్వీ హలీరామశ్చ సవ్యతః. ౮. భీమో యుధిష్ఠిరశ్చైవ మాద్రీపుత్రౌ చ పృష్ఠతః, అంధకా వృష్ణయశ్చైవ ప్రద్యుమ్నప్రముఖా స్తతః. ౯. అగ్రే బభూవుః కృష్ణస్య సముద్యతమహాయుధాః, శంఖచక్రగదాశక్తిశార్ఙ్గలాంగలనందకాః. ౧౦. అని మూలము. ౧౨౯. అధ్యాయము.

నిమిడియుండెను. ఆరూపమునకేవిశ్వరూపమనిపేరు. ఆరూపమే భగవంతునిసత్యరూపము.అట్టియాదివ్యరూపమును గనుఁగొనఁ జాలక యెల్లవారును నయనముల మోడ్చిరి. కదలఁజాలకయుండిరి. నారదాదిమహామునులు ప్రార్థింపఁ గరుణాతరంగితాంతఃకరణుఁడై భీష్మద్రోణ విదురసంజయులకు దివ్యదృష్టియొసంగెను. దానిచే వారు మాత్ర మాదివ్యరూపమును జూడఁజాలి మహానందము ననుభవించుచుండిరి. ఆకాశమున దేవదుందుభిధ్వానములు మొరసెను. పూలవాన గురిసెను.

ధృతరాష్ట్రుఁ డాకలకలంబు నాలించి శ్రీకృష్ణుని మహాత్త్వ మిదియని భావించి చేతులు ముకుళించి మహాత్మా! పురుషోత్తమా! నాపైఁ గరుణనునుపుము. నాయజ్ఞానమును క్షమింపుము. నిన్నే శరణము వేఁడెదను. నీపాదకమలములఁ గనుంగొనుభాగ్యమును బ్రసాదింపుము. అని నిండుభక్తిఁ బ్రార్థించెను. ఆప్రార్థనమును భగవంతుఁ డంగీకరించి దివ్యదృష్టి యాపుట్టుగ్రుడ్డికిం బ్రసాదించెను. దాన నాతఁడు భగవద్దివ్యరూపమును జక్కఁగాఁ జూడఁజాలెను. చూచి పరమపూరుషా! నిన్నుఁ గంటిని. కృతార్థుఁడ నైతిని. ఇంకనొరులఁ జూడ గోరను. కావునఁ గరుణానిధీ! ఈదృష్టి నుపసంహరింపుము. అని ప్రార్థించెను. ఆరాజు విశాలనయనముల నెల్లరుం గాంచిరి. పుండరీకాక్షుఁ డాతఁడుకోరినట్లే యొనరించెను. విశ్వరూపము నుపసంహరించెను. నారదాదిమునులకుం బోవననుమతి నొసంగెను. చెంతకు వచ్చియున్న సాత్యకిని గృతవర్మనుగాంచి వారి హస్తము లూఁతగా నూరక ప్రయాణము సాగించెను.

అటనుండి కదలి కుంతియింటికిం జని తనవచ్చినపనియు నదిజరగినరీతియుఁ దెలియంబలికి యామె చింతఁ దీర్చి సెలవు గైకొని నగరంబు నిర్గమింప నుద్యుక్తుం డయ్యెను. ఆవార్త నెఱింగి వచ్చినపని చక్కఁగా సాగకపోయెనే యని చింతించుచు నిఁక మహాత్తరసంగ్రామము సాగకతప్పదని దురంతచింతనొం దుచు భీష్మద్రోణాదులు చేయునదినేరక మిన్నకుండిరి. సుయో ధనునకుఁ గడపటిసారిగా సన్నియోఁభంగుల నీతుల నుపదేశిం చిరి. వాఁ డించుకంతయు బదులుపలుకకయుండెను. భీష్మద్రోణు లాగ్రహించి యటనుండి లేచిపోయిరి. ధృతరాష్ట్రుఁడు తననగరున కరిగెను. దుర్యోధనుఁడు తనపంతము నెగ్గెనని యాలోచించుచుఁ గృష్ణునిపోక కించుకంతయు మదిఁ జింతింపక యుండెను.

### శ్రీహరి కర్ణునకుఁ గర్తవ్య ముపదేశించుట.

శ్రీహరి నగరంబువెడలునపుడు రాధేయుని బిలిచికొని పోవుచు నొరులెవ్వరు వినకయుండఁ గర్ణా! నీవు వృద్ధులసే వించి ధర్మముల నెఱింగినవాఁడవు. ఒక్కరహస్యముపదేశించెద. ఆలకింపుము. మాత్రాండునివరప్రభావమునఁ గుంతికిఁ గల్గిన వాఁడవు. కావునఁ బాండవాగ్రజుఁడ వగుదువు. పాండవుల కీరహస్యము తెలియదు. నేఁదెలిపెదను. దాన వారెఱింగి నీపాదములంగొల్తురు. నిన్నే రాజ్యలక్ష్మియుఁ బొందును. కావున నిన్ను నేనే పట్టాభిషిక్తునిం జేయువాఁడను. ఆయుత్స వమునందు ధర్మరాజు నీకు ధవళచామరములం బట్టుకొని విప రును. భీముఁడు శ్వేతచ్ఛత్రమును బట్టును. అర్జునుఁడు రథము

గడపును. తక్కుంగలవారెల్ల నిన్నుం బరివేష్టించియుందురు. ఈమహామహీరాజ్యంబు నేలుము. మఱొక్క మాటయుఁ గలదు. ద్రౌపదియు నిన్ను వరించును. కావున నేమియు నూహింపక యేతెమ్మని యుపదేశించెను. ఈరీతి నీవొనరించిన గుంతికింగాక సర్వబంధువులకు మహానందంబగు ననిన విని రాధేయుండు మాధవున కిట్లు బదులుచెప్పెను. మహాపురుషా! నాజన్మవృత్తాంతమును గర్ణాకర్ణికగా నేను నాకర్ణించియే యున్నవాఁడను. నన్నుఁ గని కుంతి నిర్దయాత్మురాలై నదిలోఁ బడవైచిపోయెను. నన్నుఁదీసికొనిపోయి సూతుఁడు తనభార్య యగురాధకిచ్చెను. పుత్రులకునోచని యారాధ నన్నతికౌతూహలమునఁ బెంచెను. మూత్రపురీషాదులు తనదేహమునఁ బడఁగా నోర్చుకొని నన్నుఁ బెంచెను. ఇంతకాలము నన్నుఁ దనయునిగాఁ బెంచినవారి నిసువురను వదలి నేనితరులకొడుకు నని వదలిన మర్యాద చెడకయుండునా? పెద్దలసహవాసము గలవాఁడవని నీవే పలికితివికదా. రాధికయు నదిరథుండను నాకు జాతకర్మాదిసంస్కారములు కులోచితముగాఁ జేయించిరి. ఆతల్లిదండ్రులను వదలి వారికిఁ బుత్రకృత్యముల నొనరింపక వారల వదలివచ్చుట న్యాయముకాదు. సూతపుత్రుఁడు వీఁడనక కొడుకులకంటె సోదరులకంటె నన్నెక్కుడుగాఁ దలంచి గారవించిన కురురాజు నన్నుఁ దాఁకరాఁగా న్యాయము ననుసరించి నేనేదూరముగాఁదొలఁగుచుందును. మఱియు నర్జునునకంటె నన్ను మిన్నయని నమ్మియుండును. ఆనమ్మిక వ్యర్థమగునట్లు దుర్యోధనుం దొఱంగి నేనుబాండునందనులం జేరుటుత్తమముకాదు. నేనునర్జునుఁడును ద్వంద్వయుద్ధము చేయఁగాఁ

జూడఁగోరినజనులు నేనిప్పుడు పాండవులంగలియఁగా నవ్వరుఁ దురా? అంతియగాదు. నేను వచ్చుట యర్జునున కపకీర్తియేగాని కీర్తికాదు. ఆతనికీర్తి నిర్మలమై నెగడవలయును గదా. నాకుఁ దెలిసినదంతయుం దెల్పితి. నాకు నీవు హితముపదేశించితివి. నీబుద్ధి నిర్మలమైనది. కాని యీనీయుపదేశము నాకు రుచింపకున్నది. ఈరహస్యమును మది నిల్పుము. బయల్పడనీయకుము. ఏలయనిన. ధర్మరాజు నాయనుజుండనని తానెఱింగెనేని సామ్రాజ్యమును బూన నిచ్చగింపఁడు. అట్టిధార్మికుఁడు భూభారమును భరింపవలయునే గాని నావంటికులహీనుఁడు భరింపరాదు. ధర్మరాజు కీర్తి శాశ్వతముగా ధర నెలకొనవలయును. తమ్ములు ఋత్విజులు. కార్యములను దెలుపునీవుపద్రష్టవు. కురుకుమారులు పశువులు. ఈరణయజ్ఞమునఁ గురుకుమారపశువులు హింసింపఁబడవలయును. ధర్మరాజు సోమయాజి కావలయును. ఇట్టిమహాయజ్ఞముచేతఁ బుణ్యభూమియగు కురుక్షేత్రమునందు మాబోంట్లు సద్గతిని గాంచవలయును. ఈకార్యమునకు విఘ్నమును గల్గింపకుము. అని పలుకుకర్ణునిమాటల నాలకించి పుండరీకాక్షుఁడు సూతనందనున కిట్లనియెను. కర్ణా! దయచేత నాపలుకులు గ్రహింపకున్నవాఁడవు. అర్జునునితో మార్కొనిననీకుఁ బరాజయముగాని మరణముగాని తప్పదు. ఆతని గెలువ శక్యముగాదు. పెక్కండ్రు మృతినొందనిదియే కాలము. కావున నీమనస్సు శాంతినొందఁజాలదు. పాండవులే గెలుతురు. ఈమాసము సకలవిధముల సుఖకరముగా నున్నది. ఏడెనిమిదిదినంబుల కమవస వచ్చును. అనాఁడే యుద్ధారంభము కావలయును.

అనుటయుఁ గర్ణుఁడు శ్రీకృష్ణా! పెక్కునిమిత్తములు పొడకట్టుచున్నవి. యుద్ధము తప్పక సాగును. పాండవులే గెలుతురని నేనెఱుంగుదును. నీవు మఱల దానిం జెప్పనేల? కనుకనే నేను బాండవులంగలిసికొన రానంటిని. ఈయుద్ధమునకు నేనును దుశ్శాసనుఁడు శకుని కారణభూతులము. కురుకుమారులు పాండవులు కలిసిన నేనందు రావచ్చును. అది పొసఁగదు. కావున నిదియుఁ బొసఁగదు. నేనీమహాసముద్రమునీది యూర్ధ్వలోకంబున నిన్ను సందర్శించెదను. దీనికిఁ గాదని పలుకకుము. రహస్యమును గాపాడుము. అనిపలికి శ్రీకృష్ణునిగౌఁగిలించుకొని కరుణ ననుపుమాయని ప్రార్థించి సెలవంది తనయరదంబెక్కి కరిపురంబున కరిగెను. శ్రీహరియు నుపప్లావ్యమునకుం బోయి కరినగరమున సాగినవార్తలనెల్లం దెలిపి సర్వసిద్ధముగా నుండ ధర్మజుని హెచ్చరించి తాను సాక్షిభూతుఁడై యుండెను.

ఆర్యమహాశయులారా! ఈరాయబారమునుండి గ్రహింపఁదగినవిషయము లనేకములు గలవు. వానినెల్ల నిటవ్రాయఁ బూనిన నొక్కపెద్దగ్రంథ మగును. కావున నొక్కవిషయమును వ్రాసెదను. భగవంతుఁడు సర్వసాక్షియనుట నీకథ దృఢపఱచుచున్నది. కర్మాధీనులగుజీవులు స్వస్వకర్మానుసారముఁ బ్రవర్తించుచుండఁగా భగవంతుఁడు తానిస్సంగుఁడయ్యు సర్వకార్యములయందుఁ బ్రవర్తించుచు నాయాయికార్యములఁ గర్మానుసారము ప్రవర్తింపఁజేయుచుండును. స్వస్వకర్మములచే తనే ప్రాణులు సుఖదుఃఖముల ననుభవించుచుందురు. సర్వసాక్షియై పరాత్పరుఁడు చూచుచుండును. ఈవిషయ మెఱుంగక భగవంతు నాక్షేపించువారు మూర్ఖులు గాక మఱేమగుదురు?

శ్రీహరిని గట్టివేయఁబూని ధార్తరాష్ట్రులు విఫలమనోరథు లైరి. దానికిఫలముగా భీష్మాదులు భగవద్దివ్యరూపమునుగాంచి కృతార్థులైరి. ధృతరాష్ట్రుఁడు శ్రీకృష్ణునిదివ్యరూపమును గాంచి నేత్రము లొసంగుమని ప్రార్థింపక వేరొకరూపమును గాంచక యుండఁ జేయుమా యని ప్రార్థించెను. ఎవ్వారెవ్వరు కృతార్థులు గాఁదగినవారో వారికారూపమును సందర్శించుభాగ్యము కలిగెను. వారిప్రక్కనఁ గూరుచున్నవారి కారూపము గానరాక పోయెను. దీనింబరిశీలింపఁగాఁ గర్మానుసారముగా జీవులు ప్రవర్తింతురని దానిమీఱ నెవ్వారికిని శక్యముకాదని స్పష్టమగును. ఎందఱు పెద్దలు సాయమున్నను స్వకర్మము మంచిది గాదేని దానిని మరలింపఁజాలరు. కావునఁ బ్రతిప్రాణియుఁ దనకుఁ దానే గతియని నమ్మి తన తరణోపాయమును దాఁ జూచుకొనవలయును. పరుల నపేక్షించు టెంతమాత్రము ఫలవంతముకాదు. తనకుఁదానే గతి యనుసూక్తిని నమ్మనివాఁడు సూపకార్మతుల్యుఁడై చెడిపోవక మానఁడు. కావునఁ బరులు పలుకు మోసపుమాటలకు మనసునఁ దావీయక సత్కర్మముల నాచరించుచు భగవంతుఁడే సర్వకర్త యని నమ్మి యహంకారమునుమాని భగవన్నామసంకీర్తనము చేయుటయే ముక్తిమార్గముగాని వేఱొండుకాదని యెఱుంగవలయును. ఇఁక నీప్రకరణమును బూర్తిచేయుచు శ్రీకృష్ణపరమాత్మస్తుతిని వ్రాసెదను.

శ్లో. ఆందోళితాగ్రభుజమాకులనేత్రనీల
మార్ద్రస్మితార్ద్రవదనాంబుజచంద్రబింబం,
శింజానభూషణశతం శిఖిపించమౌళిం
శీతం విలోచనరసాయనమభ్యుపైతి. 30

తదిదముపనతం తమాలనీలం
తరళవిలోచనతారకాభిరామం,
ముదితముదితవక్త్రచంద్రబింబం
ముఖరితవేణువిలాసజీవితమ్. ౭౩
తేజసేఽస్తు నమో ధేనుపాలినే లోకపాలినే,
రాధాపయోధరోత్సఙ్గశాయినే శేషశాయినే. ౭౪
త్రిభువనసరసాభ్యాం దీప్తభూషాపదాభ్యాం
దృశిదృశి శిశిరాభ్యాం దివ్యలీలాకులాభ్యామ్,
అశరణశరణాభ్యామద్భుతాభ్యాం పదాభ్యా
మయమయమనుకూజద్వేణురాయాతి దేవః. ౭౫

శ్రీకృష్ణకర్ణామృతము. ౧ ఆశ్వా.

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.

శ్రీకృష్ణావతారతత్త్వమునందు దీనావనమను
పదియవప్రకరణము సంపూర్ణము.

## కావ్యపురాణస్మృతితీర్థ
## శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి గ్రంథములు.

| | | |
|---|---|---|
| శ్రీకృష్ణావతారతత్త్వము 1, మొదలు 10 భాగములు | | |
| ఒక్కొకభాగము ... | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్వాల్మీకిరామాయణము, నిర్వచనము, వ్యాఖ్యానములలోని భావముకూడ విడువక తెనిఁగింపఁబడినది. ఏశ్లోకమున కే పద్యమో తెలియుటకై శ్లోకసంఖ్య కూడఁ దెలుపఁబడినది. 3-సంపుటముల ప్రతి | 12 | 0 |
| 7-సంపుటముల ప్రతి | 14 | 0 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము ... | 5 | 0 |
| హాలాస్యమాహాత్మ్యము, స్కాందపురాణమునుండి తెనిఁగింపఁబడినది. | (అచ్చగుచున్నది.) | |
| ఆంధ్రలలితోపాఖ్యానము, భండాసురుని లలితాదేవి చంపుట మొదలగు గాథలనేకములిందున్నవి, మంచి బైండు ... | 1 | 8 |
| విచిత్రపాదుకాపట్టాభిషేకనాటకము ... | 0 | 12 |
| పాండవాజ్ఞాతవాసనాటకము ... | 0 | 12 |
| రామవనవాసనాటకము ... | 0 | 12 |
| సంగ్రహరామాయణము, వచనము, సులభశైలి | 0 | 10 |
| సంగ్రహభారతము ... | 1 | 0 |
| సంగ్రహభాగవతము ... | 1 | 0 |
| ఉదయగిరిముట్టడి ... | 1 | 0 |
| కలివిలాసము, విచిత్రప్రబంధము | (అచ్చగుచున్నది.) | |
| హనుమద్విజయము ... | 0 | 8 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

# భక్తిరసశతకసంపుటము. ౧

భక్తిరసశతక మొదటిసంపుటములో భక్తిరసోద్బోధకములగు ఈక్రిందిశతకములను చేర్చి ముద్రింపించితిమి. శతకములన్నియు నిర్దుష్టముగ మనోహరముగ ముద్రింపఁబడి విపులములగు పీఠికలతో నలరారుచున్నవి. 1 వృషాధిపశతకము, 2 చెన్నమల్లుసీసములు, 3 సర్వేశ్వర, 4 ఒంటిమిట్టరఘువీర, 5 దేవకీనందన, 6 నారాయణ, 7 దాశరథి, 8 సింహాద్రినారసింహ, 9 కృష్ణ, 10 మాతృ, 11 ఉన్నవరాజగోపాల, 12 మానసబోధ, 13 చిత్తబోధ, 14 ఆంధ్రనాయక, 15 ప్రసన్నరాఘవ, 16 రామతారక, 17 రామరాఘవ, 18 రామప్రభు, 19 భద్రాద్రిరామ, 20 మారుతిశతకము.

వెల రూ. 2 0

# భక్తిరసశతకసంపుటము. ౨

ఇందు 1 సూర్యనారాయణశతకము, 2 రాజలింగ, 3 రఘుకులతిలక, 4 మహిషాసురమర్దని, 5 ఉద్దండరాయ 6 గొట్టుముక్కల రాజగోపాల, 7 రుక్మిణీపతి, 8 జ్ఞానప్రసూనాంబికా, 9 ముకుంద, 10 శివ, 11 రమాధీశ్వర, 12 భక్తచింతామణి, 13 సీతాపతి, 14 మహిజామనోహర, 15 పార్థసారథి, 16 రాజశేఖర, 17 రంగేశ్వర, 18 మాధవ, 19 కామేశ్వరీ, 20 విశ్వనాథశతకము.

వెల రూ. 2 0

## భక్తిరసశతకసంపుటము. ౩

ఇందు 1 నారాయణశతకము, (పోతనకవి), 2 కాళహస్తీశ్వర, 3 రమణీమనోహర, 4 భద్రాద్రిరామ, (వేదాంతము) 5 యాదవగిరీంద్ర, 6 నృకేసరి, 7 నృసింహ, 8 భద్రాద్రి, 9 వసుదేవనందన, 10 వీరనారాయణ, 11 సదానందయోగి, 12 శివముకుంద, 13 రామరామ, 14 సంపగిమన్న, 15 శ్రీకృష్ణ 16 లక్ష్మీ, 17 రంగశాయి, 18 కాళహస్తి, 19 ముకుందరాఘవ, 20 సర్వలోకేశ్వరశతకము. వెల రూ. 2 0

## నీతిశతకసంపుటము. ౧

ఇందు 1 సుమతిశతకము, 2 భాస్కర, 3 వేంకటేశ, 4 గువ్వలచెన్న, 5 చంద్రశేఖర, 6 వేమన, 7 శరభాంకలింగ, 8 కుమార, 9 కుమారీ, 10 కోలంక శ్రీమదనగోపాల, 11 నీతి, 12 జగన్నాయక, 13 కుక్కుటేశ్వర, 14 రామలింగేశ, 15 నమశ్శివాయ, 16 బాలనీతి, 17 రామచంద్ర, 18 కృష్ణనీతి, 19 మానినీ, 20 రఘురామసుబోధయశతకము. రూ. 2 0

ఈ శతకసంపుటములు చిన్నసైజులో పెద్దక్షరములతో ముద్రింపఁబడి ముద్దులుగులుకు చక్కని కాలికోబైండుతో నలరారుచున్నవి.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.